


# పాలపిట్ట

సంపుటి:4 సంచిక:8 హైదరాబాద్ సెప్టెంబర్ 2013 పేజీలు: 124 వెల:రూ. 30

## డాక్యుమెంటరీ:
## మన కాళోజీ జ్ఞాపకాల తోరణం



ప్రజల మనిషి

PALAPITTA

# పాలపిట్ట

మాసపత్రిక

సంపుటి:4 | సంచిక:8 | సెప్టెంబర్ 2013

ఎడిటర్
**గుడిపాటి**

కాళోజీ శతజయంతి సంచిక
గౌరవ సంపాదకులు
**బి.నరసింగరావు**

అసోసియేట్ ఎడిటర్
**వై. వసంత**

లేఔట్, డిజైన్: అక్షయ డిజైన్ స్టూడియో
akshayadesignstudio@gmail com

ఫోటోలు: **భరత్‌భూషణ్**

ప్రకటనలు, చందాలకు మరియు
(రచనలు, అభిప్రాయలు పంపవలసిన చిరునామా)

**PALAPITTA**
# Flat No.3, Block 6,
MIG-2, APHB, Baghlingampally,
Opp. Sundaraiah Park Gate,
Hyderabad - 500044
Phone : 040 - 2767 8430
Mobile : 98487 87294
E-mail : palapittabooks@gmail.com

Printed, Published and Owned by
Gudipati Venkateswarlu
Printed at
Vipla Computer Services
(Designers & Multi Colour Offset Printers)
#2-3-720/1A/22/49, Ganga Nagar, Golnaka,
Amberpet, Hyderabad - 500 013

Published at H.No.16-11-20/6/1/1,403,
Vijaya Sai Residency, Saleem Nagar, Malakpet,
Hyderabad - 500 036, A.P.



## నా గొడవ

నా గొడవనునది
కాళోజీ అనునది
వాగుడు అనుపించునది

ఎడతెగని వాగుడుది
ఎడతెగక సాగునది
అక్షరజీవన మనునది
నాగొడవమనునది

కాలమునకు ప్రతికూలముగా
సతతము పారునది పోరునది
పారావారము ముట్టెడి
వారిని సైతము ఢీకొని
ఎదురీతతో పొంగి పొర్లి
ఎత్తువైపు పారునది
నా గొడవనునది
కాళోజీ అనునది

- కాళోజీ





బి. నరసింగరావు





# విశ్వకవికి నీరాజనం

**1953లో** అలంపురంలో కాళోజీ మొదటి కవితా సంకలనం 'నా గొడవ'ను ఆవిష్కరిస్తూ శ్రీశ్రీ ఆయనను నిఖిలాంధ్ర కవిగా ప్రస్తుతించాడు. అయితే కాళోజీ మొదటగా ప్రాంతీయ కవి, తర్వాత నిఖిలాంధ్ర కవి, జాతీయ కవి. అంతిమంగా విశ్వకవి. రవీంద్రనాథ్ ఠాకూర్ విశ్వకవిగా వినుతికెక్కారు. ఆ రోజుల్లో ఆయన కవిత్వంలో ఎన్నెన్నో విషయాల్ని ఎంచి 'విశ్వకవి' అని ఉంటారు. ఆ రకంగా ఆలోచిస్తే కాళోజీ కవితలో ఇంకా మరెన్నెన్నో విషయాలు చోటు చేసుకున్నాయి. అందుచేత నిస్సందేహంగా కాళోజి విశ్వకవే. అనేకానేక మంది కవులు చెప్పలేని విషయాల్ని కాళోజీ ఎంతో అలవోకగా, నిర్భీతిగా చెప్పాడు. ఈ విషయంలో కాళోజీ శ్రీశ్రీకి ఎంతమాత్రం తీసిపోడు.

కాళోజీ తను అనుకున్నవిధంగా జీవించాడు. అలా జీవించగలిగే వాళ్ళను మనం వేళ్ళపై లెక్కపెట్టవచ్చు. అలా జీవించడానికి ముందు తనపై తనకెంతో నమ్మకం ఉండాలి. పైగా సమాజంలో ఆ నమ్మకాన్ని కాపాడుకోగల్గాలి. ఇది ఆషామాషి విషయం కాదు. దానికి కేవలం తెగింపే కాదు, ఎంతో మనోనిబ్బరం కూడా ఉండాలి. సమాజంలో తాను సామాన్యుడిగా బతుకుతూనే, సామాన్యులు తన వేపు తలెత్తి పైకి చూసే పరిస్థితి కలిగించడమన్నది అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు. ఈ లోకంలోకి కోట్లాదిమంది వస్తారు. అలాగే నిష్క్రమిస్తారు. కాని కాళోజీ నూనూగు మీసాల ప్రాయంలో ఎక్కుపెట్టిన విల్లు, తాను అవని విడిచి వెళ్ళేదాకా అలాగే సంభాళించగలిగాడు. ఇది మనను ఎంతో ఆశ్చర్యానికి గురిచేసే విషయం. ఒక వ్యక్తి ఇలా జీవించగలడా అని గొణుక్కుంటూనే ఉంటాం మన జీవితాంతం. కాని దాన్ని సాధ్యం చేసిన అసాధ్యుడు కాళోజీ. మనందరి గుండెల్లో శాశ్వత స్థానం ఏర్పరచుకున్న కవి, స్వాప్నికుడు, సామాజికుడు కాళోజీ.

ఒక కవిని గాని, కళాకారుణ్ణిగాని, సామాజికుణ్ణిగాని అంచనా వేసేప్పుడు పాఠకులుగాని, విమర్శకులుగాని సహజంగానే కొన్ని ప్రమాణాల్ని పాటిస్తారు. అదంతా ఒక అకడమిక్ పద్ధతిలో జరిగి పోతుంది. ముఖ్యంగా మేధావులు ఈ పనిని తమ భుజాలపై వేసుకొని, ఆచితూచి బ్రహ్మాండమైన విమర్శను వెలువరిస్తారు. ఒక్కోసారి ఆ విమర్శ తన పరిధులు దాటి వేనవేన పేజీలుగా విస్తరిస్తుంది. అయితే ఎప్పుడూ ఏదీ అంతిమ నిర్ణయం కాదు. ఎప్పుడైనా, ఏదైనా మళ్ళీ మొదట్నుంచీ నిర్వచించడానికి పూనుకోవచ్చు. ఏవో కొన్ని కొత్త సిద్ధాంతాలని దృష్టిలో ఉంచుకొని నేనీమాట అనడంలేదు. కళాకారుడిగా స్వేచ్ఛగా ఆలోచించే ఒక కళావివేచనకు సంబంధించిన ఆలోచన చేస్తున్నాను.

సమాజంలో ఒక్కోసారి కళ, సాహిత్యాలు విజృంభిస్తాయి. ఉత్తుంగ తరంగాల్లా పోటెత్తుతాయి. ఈ తొక్కిసలాటలో ఎన్నో అమూల్యమైన విషయాలు వాటి కింద పడి మరుగైపోతాయి. అయితే ఇక్కడ మనం గమనించవల్సిన విషయం ఏమిటంటే అవి పూర్తిగా సమసిపోవు. మళ్ళీ సమయం వచ్చినప్పుడు అవి కాలరెత్తుకొని నిటారుగా నిలబడి, కాలానికి ఓ శక్తిమంతమైన సవాల్ విసురుతాయి. అప్పుడు మళ్ళీ ఆలోచనలు మొదలౌతాయి. చర్చలు రచ్చకెక్కుతాయి. నాగులు బుస కొడతాయి. కాకపోతే సుష్టుగా భోంచేసి గట్టున కూర్చున్న 'పెద్ద మనుషులు' దేన్నీ ఓ మానాన ఒప్పుకోరు. అయినా నవ్య ఆలోచనలు విశ్రాంతి తీసుకోవు. అవి ప్రజల ప్రశ్నల దండకాన్ని లంకించుకుంటాయి. వాటిలోంచి ఎన్నో మేలైన భావాలు పుట్టుకవచ్చి, మళ్ళీ సమాజ నూతన అంచనాల కోసం తెరలెత్తుతాయి.

కాళోజీ జీవితం ఒక రకంగా స్ఫటికంలాంటిది. తెరచిన పుస్తకం ఆయన జీవితం. కాళోజీ ఇక్కడే దశాబ్దాలకు దశాబ్దాలుగా గడిపి ఈ నేలమీదే శాశ్వత నిద్రలోకి వెళ్ళిపోయాడు. ఇక్కడ ఆయన్ని కవిగా అంచనా వేయడంలోనే మనం పప్పులో కాలు వేస్తున్నాం. ఆయన కవిత్వంలోని వస్తు వైవిధ్యం గత శతాబ్దంలో మరో ఏ తెలుగు కవిలోనూ కన్పించదు. ఇందులో భారతదేశ కవులు కూడా మినహాయింపు కాదు. కేవలం భావపరంగానేకాక, భావోద్వేగపరంగా కూడా ఆయన ఒక 'వోల్కనో'! మానవుల అంతరాంతరాల్లోని ఎన్నెన్నో నిగూఢమైన విషయాల్ని సభ్య ప్రపంచానికి కూడా అందని భావాలని కాళోజీ తన కవితా శకలాల ద్వారా స్వేచ్ఛగా వెదజల్లాడు. కాళోజీ ఒక స్వేచ్ఛాజీవి. ఈ స్వేచ్ఛ అన్నది విచ్చల విడితనం గాదు. అదో జీవనశైలి. ఆలోచనా ధార. అది నేల నాలుగు చెరగులా ప్రవహిస్తుంది. దాన్ని మనం నిశితంగా గమనించినప్పుడు 'మనం ఎంత మడికట్టుకొని కూర్చున్నామో' అనిపిస్తుంది. సుదీర్ఘ కాలంగా మారుతూ పోయిన అనేకానేక సామాజిక నేపథ్యాలలో ఎంతో బాధ్యతగా, ప్రపంచ స్వేచ్ఛాజీవిగా, కాళోజీ ప్రవచించిన పద్యాలూ, అల్లిన కవితా జల్లులు అనేకం. వాటిని మనం జీవితాంతం పారాయణం చేస్తున్నా అన్నీ స్పష్టంగా అర్థమైనట్టే ఉండి, మళ్ళీ జీవితానికి ఎన్నెన్నో కొత్త నిర్వచనాల్నిస్తున్నట్టు నూతన దృక్కోణాల్ని ఆవిష్కరిస్తున్నట్టు అనిపిస్తుంది. ఈ కాళోజీ శతజయంతి సందర్భంలో ఈ 'విశ్వకవి'ని సరిగ్గా అవలోకనం చేసుకుంటామనీ, ఆయన కవితా కన్యని ఆస్వాదించి మనలోని విశ్వ మానవుణ్ణి దీర్ఘనిద్ర నుండి మేలుకొల్పుతామని ఆశిస్తూ-



# విషయ సూచిక



## వ్యాసాలు



## కవితలు



## కథ

# కాళోజీ జీవనరేఖలు

**జననం:** 09-09-1914
**తల్లిదండ్రులు:** శ్రీ కాళోజీ రంగారావు, శ్రీమతి రమాభాయి
**భార్య, పిల్లలు:** శ్రీమతి రుక్మిణిబాయి, రవికుమార్
**చదువు:** మడికొండలో ప్రాథమిక విద్య
వరంగల్, హైదరాబాద్‌లలో ఉన్నత విద్య

**అభిరుచులు:** కవిత్వ, కథాసాహిత్య రచనా వ్యాసంగం
సామాజిక, రాజకీయ, పౌరహక్కుల ఉద్యమాల్లో పాల్గొనడం

**ముద్రిత రచనలు:**
01. అణాకథలు
02. నా భారతదేశయాత్ర (బ్రెయిల్ ఫోర్ట్ 'రెబల్ ఇండియా' పుస్తకానికి అనువాదం)
03. కాళోజీ కథలు
04. పార్థివ వ్యయం
05. 'నా గొడవ' మొదటి సంపుటము మొదటి ముద్రణ
06. 'నా గొడవ' మొదటి సంపుటము రెండో ముద్రణ
07. తుది విజయం మనది నిజం
08. 'నా గొడవ' పరాభవ వసంతం
09. 'నా గొడవ' పరాభవ గ్రీష్మం
10. 'నా గొడవ' పరాభవ వర్షం
11. 'నా గొడవ' పరాభవ శరత్తు
12. 'నా గొడవ' పరాభావ హేమంతం
13. 'నా గొడవ' పరాభావ శిశిరం
14. 'నా గొడవ' మొదటి సంపుటం మూడో ముద్రణ
15. జీవన గీత (ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్'కు అనువాదం)
16. తెలంగాణ ఉద్యమ కవితలు
17. 'నా గొడవ' యువభారతి ప్రచురణ
18. 'నా గొడవ' 1975-77
19. ఇదీ నా గొడవ
20. బాపూ! బాపూ!! బాపూ!!!
21. కాళోజీ కథలు - 2000

**అముద్రిత రచనలు:**
1. అంజలి (ఎన్.సి. ఫడ్కే రచించిన గ్రంథానికి అనువాదం)
2. ఖలీల్ జిబ్రాన్ కవితలకు అనువాదాలు
3. భారతీయ సంస్కృతి (సానె గురూజీ రచించిన మరాఠీ గ్రంథానికి అనువాదం





# ప్రజలమనిషి

సాధారణంగా జీవిస్తూనే అసాధారణమైన రీతిన జనం మదిలో నిలిచిపోయిన వ్యక్తే ప్రజలమనిషి. ఈ కోవకు చెందిన మనీషి కాళోజీ. సార్థక జీవనం గడిపిన ఆ మహనీయుని శతజయంతి సంవత్సరంలోకి అడుగు పెడుతున్నాం. సామాజిక, రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక రంగాలన్నిటా తనదైన ముద్ర వేసి ప్రజా జీవితాన్ని ప్రభావితం చేసిన వైతాళికుడు కాళోజీ. శతజయంతి సందర్భంగా వారి జ్ఞాపకాల్ని తలపోయడమంటే కొత్త స్ఫూర్తిని అందుకోవడం. తెలుగునాట నెలకొన్న సరికొత్త రాజకీయ సందర్భంలో కాళోజీని తలుచుకోవడం మరింత అవసరం. రాజకీయాల్లో ప్రజల పాత్ర ముఖ్యభూమిక కావాలని, 'ప్రజాకీయాలు' ప్రాధాన్యం సంతరించుకోవాలని కాళోజీ భావించారు. కనుకనే సామాజిక జీవితంలో పాదుకోవాల్సిన సిసలయిన విలువల గురించి నొక్కి చెప్పడానికి కాళోజీ శతజయంతి ఉత్సవాలు జరుపుకోవడం తప్పనిసరి.

మాటకీ చేతకీ నడుమ అంతరం లేని మనిషి కాళోజీ. ఎలాంటి వైరుధ్యాలు లేకుండా జీవించడం వారికే సాధ్యమైంది. మానవ జీవితానికి సంబంధించిన కాళోజీ తాత్విక దృక్పథం ఉన్నతమైంది. మనిషి జీవించేది ఒకే ఒక్కసారి. ఉన్న ఒక్క జీవితాన్ని కుట్రలతో, కుత్సితాలతో, కపట విలువలతో గడపడంలోని నిరర్థకత్వాన్ని తన రచనల్లో, మాటల్లో తేల్చి చెప్పారు. వాటిలోని గాఢతను, సాంద్రతను ఆవాహన చేసుకోడం కోసం మరోసారి కాళోజీ ఆలోచనాధార వైపు చూపు ప్రసరించాలి. దీనిని గుర్తు చేయడానికే కాళోజీ శతజయంతి ఉత్సవాల ఆరంభ సందర్భంగా పాలపిట్ట ప్రత్యేక సంచికను పాఠకులకు అందిస్తోంది. సుప్రసిద్ధ కవి, చిత్రకారుడు, సినీ దర్శకుడు, తెలుగు వారి కీర్తి ప్రతిష్టలను అంతర్జాతీయంగా ఇనుమడింపజేసిన సృజనశీలి బి.నరసింగరావు గారు పాలపిట్ట కాళోజీ శతజయంతి సంచిక గౌరవ సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. ఈ శతజయంతి సంవత్సరంలో కాళోజీ భావధారను ఏడాది పొడుగునా జనంలోకి తీసుకెళ్ళాలన్నది వారి సంకల్పం. ఈ సంకల్ప సాధనలో భాగస్వామ్యం వహించాలని పాలపిట్ట భావించింది. ఈ నేపథ్యంలో కాళోజీ సాహిత్యంలోని, జీవితంలోని విలువైన అంశాల ప్రాసంగికతను తెలియజెప్పే రచనలతో, ఫోటోలతో ఈ సంచికను రూపొందించింది.

గుడిపాటి

పదవులు:

1. 1958 నుంచి 1960 వరకు ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యత్వం
2. ఆంధ్ర సారస్వత పరిషత్తు సభ్యత్వం
3. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ సభ్యత్వం
4. తెలంగాణ రచయితల సంఘం అధ్యక్షులు
5. తెలంగాణ రచయితల వేదిక గౌరవాధ్యక్షులు

పురస్కారాలు:

01. 1972సంవత్సరంలో స్వాతంత్ర్య సమరయోధునిగా భారత ప్రభుత్వం సత్కారం
02. 1968లో 'జీవనగీత'కు ఉత్తమ అనువాద పురస్కారం (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అందించింది)
03. బూర్గుల రామకృష్ణారావు మెమోరియల్ తొలి అవార్డు
04. 1992లో పద్మవిభూషణ్ పురస్కారం ప్రదానం
05. 1992లో కాకతీయ విశ్వవిద్యాలయం వారు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేశారు.
06. 1996లో సహృదయ సాహితి, విశాఖ వారి గురజాడ అవార్డు
07. 1996లో కళాసాగర్, మద్రాసు వారి విశిష్ట పురస్కారం
08. 1997లో ఉండేల మాలకొండారెడ్డి విజ్ఞానపీఠం అవార్డు
09. 1996లో నాగపూర్ యూనివర్సిటీ వారి సత్కారం
10. 2000 సంవత్సరంలో రామినేని ఫౌండేషన్ వారి అవార్డు

ఇంకా అనేక సామాజిక, సాహిత్య సాంస్కృతిక సంఘాల వారు సత్కరించారు. అవార్డులకే వన్నె తెచ్చే రీతిన జీవితాన్ని గడిపిన ధన్యజీవి కాళోజీ.

నిష్క్రమణ: 13 నవంబర్ 2002



# కాళోజీ జ్ఞాపకాల తోరణం

[illegible]



కాళోజీ అంటేనే నిర్భీతికి ప్రతీక. అన్యాయంపై విస్ఫులింగాలు వెదజల్లే ఒక ధిక్కార స్వరం. అలాంటి ముక్కుసూటి మనస్తత్వం గల వ్యక్తిపై నిర్మించిన డాక్యుమెంటరీ ఎలా వుంటుందో అన్న కుతూహలం కలగటం సహజం. 'మన కాళోజీ' పేరిట చిత్రలేఖా స్టూడియోస్ వారు నిర్మించిన యాభైఆరు నిముషాల డాక్యుమెంటరీ కాళోజీ ప్రాపంచిక దృక్పథాన్ని పరిచయం చేయటమేకాదు, కాళోజీ గురించి రుక్మిణీబాయిగారు కాళోజీ కంటె మరింత సూటిగా, పదునుగా తన అభిప్రాయాల్ని వ్యక్తం చేయటం ఆశ్చర్యపరుస్తుంది. ఆవిడ మాటల్లో కాళోజీ మంచితనం పట్ల అందరూ వ్యక్తం చేసే ప్రేమకు కృతజ్ఞత వుంది. ఒక భర్తగా కాళోజీ తన ప్రేమను ఎన్నడూ అంతగా వ్యక్తపరచలేదని నిష్ఠూరమూ వుంది. సమాజము, వ్యక్తులు, జీవించే విధానం పట్ల ఎప్పటిలాగానే కాళోజీ నిర్మొహమాటత్వాన్ని, కటుత్వాన్ని ఆ డాక్యుమెంటరీలో చూస్తాం. ఒకే ప్రశ్నకు కాళోజీగారు, రుక్మిణీబాయిగారు విభిన్నంగా స్పందించటం మనకు కనిపిస్తుంది. కాళోజీ మాటలు నిప్పురవ్వల్లా మనల్ని తాకితే, రుక్మిణీబాయిగారి మాటలు మనల్ని మృదువుగా స్పృశిస్తాయి. అందుకని ఆ డాక్యుమెంటరీలోని వారి మాటల్ని వీలయినంతవరకు యథాతథంగా ఇచ్చే ప్రయత్నం చేశాం. పాఠకులు అప్పుడు మాత్రమే కాళోజీనిగాని, రుక్మిణీబాయిగారిని పోల్చుకోగలుగుతారని పాలపిట్ట నమ్మకం. ఒక జీవనతత్వాన్ని, ఒక జీవన వివేచనను ఎలా పరికించాలో, అవగతం చేసుకోవాలో బహుశః మనకు కాళోజీ నేర్పించినంతగా మరొకరు నేర్పించలేదేమో!

**"ఆ మనిషి ఎప్పుడు గుర్తుకొస్తడు. మనసుల్నే వున్నడు కదా. ఈ మంచం చూసినా ఏ వస్తువు చూసిన గుర్తుకొస్తడు. మర్చి పోతనా!"**

(కాళోజీని తల్చుకుంటూ కాళోజీగారి భార్య రుక్మిణీబాయిగారి మాటలవి)

**కాళోజీ గారి చిత్రాల మీంచి కెమేరా రోల్ అవుతుండగా రుక్మిణీబాయిగారొచ్చారు.** ఆయన జ్ఞాపకాలు ఆవిడలో అలజడి రేకెత్తిస్తుండగా చెమ్మగిల్లిన కళ్లను తుడుచుకుంటూ కూర్చున్నారు.

**డా. భిక్షం:** నారాయణరావుగారు ఇంట్లో పనిచేసేవాళ్లతోటి, రకరకాల వ్యక్తులతోటి ఎలా వుండేవారు?

**రుక్మిణీబాయి:** ఆయన వాళ్లతోటి ఎవరితోటి మాట్లాడక పోతుండె. మా తోటికోడలు వాళ్లతోటె మాటలు లేకుండె. అన్న దమ్ములు మాట్లాడుకునేవాళ్లు. (రామేశ్వరరావుగారు కాళోజీ సోదరులు.) ఎవరయినా స్నేహితులొస్తే వాళ్లతో మాట్లాడేది.

**భిక్షం:** మీ నాయనగారితో బాగా మాట్లాడేదా?

ఆయన వచ్చినప్పుడు మాట్లాడేది. ఎక్కువగా సంస్కృతంలో ఈయనకు తెలియనివన్నీ మా నాయనను అడిగేది. అడిగి తెలుసుకునేది.

**సంతోష్ (కాళోజీగారి మనవడు):** తాతకు ఎండలు అసలు పడకపోయేవి. కాళోజీగారిల్లు అని జనాలకు ఎలా తెలిసేదంటే ఇంటి చుట్టుపక్కల తడిబట్టలేసి వున్న ఇల్లు మాదొక్కటే. ఎప్పుడూ చల్లగా వుండాలని అలా చేసేవాళ్లం. అట్లా నాకు, తాతకు ఎండాకాలమొచ్చిందంటే మిషన్ లెక్క వుండేది. తడిబట్టలు ఎండగానే తడిపి ఆరేయాలని ఎదురుచూస్తూ వుండేవాళ్లం. నా చిన్నప్పుడు ఒకసారి అప్పారావుగారని హైదరాబాద్ నుంచి వరంగల్ వచ్చారు. వాళ్లు మా ఇల్లు కోసం వెతుకుతూ వుంటే ఒక దగ్గర తడిబట్టలు వేసి వున్న ఇల్లు కనిపించిందట. ఓ ఇది కాళోజీ ఇల్లే అనుకుంటూ లోనికి వచ్చేశారు.

**రుక్మిణీబాయి:** ఆయన పొద్దుపోయే లేచేది మొదట్లో. అప్పట్లో 9-10 గంటలకు లేచేది, ఏదీ రాజేశ్వరరావుగారింట్లో వుండంగ.



తర్వాత్తరావత తొందరగా లేచేది. టిఫిన్ తయారుంటేనే మొహం కడిగేది ఆయన. అన్నీ సిద్ధం చేస్తే మొహం కడుక్కుని టిఫిన్ తిని, చాయ్ తాగేవాళ్లు. మళ్లీ 12,1 గంటలకు భోజనం చేసేది.

**సంతోష్:** చిన్నప్పట్నించి లేవంగనే తాతొచ్చి నన్ను లేపేది. పొద్దున్నే 6 గంటలకు పబ్లిక్ గార్డెన్స్‌కి లేదంటే దగ్గర్లోని వన విజ్ఞాన కేంద్రంకు వాకింగ్‌కు పోయేది. నేను చిన తాతయ్య, లేదంటే పెద తాతయ్య (రామేశ్వరరావు తాతయ్య)తో ఇద్దరితో కలిసి వాకింగ్‌కు పోయేది.



**రుక్మిణీబాయి:** కాసేపు పేకాడుకునేది ఆయన. కాసేపు పండుకునేది. ఆయనిష్టం. ఇక సాయంత్రం కాగానే బయట కుర్చీలేసుకుని స్నేహితులతో కబుర్లు చెప్పేవాడాయన.

**సంతోష్:** తాత పోయెట్. సోషల్ రిఫార్మర్ అని తెలుసుకానీ, ఆ యాంగిల్‌లో అంటే ఎందుకు గొప్ప, ఏం చేసిన్రు అని ఆలోచించలే. ఎందుకింత అందరికీ ఆయనంటే గౌరవం అని తెలువదు. స్పెసిఫిక్‌గా ఇందుకని తెలువదు. ఇంటర్‌లోకి వచ్చేసరికి తాత గొప్పదనమేమిటో తెలియసాగింది. తాత వూళ్లకు ఎక్కువ తిరుగుతుండె. నాయనమ్మ ఊరికె గులుగుతుండె. కాకపోతె నా చిన్నప్పుడు నేను, తాత, నాయనమ్మ కలిసి చాలా తిరిగినం. బీదర్‌కి, అటు ఇటూ బానే తిరిగినం.

**రుక్మిణీబాయి:** మా అన్నయ్య తర్వాత 20 ఏళ్లకు పుట్టిన్న గదా! చిన్నదాన్ని. మా అమ్మ దగ్గర వుండేది. చదువుకునేది. నాల్గో తరగతి చదివాను. పల్లెటూరి చదువు కదా! నాకు ఈయన చదువు చెప్పాలని ప్రయత్నం చేసిండు. లెక్కలు చెప్పాలని చూసిండు. ఈయనకు ఓపికలేదు. లెక్కలు రాకుంటే చెవులు మెలిపెట్టేది (నవ్వు). రజాకార్ల కాలంలో వీళ్లు జైల్లో వున్నప్పుడు మా అల్లుడు కూడా జైలుకు పోయిండు కదా, వీళ్లకు కాఫీలు, టిఫిన్లు ఇంటినుంచే పంపేది. ఒకరోజు టిఫిన్ వాపస్ వచ్చింది. వాపస్ వచ్చిందేందని అడిగితే గుల్బర్గా జైలుకు పంపిన్రని చెప్పిన్రు. అక్కడ రెండేళ్లు అయినంక పోలీస్ యాక్షన్ అయింది. అప్పుడు విడుదల చేసి పంపిన్రు.

**సంతోష్:** మా ఫ్రెండ్స్ తాత గురించి మాట్లాడుతూ మీ తాత రైటరంటకదా, పొలిటీషియన్ అంట కదా అని మా పేరెంట్స్ చెప్పారు అని భయపడేది.

**కాళోజీ కవిత అక్షరం కాదు...**

**నాదం... నినాదం..**

**గుండెను తడతాయి.**

**గర్జిస్తాయి...**

**(కాళోజీ ఒకానొక సభలో పాల్గొన్న ఒక దృశ్యమది)**

బహుశః ఆ సభ హైదరాబాద్‌లో జరిగింది. ఎంతోమంది చుట్టూ వుండగా కాళోజీ హన్మకొండ వాళ్లొచ్చిన్రా అని ప్రభాకర్‌ని అడిగి తెలుసుకుంటున్న దృశ్యం కన్పిస్తుంది.

1995వ సంవత్సరం డిసెంబర్22వ తేదీనాటి ఆంధ్రజ్యోతి పేపరు చదువుతున్న దృశ్యం. కాళోజీతో ఇంటర్వ్యూ రికార్డు చేస్తున్నారు డా. భిక్షం. కాళోజీకి కెమెరాలో మాట్లాడ్డం కష్టం. ప్రభాకర్ ఒక మనిషి తోడు వుండాలని కుర్చీలో కూర్చున్నారు. ఆ లైటు నా కండ్లమీద కొడుతోంది అంటున్నారు కాళోజీ. Something is going on, but what is that I cannot distinguish అంటున్నారు కాళోజీ.

ఒక pensive Mood లో వున్న కాళోజీని ఫోకస్ చేస్తూ కెమెరా ముందుకు సాగుతూ కాళోజీని క్లోజప్‌లో చూపించింది.

**కాళోజీ:** Ordinary people want something extra ordinary in him, whom they elevate. పెద్దవాడిని చేసినవాడిలో, వాడు కూడా సామాన్యుడివలె వర్తించడం వాళ్లకు నచ్చదు. అట్లనే వానికి గూడా ఎంత గొప్పవాడయిన కూడా నాచురల్‌గా మనిషి కాబట్టి, వానికి ఆకలిదప్పులు అవి వున్నయి కాబట్టి, వాడు వర్తించినాగాని, నేను కూడా సామాన్యుడిగా వర్తిస్తున్నా అని ఎక్స్‌పోజ్ కాదలుచుకోలేదు వాడు.

జాషువా నాకు 50, 60 ఏళ్ల నుంచి పరిచయం. వరంగల్ వస్తే మనింట్లోనే వున్నడు. మరెప్పుడన్నా బెజవాడొస్తే పలానా దగ్గరుంట, రండి అని అడ్రసది ఇచ్చింది. 46లో నన్ను మూణ్ణెల్ల పాటు వరంగల్ జిల్లా నుంచి వెళ్లగొట్టిన్రు. హైదరాబాద్ వచ్చి ఒకసారి ఆ ప్రాంతం చూస్తే బావుంటుంది కదా అని బెజవాడ పోయినా. అప్పుడు జాషువా గురించి జ్ఞాపకమొచ్చింది. ఆ అడ్రస్‌కు పోయిన. ఆ అడ్రసులో ఆయన బిడ్డ, అల్లుడూ వున్నరు. మీరు సాయంత్రం గనక గాంధీనగర్ వస్తే ఫలానా హోటల్‌కు వస్తే 5 నుంచి 8 గంటల వరకు వుంట అని చెప్పిండు. సాయంత్రం అటే వెళ్తే ఆ హోటల్ కనిపించింది. క్యాషియర్‌ని అడిగితే పైన గదిలో వుంటడు, పొండి అన్నడు. అదొక బార్ కమ్ రెస్టారెంట్. 1946లో కాళోజీ అనేవాడు ఆర్య సమాజిస్టు, కాంగ్రెసోడు ఈ బార్ కం రెస్టారెంట్‌కు పోవటం చాలా విచిత్రం కదా. కానీ నేనా బోర్డు చదువుకునే లోపలకు పోయిన, without any hesitation. నేనాయనతో మాట్లాడి కిందికి వచ్చి సీడీల (మెట్లు) మీద కాలుపెడుతున్న. ఇద్దరు పరిచయస్తులు నాకు ఎదురయ్యారు. "నమస్కారం, కాళోజీగారూ" అన్నారు. 'నమస్కారం' అన్న. వాళ్లు ఆశ్చర్యం పట్టలేక "మీరూ ఇక్కడా" అన్నారు. నేను చూసి, ఏమున్నదిక్కడ అని మళ్లీ జూసి, బోర్డున్నది బార్ కమ్ రెస్టారెంట్ అని. వాళ్లతోటి ఏమనాలి నేను. caught redhanded అన్నట్లే కదా! వాళ్లని కన్విన్స్ చేయటం కోసం ఏమనాలి. నేను మనిషిని కాదా అన్న. తల్కాయొంచుకుని వెళ్లిపోయారు.



కాళోజీతో గుజ్జ భిక్షం

**కొనసకు ఒక రోజున మా అన్నయ్య నన్ను పిలిచాడు. ఆయన అడిగాడు. అరె నీకు పెళ్లి చేసుకోవద్దనే వుంటే చేసుకోకు. కానీ దాన్నెవరు సాదాలె, పిల్లలు పుడితే వాళ్లనెవరు సాదాలె అని ఆ భయంతో మాత్రం చేసుకోకుండా ఉండకు**

**(పచ్చని పొలాల మధ్య కాళోజీ నడుస్తూ ఒక ఋషిలా వెళుతున్న దృశ్యం)**

**రుక్మిణీబాయి:** మా మేనమామ వద్ద చదువుకున్నరట మా వారు. అయితే ఒకరోజు పిలిపించి 'గురుభిక్ష ఏం పెడతవు' అని అడిగిండట. నువ్వేదడిగితే అది ఇస్తానన్నడట. నా చేతిలో చెయ్యేయమన్నాడట. చెయ్యేసినంక "నా మేనగోడలున్నది, నువ్వు పెళ్లి చేసుకోవాలి" అన్నాడట. సరే అన్నాడట. మా బావ కూడా వకీలే. వకీళ్లంతా సాయంత్రం పేకాటకు వచ్చేది మా బావ ఇంటికి. అయితే రోజు జూస్తున్నడ కదా. ఏం జూస్తడు అన్నా. "లేలే పత్నీభావకంగా చూడాలె." సరే అని ఒకరోజు రమ్మంటే వచ్చిండు

**కాళోజీ:** మా కాలంలో 26వ సంవత్సరంలో నేను పెళ్లి చేసుకున్న. ఆ వయసులో 10 ఏళ్ల కొడుకు వున్నవాళ్లు ఉన్నారు, నా జంటవాళ్లు. నా జంటవాళ్లే (కాళోజీ స్ట్రెస్ చేస్తూ అన్నారు.) అప్పుడు చాలా తొందరగా పెళ్లి అయ్యేది. పదహారోయేట కొడుకో, బిడ్డో పుట్టేది. నేను మాత్రం ఇరవై ఆరో ఏట చేసుకున్న. ఆమె 13 ఏళ్లు నాకంటే జూనియర్. ఆమెకు 13 సంవత్సరాలు నాకు 26. 1948లో మ్యారేజి అయింది.

**రుక్మిణీబాయి:** సరే చూసిండు. ఎల్లిపోతున్నడు. ఏమాయన్నయ్యా, చూసినవ్, లేచెల్లిపోతున్నవ్ అంటే నాల్రోజుల తర్వాత







చెప్తా అన్నడు.

**కాళోజీ:** అయితే ఇరవై ఆరేళ్లంటే నేను adultని కదా. 12-13 ఏళ్ల నుంచి పబ్లిక్‌లో తిరుగుతున్నవాడిని కదా. I was conscious that I am totally depending on my brother. ఇక దాంట్లో పెళ్లి చేసుకున్నట్లయితే ఏమయితదో, ఎందుకు అని చెప్పి I was hesitating to marry.

**రుక్మిణీబాయి:** అంటే ఆయన అన్నగారు అంటే మా బావగార న్నరట, నువ్వు సంపాదించకపోతే మానె కానీ, పెళ్లి చేసుకోవాలె అన్నరట. మై హూనా సాత్ అన్నాడట.

**కాళోజీ:** కొసకు ఒక రోజున మా అన్నయ్య నన్ను పిలిచాడు. ఆయన అడిగాడు. అరె నీకు పెళ్లి చేసుకోవద్దనే వుంటే చేసుకోకు. కానీ దాన్నెవరు సాదాలె, పిల్లలు పుడితే వాళ్లనెవరు సాదాలె అని ఆ భయంతో మాత్రం చేసుకోకుండా ఉండకు. నిన్ను సాదినట్లే, దాన్ని సాదుతా, దాని పిల్లల్ని సాదుతా. అన్నాడు. Immediately I agreed and married.

రుక్మిణీబాయి: ఇక్కడికొచ్చినంక అందరూ పెద్దోళ్లేనాయె, అత్త పెద్దది. ఎవర్తోటి మాట్లాడతా! అందరికి భయపడ్డా. ఇక మాయనే. కూసున్నోడు కూసున్నట్లే లేచిపోయేది, నిలబడ్డోడు నిలబడినట్లే లేచిపోయేది.

కాళోజీ: ఇక్కడ రెండు భేదాలున్నాయి. ఆమె సైకాలజీ చెప్పాలంటే నాకు నన్ను సాదేటటువంటి అన్న అదుపు కూడా నాకు లేదు కదా! కానీ ఆమెకు నా అదుపు ఒక భర్తగా, బావ అదుపు, పెద్ద కోడలు అంటే మా వదినగారి అదుపు, మా అమ్మ ఇంటర్ ఫియర్ కాకున్నా కూడా వుండే అత్త అదుపు. దీంతోటి ఏంచేసిన ఏమయితుందో అన్న దాంతోటి ఆమె కాంప్లెక్స్ అంతా వేరే గదా!

భిక్షం: ఆ విషయం మిమ్మల్ని బాధపెట్టలేదా!

కాళోజీ: బాధేమున్నది. I Understand her position.

రుక్మిణీబాయి: అక్కడ ఘంటసాలలో గొర్రెపాటి వెంకట సుబ్బయ్య అని ఒకాయన నున్నాడు. ఈయన అక్కడికి పోతే నెలా, రెండు నెలలుండేదన్నమాట. మేం బెంగపెట్టుకుంటమే మోనని అక్కడ్నించి ఉత్తరం రాసేదాయన. (గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు). మా తమ్ముడిక్కడే వున్నాడు. మీరేమీ బెంగ పెట్టుకోకండి అని ఎక్కడికి పోయేది చెప్పకపోయేది. ఎటుపోయేది చెప్పకపోయేది.

కాళోజీ: There was a great mistake. If for anything I regret, very few things that I regret at that time being married. I thought that తినడానికి పెడితే చాలనుకున్న.

రుక్మిణీదేవి: ఆయన సంగతి తెలిసి కూడా చేసుకోవాలనుకున్న కదా! జైల్లోకి పోతే కూడా మా అమ్మ భయపడితే, మా మేనమామ ధైర్యం చెప్పిండు. నా కిష్టమయింది, చేసుకుంటా అన్న. చేసుకున్న.

కాళోజీ: కానీ, దానికి నేను భర్తను కదా! మరి తక్కిన భర్తలున్నట్లు వుండాలి కదా! అట్లా వర్తించాలి కదా! మన బట్టల విషయంలోనే కొనుక్కున్నది లేదు, చేసింది లేదు. అట్లనే ఆమె విషయంలో మనం పోవడమనే ప్రశ్నే లేదు. అందరికి వచ్చినట్లు బట్టలు ఆమెకు వచ్చినయి. వస్తున్నయి. కానీ ఇవి కాకుండా భర్త అని ఒకటుంటుంది కదా. ఆమె నేచర్‌కు సంబంధించిన ఇష్యూలలో most faithfull husband ని.

భిక్షం: ఫస్టు పెళ్లి కాగానే కాళోజీ ఏం మాట్లాడాడో అది చెప్పమ్మా. ఆయన తీరు ఎట్లనిపించింది?

రుక్మిణీబాయి: అవి వెనకటి రోజులు కదా! ఏం మాట్లాడుకోలే. పెళ్లి చూపులప్పుడు ఒక్కడే వచ్చిండు, చూసిండు, ఎల్లిపోయిండు. అప్పుడు మా బావ అడిగిండు. ఏం పోతున్నవ్, మరేం జెప్పవంటే, నాల్రోజులకు జెబుతా అన్నడు. మళ్లా వీళ్లు పోయి అడిగితె 'చేసుకుంటా' అన్నడు. అంతే. ఇక నేను, ఆయన ఏం మాట్లాడుకోలె.

కాళోజీ: ఒకాయన నూరేళ్ల వయసున్నాయన వున్నడు. ఆర్యసమాజిస్టు. పేరు గోపీదేవశాస్త్రి. చాలా చదువుకున్నాడు. He has celebrated 100th birthday 6 months back. 50-60 ఏళ్ల నుంచి ఆయన పరిచయం. బోయి భీమన్న 85-86 ఏళ్లున్నవాడు. ఈయన బయోగ్రఫీ తీసుకుపోయి ఆయనకిస్తే అందులో నేనూ, నా భార్య వున్న ఫోటో వుంది. ఈమెవరు అన్నడు. నాకు 50-53 నుంచి పరిచయమున్నాడు భీమన్న. ఈమెవరు అంటే నా భార్య అన్న. నీకు పెళ్లయిందా అన్నడు (నవ్వు). ఒకసారి హైదరాబాద్‌కి వస్తే గోపీదేవశాస్త్రి ఎక్కడున్నడో అక్కడకు నా భార్యతోటి వెళితే ఇదే అన్నడు ఆయన 'నీకు పెళ్లయిందా' అని. ఆయన ఆజన్మ బ్రహ్మచారి, ఎవరూ


కాళోజీ సోదరులు

గోపిదేవశాస్త్రి. 'నీకు పెళ్లయిందా' అన్నడు. నిన్న మా భీమన్న మళ్లా అదేమాట 'నీకు పెళ్లయిందా?' అని. ఏమిటంటే పబ్లిక్ లైఫ్‌లో కాళోజీ ఎంత దిక్కున్నడో, ప్రతి దగ్గరా కూడా ఆమె రాలేదు కనక కాబట్టి ఆ ప్రసక్తి రాలేదు. పెళ్లయిందా లేదా అన్న ప్రస్తావన ఎన్నడూ రాలేదు. ఇంక తక్కినోళ్లకి ఎరుకున్నోళ్లకు మా ఇంటికి వచ్చినవాళ్లకు తెలుసు.

**(ఈ ఎపిసోడ్ చెబుతున్నప్పుడు కాళోజీ మొహంలో పట్టరాని నవ్వు దోబూచులాడింది.)**

**(దృశ్యం మార్పు. ఇక్కడ కెమేరా కాళోజీ దంపతుల పెళ్లి నాటి ఫోటోలను వీక్షకులకు పరిచయం చేస్తోంది)**

**(కాళోజీ- రుక్మిణీబాయి వివాహ మహోత్సవం 1940వ సంవత్సరంలో జరిగింది. నవదంపతులు ఛాయాచిత్రం వీక్షకుల ను ఆకర్షిస్తూ కన్పిస్తుంది.)**

**రుక్మిణీబాయి:** పోలీసు యాక్షన్ వచ్చింది. అప్పుడు పోలీసులొచ్చిన్రు. పోలీసులు ఆయనను పట్టుకుపోంగనే సోదా కొచ్చిన్రు. అయితే ఒక ముసల్ది రోడ్డు మీద పోతుంటే, దాన్ని తోలిన్రు లోపలికి. కాళోజీ భార్య మీద ఏమన్నా సొమ్ములు న్నాయా చూసి రమ్మని. ఆ ముసల్ది చూసొచ్చి ఏంలేదు పసుపుతాడు, పుస్తెలే అన్నది. అయినంక లోపలికొచ్చి సోదా కొచ్చిన అన్నరు. ఆయన సంపాదించలేదు. మా బావగారు ఆయన్ని, ఆయన భార్య పిల్లలను నేనే సాదుతున్న, ఆయనదేమీ లేదు, ఒక మంచమున్నది. (ఇప్పటికి వున్నది) కావాల్సిస్తే ఆ మంచం తీస్కపోన్రి అన్నరు. గంత మంచం మాకెందుకు. ఏదో కానూన్ ప్రకారం తీస్కపోవాలి అంటూ ఒక అల్మైరా, ఒక కుర్చీ, ఇంకో మంచం తీస్కపోయి కోర్టులో పెట్టుకున్నరు. మళ్లీ విడుదలయినంక అవి తెచ్చి మా ఇంటిలో పడేశారు.

**కాళోజీ:** when I was 58 years old in 1972. రెండువందల రూపాయల పొలిటికల్ పెన్షన్ వచ్చేది నాకు. ఆ రెండు వందలు తీస్కపోయి మా అన్నకిస్తుండె. మొదటిసారి జీవితంలో ఆయనికిచ్చిన. నాక్కావాలసింది ఆయన్ని అడిగి తీసుకున్నా.

**భిక్షం:** ఎప్పుడయినా పుట్టిన రోజు కాక చేసిండా అని రుక్మిణీబాయి గారిని అడిగారు.

**రుక్మిణీబాయి:** ఎన్నడూ చేయలే. ఆయన కూడా చేసుకోలేదు. షష్ఠిపూర్తి అయిన దగ్గర్నించి ఆయనకి జేస్తున్నరు.

**కాళోజీ:** వ్రతనిష్ఠుడయిన వాని భార్యా పిల్లలకు, వ్యసనపరు డయిన వాని భార్య పిల్లలకు ఏమీ తేడా ఉండదు. We are not even loyal to the vices. That is the tragedy of the society.

**సంతోష్:** తాతయ్యకు నాయనమ్మ మీద చాలా ప్రేమ ఉండేది కానీ, ఎన్నడూ వ్యక్తం చేయకపోయేది. నాయనమ్మకు జ్వరం వస్తే డైరెక్ట్‌గా చూడకపోయేది, అడగకపోయేది. ఎట్లున్నదిరా అని నా ద్వారా అడిగేవాడు. ప్రతి అరగంటకోసారి అడిగేది. నాయనమ్మ మీద కానీ, నాన్న మీద కానీ ఎన్నడూ డైరెక్ట్‌గా చూపకపోయేది ప్రేమ అనేది. కానీ నామీద అలాకాదు, నాకు కొంచెం బాగా లేకపోతే ప్రతి పది నిముషాలకొకసారి అడిగిపోతుండె తాతయ్య. ఈ సందర్భం గా లోకమంత తాత మంచోడు, మంచోడు అని ఎందుకంటరు అని సంతోష్ వాళ్ల నాయనమ్మను అడిగాడు.

తాత అందరితోను మంచిగుంటడు కాబట్టి అందరు మంచోడం టారు. అని రుక్మిణీబాయిగారు సమాధానమిచ్చారు. ప్రపంచమంతా మంచేకదా. నాకదే చాలు. నాతో ఉంటే ఏం, లేకపోతే ఏం, నాకుండేది ప్రేమ ఆయనంటే. ఆయనకున్నదో లేదో నాకు తెలవదు అని సమాధానమిచ్చారు.

**సంతోష్:** నువ్వు తాతకు ఈ మాట జెప్పనుండె

**రుక్మిణీబాయి:** ఎందుకు జెప్పాలె. నా కష్టం నేనే పడ్డ. ఎవరికీ జెప్పలేదు.

**భిక్షం:** కాళోజీగారూ, మీరూ కలిసి వేరే ప్రాంతాలకు వెళ్లారా. వెళితే ఆ విషయాలు చెప్పండి.

**రుక్మిణీబాయి:** కాశీకి పోయినం, రామేశ్వరం పోయినం, ఢిల్లీకి పోయినం, తిరుపతి రెండుసార్లు పోయినం. రామేశ్వరం పోయిన







*కాళోజీగారు అనగానే, కాళోజీ గారన్నవా అని ప్రశ్నించారు కాళోజీ. గారు కాదు, కాళోజీ పెద్దన్న. జగతికి శాపములిచ్చుచూ, శతవత్సరములు బ్రతుకుము అని మాత్రం అంటాను. ఎందుకో ఈయన తిడితే తిట్టినట్లుండదు మాకు. దీవించినట్లుంటుంది. ఇదంతా ఆయన గొడవకు సంబంధించిన మా అందరి గొడవ.*

ప్పుడు మాత్రం హైదరాబాద్ నుంచి వచ్చినవాళ్లు ఒకళ్లు వచ్చిన్రు. వాళ్లతోటి నన్ను పంపించిండు, తను రాలే ఇక. ఆయన ఎక్కడికి తీస్కపోడు. ఎవరింటికి పోతామో వాళ్లే తీస్కపోయి చూపించాలె. ఆయన రాకపోయేది. గుళ్లూ, గోపురాలు ఎప్పుడూ పోలేదాయన. తిరుపతి పోయిన కూడా కొండ ఎక్కలే. దేవుడి దగ్గరకు పోలే.

**కాళోజీ:** ఈ దేవుడు అనే ఐడియా ఎందుకొచ్చిందంటే, ప్రతివాన్ని కన్విన్స్ చేసి రూల్‌కు ఒప్పించలేం కాబట్టి, వాడి మీద పోలీసోడు కాపరి. పోలీసోడు లేనప్పుడు తప్పుడు పనులు చేస్తున్నావు. అందుకని సొసైటీని కనిపెట్టినవాడు ఏం చేశాడంటే దేవుడనే వాడు సర్వాంతర్యామి, ప్రతి దగ్గర వున్నాడని సృష్టించాడు. ఇవన్నీ చెక్స్. మంచిగ చేస్తే నీకు స్వర్గమొస్తది. చెడు చేస్తే నరకానికి పోతావు అని క్రియేట్ చేశారు. గంగలో స్నానం చేస్తే నీ పాపం పోతుంది, తిరుపతి వెంకటేశ్వరుడు దగ్గరకు వెళితే నీ పాపం పోతది, ఇలా. ఇంత భక్తుడయినవాడు, స్వర్గాన్ని నమ్మేవాడు, నరకాన్ని నమ్మేవాడు తప్పులెందుకు చేస్తున్నాడంటే వానికున్న ఎరుక, తిరుపతికి పోయి మొక్కు చెల్లిస్తే అక్కడికి ఆటోమేటిక్‌గా పరిహారమయిపోతుంది. ఎవరి ద్వారా ఉద్యోగమొచ్చిందో మంత్రో, ఎమ్మెల్యే ఎవరో ఒకరి ద్వారా వచ్చి ఉంటే వారిని గౌరవిస్తున్నావు. రెండోది తిరుపతికి పోయి అక్కడి హుండీలో ధర్మాలకు డబ్బులేస్తున్నావు. నా స్వయం కృషితో న్యాయబద్ధంగా వచ్చిందన్న Conviction లేదు. ఇన్ని క్వాలిఫికేషన్స్ వున్న గాడ్‌తోటో, గాడ్ ఫాదర్‌తోటో మొరపెట్టుకోవాల్సిందే కదా. ఈ సొసైటీలో Extraordinary things, unnatural things పట్ల వున్న admiration, natural things పట్ల ఎందుకు లేదూ అన్నదే నా ప్రశ్న.

**భిక్షం:** ఆయన గడ్డం పెంచుకోకముందు మంచిగ అన్పించిండా, పెంచుకున్న తర్వాత మంచిగ అన్పించిండా?

**రుక్మిణీబాయి:** పెంచుకోకముందే మంచిగున్నడు. (నవ్వు). షష్టిపూర్తి అయినంకనే గడ్డం పెంచుకున్నడు. అంతకుముందు లేదు.

**భిక్షం:** గడ్డం తీయమని చెప్పలేదా?

**రుక్మిణీబాయి:** నేనా? నే చెబితే వింటడా? ఆయన ఎవరి ఎదురు మాట వినకపోయేది కదా! తల్లి మాట వినలేదు. అన్నమాట వినలేదు. ఇక నామాట ఎందుకింటడు ఆయన.

**కాళోజీ:** నేను ఏడు నెలల వాడ్ని. మా అమ్మ మళ్లా గర్భవతి అయింది. దానివల్ల నన్ను మోయలేకపోయేది. ఏడేళ్ల మా అన్నకు ఇచ్చింది నన్ను ఎత్తుకోమని. వాడు ఇప్పటికి నన్ను కింద ఎత్తేయలేదు. నేను దిగలేదు. వాడి మాటే వినని నేను, ఇక ఎవరి మాట వింటాను?

క్రెడిట్ పద్దు వేరు. డెబిట్ పద్దు వేరు. నన్ను సాదినందుకు ఆయనకు నమస్కారాలు. నాకిష్టం లేనిదయినా, నేను తప్పు అనుకున్నదయినా ఆయన వినమని జెప్పితే no question at all. అది అర్థం చేసుకుంటాడాయన.

**సంతోష్:** మిత్రమండలి మీటింగ్స్ ఇంట్లో అయినప్పుడు పెద్ద తాతకి, చిన్న తాతకి ఆర్గ్యుమెంట్స్ అవుతూ వుండేవి. పెద్దతాత ఒకటంటే, చిన్నతాత ఆర్గ్యు చేసేది. అది అక్కడ వరకే. తర్వాత మళ్లా మామూలుగానే మాట్లాడుకునేది.

**కాళోజీ 'నాగొడవ' ఆవిష్కరణ సభ దృశ్యం. మాజీ ప్రధాని పి.వి.నరసింహారావుగారు ముఖ్యఅతిథి. అదొక అపురూప దృశ్యం.**

పి.వి.నరసింహారావుగారు మాటల్లో చెప్పాలంటే

"కాళోజీగారు అనగానే, కాళోజీ గారన్నవా అని ప్రశ్నించారు కాళోజీ. గారు కాదు, కాళోజీ పెద్దన్న. మా మధ్య దూరాన్ని తీసేశాను. నాకు వెంటనే గుర్తు చేసినందుకు వారికి కృతజ్ఞతలు. జగతికి శాపములిచ్చుచూ, శతవత్సరములు బ్రతుకుము అని మాత్రం అంటాను. ఎందుకో ఈయన తిడితే తిట్టినట్లుండదు మాకు. దీవించినట్లుంటుంది. అంత ప్రేమతో తిడతాడు. కోప్పడతాడు. ఏడుస్తాడు. నవరసాలొలికిస్తాడు. ఇదంతా ఆయన గొడవకు సంబంధించిన మా అందరి గొడవ."

**రుక్మిణీబాయి:** పివి నరసింహారావు ఫోన్ చేసి ఇట్లా అడిగిండు, అవార్డిస్తడట, ఢిల్లీకి పోవాలంట అని అన్నడాయన. నేను గూడా వస్తా అన్న. నువ్వు వద్దు వద్దు అన్నా బలవంతంగా నేబోయిన.



**కాళోజీ:** నీకు అవార్డు ఇవ్వదలచుకున్నామన్నడు. నాకేమి ఆక్షేపణ లేదు అన్న. థ్యాంక్యు అన్నడు.

**భిక్షం:** ఏం అవార్డు అని కూడా అడగలేదా మీరు?

**కాళోజీ:** గవర్నమెంటిచ్చేది ఏ అవార్డయితే మనకెందుకు. అవార్డు ఇస్తున్నమన్నడు. నాకేమీ ఆక్షేపణ లేదన్న. అన్నగారు బావున్నారా అన్నాడు. బావున్నడు అన్న. అయితే పెట్టేయనా

అన్నాడు. పెట్టేయన్న. సంభాషణ అంతా కలిపి నిముషం కూడా లేదు.

**రుక్మిణీబాయి:** వాళ్లు ఇస్తనని చెప్పిన్రు. తీసుకుంటా అన్న అన్నడు. తీసుకుంటోడో లేదో అని మొదలు పిలిపించి అడిగిం దన్న మాట. ఈయన మొండోడు కదా.

**కాళోజీ:** పి.వి.నరసింహారావు చందా కేంపులో తిరిగిన వాడు, చేసినవాడు. ఆ పివి నరసింహారావుకంటే ప్రైమ్ మినిస్టర్ పీవీ నరసింహారావు పెద్దవాడు కాదు, అని నా కన్విక్షన్. తక్కినవాళ్ల దృష్టిలో అది కాకపోవచ్చు.

**భిక్షం:** మీరే ప్రపంచం కాకపోవచ్చు కదా!

**కాళోజీ:** నా దృష్టిలో అంటున్న కానీ, వాడు degrade అయిందు, పోగొట్టుకున్నడు అంటలేదు కదా. I am speaking this in relation to Kaloji and P.V.Narasimharao. కాళోజీ అండ్ రామకృష్ణరావు (బూర్గుల). రామకృష్ణరావు చీఫ్ మినిస్టర్‌గా వుంటే రామకృష్ణరావు బిడ్డ చచ్చిపోయింది. పద్దెనిమి దేళ్లది. రామకృష్ణరావు దగ్గరకు పోయిన. కాళోజీ నారాయణ రావు అని రాసిచ్చిన, ఆ ఫోర్త్‌క్లాస్ ఎంప్లాయికి. వాడు లోపలికి తీసుకుపోయి, ఇంత ప్రొఫార్మా తెచ్చిండు. చీఫ్ మినిస్టర్ దగ్గరకు ఎందుకొచ్చినవు, ఏ కారణంతోటి, ఇవన్నీ నింపాలనట. ఎవరి చ్చిండు ఇది అంటే పి.ఏ. ఇచ్చిండు అన్నడు. పోదాంపా మీ పి.ఎ దగ్గరకు అని పోయినం. ఇంతలో ఆ పి.ఏ గారొ చ్చిండు. ఏమిటిదండీ ఇదంతా అంటే మీరు చీఫ్ మినిస్టర్ దగ్గరకు వచ్చిన్రు. ఎందుకొచ్చిన్రో, మీ పేరు, చిరునామా ఇవన్నీ రాయాలి అన్నడు. నువ్వెవరవు అంటే నేను పి.ఏ.టు చీఫ్ మినిస్టర్ అన్నడు. అయితే నేను చీఫ్‌మినిస్టర్ దగ్గరకు రాలేదు, రామకృష్ణా రావు దగ్గరకు వచ్చిన అన్న. రామకృష్ణరావు దగ్గరకు ఎందుకు వచ్చిన అన్నది నీకు చెప్పవలసిన పనిలేదు అని చెప్పిన. అజీబ్ బాతే కర్‌తేహై అంటాడు వాడు. చాలా విచిత్రంగా మాట్లాడుతు న్నవ్ అంటాడు. అయ్యా నేనేమి విచిత్రం మాట్లాడు తలేను. వాస్తవం మాట్లాడుతున్న అన్న. చీఫ్ మినిస్టర్‌తో పనిబడితే మీరు చెప్పినవన్నీ చేయాలి. కానీ ఇప్పుడొచ్చింది మాత్రం చీఫ్ మినిస్టర్ దగ్గరకు కాదు, రామకృష్ణారావు దగ్గరకు అన్న. అంటే 'ఏ మిల్‌నే కా వక్త్ హై దో బజేకో' అన్నాడు ఆ పి.ఏ. అంటే నేనన్న.దాంట్లో రాసిలేదు తక్షణం నా ముందర హాజరయి నాకు దర్శనమివ్వవలసింది అని. నా పేరు వానికి తెల్వాల. వాడిప్పుడు కలుస్తాడో, రాత్రి 12 గంటలకు కలుస్తాడో, తనే వస్తానంటడో అది వానిష్టం. నన్నేం చేయమంటవ్ అన్నడు. నీకు వీలుంటే ఈ పేరు వాని ముందర ప్రవేశపెట్టు. సరే పంపించిండు. రామకృష్ణారావు అన్నం తిని చేయి కడుక్కుంటు న్నడు. నా పేరున్న కాగితం కన్పించింది. కాళోజీ నారాయణరావు అని కన్పడగానే తువ్వాలుతోని చేయి తుడుచుకుంటు వచ్చిండు. ఏం చెప్పాలి నారాయణరావు, నా భార్యతో కూర్చుని నా బిడ్డ చచ్చి పోయిందని ఏడ్వడానికి కూడా టైం లేదు అన్నడు. చాలా మంచిది రామకృష్ణారావుగారూ, ఎందుకంటే రామకృష్ణారావు



బిడ్డ చచ్చిపోయిందికానీ, చీఫ్‌మినిస్టర్ బిడ్డ చనిపోలేదు. చీఫ్ మినిస్టర్‌కు బిడ్డ లేదు. చీఫ్ మినిస్టర్ అంటే ఇన్ని కోట్లమందికి తెలిసినవాడు. అతనికి ఏడ్వడానికి కూడా టైం లేదంటే, ఇది నీకు పెద్ద క్రెడిట్ అన్న. All these things ఒక్క క్షణం ఆలోచించి చెప్పినవి కాదు. ఇవన్నీ impulse తో చెప్పినవి. ఇంకో ఆయన 'దిగంబరరావు బిందూ' అని హోంమినిస్టర్ ఉండె. ఆయన మా మేనమామ లాంటివాడు. ఆయన్ని కూడా 'మామా' అని పిలిచేది. వాడు హోంమినిస్టర్ అవ్వగానే కాంటాక్ట్ క్లోజ్. ఇప్పుడు పీవీ నరసింహారావుగారు మంత్రి అయిన తర్వాత కాళోజీ రావటం లేదు. కన్పడటంలేదని రామరాజుతో అన్నాడట. అంటే రామ రాజు ఎందుకు కాళోజీ ఎప్పుడొచ్చినట్లె వస్తున్నడు, కలుస్తున్నడు, ఎక్కడ ఉండాలో అక్కడ్నే ఉంటున్నాడు అన్నాడుట. మరి ఏమాయె నన్ను కలవటం లేదు అని పీవీ అని, ఆయనొచ్చి నప్పుడు ఆయనకు తెల్వకుండా నాకు ఫోన్ చెయ్యి అన్నడట. రాత్రి పదకొండున్నరకు ఎవరో కలవటానికి వస్తే, తన మినిస్ట్రీ కారు పక్కన బెట్టి, ఆ స్నేహితుడి కారు తీసుకుని తనే డ్రైవ్ చేసుకుంటూ వచ్చాడు, రామరాజింటికి. వచ్చి ఏమయింది, ఎందుకు రావటం లేదూ అని అడిగాడు. నువ్వు నరసింహారావుగా రా, నాకు మినిస్టర్‌గారితో పనిలేదు. పరిచయం లేదు అన్న. నేనెందుకొస్త, నేను రాను అన్న. మినిస్టర్ అయితే పాపం చేసినట్టా అన్నాడు పీవీ. పాపం, పుణ్యం సంగతి కాదు, ఆ దర్బారే వేరు.

అలాగే 'పద్మవిభూషణ్' ఇస్తే తప్పు లేదురా. 'పద్మవిభూషణ్' ఇచ్చిండని వాడు చెప్పినట్లు వింటే తప్పు అన్న. ఈ 'పద్మవిభూషణ్' రావటం వల్ల ఎన్నో సర్కిల్స్‌లో బాయికాట్ చేసినవన్నీ నా ముందు కూర్చుని వింటున్నయి. ఆ అడ్వాంటేజ్ కోసం తీసుకన్నని చెప్పిన. హారాలు వేసుకోవటం తప్పుకాదురా, హారాలు వేసిండని వాని మాట వినడం తప్పయితది. హారాలు ప్రేమగా వేసుండచ్చు. కానీ ఆ హారాలకు లొంగిపోవడం అనేది తప్పురా అని చెప్పిన.

**రుక్మిణీబాయి:** ఎక్కడి బోయినా ఉత్తరాలు ఎప్పుడు రాయలా ఈయన. వాళ్లే రాసేది. బట్టలు కూడా తీస్కపోయేది కాదు. నిలబడ్డోడు నిలబడినట్టే పోయేది. అయితే ఘంటసాలలో గొర్రె పాటి వెంకట సుబ్బయ్యగారింట్లో నెలలు కొద్ది వుండేది. ఆయనే



ఉత్తరం రాసేది. మీరు బెంగపడకుండి. మా తమ్ముడు మా దగ్గర్నే వున్నాడని. ఎక్కడ బోయినా వాళ్లు ఉత్తరం రాయవలసిందే కానీ, ఈయన ఉత్తరం రాయకపోయేది. మళ్లా ఇక్కడ వస్తే మాత్రం పేరు పేరున జోరుగా ఉత్తరాలు రాసేది వాళ్లకు.

**కాళోజీ:** హ్యూమన్ సొసైటీలోపట ఏది కూడా ఫైనల్ కాదు. We are always on experimental search. ఇది ఇదమిద్ధమని కాని పర్మనెంట్ సిస్టం కానీ వుంటదని లేదు. కానీ సోషల్ యానిమల్స్ కాబట్టి కలిసి మెలిసి ఉండటానికి రెండు రకాలుగా జీవించాల్సి వస్తుంది. ఒకటి కాంపిటేటివ్ మెథడ్‌లాగా చేసుకుని rivalry తో బతకవచ్చు. కోపరేషన్‌తోటి బ్రతకవచ్చు. అయితే మనం కోపరేషనల్ బతుకు బతుకుతమా, కాంపిటేషన్‌తో rivalry తో బతుకుతామా అన్న సంగతి. అంగడి బ్రతుకు. సంగడి బ్రతుకు. సంగడి అంటే స్నేహం. అంగడి బ్రతుకు అంటే మార్కెట్ లైఫ్. అక్కడ కాంపిటేషన్, పోటీ అన్నీ వుంటాయి. సంగడి బతుకు స్నేహపూర్వకమయిన బతుకులోపట కోపరేషన్ వుంటుంది. గుడ్‌విల్ ఉంటుంది. ఒకనికొకడు సహాయపడాలన్న దుంటుంది. స్నేహపూర్వకమయిన లైఫ్‌ను మనం ప్రిఫర్ చేద్దామా? అయితే నువ్వేదయితే చెబుతున్నవో పైకొచ్చినమని, దాంట్లో వాడు ఎవడ్ని ఏం చేస్తున్నడో ఏమీ లేదు. ఏ పార్టీకి ఏం చేస్తున్నాడన్నది లేదు. ఆ rivalry లోపల వాడ్ని వెనక్కి లాగాలి, తను ఎట్లయినా ముందుకెళ్లాలి.

హార్మోనీ, కోపరేషన్‌తో ఉండటం అనేది సొసైటీకి క్షేమదాయకం. స్నేహం, క్షేమం పోటీపడే కాడ, దానికి అంతులేదు. "చాప చింపు సామ్రాజ్యం, పాటి మన్ను ప్లాటినం, బస్సు సీటు బ్రహ్మరథం, కోహినూర్- కోడిగ్రుడ్డు ఏదయితేనేం ఏదయితేనేం పోటీపడ కొట్లాడ" అరె వెధవలు కోడిగ్రుడ్డు కోసం కొట్లాడుకుంటాన్రు భయ్, వీడేమో కోహినూర్ కోసం కొట్లాడుతాడు. అక్కడేమో చెత్తకుండీ దగ్గర బన్ను రోటీ కోసం కొట్లాడితే, ఇక్కడ నువ్వు బఫేలో బిర్యానీ కోసం కొట్లాడుకుంటావు. దాంట్లో డిస్టింక్షన్, దాంట్లో కూడా స్టాండర్డు.

**రుక్మిణీబాయి:** రజాకార్ల అప్పుడే కాకుండా, ఆంధ్ర-తెలంగాణా అప్పుడు కూడా 15 రోజులు జైలుకు పోయిండు. అయితే ఎస్‌పి వచ్చి కూర్చున్నడు. ఈయన స్నానం చేసి వచ్చిన్నుడు. ఇద్దరూ మాట్లాడుకున్నరు కాసేపు. ఏంది ఎందుకొచ్చి



నవంటే నిన్నరెస్టు చేయనీకి వచ్చినం. నువ్వు చేసేదేంది పా, నేనే వస్తానన్నాడు. అప్పుడు జర్దాకులు తింటుండె. బట్టలు అవీ సర్దాల్నా అంటే తీస్కపోయినప్పుడు పెట్టడా. బట్టలిస్తడు, ఆకులిస్తడు, జర్దా పెడతడు. తీస్కపోయినోడు వాడే పెడతడు, అని చప్పుడు జేయక పోయిండు. 15 రోజులున్నంక మళ్లా కోర్టుకి తీసుకుపోయి విడుదల జేస్తామని జెప్పిన్రు. అంటే అన్నకు జెప్పి పంపిండు. నన్ను విడుదల చేస్తామంటున్నరు. కోర్టుకు పోయిన అని. అన్నపోలే కోపమొచ్చి, ఇక ఈయన నన్ను ఎందుకు అరెస్టు చేసిన్రు. ఎందుకు విడుదల జేస్తున్రు, ఏ కారణం వలన విడుదల చేస్తున్రు. అది చెప్పండి అన్నడు. ఎట్ల అయితే ఏందయ్యా నిన్ను విడుదల చేస్తున్నం అన్నడు మున్సిఫ్. నాక్కారణం చెప్పేవరకు నేను విడుదలకాను అన్నడట.

**(దృశ్యం మార్పు- రుక్మిణమ్మగారు నడిచి వస్తున్న దృశ్యం- నేపథ్య సంగీతం)**

రుక్మిణీబాయి మనవడు సంతోష్‌తో "మంచిగ మాత్రం చూడలే, గ్యారంటీ. అన్నీ చెప్పమన్నరు కదా చెప్తున్న. మంచి అంటే ప్రపంచానికి మంచే, నాక్కూడా మంచేకానీ, చూసుడు మాత్రం మంచిగ చూడలేదు. మనవడ్ని మాత్రం నెత్తిన పెట్టుకునేది."

**సంతోష్:** నీకు కుళ్లా అని నాయనమ్మను అడిగాడు.

**రుక్మిణీబాయి:** నాకేం కుళ్లు, నేను కూడా నెత్తిన పెట్టుకున్న గదా (నవ్వుతూ).

సంతోష్ గొంతులో శ్రుతి కలిపారు.

బయటికి చూపకపోయినా, లోపల ప్రేమ పడేది కదా అన్నడు సంతోష్.

దాన్ని రుక్మిణమ్మ గారొప్పుకోలేదు. నా బొంద అని కొట్టి పడేశారు.

సంతోష్ వూరుకోలేదు. మనసున ప్రేమ ఉండెనేమో అని రెట్టించాడు.

'ఆ సంగతి నాకు తెలీదు' అంటారు రుక్మిణీబాయిగారు.

**దృశ్యం మార్పు**

**కాళోజీ:** నేను బతకడం కోసమని మూడు పూటల భోజన



**అలాగే 'పద్మవిభూషణ్' ఇస్తే తప్పు లేదురా. 'పద్మవిభూషణ్' ఇచ్చిండని వాడు చెప్పినట్లు వింటే తప్పు అన్న. ఈ 'పద్మవిభూషణ్' రావటం వల్ల ఎన్నో సర్కిల్స్‌లో బాయికాట్ చేసినవన్నీ నా ముందు కూర్చుని వింటున్నయి. ఆ అడ్వంటేజ్ కోసం తీసుకున్నని చెప్పిన. హారాలు వేసుకోవటం తప్పుకాదురా, హారాలు వేసిండని వాని మాట వినడం తప్పయితది.**





పద్మవిభూషణ్ ప్రదానం చేస్తున్న నాటి రాష్ట్రపతి ఆర్.వెంకట్రామన్

మున్నూ, బట్టలు గిట్టలు లేని పరిస్థితి నాకు రాలేదు. అట్లా వచ్చినప్పుడు నేను ఏవిధంగా చేస్తనో ఆ టెస్ట్ నేనివ్వలేదు. కానీ నీ లగ్జరీ కోసం లొంగిపోవటం, నీ లగ్జరీ కోసం సొసైటీకి హాని చేయటం, సంపాదించుకోవడం ఏదయితే వుందో, దాని విషయంలో నేను వ్యతిరేకిని. 1934-35 ఆ ప్రాంతం లోపట ఒక అర్థోడాక్స్ ఫామిలితో నేను వాళ్లింట్లో వున్నాను. వాళ్లెంత ఆర్థోడాక్సో చెప్పలేను. అప్పటికే నేను ఆర్యసమాజ్‌లో తిరిగిన వాడిని. ఎక్కడపడితే అక్కడ తినటం అలవాటుంది. ఒకరోజు పెద్ద వాన కొడుతోంది. రోడ్డుమీద నీళ్లు పారుతున్నయి. మేమున్న ఇల్లు రోడ్డుకే వుంది కాబట్టి ఎక్కువయిన నీళ్లు రోడ్డు దాటి గడపలోంచి లోపలికి వస్తున్నయి. పెద్ద దర్వాజా పెట్టేసి కూర్చున్నా. రెండు గంటల తర్వాత వాన వెలిసింది. నేను మొట్టమొదట వచ్చి తలుపు తెరిచి నిలబడ్డ. ఆ గోడ పక్కకు రెండున్నర సంవత్సరాల పిల్లగాడు నిలబడున్నడు. చిన్న గుడ్డ గోచీ పెట్టుకున్నడు. గోడ కంటుకుని నిలబడ్డడు. చూరు నుంచి నీళ్లు వాడి ముక్కు మీద బడుతున్నయి. నేను గదా హ్యూమన్ బీయింగ్ నయితే వాడిని తీసుకుని లోపలికి రావాలి, according to my convictims and declarations. కానీ అక్కడ నా consideration ఏమిటో తెలుసునా. ఇది ఆర్థోడాక్స్ ఫ్యామిలీ. ఆ పిల్లవాణ్ణి లోపలకు తీసుకొస్తే వీళ్లేమయితరు అనే ఒక సందేహం. అయితే నా conviction గనక రైటే అయితే నాకా సందేహముండ గూడదు. కానీ లేదు. నాకా సందేహమొచ్చింది. వీణ్ణి లోపలకు రమ్మంటే వాళ్లేమంటరో అని వెనక్కి తిరిగి చూస్తే ఆ ఇంట్లో వుండే పెద్ద కోడలు నా ఈడుదే ఆమె వెళ్లబట్టె. వదినె, వదినె అని పిలవ బట్టె నేను. ఇటు వచ్చింది. వచ్చి దర్వాజ దగ్గర నిలబడింది. అగో అని ఆ పిలగాడిని చూపించిన. ఆ పిల్లగాడిని చూపించగనే ఆ ఆర్థోడాక్స్ లేడీ వెంటనే ఆ పిల్లగాడిని ఎత్తుకుని లోపలకు తీసుకొచ్చింది. ఒళ్లో కూర్చో బెట్టుకుని కొంగుతో వాడిని తుడిచి, వాడికి కొంగు బట్టింది. ఆమె హ్యూమన్ ఫీలింగ్స్ నిజంగా ఉన్నవి కాబట్టి ఆమెకి సంకోచం లేదు. నాలో మాత్రం అనుమానం, సంకోచం. ఆమె తల్లి కాబట్టి ఆ చిన్నపిల్లగాడిని దగ్గరకి తీసుకోవడంలో ఆమె హెసిటేట్ చేయలేదు. ఏ కులం, ఎవరూ అన్న సంకోచం లేకుండా ఆమె తీసుకున్నది. మరి అంత ఆర్థోడాక్స్ ఆమె సంకోచం లేకుండా తీసుకోవడం, నేనింత రిఫార్మర్ అనుకునేవాడిని, చదువుకున్నవాడిని, ఆర్యసమాజిస్టు అనుకునేవాడిని నేను చేయలేని పని ఆమె ఎట్లా చేసింది. అంటే ఈ విషయాన్ని forcefulగా, fashionగా, reformer గా పేరు రావటం కోసం ఆవిడ చెయ్యలేదు. ఆమెకు హ్యూమన్ ఫీలింగ్స్. నాదేమిటి ఈ సొసైటీ కోసమని ఒక స్ట్రాటజీగా తీసుకు న్నది. హిందూ ముస్లిం యూనిటీ అనేది strategy గా తీసుకోవటం వేరు. అస్పృశ్యత పోవాలన్నది స్ట్రాటజీగా తీసుకోవటం వేరు. అస్పృశ్యతనే పాటించకూడదు అన్న convictionతో అనటం వేరు. Thats what Krishna says in భగవద్గీత.

నాకు మంచి, చెడ్డ అది చేయాల్నా ఇది చేయాల్నా అన్నది ఏమీలేదు. కానీ "యత్ర ఆచర్యతే శ్రేష్ట, తత్ర ఆచర్యతే జనః" శ్రేష్ఠుడనే ఇమేజ్ వున్నవాడు ఏదయితే చేస్తాడో దాన్ని కాపీ చేసే ప్రయత్నంలో వుంటుంది జన బాహుళ్యం. కాబట్టి నేను ఒక స్టాండర్డ్‌గా అపియర్ కావలసి వస్తుంది అంటడు. శిష్టుడనబడేవాడు ఏది చేస్తడు, అదే అందరూ కాపీ చేయటానికి ప్రయత్నిస్తారు కాబట్టి వాడు జాగ్రత్తగా వుండాలి. నాకుమాత్రం ఇది చెడ్డ, ఇది మంచి, ఇది చేయాలని ఏ నిబంధనలు లేవు. కానీ for the sake of society I have to behave like this అంటడు కృష్ణుడు.

**భిక్షం:** మీకు 85 ఏళ్లు ఇప్పుడు. ఇంకో పాతిక, ముప్పై సంవత్సరాలలో దేశం ఎట్లుంటుందనుకుంటున్నారు?

**కాళోజీ:** ఈ ఓపెన్‌నెస్ ఎక్కువయిపోవటం వల్ల హిపోక్రసీ తక్కువయిపోతోంది. ఒక ఇంగ్లీష్ ఆఫీసర్ రిటైర్ అయిపోయిం తర్వాత ఇంగ్లండు వెళ్లిపోయిండు. రాజగోపాలాచారిగారికి పరిచయం. ఆ ఆఫీసర్ తన బయోగ్రఫీ రాసుకున్నడు. దాన్నో కాపీ రాజగోపాలాచారికి పంపిండు. అందులో Finances విషయంలో, తన Finances విషయంలో, సెక్స్ విషయంలో ఓపెన్



గా రాసుకున్నాడు. ఆయనకు రాజగోపాలాచారి ఉత్తరం రాసిండు. నువ్వంత బాగా రాశావు కానీ ఆ సెక్స్ గురించిన ఛాప్టర్ లేకపోతే బావుండేది అంటూ.

వాడు మళ్లా జవాబు రాసిండు. ప్రపంచంలో వున్న అవకతవ కల్లో 80 శాతం ఈ రెండు విషయాలలోనే అన్నడు. ఓపెన్‌నెస్ ఉంటే ఇట్లుండరు. వాటి విషయంలోనే మనం దాచుకుంటూ వుండటం వల్ల ఇట్లా జరుగుతోంది అన్నడు.

పాయింటేమిటంటే ఎక్కడ్నో ఐదేసి రూపాయలు, పదేసి రూపాయలు తెప్పించుకుంటూ డబ్బుదేమున్నది అంటూ ఖర్చు పెట్టేవాడు మనల్ని ముంచిపోతాడు. ఎప్పుడూ విచ్చలవిడిగా ఖర్చుపెట్టేది ముంచుతాడని అనుకోలేదని బాధపడ్తాం.

మా 'లా'లో cheating ఎప్పుడు మొదలవుతుందంటే confidence gain చేయటంతో మొదలవుతుంది. confidence gain చేయకుండా గుంజుకోవడం మోసం కాదు. జబర్దస్తీ అవుతుంది. రేప్ అవుతుంది. ఇంకేదయినా అవుతుంది. కానీ మన సామెత ఏముంటుంది. 'నమ్మినోణ్ణి చెడగొట్టొద్దు'

నమ్మకపోతే చెడగొట్టడమెలా (నవ్వు)

చెడగొట్టదలుచుకుంటే మొదట నమ్మించాలి.

ప్రాక్టికల్ లైఫ్ లోపట, మనం చెప్పే వేదాంతానికి, శాస్త్రానికి భేదమున్నది. కానీ ఈ సొసైటీ వున్నదే... ఏ కాలంలోనయినా సొసైటీకి అంతా తెలుసు.

*నేను డేంజర్ ఎక్కడుంటే, అపాయమెక్కడుంటే దాంట్లో పోయి పాల్గొన!*

*కానీ డేంజర్ నాకెదురుగా వస్తే అక్కడ్నించి పారిపోను.*

*దాంట్లో నా effort ఏమీ లేదు. That's my Nature.*

***'మన కాళోజీ' డాక్యుమెంటరీకి***
***అక్షరరూపం: రాంబాబు***

## మన కాళోజీ - డాక్యుమెంటరీ

కాన్సెప్ట్: బి.నర్సింగరావు
నిర్మాత: జి.రవీంద్రనాథ్
దర్శకత్వం: ఎస్.అమరనాథ్
కాళోజీ ఇంటర్వ్యూ: డా॥ భిక్షం
రుక్మిణీబాయి, సంతోష్ ఇంటర్వ్యూ: పున్నా కృష్ణమూర్తి
ప్రజాకవి కాళోజీ డాక్యుమెంటరీ ఫుటేజ్: ప్రేమ్‌రాజ్ చిత్రం నుండి
స్టిల్ ఫొటోగ్రఫీ: భరత్‌భూషణ్
కృతజ్ఞతలు: కాళోజీ కుటుంబం
టి.ప్రభాకర్, నాగిళ్ళ రామశాస్త్రి, వి.ఆర్.విద్యార్థి, శేఖర్ (ఫొటోగ్రాఫర్), పి.హరనాథ్, డా॥ అంపశయ్య నవీన్, ఎస్.జీవన్‌కుమార్ అండ్ కాళోజీ ఫౌండేషన్, హైదరాబాద్, వరంగల్





వరవరరావు

# కాళోజీని ఎవరూ అనుకరించలేరు

కాళోజీని చూసినా, విన్నా, చదివినా, హోచిమన్ (ఆయన హృదయానికి ఎంతో దగ్గరివాడయిన విప్లవ నాయకుడు. బహుశా తెలంగాణాకు, వియత్నామ్‌కు ఉన్న పోరాటానుభవాలు, పోలికల వల్లనేమో) ఆవేశించిన గాంధేయవాదిలా ఉంటాడు.

కాళోజీ గాంధేయవాది- అటువంటి గాంధేయవాదిని మాత్రం నేనింకెవరినీ చూడలేదు. గాంధే స్వయంగా 'హరిశ్చంద్ర' నాటకం చూసి అబద్ధం ఆడకూడదని బాల్యంలో నిర్ణయం తీసుకున్నాడు. పెరిగి రాజకీయాల్లో, సామాజిక, వ్యక్తిగత జీవితంలో కూడ సత్యంతో ప్రయోగాలు చేశాడు. కాళోజీ, 'ప్రహ్లాదచరిత్ర' తండ్రి దగ్గర విని, తండ్రి చెప్పిన డైమన్షనల్ వ్యాఖ్యలతో ప్రభావితుడై (బహుశా కాళోజీ ప్రహ్లాద చరిత్రను జీవితానికి, రాజకీయాలకు అన్వయించినంత అపూర్వంగా, అద్భుతంగా, వైవిధ్యంతో పోతన కూడ రాసిననాడు ఊహించి ఉండడు) సత్యాహింసల మార్గాన్ని ఎంచుకున్నాడు.

కాళోజీ గాంధేయవాది కావడంలో ఇద్దరి, బునియాదిలో ప్రభావం లోనే కొంచెం తేడా ఉన్నది. గాంధీ- నేను పిరికితనం కన్నా హింసను బలపరుస్తాను_ అనే మాటను కాళోజీ తరుచూ ప్రస్తావిస్తాడు గానీ కాళోజీ ప్రహ్లాద ఆదర్శం ఉగ్రనరసింహస్వామి హిరణ్యకశ్యప వధ దగ్గర సాఫల్యం చెందుతుంది. ఆయన అధికృత హింసకు ప్రతిఘటనగా ప్రతిహింసను ఇవ్వాళ కాదు పుట్టి బుద్ధి పుట్టి తెలిసిన దగ్గరి నుంచీ సమర్థిస్తున్నాడు. యాదగిరి లక్ష్మీనరసింహ స్వామిపై రాసిన కవితలో గానీ, పాల్కురికి సోమన్నపై రాసిన దండకం వంటి కవితలోగానీ, కాళోజీ ఒక సమగ్రమైన ప్రాకృతిక మానవుడుగా మనకు సాక్షాత్కరి స్తాడు. అవి సుదీర్ఘమైన కవితలు కనుక పేర్కొనడం లేదుగానీ, ఒక తాత్వికుడు, కవి- ప్రపంచం గురించి ఎట్లా తనలోతాను సంఘర్షణ పడుతూ, డిస్టర్బ్ అవుతూ, సమాజాన్ని, యథాతథ స్థితిని విలువలను డిస్టర్బ్ చేయాలని, కదిపి కుదిపి మార్చాలని చూస్తాడో, అందాక ఎట్లా ఉన్మాదివలె మానసిక స్థితిలో కొనసాగుతాడో- ఎంచుకున్న కవితా



కవియే నిజమైన ప్రపంచ పౌరుడు.
కవి అంటే ఎప్పుడూ ప్రతిపక్షంలో
ఉండేవాడు. తనకూ సమాజా నికీ
సామరస్యం కుదిరేదాకా అంతర్‌బహిర్
యుద్ధం చేస్తూ యుద్ధరావాన్ని
కవిత్వంగా గొంతెత్తి ఆల పించే వాడు.
రాజ్యం మీద- తన ఎనభైఎనిమిది
ఏళ్ల జీవితాన్ని కత్తిగట్టి-
పోరాడుతున్నవాడు. కవి అంటే
పక్షిమీద ప్రేమతో, హంతకునిపై
కోపంతో శోకం శ్లోకమైనవాడు-అంటే
అవన్నీ కవిగా కాళోజీ అవుతాడు.

రూపాలు, భాష, శైలితోసహా శక్తివంతమైన ఉదాహరణలు- కాళోజీలో మేజికల్ రియలిజమ్- మంత్రనగరి సరిహద్దులు చెరిపిన తిరుగుబాటు ధోరణి. ప్రహ్లాద చరిత్రను, నరసింహస్వామిని, శివుణ్ణి మాత్రమే కాదు భారత, రామాయణ, పురాణాలను కాళోజీ రూపురేఖలు మార్చి వర్తమానానికి అన్వయిస్తాడు. తన అనుభవాన్నీ, పరిశీలనను, అధ్యయనాన్ని తన అవగాహన నుంచి ప్రపంచ గతికి అన్వయించే విషయంలో కాళోజీకి అస్పృశ్యమూ నిషేధమూ ఏదీ లేదు.

ప్రమాణమల్లా ఒక్కటే- మనిషి- బతుకు.

కవిగా కాళోజీని ఆయన దృక్పథం నుంచి వేరు చేసి విశ్లేషించడం అంచనా వేయడం అన్యాయం. శ్రీశ్రీ అనితర సాధ్యం నా మార్గం అన్నాడు గానీ శబ్దశక్తితోసహా ఆయన మార్గాన్ని అనుసరించిన వాళ్లు, అనుకరించిన వాళ్లు చాలామంది ఉన్నారు. శ్రీశ్రీ ప్రభావం నుంచి బయటపడడానికి ప్రయాసపడవలసి వచ్చింది ఒక తరానికే.

కాళోజీ ఎవరినీ అనుకరించలేదు. కాళోజీని ఎవరూ అనుకరించలేరు. ఆయన ప్రభావం లేని





తెలంగాణ కవిగానీ, సామాజికులుగానీ లేరు. ఎందరెందరో జీవితాలను కూడ ఆయన అనితర సాధ్యంగా ప్రభావితం చేసారు (చలం వలె). కాని ఎవ్వరూ కవులైతే ఆయన వలె రాసిన వాళ్లు కారు.

అయినా ఒక కేటగిరీలో చేర్చాలంటే కాళోజీ వేమన- గురజాడల వంటి కవి. ముగ్గురూ ప్రజా ప్రయోజనాలను, లేదా సమాజం పట్ల తమ అవగాహనను, బాధ్యతను, కవిత్వం కన్నా, రచనాశైలి కన్నా ప్రధమ స్థానంలో ఉంచినవాళ్లు. అందువలన సులభంగా, సరళంగా, సందేశపూర్వ కంగా చెప్పడానికి ఎంచుకున్నారు. కాళోజీ కవితా రూపం గురజాడకు దగ్గరగా ఉంటుంది. లేదా దేశి ఛందస్సుకు దగ్గరగా ఉంటుందని చెప్పడం ఉచితం. ఈ సంకలనంలో ఒకచోట చూసినపుడు మాత్రం ద్విపదకు దగ్గరగా ఉండే దేశి ఛందస్సు మాత్రమే కాకుండా తెలంగాణలో ప్రచారంలో ఉన్న జానపద పాటల బాణీలలో రాసిన పాటలు కూడా చాలా ఉన్నాయి. తెలంగాణ పలుకుబళ్లు, నుడికారాలు, సామెతలు కోకొల్లలు.

కవులు (ఎన్నికల్లో పోటీ చేయకుండానే) ఎన్నికయిన ప్రజా ప్రతి నిధులు అని చెప్పిన షెల్లీ నుంచి, మనిగా కవి జీవితంలో, సమస్యలు ఉంటాడు గనుక మనిషితోపాటు పరిష్కారంలో కూడా ఉండాలి అని సార్త్రే దాకా కవులకు, బుద్ధిజీవులకు ఇచ్చిన అన్ని నిర్వచనాలకు ఇంకో ఆచరణాత్మక నిర్వచనాన్ని చేర్చుకునే చెప్పుకోవచ్చు కాళోజీ గురించి.

కవియే నిజమైన ప్రపంచ పౌరుడు. కవి అంటే ఎప్పుడూ ప్రతిపక్షంలో ఉండేవాడు. తనకూ సమాజానికీ సామరస్యం కుదిరేదాకా అంతర్‌బహిర్ యుద్ధం చేస్తూ యుద్ధరావాన్ని కవిత్వంగా గొంతెత్తి ఆలపించే వాడు. రాజ్యం మీద- తన ఎనభైఎనిమిది ఏళ్ల జీవితాన్ని కత్తిగట్టి- పోరాడుతున్నవాడు. కవి అంటే పక్షిమీద ప్రేమతో, హంతకునిపై కోపంతో శోకం శ్లోకమైనవాడు-అంటే అవన్నీ కవిగా కాళోజీ అవుతాడు.

*(కాళోజీ నాగొడవ కవితల సంపుటానికి వరవరరావు రాసిన ముందుమాట నుంచి)*

# పొలికేకలు



అద్దిర అద్దిర అద్దిర
గద్దర్ పాటల ముద్దెర
ప్రజల మనోభావాలకు
అద్దంపట్టే పాటలు
ప్రజల గుండెలవిసి అవిసి
ఎగజిమ్మే కసి పాటలు
పలుకలేని కష్టజీవి
మనసులో మూల్గెడి పాటలు
'కల్లోలిత' ప్రాంతాలా? కాదు కాదు
పల్లె ప్రజల కల్లోలిత హృదయాల
పొలికేకలు ఆ పాటలు
ఆరాటం బాపుకొరకు
పోరాటం సాగించెడి
జనం జనం జనం జనం
ఇక్కడ అక్కడ అంతటా
నేల ఈనినట్లు జనం
జననాట్యం సాగిస్తూ
గొంతులన్ని రణభేరీలైనట్లు
నినదిస్తూ
అద్దిర అద్దిర అద్దిర
గద్దర్ పాటల ముద్దెర

**- కాళోజీ**



డా॥ తూర్పు మల్లారెడ్డి



ఒక మనిషి తాను బతికిన జీవిత కాలంలో కలాన్నీ గళాన్నీ ఒకే వాడితో ఉపయోగించి రచనలోను, ఆచరణలోను ఒకే నిశిత వైఖరితో పోరాటం సల్పిన ఆదర్శానికి సాక్ష్యం కాళోజీ నారాయణరావు జీవితం *(1914-2002).*

# అచ్చమైన ప్రజాస్వామ్య వాది

వెయ్యీ యాభై ఎనిమిది నెలల (88 సం.రాల 2 నెలలు) జీవితంలో వెయ్యి కాళ్ళ జెర్రిలా తెలుగు నేల పలు దిశల తన ఇంట్లోకి వెళ్ళగలిగినంత సులువుగా, హాయిగా, సంతోషంగా ఎవరి ఇంట్లోకైనా పసిపాప మొదలు కొని పండు ముదుసలి వరకు ఏ మనిషి హృదయంలోనికైనా వెళ్ళగలిగే కాళోజీ గురించి, కనీసం 75 సం.రాల ఉద్యమ జీవితం గురించి, ఏ బ్రతుకు సూత్రానికీ ఏ పార్టీ నియమాలకు, ఏ సంస్థల సిద్ధాంతాలకు కట్టుబడని విచిత్రమైన అసాధారణ వ్యక్తిత్వం గురించి, ప్రజల కష్టాలు వింటే జలజలా కారే కన్నీళ్ళ గురించి, జరుగుబాటు కొరకు సర్దుబాటు చేసుకోని మలినమంటని నడత గురించి, పాలకులు, అధికారులు చేసే అవినీతిని, అహేతుకతను, అధికృత హింసను వ్యతిరేకించి జీవితాంతం ప్రజల తరఫున ప్రశ్నించిన ధిక్కార స్వరం గురించి, తన నడవడికకి ఒక ప్రత్యేకమైన ఒరవడిని సంతరింపజేసుకున్న విచిత్ర విశిష్ట సంక్లిష్ట తత్వమున్న కాళోజీని సిద్ధాంతాల ప్రమాణాలతో నిర్ధారించి సిద్ధాంతీక రించడం కుదరని పని. ఆయన ఒక ప్రత్యేకమైన ఫినామినన్. మానవీయ జెస్చర్.

కాళోజీ చిన్నప్పుడు మడికొండలో తండ్రిగారైన రంగారావుగారి వద్ద, వానమామలై వెంకటాచార్యుల వద్ద చదువుకున్నాడు. సుప్రసిద్ధ పండితు లైన పల్లా దుర్గయ్య, ప్రఖ్యాత కవి వానమామలై వరదాచార్యులు సహాధ్యా యులు కావటం వల్ల కాళోజీకి కొంత సాహిత్య వాతావరణం చిన్నతనం లోనే ఏర్పడింది. తరువాతి కాలంలో అనేకమంది కవి పండితులతో పరిచయం, దానికితోడు కుటుంబ వాతావరణం వల్ల అబ్బిన కన్నడ, ఉర్దూ, మరాఠీ భాషల పరిచయం, నిరంతరం పఠనం ఆయనలో కవి పుట్టడానికి కారణమయ్యాయి. దీనికి తోడు చిన్ననాడు కాళోజీ తల్లి రమాబాయమ్మ మరాఠీ వీరుల గూర్చి ముఖ్యంగా వీర సావర్కర్ గూర్చి బాగా వివరించి చెప్పింది. రాజకీయంగా తిలక్ దృక్పథం కలిగిన మేనమామగారైన పండిత నర్దేవశాస్త్రి గారితో కలిసి ఆర్య సమాజ కార్యక్రమాల్లో పాల్గొనడం వల్ల తెలంగాణ ప్రజల దుస్థితి, నిజాం నిరంకుశ పాలన అర్థమయినై.

వ్యక్తిపరంగా కాళోజీ, ఒక పెద్ద ఆర్గనైజర్. చిన్నప్పుడు గణపతి ఉత్సవాలు, గ్రంథాలయోద్యమాలు, ఆర్యసమాజ కార్యక్రమాలు, హిందూ మహాసభ కార్యక్రమాలు, కాంగ్రెసు సత్యాగ్రహోద్యమాలు, ఆంధ్ర మహాసభ పోరాటాలు మొదలైన కార్యక్రమాలను వయసుకు మించిన శక్తితో సమర్థవంతంగా నిర్వహించి ఆనాటి ఉద్యమ పెద్దలతో భేష్ అనిపించు



కున్నాడు. తరువాతి కాలంలో పౌరహక్కుల ఉద్యమాలలోనూ, ప్రజా పోరాటాలలోనూ, ప్రజా చైతన్య కార్యక్రమాలలోనూ అగ్రభాగాన నిలిచి యువతతో కాళోజీ 'షహర్' అనిపించుకున్నాడు. తన జీవిత కాలంలో తలెత్తిన అన్ని ఉద్యమాల్లో పాలు పంచుకుని పోరాడిన అపూర్వ వ్యక్తిత్వం ఆయనది. బహుశా ఆయన సమాజాన్ని వర్గ దృష్టితోగాక మానవతా దృష్టితో చూడడమే అందుకు కారణమై ఉండవచ్చు.

కాళోజీ పేరు వినగానే మొదటగా గుర్తుకొచ్చేది వ్యక్తిగా రాజీపడని ఆయన మొండితనం. దండి ధైర్యం. ప్రజల గొడవగా వినిపించిన 'నా గొడవ'.



***నైజాం రాజ్యంలో నిజాం రాజు అనుసరించే ద్వంద్వ నీతిని, దమన వైఖరిని, అరాచక పాలనను, ఆనాటి దేశ్‌ముఖ్‌లు, పటేండ్లు, పట్వారీలు, రజాకార్లు ప్రజలపై చేసే దౌర్జన్యాలను తీవ్రంగా ప్రతిఘటించాడు. ప్రశ్నించాడు.***

1931 ప్రాంతంలో కాళోజీకి గురువుగారైన గార్లపాటి రాఘవరెడ్డి గారితో కల్గిన సాహచర్యం వల్ల కవితా రచనకు ప్రేరణ కల్గింది. కాళోజీ కవిత్వాన్ని ఒక అవసరంగా భావించాడు. సమకాలీన రాజకీయ వ్యవస్థ పట్ల ప్రజలను చైతన్యవంతం చేయడానికి తాను చేసే ఉపన్యాసాల కంటే కవితలే శక్తివంతంగా ఉపయోగపడతాయని కవిత్వానికుండే చైతన్యశక్తిని గుర్తించి కవితా రచన సాగించాడు. ఆ రకంగా జనచైతన్య ప్రయోజనాన్ని ఈడేర్చే ఉపన్యాసానికి ప్రత్యామ్నాయంగా కవితా రచనను తీర్చిదిద్దు కున్నాడు. ముఖ్యంగా కాళోజీకి కవిత్వం పరమావధి కాదు. ప్రజా చైతన్యం పరమావధి. ఇంట్లో సంభాషణల వలెనే, ప్రజల మధ్య ప్రసంగం వలెనే కవిత్వం ఆయనకు ఒక సామాజిక వాహిక. పాండిత్య ప్రదర్శనలు, భావ చిత్రాలు, శబ్ద చిత్రాలు, అల్లిక జిగిబిగులు, జీవంలేని శోభాయ మానాలు ఆయనకు నచ్చవు. కాళోజీది టెక్నిక్ కవిత్వం కాదు. కమ్యూనికేటివ్ కవిత్వం.

నిజాం నిరంకుశ పాలనకు ప్రజలు విసిగి బ్రతుకు చితికి ఎదురు తిరుగుతున్న రోజుల్లో కవిగా కాళోజీ నా గొడవను ప్రకటిస్తూ తలెత్తాడు. ఆనాటి సంఘర్షణాత్మకమైన, సంక్లిష్ట తెలంగాణా సామాజిక జీవితంలో భాగంగా ఉంటూ పౌరహక్కులకు ఏ స్థాయిలో భంగం కలిగినా ప్రతిఘ టించిండు. బాధితులను చూసి సున్నిత మానవీయ హృదయంతో కన్నీరు కారుస్తూ చలించిండు. ఆ చలన తరంగాలే కవితలుగా రూపుదిద్దు కున్నై. కాబట్టే కాళోజీ కవితకు ప్రజా హృదయ పీఠిక లభించిందంటాడు దాశరథి. జీవితం కవిత్వం వేరు కాని వ్యక్తి కావడం వల్ల కాళోజీ జీవితంలోని ప్రతీ సంఘటనను ఆయన కవిత్వంలో చూడవచ్చు. అసలు ఆయన జీవితమే సామాజిక జీవితం అయినప్పుడు సామాజిక సంఘటనలన్నీ ఆయన కవిత్వంలో రికార్డు అయినై. అట్లా రికార్డు చేసిన సందర్భాలలో ఆయన సమాజం తీరు పట్ల, పాలకుల పరిపాలన పట్ల చేసిన విశ్లేషణలు, వేసిన ప్రశ్నలు, ఇచ్చిన తీర్పులు సమాజ చరిత్రను అక్షరబద్ధం చేసిన రన్నింగ్ కామెంట్రీలాగా కాళోజీ కవిత్వం కొనసాగింది. సామాన్యుని వేదనను సజీవమైన ప్రజా భాషలో సరళ రీతిలో కవిత్వీకరించడం వల్ల కాళోజీ ఇతర కవుల కంటే భిన్నంగా కన్పిస్తాడు. మౌఖిక రచనా ఛాయలతో సామాజిక కవులైన శతక తత్వ కవులకు దగ్గరగా కన్పిస్తాడు. ఈ కారణంగా ఆయన కవిత్వంలో గేయాత్మకత, కథనాత్మకత ఉంటుంది. వ్యంగ్య అధిక్షేపాలతో కూడిన ప్రశ్నాత్మకతా ఉంటుంది.

కాళోజీ సమాజ పరిశీలనం సూక్ష్మేక్షికతతో కూడుకుని ఉంటుంది.

**"అన్నపు రాసులు ఒక చోట - ఆకలి మంటలు ఒక చోట**
**కమ్మని చకిలాలొక చోట- గట్టి దౌడలింకొక చోట**
**పెత్తనమంతా ఒక చోట - సత్తువ అంతా ఒక చోట**
**అనుభవమంతా ఒక చోట - అధికారం బది ఒక చోట..."**

ఇలా సమాజంలోని వైరుధ్యాలను నిశితంగా పరిశీలించి ఒక తాత్వికునిలా అక్షరబద్ధం చేశాడు కాళోజీ.

మార్క్స్ సమాజాన్ని పాలకుల పాలితుల సంఘర్షణగా చిత్రీకరిస్తే కాళోజీ సమాజమంతా చతుర మతులు, దెబెమొగాలు అనే రెండు వర్గాల సంఘర్షణగా నడుస్తుందన్నాడు.

ఈ క్రమంలో 'మానవుని మానవుడు మానవుని మాదిరిగ మన్నించలేనంత మలినమై పోయిందంటాడు. అందుకే మనిషిని స్వంత ఆలోచనలతో బ్రతుకమని చెప్పడానికి బదులు మంది ఆలోచనలతో బ్రతుకమని చెప్పడం సరికాదంటాడు. మనిషి స్వచ్ఛందంగా స్వేచ్ఛగా బ్రతకాలనేది ఆయన అభిప్రాయం. 'బ్రతుకు పూజనీయం' రెవరెన్స్ టు లైఫ్ అనే ఆల్బర్ట్ స్విట్జర్ సిద్ధాంతంలాంటిది బ్రతుకు పట్ల కాళోజీకి ఉన్న అభిప్రాయం. ఈ ఆలోచనా విధానమే కాళోజీని రోమారోలా, ఖలీల్ జీబ్రాన్‌ల అభిప్రాయాలకు సన్నిహితంగా చేసింది. బ్రతుకుకు బ్రతుకు తప్ప మరో నిర్వచనం కుదరదంటాడు కాళోజీ. ఈ జీవన దృక్పథం నంచే ఆయన ప్రాపంచిక దృక్పథం కూడా ఏర్పడింది. అందుకే మనిషి బ్రతుకు అవకతవకలకు గురైనప్పుడు ఆయన హృదయం ఆవేదన చెందింది.' అవనిపై జరిగేటి అవకతవకల జూచి ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు?" అని ప్రశ్నించుకున్నాడు.

నైజాం రాజ్యంలో నిజాం రాజు అనుసరించే ద్వంద్వ నీతిని, దమన వైఖరిని, అరాచక పాలనను, ఆనాటి దేశ్‌ముఖ్‌లు, పటేండ్లు, పట్వారీలు, రజాకార్లు ప్రజలపై చేసే దౌర్జన్యాలను తీవ్రంగా ప్రతిఘటించాడు. ప్రశ్నించాడు.

ప్రశ్నాత్మక రూపంలో ప్రజా చైతన్యం కల్గించడం కాళోజీ కవిత్వ ప్రత్యేకత. ప్రశ్నించే శైలి కాళోజీ కవిత్వానికి అదనపు ఆకర్షణను చేకూర్చింది. కవిత్వంలో ఆయన కథనాత్మక ఉపన్యాసకుడుగా కనబడు తాడు. నిజాం రాజ్య కాలంలో జరిగిన తెలంగాణ విముక్తి పోరాటంలో నిజాం వ్యతిరేకత అంటే ఫ్యూడల్ పెత్తందారి రాజ్య వ్యతిరేకతే గానీ ముస్లిం వ్యతిరేకత గాదు. ఫాసిస్టు స్వభావం కలిగిన రజాకార్లను ద్వేషించడం మొత్తగా ముస్లింలను ద్వేషించడం ఒకటిగాదు, ఉర్దూ భాషా పెత్తనాన్ని వ్యతిరేకించడమంటే ఉర్దూ భాషను వ్యతిరేకించడం కాదు, దాని ద్వారా రుద్ద బడుతున్న అప్రజాస్వామిక విలువలు, బానిస భావం పెంచి పోషింపబడినచోట, బానిసలున్నచోట ఓ స్పార్టకస్ ఉంటా డు. తెలంగాణ స్పార్టకస్ కాళోజీ. శ్రీశ్రీ అన్నట్లు లూయీ అరగాన్ కాళోజీ.

ప్రజాస్వామ్యాన్ని ఒక జీవన విధానంగా భావించిన కాళోజీ స్వాతంత్ర్యానంతరం ప్రజాస్వామ్య పాలనా ముసుగులో మన పాలకులు అప్రజాస్వామిక చర్యలను హద్దూ పద్దూ లేకుండా కొనసాగించడాన్ని తీవ్రంగా నిరసించాడు. గాంధేయవాద దార్శనికత్వం కలిగిన కాళోజీ ప్రజాస్వామ్యం ఇలా ఎన్నికలు- పార్టీలు- అధికారుల కుమ్ములాటలు-





అయిన కాడికి పీక్కు తినే రాబందుల ఆటలు దొరికిన కాడికి దోచుకు తినే నల్లబజారు నాటకాలుగా మారినందుకు తీవ్ర ఆవేదనను పొందాడు.

క్రమంగా భారతదేశంలో పాలకులకు ప్రజలకంటే పార్టీలే ముఖ్యమైనై. ప్రజా సంక్షేమం కంటే పార్టీల క్షేమమే వారికి ముఖ్యం. పంచవర్ష ప్రణాళికలన్నా పార్టీల ప్రణాళికలకే వారి ప్రాధాన్యం. ప్రజల ధూ... అని గేలిచేసినా, వెలి వేసినా, వ్యక్తిత్వం పోయినా, పార్టీ బహిష్కరించినా కొసకు ప్రాణం పోయినా నాయకులు పార్టీలను వదలరు. వ్యక్తిత్వాన్ని తాకట్టు పెట్టుకునే అసహ్యమైన ఈ పార్టీ వ్రత్యం (పాతివ్రత్యం) అని మాట సామ్యంతో కాళోజీ ఈ మాట సృష్టించాడు) గుర్చి నోరు నొచ్చేంత చెప్పాడు. వేళ్ళు కాయలు కాసేంత రాశాడు.

1952 నుండి వరుసగా మూడుసార్లు ఎన్నికల్లో గెలిచిన కాంగ్రెసు పార్టీ నాల్గో పర్యాయం కూడా దాని మనుగడ కోసం, ఎన్నికల్లో గెలవడం కోసం, పలుకుబడి కోసం, అవకాశాల కోసం ప్రజాస్వామ్య విధానాలను కాలరాచింది. ఈ పరిస్థితికి కారణభూతురాలైన ఇందిరాగాంధీని కాళోజీ 'వట సావిత్రీ పూజల వారకాంతగ' అధిక్షేపించాడు. అవినీతికి ఆలవాలమైన కాంగ్రెసు పార్టీకి, దళారులకు, నల్లబజారు వ్యాపారస్తులకు, దోపిడీ దారులకు, అవకాశవాదులకు ఓటు వేయక అటువంటి వారిని మట్టి కరిపించాలని కాళోజీ ప్రజలకు పిలుపునిచ్చారు.

ఎన్నికల ప్రచారంలో గుండాయిజం. డబ్బులు పంచి ఓట్లు కొనడం, ప్రత్యర్థులకు ఓట్లు వేయడానికి సిద్ధపడ్డ ఓటర్లపై అధికార పార్టీ అభ్యర్థులు కాల్పులు జరపడం మొదలైన రాజ్యాంగ వ్యతిరేకమైన పౌరహక్కుల భక్షణ జరిగినందుకు కాళోజీ చలించిపోయాడు.

ఆయన పార్టీరహిత ప్రజాస్వామ్యాన్ని ఆశించాడు. ఆయనొక లిబరల్ డెమొక్రాట్. ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యల్ని, ఎదుర్కోవడంలో, అధికృత హింసను ఖండించటంలో ప్రజలు అప్రమత్తంగా ఉండాలని వాచ్‌డాగ్‌లా పనిచేశాడు కాళోజీ. 'మనకేమని అనరాదు/ మనది కాని దేమున్నది/ దేశము దేశీయులదే/ దేశీయుల మన్నమనమే' అని ప్రబోధించాడు.

1975లో దేశంలో ఆంతరంగిక అత్యవసర పరిస్థితి (ఎమర్జెన్సీ) ప్రకటింపబడింది. దీని పర్యవసానంగా ప్రాథమిక హక్కులు రద్దయ్యాయి.





రాష్ట్ర ప్రభుత్వాల కార్యనిర్వహణ విషయాలు కేంద్ర ప్రభుత్వ శాసనాలకు కట్టుబడ్డాయి. ప్రధాని మాటకు అడ్డులేకపోయింది. అధికృత హింసతో ప్రచార సాధనాలన్నింటిని వశపరచుకోవడం జరిగింది. ఎదురు తిరిగిన వారి పీక నొక్కబడ్డది, కాదంటే కటకటాల వెనుకకు నెట్టి వేయబడ్డది అత్యవసర పరిస్థితిలో సాగిన నియంతృత్వ పోకడలను అధికృత హింసను ధైర్యంగా నిరసించాడు కాళోజీ.

దేశంలో ఎమర్జెన్సీ విధించినపుడు కాళోజి ధైర్యంగా తన కలంకాహళికి పని చెప్పాడు. 'డెమాక్రసీ డెడ్. లాంగ్ లీవ్ డెమొక్రసీ, రాష్ట్రపతి ఏమంటవ్ కాస్త చెప్పు' అని ప్రశ్నలను కవితా రూపంలో సంధించాడు. ఎమర్జెన్సీ ప్రకటించిన రెండో రోజు నుంచే తన ప్రతిఘటనను కవితల రూపంలో రాయడం ప్రారంభించాడు. తత్కాలంలో ఎమర్జెన్సీని ధిక్కరిస్తూ తెలుగులో ఇన్ని కవితలు రాసినవారు ఒక్క కాళోజీనే అంటే సత్యదూరం కాదు.

ఏ వ్యవస్థలోనైనా ప్రజల హక్కులకు భంగం కలిగినప్పుడు తమ హక్కులను కాపాడుకోవడానికి ప్రజలు తిరుగుబాటు చెయ్యడం తప్పనిసరి. ఇది చరిత్ర చెప్పిన సత్యం. అందుకే అంటాడు థోరో. పాలకులు ప్రజల హక్కులకు న్యాయం చేయడానికి బదులుగా తమ హక్కుల పరిరక్షణ కోసం తిరగబడే ప్రజలపై హింస జరిపితే ప్రతి హింస సహజంగానే పుట్టుకొస్తుంది. అందుకే హింసను చేపట్టిన హిరణ్యకశిపునిపై నరసింహుడు చేసిన ప్రతి హింస సరియైనదే అంటూ సాంప్రదాయిక విశ్వాసాన్ని చెప్పి ప్రతి హింసను సమర్థించాడు కాళోజి.

కాళోజీ సాంప్రదాయకమైన విశ్వాసాలను ఆధునిక అవసరాలకనుగుణంగా సమర్థించి చెప్పడం కనబడుతుంది. ప్రాచీన కాలంలో కూడా హింస నరికట్టడానికి ప్రతి హింస తప్పనిసరియైన మార్గమని మన పురాణాలు ఘోషిస్తున్నాయి. అందుకే హింసా హిరణ్యకశ్యపులు పుట్టిన సమాజంలో ప్రతిహింసను చేపట్టే నరసింహులు పుట్టడం అనివార్యమంటాడు కాళోజి. ప్రహ్లాద చరిత్ర పట్టుకొని ఎమర్జెన్సీ కాలమంతా అందరికి చదివి వినిపిస్తూ తిరిగాడు. 'కాళోజి ఎన్నిసార్లు చెప్పినా, ఎన్ని సందర్భాలకు అన్వయించి చెప్పినా ఆయన నోట వినవల సిందే ఈ ప్రహ్లాద చరిత్ర. బహుశా చలం, ముద్దుకృష్ణ, రాజమన్నారు, గిరీష్‌కర్నాడ్ ఎవ్వరూ సామాన్య ప్రజానీకానికి ఇంత దగ్గరగా పురాణాలను సమకాలీనం చేసి సజీవ సాహిత్య ప్రేరణ ఇచ్చి ఉండరు. షేక్స్‌పియర్ నాటకాలను ఎట్లా శిధిల ఫ్యూడల్ సమాజ మానవ ప్రవృత్తులకు అన్వయించవచ్చునో కాళోజీ ప్రహ్లాద చరిత్రను అట్లా రాజ్యం, అధికారం, ధిక్కారం, హింస, అధికృత హింస, అహింస వంటి మౌలిక తాత్విక అంశాలను అన్వయించి పోతన చెప్పాడో, కాళోజి చెప్తున్నాడో నమ్మలేనంత నమ్మకంగా చెప్పాడని' అంటాడు ప్రఖ్యాత విప్లవ కవి వరవరరావుగారు. తనది ప్రహ్లాదుడి

మార్గమే అయినా ఆ మార్గం నిరాటంకం కావాలంటే ఉగ్రనరసింహుడి అవతారం తప్పదని నమ్మే వ్యక్తి కాళోజీ.

హింస అహింసల నడుమ ఏది కావాలో తేల్చుకోవలసి వస్తే తాను అహింసనే కోరుకుంటాననీ, అయితే పిరికితనానికి హింసకు మధ్య ఏదో ఒక దానిని ఎంచుకోవలసి వస్తే మాత్రం హింసనే ఎంచుకుంటానని మహాత్మాగాంధీ చెప్పిన మాటలను అక్షరాల నమ్మినవాడు కాళోజీ. ప్రతి హింస కన్నా అధికృత హింస మరింత దారుణమని తేల్చి చెప్పాడు.

ఎమర్జెన్సీ అకృత్యాలకు బాధ్యుడైన జలగం వెంగళరావుని, కల్లోలిత ప్రాంతాలను ప్రకటించిన చెన్నారెడ్డిని, హక్కుల అణచివేతలో ఒకరిని మించిన వారు మరొకరైన ఎన్.టి.ఆర్., చంద్రబాబులను నిర్భయంగా నిలదీసి కడిగి ఆరవేయడానికి ఆయన ఏనాడు జంకలేదు. ఎమర్జెన్సీ చీకటి రోజులలో నిరసన తెలుపడానికి వస్తామన్నవారు ఎవరూ రాక పోయినా కాళోజి ఒక్కడే నోటికి గుడ్డ కట్టుకొని వరంగల్లు బజారులో నిరసన ప్రదర్శన చేశాడు.

ఆగ్రహంతో తుపాకీ పట్టుకొని కాల్చే వాళ్ళకంటే లంచగొండితనం, అవినీతి, ఆశ్రిత పక్షపాతం, అక్రమ సంపాదన, బంధుప్రీతి, మోసం మొదలైన నేరాలకు పాల్పడుతున్న అధికారుల, రాజకీయ నాయకుల వలన ఈ దేశం నాశనమై పోతున్నదని హింసావాదులకంటే అధికారం లో ఉండి నేరాలతో అధికృత హింస చేసేవారే ఎక్కువ ప్రమాదకారులని కాళోజి అభిప్రాయం.

స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాలకై ఏర్పడ్డ ఫజల్ అలీ కమీషన్ హైదరాబాద్ రాష్ట్రానికి సంబంధించినంతవరకు కర్ణాటక జిల్లాలను మైసూర్ రాష్ట్రంలోనూ, మరత్వాడ జిల్లాలను మహారాష్ట్ర రాష్ట్రంలోనూ కలిపి మిగిలిన తొమ్మిది తెలంగాణ జిల్లాలను కొన్ని ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగించాలనీ 1957 ఎన్నికల తర్వాత ఎన్నికైన విధాన సభ సభ్యుల 2/3 వంతు మెజారిటీ ఆమోదంతో ఆంధ్ర జిల్లాలతో కలిపి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పర్చాలని సూచించింది. కానీ కమీషన్ సిఫారసులకు భిన్నంగా సీమాంధ్ర నాయ కులు అన్నిరకాల అభివృద్ధి చెంది, అపార వనరులున్న హైదరాబాద్ రాష్ట్రాన్ని ఎలాగైనా ఆక్రమించాలనే సామ్రాజ్యవాద దృక్పథం తో ఒత్తిడి చేసి కొద్దిమంది తెలంగాణ అమాయక నాయకుల నమ్మికవల్ల 1956లో పెద్ద మనుషుల ఒప్పందంతో కొన్ని ప్రత్యేక రక్షణలతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించేలా చేశారు. అయితే పట్టుమని పదేళ్ళలోనే సీమాంధ్ర నాయకుల దోపిడీ బుద్ధి బహిర్గతమైంది. 1969 నాటికి సీమాంధ్ర పాలకులు ఒప్పందాలలోని నిబంధనలనన్నింటిని యథేచ్ఛగా ఉల్లంఘిం చారు. పైగా తమ అవసరాలకనుగుణంగా మలచుకున్నారు. ఈ విషయాన్ని కాళోజీ ఆనాడే చాలా స్పష్టంగా కవిత్వీకరించాడు.



ఏ దేశంలోనైనా వేర్పాటు వాదాలు అసమతౌల్య అభివృద్ధి కారణంగా వివక్షతల కారణంగా అణిచివేతల ఆధారంగానే పుట్టుకొస్తాయి. ఈ నేపథ్యంలో రాష్ట్రాలు విడిపోయినంత మాత్రాన దేశ సార్వభౌమాధికారానికి గానీ, సమగ్రతకు కానీ ఎలాంటి ధోకా ఉండదు. పైగా లభ్యమయ్యే వనరులను సంపూర్ణంగా ఉపయోగించుకొని త్వరితగతిన అభివృద్ధి చెందు తాయి. ఈ దృక్పథంతోనే కాళోజీ-

**"తెలంగాణ వేరైతే దేశానికి ఆపత్తా**
**తెలంగాణ వేరైతే తెలుగు బాస మరుస్తారా**
**తెలంగాణ వేరైతే కిలోగ్రాము మారుతుందా**
**తెలంగాణ వేరైతే రూపాయికి పైసలు నూరు కాకపోతాయా**
**తెలంగాణ వేరైతే కోర్టు అమలు అధికారము మారుతుందా"** అని ప్రశ్నించాడు.

1969లో విద్యార్థుల గుండెల్లోంచి ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా తెలంగాణ ఉద్యమమెంత స్వచ్ఛందంగా తీవ్రతరంగా ఎగిసిందో ప్రతీ సంఘటనను అక్షర బద్ధం చేశాడు కాళోజీ. తెలంగాణ ప్రజల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక జీవన పురోభివృద్ధికి తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలని కాళోజీ చిత్తశుద్ధితో బలంగా అవిశ్రాంతంగా పోరాడాడు.

కాళోజీకి తెలంగాణ ఊపిరి. ఆయన కవిత్వం తెలంగాణ గుండె చప్పుడు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడడమే ఆయన ఆత్మకు నిజమైన నివాళి.

కాళోజి పుస్తకాలతోపాటు మనుషుల్ని విస్తృతంగా అధ్యయనం చేశాడు. విక్టర్ హ్యుగో, రోమా రోలా, ఖలీల్ జిబ్రాన్లను తరచు కోట్ చేస్తుండేవాడు. ఆయనను కలిస్తే, కదిలిస్తే సాహిత్యంతో జీవితం కలగలిపిన మానవ చరిత్రను మనముందు సాక్షాత్కరింపజేసేవాడు. ఆయన సజీవ గ్రంథం. నిరంతర వాక్ ప్రవాహం. అనవరతం ఆధిపత్యాలను, అసత్యాలను, అన్యా యాలను, అవినీతిని ప్రశ్నించే అసాధారణ మానవ రూపం.

"నేను నీతో ఏకీభవించకపోయినా, నాతో విభేదించే నీ హక్కును నేను సమర్థిస్తాను" అనే అచ్చమైన ప్రజాస్వామ్య వాది కాళోజీ. రాజ్యం విసిరే ఉరులకు, ఎరలకు లొంగకుండా ప్రజల పక్షాన అప్రకటిత ప్రతినిధిగా నిర్భయంగా నిలబడ్డాడు. అరవై ఏళ్ళ సుదీర్ఘ కాలం పాటు ఒక తరాన్ని కాళోజీలాగా ప్రభావితం చేయగలిగిన కవులు చాలా అరుదు. తన సమ వయస్కుల కన్న యువకులకే ఎక్కువ స్ఫూర్తినివ్వగలిగిన నిత్య యవ్వనుడు కాళోజీ. ప్రశ్నను ప్రగతికి మార్గంగా భావించి సదా ప్రజల తరఫున సంధించే ప్రశ్నలకు కవితా రూపం తొడిగి పాలకులను హెచ్చరిస్తూ ప్రజా చైతన్యాన్ని రగిలించే కళను ఆయుధంగా మార్చుకున్న కవి.

**అన్యాయాన్నెదిరిస్తే**
**నా గొడవకు సంతృప్తి**
**అన్యాయం అంతరిస్తే**
**నా గొడవకు ముక్తి ప్రాప్తి**
**అన్యాయాన్నెదిరించిన వాడు**
**నాకు ఆరాధ్యుడు.**

ప్రపంచంలో న్యాయాన్యాయాల మధ్య గొడవ ఉన్నంతకాలం ఆయన 'నా గొడవ' మనుషుల గొడవగా బతికే ఉంటుంది. పౌరులు స్వేచ్ఛగా జీవించడానికి వ్యవస్థతో, రాజ్యంతో రాజీలేకుండా పోరాటం చేయమని ప్రశ్నిస్తూనే ఉంటుంది.

***రచయిత సెల్: 98491 92154***

వి.ఆర్. విద్యార్థి



# కాళోజీ ప్రతిజ్ఞాపకమూ ఒక సందేశమే

చరిత్రలోకి వెళ్ళితే తెలుగు నేల మీద వరంగల్లు ప్రాంతానికి కనీసం వేయి సంవత్సరాల ధిక్కార చరిత్ర ఉంది. ఎంతో నిరసన కవిత్వ మొచ్చిందిక్కడ. అట్లాంటి ధిక్కార చరిత్రకు, నిరసన కవిత్వానికి ముగ్గురు ప్రతినిధులు గోచరిస్తారు. వారే పాలకుర్కి సోమన, బమ్మెర పోతన, కాళన్నలు. ఈ ముగ్గురిలో సోమన పదకొండో శతాబ్దం వాడంటారు. పోతన పదిహేనో శతాబ్దం వాడంటారు. కాళన్న ఇరవయో శతాబ్దం వాడు. ముగ్గురి మధ్య ఐదైదు వందల సంవత్సరాల అంతరముంది.

కాళోజీని ప్రత్యక్షంగా ఎరిగిన వారు, వారికి సన్నిహితంగా మెలిగిన వారు ఎందరో ఉన్నారు. ఆయన జీవితకాలంలో మూడు తరాల వారు ఆయనకు సన్నిహితులే.

మహోన్నత వ్యక్తిత్వం గల 'ప్రజాకవి' శతజయంతి అప్పుడే వచ్చేసింది. సుమారు తొంభై సంవత్సరాల నిడివితో ప్రవహించిన యీ 'నిప్పుల గది' గురించి, యీ 'కన్నీటి జలపాతం' గురించి ఎంతెంతో చర్చించుకోవాల్సి ఉంది. స్మరించుకోవాల్సి ఉంది. ఆయన స్ఫూర్తిని ముందు తరాలకు అందించవల్సి ఉంది.

మౌలికంగా కాళోజీ ఒక యోగి. వేమనలాంటి యోగ కవి. ఖలీల్ జిబ్రాన్‌లాంటి ప్రపంచ మానవుడు. ప్రజల భాషలో, ప్రజల కోసం కవిత్వం రాసిన ప్రజా కవి. ఇట్లాంటి ప్రజాకవులు ప్రపంచ భాషల్లో అరుదుగా దొరుకుతారు. చిన్నతనం నుండీ ఆయన ఉద్యమ జీవి. స్వాతంత్ర్య సంగ్రామం మొదలుకొని ఎన్నో పోరాటాలు చేశారు. ఆయన పాత్రలేని ఉద్యమమంటూ తెలుగు నేలపై లేదంటే అది అతిశయోక్తి కాదు. రాజకీయాలంటే ఆయనకు చిరాకు. ప్రజాకీయాలు కావాలన్నాడు. ప్రతి ఉద్యమంలో ప్రజల పాత్రే ముఖ్య మన్నాడు. ప్రజాకీయాల కోసమే తపించాడు. ప్రజాపక్ష నాయకుడయ్యి తననుతాను ఒక కార్యకర్తగానే చెప్పుకున్న నిరాడంబరుడు. ఏ రాజకీయకుడికి తీసిపోని తెలివితేటలుండీ జీవితంలో ఏనాడూ రాజకీయాలు చేయలేదు. ఆయన చేసిందంతా ప్రజాకీయమే.

కాళోజీ నిజమైన ప్రజాస్వామ్యవాది. ప్రజాస్వామ్య తాత్వికుడు. ప్రజాస్వామ్యమే ఆయన ఫిలాసఫీ, ఆయన ఇజం. 'అసమాన సమాజంలో ఆర్జనమే దౌర్జన్య'మని నమ్మినవాడు. 'థోర్' ఆలోచనలను ఇష్టపడ్డవాడు. గాంధీ జీవించిన విధానం నచ్చినవాడు. ఆయన ఏ రాజకీయ తాత్వికుడికీ అనుయాయి కాదు. తాను పుట్టిపెరిగిన తెలంగాణ గడ్డలో, తన దేశంలో, ప్రపంచంలో వస్తున్న మార్పులని,మారుతున్న విలువలని, ఆలోచనలని ఆకళింపు చేసుకుని ఏదిమంచో ఏది చెడో అని తన కవిత్వంలో చెప్పినవాడు. రాజకీయవేత్తలనీ, తత్వవేత్తలనీ చివరికి తాను పుట్టిన కులం, మతం, సాంప్రదాయం అన్నింటి నుండి విడి వడి ఆలోచించినవాడు. వచించినవాడు. తనదైన జీవన మార్గాన్ని ఎన్నుకున్నవాడు. రోమ రోలా మాటలు... only few liberated souls rise above and speak the truth" అనే మాటలు కాళోజీకి బాగా ఇష్టం. తానూ ఒక liberated soul అని మనం చెప్పుకోవచ్చు.



మనిషంటే ఆయనకు ప్రాణం. ఒక దేశాధ్యక్షుడిలోనూ ఒక సామాన్య మైన కూలీలోనూ ఆయన 'మనిషి'నే వెదుకుతాడు. ఏనాడూ ఎవడికీ తల వంచని వాడు. అన్యాయాన్ని ఎదిరించినవాడ్ని ఆరాధించినవాడు. అన్యాయాన్నె దిరించిన వాడే ఆయనకు హీరో. 'రాయి రువ్వినా– రాకెట్ విసిరినా గిట్టనివాడ్ని కొట్టుటకే గద' అని తెల్సుకున్నవాడు. 'సానికొంప– సాధు మఠం ఎచట్టైతేం ఎచట్టైతేం పోటీపడి కాటులాడ' అని గమనించిన వాడు. 'నానా ఇజాల మాటున నా యిజానిదే అడుగుజాడ' అని హెచ్చరించిన వాడు. అట్లాంటి మహోన్నత వ్యక్తిత్వం గల 'ప్రజాకవి' శతజయంతి అప్పుడే వచ్చేసింది. సుమారు తొంభై సంవత్సరాల నిడివితో ప్రవహించిన యీ 'నిప్పుల గది' గురించి, యీ 'కన్నీటి జలపాతం' గురించి ఎంతెంతో చర్చించుకోవాల్సి ఉంది. స్మరించుకోవాల్సి ఉంది. ఆయన స్ఫూర్తిని ముందుతరాలకు అందించవల్సి ఉంది.

కాళోజీ కాలు ఫ్రాక్చరైతే నిమ్స్ హాస్పిటల్‌లో చేర్చారు. తెలంగాణా ప్రభాకర్ ఇంకా మిగిలిన హైదరాబాద్ మిత్రులు కాళోజీని చూసుకుంటున్నారు. అప్పటివరకు కాళోజీని ఆసుపత్రిలో చూసుకుంటున్న కాళోజీ కోడలు వాణి, మనవడు సంతోష్, కాళోజీకి సన్నిహితులు నాగిళ్ళ రామశాస్త్రిగారు పనిమీద వరంగల్ వెళ్ళారు. నేను కాళోజీ దగ్గర పది రోజుల పాటు ఉందామని నిమ్స్‌కి వచ్చాను. కాని తెల్లవారుజామునే కాళోజీ తుదిశ్వాస విడిచారు. నిమ్స్ హాస్పిటల్ డా॥ నరేంద్రనాథ్ కాళోజీ మరణవార్తను అధికారికంగా నాకు చెప్పారు.

ఇంతలో బయట వున్న వరవరరావు గారు, తెలంగాణా ప్రభాకర్‌రావు మరి కొందరు కాళోజీ పార్థివ శరీరం దగ్గరకు వచ్చారు. అప్పుడు వరవరరావు గారు 'ఇక ముందు కాళోజీ లేని ప్రపంచంలో మనం బ్రతుకాలా?' అని దుఃఖముతో అని కాళోజీ మరణ వార్తను మీడియాకు తెలియజేశారు. 'కాళోజీ లేని ప్రపంచంలో బ్రతుకాలంటేనే భయంగా ఉంది' అని పలువురు దుఃఖించారు. నిజమే ప్రజాకవి కాళోజీ మనకు పెద్ద దిక్కుగా ఉన్నాడులే అని ఎంత ధీమాగా బతికేవాళ్ళం!

కాళోజీకి సన్నిహితంగా జీవించే అవకాశం దక్కినవాళ్ళలో నేను ఒకడ్ని గనుక ఆయన శతజయంతి సందర్భంగా కొన్ని జ్ఞాపకాల్ని గుర్తుకు తెచ్చుకుంటాను.

కాళోజీతో నాకు రెండు రకాల అనుబంధాలున్నాయి. మొదటిది కాళోజీ శ్రీమతి రుక్మిణీబాయి వల్ల, రెండవది సాహిత్యం, మిత్రమండలి వల్ల. రుక్మిణీబాయిది (ఈమెను బంధువర్గమంతా 'యాదక్క' అని పిలుస్తారు) వరంగల్ సమాజంలో ఉన్న గవిచర్ల అనే గ్రామం. నాదీ ఆ ఊరే. ఆమె తండ్రిగారు వేలూరి మాణిక్యరావు. విద్వత్ కవి. గోలుకొండ కవుల్లో ఒకడు. కాళోజీకీ రుక్మిణీబాయికీ వివాహం 1940లో జరిగింది. అప్పటికి నేను పుట్టలేదు. ఆమె మా నాన్నకు చెల్లెలు. మా అమ్మ ఆమెకు చిన్నతనం నుండీ స్నేహితురాలు. కాళోజీ తనకు దైవ సమానుడైన గురువు 'డి.రాజా'కు గురుదక్షిణగా రుక్మిణిబాయిగారిని వివాహమాడినట్లు ఆమె చెప్పేది. 'డి.రాజా' ఆమె మేనమామ. మా వేలూరి సదాశివరావు (బంధుత్వాలు పక్కకు నెట్టి ఆయనను నాకు చిన్నతనంలో విద్యాబుద్ధులు నేర్పిన, జిడ్డు కృష్ణమూర్తి ఆలోచనల్ని పరిచయం చేసిన గురువుగా గుర్తుంచుకుంటాను) రుక్మిణీబాయి అన్న కొడుకు. ఆయన నాకు సాహిత్యంలో మొదటిసారి ప్రవేశం కల్పించారు. తొలిసారి అచ్చైన 'నా గొడవ'ను (1953) రుక్మిణీబాయి గారు గవిచర్లలో మాకు చూపించారు. ఒక సందర్భంలో తన నా గొడవ తొలిసారి అచ్చు కావడానికి కారకులు వట్టికోట ఆళ్వారు స్వామి, దాశరథి అని కాళోజీ చెప్పారు. చిన్నతనం నుండే కాళోజీ ఇంటికి పోయివస్తుండే వాడ్ని. ఇట్లా కాళోజీ కుటుంబం మాకు అత్యంత గౌరవనీయమైన కుటుంబం.

కాళోజీ అమ్మ రమాబాయి విజ్ఞురాలని, దయామయియని మా అమ్మ చెప్తుతుంటుంది. కాళోజీ అన్నగారు రామేశ్వర్‌రావు 'షాద్'గారు (దక్కన్ ఉర్దూ కవిగా వీరు ప్రసిద్ధులు) వారి శ్రీమతి సరస్వతి బాయి గారు గొప్ప మనుషులు. వారింట్లో ఎందరో పేద విద్యార్థులుండి పెద్ద చదువులు చదివి గొప్ప వాళ్ళయ్యారు. వారిలో కొండపల్లి శేషగిరి


కాళోజీతో వ్యాస రచయిత వి.ఆర్.విద్యార్థి

రావుగారు కూడా ఉన్నారు. నన్ను కూడా పెద్ద చదువులు చదివించాలని సరస్వతి బాయిగారి కుండేదని, కాని అప్పుడు ఆర్థిక పరిస్థితులు బాగాలేక చదివించలేక పోయానని కంట తడి పెట్టుకున్నారని రుక్మిణిబాయి గారు చెప్పారు.

కాళోజీ పూర్వీకులు మహారాష్ట్రులు. ఎప్పుడో చౌత్ (సుంకం) వసూలు చేయడం కోసం మహారాష్ట్ర నుండి నైజాంకు పంపించబడి ఇక్కడే స్థిర పడ్డారు. కాళోజీ పాలి వాళ్ళు మహారాష్ట్రలోని నాగపూర్‌లో ఉన్నారు. కాళోజీ చిన్నాన్న బిడ్డ బాగా చదువుకున్నామె. పెద్ద ఉద్యోగం చేసేది. ఆమె భర్త ఇంటి పేరు 'పాగే'. ఆమె కొడుకు 'ముకుంద్ పాగే' ఇండియన్ ఎర్‌ఫోర్స్‌లో పైలట్. ఇద్దరం పఠాన్‌కోట్ (పంజాబు)లో ఒకే ఎర్‌ఫోర్స్ స్టేషన్‌లో కొంతకాలం పనిచేశాం. కాళోజీ మేనమామ పండిట్ నర్దేవ్ శాస్త్రిగారు తిలక్ 'స్కూల్ ఆఫ్ థాట్'కు చెందినవారు. కాళోజీపై వారి ప్రభావముంది. వారు ఉత్తరప్రదేశ్ విధానసభకో, శాసన సభకో కొంత కాలం ప్రాతినిధ్యం వహించారు. కాళోజీ బంధువులందరితో సాన్నిహిత్యం ఉండేదిది.

కాళోజీ కొడుకు రవికుమార్‌కు 1983లో 'వాణి'తో పెళ్ళి జరిగింది.

'వాణి' కుటుంబం గూడా మాకు తెలుసు. వాణి పూర్వీకులు కూడా మాకు దగ్గరివారే. కాళోజీ మనుమడు సంతోష్ వివాహం 'ప్రియాంక'తో 2011లో జరిగింది. వాళ్ళు అమెరికాలో ఉంటున్నారు. కాళోజీ దంపతులకు మనుమడు సంతోష్ అంటే ప్రాణం.

కాళోజీ నాకు సామాజిక సాహిత్య రంగాలకు చెందిన తారా మండలాన్నే పరిచయం చేశారు. వారిలో చాలా మందితో నాకు సాన్నిహిత్యం ఏర్పడ్డది. నా సహచరి రత్నమాలను కాళోజీ దంపతులు స్వంత కూతురుగా చూసుకునేవారు. మా పిల్లలకు కాళోజీతో చాలా సాన్నిహిత్యం ఉండేడిది. కాళోజీ తాతగా ఎంతో ప్రేమను పంచారు మా పిల్లలకు.

కాళోజీతో సామల సదాశివ, ఆచార్య కొత్తపల్లి జయశంకర్, డా. బియ్యాల జనార్దన్‌రావు లాంటి ఎందరో మహామహులు మా ఇంటికి వచ్చేవారు. అనేక సాహిత్య, సామాజిక, రాజకీయ చర్చలు జరిగేవి. జయశంకర్‌గారు కాళోజీ ముందు మనం మాట్లాడితే ఆయనను వినడం కోల్పోతాము అని ఒకసారి జనార్దనరావుతో అన్నారు మా ఇంట్లో.

నాకు తెల్సి (1968లో అనుకుంట) కాళోజీ మొదట నమస్కారం చేసింది ఒక్క చందా కాంతయ్యగారికే. అప్పుడు కాంతయ్యగారి గొప్పతనం గురించి నాకు చెప్పారు. కాళోజీకి తనకంటే వయస్సులో పెద్ద వారిని చాలా గౌరవించేవారు. ఒక సభలో నార్ల వెంకటేశ్వర్‌రావుగారు మాట్లాడవల్సి ఉన్నది. కాళోజీకి ముఖ్యమైన పని ఉన్నా ఆ పనిని వదిలి నార్ల వారు ఉపన్యసించే దాక కదలలేదు. నార్లవారు తన కంటే పెద్ద వారట.


బాలగోపాల్‌తో కాళోజీ

1970 జనవరిలో కాళోజీ అన్నగారికి వరంగల్ యం.జి.యం.లో అబ్డామినల్ ఆపరేషన్ జరిగింది. ఆసుపత్రిలో ప్రత్యేకమైన వసతులున్న గదిలో చికిత్స పొందుతున్నారు. ఒకరోజు హాస్పిటల్ సూపరింటెండెంట్ పరీక్షించి కాళోజీ అన్నగారి ఆరోగ్యం బాగుంది, డిశ్చార్జ్ చేయవచ్చు కాని ఇంట్లో ఈ వసతులుండవు గనుక కొన్నాళ్ళు ఈ గదిలోనే ఉంచుదాం అన్నారు. అందుకు కాళోజీ ఒప్పుకోలేదు. బాగైంతర్వాత ఇక్కడుంటే వేరేవాళ్ళకు దొరకవల్సిన సౌకర్యం మనం దోచుకున్నట్లు గదా అని డిశ్చార్జ్ చేయించారు. కాళోజీకి తరతమ భేదం లేదు. అవసరమున్న వాళ్ళకే వసతులుండాలి అనే సిద్ధాతం కాళోజీది.

**తొలిసారి అచ్చైన 'నా గొడవ'ను (1953) రుక్మిణీ బాయి గారు గవిచర్లలో మాకు చూపించారు. ఒక సందర్భంలో తన నా గొడవ తొలిసారి అచ్చు కావడానికి కారకులు పట్టికోట ఆళ్వారు స్వామి, దాశరథి అని కాళోజీ చెప్పారు.**

ఇంకో సందర్భం (1980లలో) ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆచార్యులు 'కుందుమీరీ' రిటైర్‌మెంట్ సందర్భాన ఒక సెమినార్ ఏర్పాటు చేశారు. దానికి కాళోజీ గూడా ఒక వక్త. సభ నిజాం కాలేజీలో. ముఖ్య అతిథిగా సంఘ సంస్కర్త, స్వేచ్ఛాభావాలున్న బోరా కమ్యూనిటీకి చెందిన ముస్లిం డా॥ అస్గర్ అలీ ఇంజనీర్ (ఈయన ఇటీవలే కన్ను మూశారు) వచ్చారు. ఆయనంటే ముస్లిం ఫండమెంటలిస్టులకు పడదు. ఆరోజు ఆయనను చంపడానికి బాంబే నుండి అనుసరించారు. ఇంజనీర్ లేచి తన ఉపన్యాసం ప్రారంభించగానే జనం మధ్య ఉన్న ముస్లిం ఫండమెంటలిస్టులొచ్చి ఆయన మెడలో పొడిచారు. రక్తం చిమ్ముతున్నది. ఆ సంఘటన చూసి భయంతో అందరూ పారిపోతున్నారు. కాళోజీ తానున్నచోటు నుండి ఒక్క అడుగు గూడా అటు ఇటు వేయకుండా తన ఉత్తరీయాన్ని నాకిచ్చి ఉరికి రక్తాన్ని ఆపమన్నారు. నేను పరుగెత్తుకెళ్ళి గాయాన్ని ఉత్తరీయంతో అదిమి పట్టి అక్కడున్న కార్యకర్తలూ, నేను కల్సి కారులో ఆయన్ని కూర్చోబెట్టి హాస్పిటల్‌కు పంపాము. పొడిచిన వాళ్ళు నినాదాలు చేసుకుంటూ వెళ్ళిపోయారు. అప్పుడన్నారు నాతో కాళోజీ– 'ప్రమాదాల్ని కొని తెచ్చుకోలేదు. ప్రమాదం నుండి ఎప్పుడూ పారిపోలేద'ని. ఆయన సమయస్ఫూర్తి, నిబద్ధత గొప్పది.

1982లో ప్రతిభావంతులైన సాహితీపరులకు ఇతర కళారంగాలకు చెందినవారికి రవీంద్రభారతిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సత్కారం ఏర్పాటు చేసింది. ముఖ్యమంత్రి అంజయ్యగారికి అందరూ నమస్కారం పెడుతున్నారు. కాళోజీ పేరు పిలవగానే ఆయన శిరస్సు వంచి తానే మొదట కాళోజీకి నమస్కరించి సత్కరించారు. కాళోజీ అంటే అంజయ్య గారికి గొప్ప గౌరవం. అదే సభకు బాధ్యులైన సాంస్కృతిక శాఖామాత్యులు కళాకారులను తిరిగి పంపించే ఏర్పాట్లు సరిగా చేయకుంటే కాళోజీ దులిపేవాడు. వెంటనే మంత్రివర్యులు డబ్బు ఏర్పాటుచేశారు. కాళోజీ నిబద్ధత తప్పినవారెవరైనా వారిని క్షమించరు. ప్రజలకు జీవితాన్ని అంకితం చేసినవాడు కుటుంబం గురించి ఆలోచించలేదన్నారు కాళోజీ. గాంధీ గూడా ఇదే అన్నాడన్నారు.

హైద్రాబాద్‌లో 1980 ప్రాంతంలో బ్యాంక్ యూనియన్ వారు ఒక సభ ఏర్పాటుచేశారు. దానికి ముఖ్య అతిథిగా పేరుగాంచిన పార్లమెంటేరియన్, గొప్ప వక్త సి.పి.ఐ., యం.పి. భూపేశ్ గుప్తాగారిని ఆహ్వానించారు. భూపేశ్ గుప్తాను విందామని నన్ను వెంట తీసుకొని వెళ్ళారు. భూపేశ్‌గుప్త ఉపన్యసించింతర్వాత తాను సంపాదకత్వం వహిస్తున్న 'న్యూ ఏజ్' ఇంగ్లీషు వార్తపత్రికను చందాదారులుగా చేరమని సభలో ఉన్నవారికి విజ్ఞప్తి చేశారు. వెంటనే కాళోజీ నాకు ఇరవైయైదు రూపాయిలిచ్చి రసీదు తీసుకోమన్నారు. నేను వెళ్ళి రసీదు బుక్కులో కాళోజి అని రాయగానే (ఆ రశీదు భూపేశ్ గుప్తా సంతకంతో నా దగ్గర ఉంది.) భూపేశ్ గుప్తా గారు, అధ్యక్షుడు కాళోజీ ఎక్కడున్నారు అని అడిగారు. అప్పటికి వారికి



గింజల నరసింహారెడ్డి





కాళోజీ గురించి తెల్సుగాని ప్రత్యక్షంగా చూడలేదు. నేను చూపించగానే కాళోజీతో మాట్లాడించమని భూపేశ్ గుప్తా అధ్యక్షుడుతో చెప్పారు. కాళోజీకి విజ్ఞప్తి చేశారు. వినడానికి వచ్చినవాడ్ని నేను మాట్లాడటం ఏమిటి కాళోజీ అన్నారు. వాళ్ళు మళ్ళీ విజ్ఞప్తి చేయగా కాళోజీ ఇంగ్లీషులో అద్భుతంగా ఉపన్యసించారు. సభలోని వారంతా ముగ్ధులయ్యారు. భూపేశ్‌గుప్తా గారు సంతోషంగా కాళోజీతో కరచాలనం చేశారు. ఆ తర్వాత మాట్లాడిన ఒక యువ కార్మిక నాయకుడు (దక్షిణాఫ్రికా వాడనుకుంటాను) కాళోజీని అనేక సార్లు తన ఉపన్యాసంలో ఉటంకించాడు. ఇది కాళోజీ ప్రత్యేకత. ఏ జనం మధ్య ఉన్నా ఇట్లే మెరిసిపోతాడు. కేంద్ర బిందువవుతాడు.

ఒకసారి జైలు నుండి ఒక నక్సలైటు విడుదలయ్యాడు. కాని అతడిని పోలీసులు ఎన్‌కౌంటర్ చేస్తారనే అనుమానంతో విడుదలైన ఆ నక్సలైటు వెంట రైల్లో వెళ్ళి అతడిని ఇంటికి చేర్చిన కాళోజీయే, మరో సందర్భంలో "ఓట్లు వేసిన వాళ్ళ చేతులు నరుకుతాం" అని నక్సలైట్లు ప్రకటిస్తే మొట్టమొదటి ఓటు తానే వేసి బయటికొచ్చి 'నరకండి నా చేతులు' అని సవాల్ చేశారు! ఇది కాళోజీ ప్రత్యేకత.

1993లో మా నాన్న అకస్మాత్తుగా కన్నుమూశారు. ఆయన హిందూస్తానీలో బాగా పాడేవారు. ఆ సంగీతాన్ని కాళోజీ ఇష్టపడి నీకు తంబూరా కానుకగా కొనిపెడతానురా! అని అన్నారు. (మా నాన్నకు బావ వరుస కనుక రారా పోరా అనేవాడు). మా నాన్న చనిపోవడం వల్ల 'తంబూరా' బాకీగానే మిగిలిపోయిందని కంట తడిపెట్టారు కాళోజీ.ఇట్లా నాకు ప్రత్యక్ష సంబంధమున్న జ్ఞాపకాలు ఒక ఐదారుమాత్రమే ప్రస్తావించానిక్కడ. కాళోజీ ప్రతి జ్ఞాపకంలోనూ ఒక సందేశం ఉంటుంది. జ్ఞాపకాలన్నీ రాయాలంటే ఒక పెద్ద గ్రంథమే అవుతుంది. ఎప్పటికయినా రాయాలనేది నా అభిలాష.

'పుటక నీది, చావు నీది, బతుకంతా దేశానికది' అని జె.పి. గురించి అన్న కాళోజీ మాటలు ఆయనకే వర్తిస్తాయి. ప్రజా హృదయ వేదికపై స్థిరపడ్డ, కాలం నాలికపై నిలబడ్డ కాళోజీ 'పద్మవిభూషణ్ కాళోజీ నారాయణరావు'గా పిలిపించుకోవడం కంటే 'ప్రజాకవి కాళోజీ'గా పిలిపించుకోవడానికే ఇష్టపడేవాడు. 'కాళోజీని నమ్ముకొన్నవాడ్ని' అని నేనంటే 'కాళోజీని కాదు 'కాజ్ (లక్ష్యం)ను నమ్ముకో' అని అన్నారు. ఇదే వారు నాకిచ్చిన చివరి సందేశం.

అన్యాయాన్నెదిరించే వాడిని ఆరాధిస్తూ ఉద్యమం ఉప్పెనలో ఊపిరి తీస్తూ కాళోజీ సదా వ్యవస్థను ప్రశ్నిస్తూనే ఉంటారు.

***రచయిత సెల్: 99891 39498***

1. 'నా గొడవ'తో తెలుగు
నాట విఖ్యాతుడు,
తానందరొచు అది
మన గొడవ ఐనోడు.

2. ఎవడు? ఇంకెవడు? 'కా
ళోజి' తెలగాణోడు!
వెలుగు జలదాల వ
ర్షం వాక్కులైనోడు.

3. అన్యాయ మెదిరించు
టతని వ్యవహారమై
కవితాయుధం వాడు.

4. నిజమె 'ఇజము'గ ప్రజా
ప్రజపు పక్షంవాడు,
చేతనత ధ్వజముగ చ
రించు పెను యోధుడు.

5. సర్వాంధ్ర ధాత్రి కవి
తా క్షేత్రవంద్యుడు,
'కాద్ వినోదమె కవిత'
అను సమత పాంథుడు,
జన జగద్బంధుడు.

6. 'కాళోజి'- హిత కార్య
ఘన తరంగిణి వీచి!
తెలగాణభాషాభి
మాన విధుర విరోచి!







డా॥ సుంకిరెడ్డి నారాయణరెడ్డి

# హృదయ వచనం

కాళోజీ హృదయోపజీవి. అది ప్రకృతి ప్రసాదం. పసిపిల్లడి తత్వం ఆయన సొంతం. హృదయ చలనం పసిసిల్లడి ప్రవర్తన పర్యాయ పదాలు.

నిర్భీతి

నిజాయితీ

స్వచ్ఛత

ఇతరుల కష్టాలకు చలించే మానవీయత పసిపిల్లడి తత్వం. ఈ లక్షణాల్లోంచే కాళోజీలోని కవి, ఉద్యమ కారుడు, సంస్కర్త, కార్యకర్త మొగ్గ తొడిగింది. "పరుల కష్టము చూచి కరిగిపోవును గుండె". పిల్లవాడు పెరిగినకొద్దీ లౌక్యం అలవరచుకుంటాడు. హృదయాన్ని జారవిడుచు కుంటాడు. ఇతరుల కష్టాల్ని చూసి చలించే స్పందనా గుణాన్ని పోగొట్టుకుంటాడు. క్రమంగా స్వార్థం- చుట్టూ ఉండే సమాజాన్ని విదిలించి, బాధితుల పట్ల స్పందించడం మాని- తన గురించే, తన కోసమే ఆలోచిస్తాడు, ప్రవర్తిస్తాడు. అందుకోసం ఇతరులను కొల్ల గొట్టడమూ నేర్చుకుంటాడు. ఈ లక్షణాలు సోకకుండా పసిపిల్లడి తత్వాన్ని చివరిదాకా నిలుపుకున్న- అంటె కాన్షియస్‌గా కాదు- కాన్షియస్‌గా చేస్తే తిరిగి అందులో లౌక్యం- కృతకృత్వం జొరబడతవి- సహజంగా నిలుపుకున్నవాడు కాళోజీ. ఈ తత్వాన్ని ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా వ్యాఖ్యానించినారు. తమకు అనిపించినదానికి, తమ వాదానికి అనుగుణంగా ఆయనను వ్యాఖ్యానించుకున్నరు. అయితే అందుకు ఆయన తత్వంలో కొంత స్పేస్ కూడా ఉంది. చాలామంది ప్రేమను (గౌరవాన్ని కాదు) ఆయన పొందడం, ఆయన చాలామందిని ఇష్టపడడం అరమరికలేని ఈ హృదయ గతివల్లనే కావచ్చు.

కాళోజీ ఇచ్ఛా నడవడిక, స్వేచ్ఛా ప్రియత్వం హృదయ మూలమే. ఫ్రెంచి విప్లవంలో ప్రాచుర్యంలోకి వచ్చిన, నిర్దిష్ట తాత్వికార్థంలోనే కాక అనాదిగా మానవుడి స్వేచ్ఛాకాంక్ష-ఈ రెండు అర్థాల్లో స్వేచ్ఛ- ఈ రెంటి కలయిక అయిన స్వేచ్ఛ కాళోజీలో దర్శనమిస్తుంది. అది బతుకు విధానమయ్యింది. కాకతాళీయంగా ఖలీల్ జిబ్రాన్, ఆల్బర్ట్ ష్విట్జర్‌లతో జత కుదిరింది. గణపతి ఉత్సవాలు మొదలుకొని- గ్రంథాలయోద్యమం, ఆర్య సమాజ కార్యకలాపాలు, ఆంధ్ర మహాసభ తాదాత్మ్యం, స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహ మమేకం, తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట ఆగ్రహం, రజాకార్లతో ప్రతిఘటన, 1969 తెలంగాణ రాష్ట్ర ఉద్యమం, ఎమర్జెన్సీ వ్యతిరేకత, పౌరహక్కుల ఉద్యమం, రాజ్యహింస వ్యతిరేకత, ఇప్పటి తెలంగాణ ఉద్యమం దాకా సుదీర్ఘకాలంలో ప్రతి ప్రజా ఉద్యమంలో ఆయన హృదయ లయ శ్రుతి కలిపింది. కవిత్వ రూపంలోనైనా, ఉద్యమ రూపంలోనైనా.

అధిక్షేపం, సారళ్యం, సమకాలీనతల దృష్ట్యా శతక కవులలాంటి వాడు కాళోజీ. శతకాలంటే పండితులకు



వారి మనసులో ఒక మాట
నోటికో మాట రాదు

– పి.వి.నరసింహారావు

కాళన్న 'గుండెతడి'

–సామల సదాశివ




చిన్నచూపు. రసావిష్కరణకు శతకం వాహిక కాదన్నది, అందువల్ల అది కవిత్వం కాదన్నది వారి అభిప్రాయం. అందుకే వేమన్నను- బ్రౌన్ వెలుగు ప్రసరించేదాకా- కవిగా అంగీకరించలేదు. కుల పురాణాల్ని పుక్కిటి పురాణాలని ఈసడించినట్లు,శతక కవుల్ని వీధికో కవి అని వెక్కిరించిండ్రు. అదే ప్రమాణాలతో కాళోజీని కవిగా అంగీకరించలేదు. సరిగ్గా ఆ ప్రమాణాలనే కాళోజీ ధిక్కరించిండు. చట్రాల్ని తిరస్కరించిండు. హృదయం ఎట్లా పలికిస్తే అట్లా రాయాలన్నది ఆయన ఇచ్చ. "ఇచ్చయే ఈశ్వరుడన్నా"డు. కృతక నియమాలు వద్దన్నాడు. శతకానికి ఛందస్సులాంటి నియమమన్నా ఉంది కానీ, ఆయన కవిత్వానికి ఏ ప్రామాణిక నియమాలూ లేవు. మాత్రా నియతి ఉన్నా అది- అసహజ మైంది కాదు. ఆ మాత్రల నియతి (దానికి గూడా పూర్తిగా కట్టుబడలేదు) గూడ తన హృదయ లయనించి వచ్చిందే. కోపంతో, దుఃఖంతో ఆవేశంగా మాట్లాడే ఒక జానపద స్త్రీ మాటల్లో విని పించే లయ బద్ధతే (అంటే మాత్రాబద్ధత) కాళోజీ కవిత్వంలో వినబడు తుంది. తెలుగు కవిత్వం పద్య ఛందస్సు, మాత్రాఛందస్సు, గేయ ఛందస్సు లను దాటుకొని వచన కవిత్వంలోకి అడుగిడినా ఆయన హృదయ వచనాన్ని విడిచి పెట్టలేదు. తెలుగు కవిత్వంలో ఆయనొక 'యూనిక్'. పేరొస్తదా రాదా అన్న లెక్క లేదు.

ఆయన కవితాశిల్పానికి, శైలికి కూడ ఈ 'హృదయగతి'యే కారణం. శిల్పం కోసం చూస్తే మేధ ప్రవేశిస్తుంది అని అప్పుడు హృదయం నుండి వ్యక్తం కావలసింది సహజంగా వ్యక్తం కాదు అని ఆయన ఉద్దేశం. అందుకే ఆయన భావాన్ని అణచుకోవడం నేరం అంటాడు. అట్లా హృదయం నుంచి పలికిండు కాబట్టే తనదైన అభివ్యక్తి, సొంత శైలి ఏర్పడ్డాయి.

భాష విషయంలో కూడ ఇదే కనిపిస్తుంది. "బడి పలుకుల భాష, పలుకుబళ్ళ భాష" అని భాషను రెండు విధాలుగా వర్గీకరిస్తూ ఆయన తనది పలుకుబళ్ళ భాష అన్నడు. అంటే గ్రాంధిక భాషకు భిన్నమైన వ్యావహారిక భాష. హృదయం సరిగ్గా బట్వాడా అయ్యేది వ్యావహారిక భాషలోనే. ఆగ్రహావేశాలు సమర్ధవంతంగా అభివ్యక్తమయ్యేది ఆ భాషలోనే.

హృదయ చలనమే అడుగులైనవాడు లెక్కలు వేయడు- పేరు గురించైనా, పైసల గురించైనా, పదవి గురించైనా, ప్రమాణాల గురించైనా- ఆ లెక్కలు వేస్తే గవర్నరయ్యేవాడు. ఏదో అకాడమీకి చైర్మన్ అయ్యుండే వాడు. ఏదో ఒక రచయితల సంఘానికి అధ్యక్షుడయ్యుండేవాడు. తనకంటూ ఏమీ లేకుండానే దర్జాగా వెళ్ళిపోయిండు.

*రచయిత సెల్: 98856 82572*


సుప్రసిద్ధ జర్నలిస్టు జి.కృష్ణతో...

**డా. దామెర రాములు**

# సమరశీలి క్రాంతదర్శి మన కాళోజీ!

మన ప్రాంత పొలిమేరల్లో
గుబురు మీసాల్తో దుడ్డుకర్రతో
ఒక బక్క పలుచటి పెయ్యితో
ఒక్కొక్క మాట పిడుగులా
ఒక్కొక్క చూపు మెరుపులా
మేరు నగధీరునిలా...

"ఎవడ్రా ప్రాంతేతరుడు
దగా చేసెటోడు మా ముల్క్‌లో
బట్వాయించే దొంగ మా ఇలాకాలో"
అంటూ విద్రోహ చర్యలకు పాల్పడే
దోఖా బాజీలను హెచ్చరిస్తూ
స్వర కరవాలాల్తో శివమెత్తిన శిరస్సుతో
నిలుచున్న ఆ పెద్దాయన మీకు కనిపిస్తున్నాడా?
కాలం కదలికల్లో జ్వాజ్వల్యమాన తారలా...?
నా వతన్ నా యాస తెలంగాణ
నా పలుకు పదమూ దక్కనీ
రాజీపడే సవాల్లేదు ప్రలోభాలకు లొంగేది లేదు
ఎవడ్రా నిజాం రాజు? ఎవడ్రా తెల్లదొర?
నా జనంపై హుకుమత్ చెలాయిస్తూ జులుం చేస్తూ
రక్తమాంసాదులు నంజుకు తినే
దగాకోరు సైతాన్ బచ్చాగాళ్లెవడ్రా?
అంటూ ఉరుముతూ గొంతెత్తే పెద్ద దిక్కుని
మీరు పోల్చుకున్నారా? ఆయనే మన కాళోజీ!
ప్రాంతం వాడు మోసం చేస్తే
వేస్తాం పది నిలువుల పాతర...

సజీవ జీవనరాగాలు తొణికిసలాడే
పది జిల్లాల పకడ్బందీ తెలంగాణ
అవతరణోత్సవాల్ని కళ్లారా చూస్తాన్రా?"
అంటూ నిండు మనసుతో కలలుగన్న పండు ముదుసలి
తంగెడు గునుగూ మరియు
తీరొక్క రంగురంగుల పూల 'బతుకమ్మ'
నవరాత్రీ వేడుకల నవ తెలంగాణ
సంబురాల కూర్పు మన కాళోజీ మూసపోసిన తేజస్వి...
కాళోజి యాది యావ చింతన తండ్లాట
ఏనాటికైన మనకు స్ఫూర్తి! ఉత్తేజం!
వెలుగులు పంచి దిక్కులు చూపించే దీపస్తంభం!!

*కవి సెల్: 98664 22494*





దేవులపల్లి కృష్ణమూర్తి

# మన కాలం వీరుడు

***1968-69*లో నవీన్‌గారు నల్గొండలో లెక్చరర్‌గా పనిచేస్తూ వుండేవారు. 'సృజన' మూలంగా వారితో పరిచయం ఏర్పడింది. ఎప్పుడు మాట్లాడినా వరంగల్ ముచ్చట రాంది ముందుకు జరిగేది కాదు. అట్లే మిత్రమండలి సమావేశాలంటూ కాళోజి గారంటూ చెప్తుండేవారు. అప్పట్లో వారి అంపశయ్య వ్రాత ప్రతి పూర్తయ్యింది.**

నవీన్‌గారు నెలనెలా మిత్రమండలి సమావే శాలంటూ వరంగల్‌కు వెళ్తుండేవారు. అరే ఈ సమావేశాలు ఎట్లుంటయో చూద్దామని వారితో పాటుగా ఒకసారి వరంగల్‌కు పోయిన. అప్పుడే మొదటిసారిగా కాళోజి గారిని చూడటం జరిగింది. మనిషి వూటగా గాలొస్తె లేచిపోయే టట్లుండు. పలకరించిన ప్రతివాణ్ణి ఎరా, ఏందిరా అంటూ ఎంతో ఆప్యాయతగా మాట్లాడుతుండు. గొంతు మాత్రం గంభీరంగా వుంది.

సమావేశంలో పాల్గొన్నవారంతా ఏదో ఒకటి చదువుతూ పోతుండ్రు. నాకు అంతకుముందు నల్గొండలో పరిచయం అయిన వరవరరావుగారు కూడా వచ్చి యుండిరి. ఇంకా ఇరివెంటి కృష్ణమూర్తిగారు, గంట రామన్నగారు, వేనరెడ్డిగారలు ఆ సభలో పరిచయం అయ్యిండ్రు. ఆ సమావేశం నన్ను చాలా ప్రభావితం చేసింది. కవిత్వం చదవాలన్న కోరిక పెర్గిపోయింది. వ్రాద్దామని ప్రయత్నించిన కాని నాకే తృప్తి నివ్వక వ్రాయటం ఆపి చదవటం మొదలుపెట్టిన. కాళోజిగారి 'నా గొడవ' చదవటమయ్యింది. ఇదేందిరా? కవిత్వం ఇంత కుండలు బద్దలు కొట్టినట్లుగా వుంటుందా అనిపించింది. తెలంగాణలో మొదటగా గుర్తొచ్చే కవి కాళోజి. తన కలాన్నే ఖడ్గంగా మార్చి అన్యాయాలపై, అక్రమాలపై పోరాడిన మన కాలం వీరుడు. వాడు ఎంత బలవంతుడైనా తను చెప్పాలనుకున్నది నిష్కర్షగా చెప్పటం ఆయన నైజం. ఎక్కడ అన్యాయం జర్గినా తీవ్రంగా స్పందించటం



ఆయన లక్షణం.

**- తెలంగాణ బ్రతుకును కాళోజి బతుకమ్మలో ఇలా చూపించాడు.**

గుమ్మడి పూలు పూయగ బ్రతుకు
తంగెడి పసిడి చిందగ బ్రతుకు
గునుగు తురాయి బ్రతుకు
కంట్ల నీలిమలు చిమ్మగ బ్రతుకు
అంటూ-
బతుకు బ్రతికి బ్రతుకురి బతికిస్తూ
బతుకమ్మ బ్రతుకు
అంటాడు.

యమర్జెన్సి కాలంలో-
నరుడను నేను వరుడను నేను
మనిషి బ్రతుకు బ్రతుకు తాను
నా ఇష్టం వచ్చినట్లు నా మనసుకు నచ్చినట్లు
మాట్లాడుతా, రాస్తా, ప్రకటిస్తా
నా ఆలోచన నాది.

అభిప్రాయ భేదానికి అవకాశం లేకున్నా
సభ్య ప్రపంచం సున్నా
నా మతమున ప్రకటిస్తా
అది నా స్వతస్సిద్ధమైన హక్కు
జన్మహక్కు
ఆ మాత్రం లేకుంటే బ్రతుకెందుకు?

కాళోజీ ఒక చెమ్మగిల్లిన కన్ను. తన ముందు ఎవరు బాధపడ్డా తను విలవిల్లాడిపోయేవాడు. చిన్నపిల్లవాడిలా బోరున ఏడ్చేవాడు.

అవనిపై జరిగేటి అవకతవకలు చూచి
ఎందుకో నా హృదిని ఇన్ని వేదనలు
పరుల కష్టంచూచి కరిగిపోవును గుండె
మాయ మోసం చూచి మండి పోవును కళ్ళు.

సమాజంలో రోజురోజుకు సాటి మనిషిని పట్టించుకునే తీరిక లేకుండా జీవిస్తున్నారు, జీవితాలను నెట్టుకొస్తున్నారు. ఎన్ని వున్నా ఇలాంటి స్పందనలు తగ్గినపుడే మనుషుల్లో సమస్యలు చోటు చేసుకుంటాయి. హద్దులు లేని సరిహద్దులు మనుషుల్లో గూడు కట్టుకుంటున్నాయి. వాటిని బద్దలు చేసేంత వరకు సమాజంలో అలజడులు, ఆందోళనలు కొనసాగుతూనే వుంటాయి.

కాళోజీ ఇటువంటి సందర్భంలో మన తరఫున నినదించాడు. మనందరి గొడవలను తన గొడవగా చాటాడు. మనసులోనే కన్నీళ్ళు పెట్టుకొని ఆగ్రహావేశాలతో వూగిపోయాడు. కాళోజీ అంటే అది.

పసిపిల్లలు తమకు కావలసినవి సాధించుకోవడానికి ఏడుపునే ఆయుధంగా వాడుతారు. కొందరు తమ ఆవేదనను హృదయంలో పలికిస్తూ అందరికి కన్నీళ్ళు తెప్పిస్తుంటారు. సహజంగా అలాంటి వాళ్ళు పుట్టుకతోనే ఈ లక్షణాలను కల్గి వుంటారు. ఇలాంటి తీవ్ర భావోద్వేగాలు కలిగిన వారే సరికొత్త ఆవిష్కరణలు చేస్తూ వుంటారు. తమకంటూ ప్రత్యేకమైన ఒరవడిని కలిగి చరిత్రలో నిలిచిపోతారు. మన కాళోజీ హృదయం కూడా అలాంటిదే.

మనిషి భౌతికంగా తనముందు కనిపించిన అంశాల పట్ల చలిస్తాడు. ఆ స్పందన ఏ రూపంలో వుండాలి, ఎవరి ప్రయోజనాలు నెరవేర్చేదిగా వుండాలనేది ఆయా మనుషుల వ్యక్తిత్వాలపై ఆధారపడి వుంటుంది. కాని స్పందించే లక్షణం మాత్రం సహజంగా వుండాలి.మన కాళోజీలో ఆ గుణం నిండుగా వుండేది.

మొదట విశాలాంధ్ర కావాలనే నినదించిన తను 1969లో ప్రత్యేక తెలంగాణ కావాలని పోరాడిండు. నిజానికి కలిసి వుండటంలో జరిగిన మోసాన్ని గుర్తించటంలో కాస్త ఆలస్యం జరిగింది. అది తెల్సుకున్నంక మన తెలంగాణ మనకు కావాలని గళమెత్తిండు. అది కాళోజీలోని ప్రత్యేకత.

మొహమాటం ఆయన జీవితంలోగాని కవిత్వంలోకాని కానరావు. తెలంగాణ ఉద్యమాన్ని బలపరుస్తూ.

ఎవరనుకున్నారు ఇట్లౌనని
ఎవరనుకున్నారు
నమ్ముకొని పెత్తనమిస్తే
నమ్మకం పోగొట్టుకుంటిమి
కుప్ప కావలి వుండి కట్టలు
తప్ప దీస్తిరి, ముద్దరేస్తిరి
సాటివాడు చేరదీస్తే
నోటి నిండా మన్నుగొడ్తిరి
అట్లే-
దోపిడి చేసే ప్రాంతేతరులను
దూరంగా తన్ని తరుముదాం
ప్రాంతం వారే దోపిడి చేస్తే
ప్రాణాలతో పాతరేస్తం
అంటూ కవితాగానం చేసిండు మన కాళోజీ.

మా వేణు సంకోజు నల్గొండకు వచ్చిన తర్వాత సాహిత్య సభలు వూపందుకున్నయి. అతగాడు మిత్రులకు, పెద్దలకు, తను అభిమానించే కవులకు నూతన వత్సర శుభాకాంక్షలతో, రంగు రంగుల బొమ్మలు వేసి వుత్తరాలు రాస్తుండేవాడు. ఆవిధంగా ప్రతి సంవత్సరం జనవరి మొదటి తారీఖున చేరేవిధంగా కాళోజీ అభినందన లేఖ వ్రాయటం ఆనవాయితిగా మారింది. ఇది వారు జీవించి వున్నంతకాలం పంపిస్తూనే వుండినారు. ఒక సంవత్సరం వారికి ఉత్తరం అందటం ఆలస్యం అయ్యింది. 'అరే! మన వేణు ఉత్తరమేదిరా' అంటూ ప్రతి రోజు వెతుకుతుండేవాడట. అది అతని అభిమానం.

నాగార్జునసాగర్‌లో కొంతకాలం పాటు సీనియర్ చిత్రకారుడు 'దాసి' సుదర్శన్‌గారు 'అల' అనే సాహిత్య సంస్థను ప్రారంభించి సాహిత్య సభలు నిర్వహిస్తూ వుండేవాడు. అవి కొన్నేండ్లపాటు జరిగి ఇప్పుడు ఆగిపోయినవనుకోండి. ఒక సంవత్సరం ముఖ్యఅతిథిగా కాళోజీగారు వచ్చి రెండు రోజులున్నారు. ఆ రెండు రోజులు వారితో గడపటం మరచిపోలేని మధుర జ్ఞాపకం.

మన కాలం వీరునికి మరోమారు వందనం.

*రచయిత సెల్: 92900 94015*



వరంగల్ మిత్రమండలి సమావేశాల్లో కవులు, రచయితలతో

చింతపట్ల సుదర్శన్

# కాళోజీ రామేశ్వర్రావుతో కొన్ని గంటలు

రెండు దశాబ్దాల కిందట అనుకుంటాను. వరంగల్లు మా బంధువుల ఇంటికి వెళ్ళినప్పుడు (వాళ్ళు ఉండేది నక్కలగుట్టే) వాళ్ళ ఇంటి వెనకవున్న కాళోజీ ఇంటికి వెళ్ళాను. నేను వెళ్ళేప్పటికి కాళోజీ నారాయణరావుగారు చెప్పుల్లో కాళ్ళు దూర్చి వున్నారు. బయటికి వెళ్తున్న ఆయన నన్ను ఇంట్లోకి పిలిచి కూచోబెట్టి యిప్పుడే వస్తానని బయటకు వెళ్ళాడు. ఇంట్లో వున్న కాళోజీ రామేశ్వరరావుగారికి నన్ను నేను పరిచయం చేసుకున్నాను. నేను అన్నగారితో మాట్లాడుతూ వుంటే రెండుసార్లు ఇంట్లోకి వచ్చి వెళ్ళారు నారాయణరావుగారు.




కరెంటు బిల్లుకు సంబంధించిన కాయితాల కోసం అని తెల్సింది. ఆయన ఇట్లా కరెంటు ఆఫీసుకు వెళ్ళడం రావడం మళ్ళీ వస్తానని వెళ్ళడం వల్ల ఆయనతో సావకాశంగా మాట్లాడ్డం కుదరనేలేదు. 'షాద్' అనే కలం పేరుతో ఉర్దూలో కవిత్వం రాసిన రామేశ్వరరావుగారు తాను 1908లో హైదరాబాద్‌కు సమీపంలోని 'ఆలూరు'లో జన్మించానని వారి కుటుంబం తాను మూడవఫారం చదువుతున్నప్పుడు హన్మకొండకు వచ్చి చేరిందని చెప్పారు. తన గురించీ, తమ్ముడి గురించీ, తమ చిన్ననాటి రోజుల గురించీ ముచ్చటించారు. తను ఉర్దూ కవిగా ప్రసిద్ధి చెందినా, తెలుగులో కవిత్వమూ, వచనమూ కూడా రాశానని, తమ బాల్యాన్ని 'చిన్ననాటి రోజులు' అనే రేడియో వ్యాసంలో పొందుపరిచాననీ అన్నారు. చదివి వినిపించారు. 'ఓరుగల్లు తాలూకాకు సంబంధించిన మడికొండ గ్రామంలో, గ్రామం మధ్యన బురుజుకు సమీపంలో గల ఒక త్రిశాల భవంతిలో ఉండేది, నేను ప్రాథమిక విద్యనభ్యసించిన పాఠశాల' అని ఆ వ్యాసం మొదలుపెట్టారు. తర్వాత తాము వకాలత్ కోసం 'మఖ్తార్లు' అనే పరీక్షలకు చదివానన్నారు. ఆ తర్వాత వారు నాకు చదివి వినిపించిన కొన్ని కవితలు నోట్ చేసుకోవడం జరిగింది. ఉర్దూ ప్రభావం ప్రతిఫలించే

---

ఆ మధ్యాహ్నం వరకూ రామేశ్వర్రావుతోనే గడచిపోయింది. కాళోజీ బయట పని పూర్తి చేసుకుని వచ్చేప్పటికి అలసిపోయారు. నేను మళ్ళీ కలుస్తానని వచ్చేశాను. కాళోజీ రామేశ్వరరావుగారు తన తెలుగు రచనలని వరంగల్ కవి మిత్రులు, మిత్రమండలి కవులు తీసుకువస్తే బావుండునన్నట్టు జ్ఞాపకం.

---

తెలుగు కవిత్వం ఆయనది. కాళోజీకి మల్లేనే కనిపించేది కనిపించ నిదీ అయిన 'లయ' వున్నది ఆయన కవిత్వంలో.

'అందమైనది సౌరభము  
వెదజల్లునట్టివి, తీరు  
తీరువి, గజలుతోటలో  
రంగురంగుల పుష్పముల  
వికసింపజేసే తోట  
మాలీ పనికి 'షాదే'  
తగినవాడని రసికులంటే  
మురిసిపోదును నాలో నేనే'

మరొక కవితలో

'రాత్‌కీ రాణిని గాను  
రప్పు రప్పున ఎగసిపోను  
గాలివెంట- వెంట దిరిగి  
సౌరభము వెదజల్లుకోను  
మంచి గంధపు చెక్కవోలె  
మారుమూలన మణగియుందును  
శ్రద్ధయై శ్రమ కోర్చు వారికి  
అరగి అరగి కరగి కరగి  
దెందమున కానందమిత్తును

అన్నారు. కాళోజీ కలంలోని పదునూ అన్నగారి కలంలో కనిపించింది.

'అన్నపానాదులకు నాత్మ  
తాకట్టు ఒద్దు



మనుగడ నాకు సమ్మతము కాదు'

అన్నప్పుడు ఒక కవితలో, ఆయన వినిపించిన 'మా అమ్మ పాడిన గీతాలు', 'నేను చదువుకున్న రోజులు' కవి- ఫోటోగ్రాఫర్, రేడియో వ్యాసాల్లో అవహేళన, హాస్యం కాళోజీ 'సాటినిక్ విజన్'ని తలపింప చేశేయి.

ఫోటోగ్రాఫర్- కవితలోని కొన్ని వాక్యాలు-

'సృష్టిలో వున్న అందాలను వెతుక్కుంటూ తిరుగుతాను నేను (కవి). అందాలే నిన్ను వెదుక్కుంటూ వస్తుంటవి. నీవు రెడీ అనగానే ఫోజు పెట్టని మహానుభావుడెవరైనా ఉంటే నాకు చూపించు మోకరిల్లి ఆయనకు సాష్టాంగ ప్రణామం చేస్తాను. పెద్దపెద్ద సమావేశాల్లో డయాసుపై బాలీసు దిండ్ల కానుకుని అసభ్యంగా, అసహ్యంగా, శ్రోతల వైపు కాళ్ళు బారజాపి సుఖాసీనులైయున్న వి.ఐ.పి.లు, మహామనుషులు సైతం, అంతవరకు ధోవతి ఎంతపైకి జరిగిందో, ఎంత పక్కకు తొలగిందో తెలుసుకొనలేని పరిస్థితిలో ఉన్న ప్రమత్తులు నీవు ప్రత్యక్షం కాగానే "బా అదబ్ బామురలా హిజా హోషియార్ నిగాః రూబరూ" అని చోబ్దార్లు గర్జిస్తే అదబ్‌గా కూర్చునే దర్బారిల మోస్తరు సర్దుకొని కూచుంటారు.'

ఆ మధ్యాహ్నం వరకూ రామేశ్వర్రావుతోనే గడచిపోయింది. కాళోజీ బయట పని పూర్తి చేసుకుని వచ్చేప్పటికి అలసిపోయారు. నేను మళ్ళీ కలుస్తానని వచ్చేశాను. కాళోజీ రామేశ్వరరావుగారు తన తెలుగు రచనలని వరంగల్ కవి మిత్రులు, మిత్రమండలి కవులు తీసుకువస్తే బావుండునన్నట్టు జ్ఞాపకం. వారు ఆ పుస్తకం వెలువరించిందీ లేనిదీ తెలియదు. ఆయన చెప్పిన నాలుగు కవితా వాక్యాలతో ముగిస్తాను.

'పాఠకుల తలతాప జేయని
రచన రచనే కాదు 'షాదు'
శ్రోతలను మెప్పించజాలని
కవిత కవితే కాదు 'షాదు'

***రచయిత సెల్: 92998 09212***



సోదరుడు రామేశ్వరరావు సభలో ప్రసంగిస్తున్న కాళోజీ



*కాళోజీ సోదరుల్లో ఒకరైన మీ అగ్రజులు శ్రీ రామేశ్వరరావు గురించి మీ అభిప్రాయం?*



ఆయన వంటి అన్న అందరికీ లభించడం అరుదు. ఆయన సహ ప్రచంద్ర ఉత్సవంలో పూల కిరీటం పెడితే అయిదు నిముషాలకు మించి ఉంచుకోలేదు. చిరాకు పడ్డాడు. అట్లాటిది, నన్ను 83 ఏండ్లు భరించిండు. ఏడేండ్ల వాడైన మా అన్న రామేశ్వరరావు భుజం మీద, నా ఏడు నెలల వయస్సునపుడు మా అమ్మ వేసింది. అప్పటి నుంచి ఆయన చనిపోయే వరకు ముళ్ళ కిరీటం వంటి నన్ను మోస్తూనే ఉండే. రాసుకున్నాను.

"ఎన్నేండ్లు వచ్చినను చిన్నవాడనరుంచు అతి గారబము తోడ అన్ని సమకూర్చు చుచు ఆట పాటలకెంతో అవకాశ మిచ్చిన అన్నకీ గొడవ అంకితము సేతు అని నా గొడవ ఆయనకే అంకితం ఇచ్చిన. అంతేకాదు 'సైరణలో పుడవిచి అతనికి ఉన్న తేడ కదునన్నది కందిరీగ నడుమ నుటయు మోటగునను భయమున్నది.' అని కూడా అన్న నన్ను సొసైటీకి ఆయన డొనేట్ చేసిందని కూడా సభల్లో చెప్పుకున్న ఉర్దూలో గొప్ప కవిత్వం రాసిండు.

'కలామెషాద్ అవ్వల్, కలా మెషాద్ దువ్వం' ఆయన బతికుండగానే అచ్చయినయి. ఆయన చనిపోయినాక కాయనాతౌ షాద్' అని మూడో పుస్తకం అచ్చైంది. ఇంకా ఎన్నో హిందీ కవితలు, 'గుణగాన్' అని వివిధ వ్యక్తుల మీద రాసినవి ఉర్దూ కవితలు అచ్చు కావలసి ఉన్నాయి. తెలుగులో కూడా ఆయన రచనలు, ఆయన సొంతంగా రాసినవి, దేవులపల్లి సుదర్శన్‌రావు అనువాదం చేసినవి ఒక పుస్తకంగా వచ్చినాయి.

*(కాళోజీ యాదిలో... కాళోజీతో తాళ్ళపల్లి మురళీధర్ గౌడ్ ఇంటర్వ్యూ నుంచి)*

యస్. జీవన్‌కుమార్

నేడు దేశంలో విపరీతమైన అస్థిరత్వం చోటు చేసుకుంది. ప్రభుత్వం ఎంతకాలం ఉంటుందో, దాన్ని నిలబెట్టుకోవడానికి ఎటువంటి ఎత్తుగడలు, సమీకరణలు చేసుకోవాలో అనేదే ఇప్పుడు ప్రభుత్వాలు నడిపించే రాజకీయ పార్టీలకున్న తాపత్రయం. ఈ మొత్తం ప్రక్రియలో విలువలు పూర్తిగా కనుమరుగైపోయినాయి. ఒకే పార్టీ రెండు ప్రాంతాలలో రెండు రకాల అభిప్రాయాలు వ్యక్తపరుస్తున్నాయి. క్రియాశీలకంగా ఉండవలసిన రాజకీయాలు పూర్తిగా భ్రష్టు పట్టిపోయాయి. ప్రజల్లో పాలనా యంత్రాంగం పట్ల జుగుప్స, అసహ్యం, అసహనం పెరిగి పోయింది. ప్రజలు పూర్తిగా నిమిత్తమాత్రులుగా మిగిలిపోతున్నారు. ప్రజలకు, ప్రభుత్వానికి ఏమీ సంబంధం లేని వ్యవస్థ ఒకటి ఏర్పాటయి ముందుకుపోతుంది. దీన్ని 'ప్రజాస్వామ్యం', 'ప్రజాస్వామిక పాలన' అని పిలుస్తున్నాం.

తాను స్వయంగా గాంధేయవాది అయి వుండి కూడా నైజాం పాలన లోని దుష్ట లక్షణాలన్నీ వ్యతిరేకించడమే కాకుండా, జీవితమంతా తానే ఒక ప్రతిపక్షమై వ్యవహరించాడు. నక్సలైట్ల ఎన్‌కౌంటర్ల విషయం ప్రస్తావిస్తూ తనను కూడా ఎన్‌కౌంటర్ చేసి ఒక నక్సలైట్‌ను చంపామని ప్రకటించే ఒక సంస్కృతిని ప్రభుత్వం ప్రోత్సహిస్తుందని, ఇది ప్రజాస్వామ్యానికి ప్రమాదమని ఉపన్యాసాల్లో పదేపదే చెప్పుతుండేవాడు.



ప్రజాకవి కాళోజీ శతజయంతి సందర్భంగా, ఇప్పుడు సామాజికంగా, రాజకీయంగా నెలకొన్న పరిస్థితుల నేపథ్యంలో కాళోజీని ఒకసారి దర్శించడం సబబుగా ఉంటుంది. ముఖ్యంగా కాళోజీ దృక్పథంలో ప్రజాస్వామ్యం అంటే ఏమిటి? ఆయన పౌరుడిని ఎట్లా చూసాడు? ప్రజాస్వామ్యం దృఢంగా, ఆరోగ్యంగా ఉండటానికి ఆయన ఎటువంటి ఆదుర్దాను, తపనను వెలిబుచ్చాడు? ఈ విషయాలు పరిశీలిస్తే కాళోజీ ఎందుకు ఇప్పటికి, ఎప్పటికి రెలవెంట్‌గా ఉంటాడో అర్థం చేసుకోగల్గుతాం.

రాజకీయాలు క్రియాశీలంగా ఉండాలని వాటిని 'ప్రజాకీయాలు' చేయాలనేది కాళోజీ తపన. రాజకీయాలు, ప్రజా రాజకీయాలుగా, ప్రజల ఆకాంక్షల వెలుగులో పరిణితిచెంది, ప్రభుత్వాలు ప్రజలలో భాగమై పని చేయాలి అంటాడు కాళోజీ. ప్రజాస్వామ్యాన్ని, పౌరుడ్ని కాళోజీ ఈ దృష్టి కోణంతోనే వీక్షించాడు. కాళోజీ కవిత్వం అంతా ఇదే దృక్పథాన్ని ప్రతిబింబిస్తుంది.'ప్రజాస్వామ్యమంటే' అనే కవితలో కాళోజీ ప్రజాస్వామ్యం పై తన దృక్పథాన్ని స్పష్టంగా వ్యక్తపరుస్తాడు.

'ప్రజాస్వామ్యమంటేమిటి?
ప్రజారాజ్యమంటేమిటి?
సౌజన్యాలకు రక్ష
సామరస్యాలకు రక్ష
సహకారాలకు రక్ష
సహజీవనానికి రక్ష
ప్రజాస్వామ్యమంటే అది
ప్రజా రాజ్యమంటే అది!

మానవత్వానికి మనుగడ
దానవత్వానికి ఎద దడ
గుండాతనానికి దగడు
గూడుపుఠానికి బెగడు!

కుట్రదారులకు హడలు
చట్రాలను మార్చుకోడాలు
శాసనబద్ధ వ్యవస్థ
స్వైరవిహారుల కవస్థ!
ముఠా బందికి మృత్యువు
శఠపీఠములకు శత్రువు
ఆకతాయి సంహరణం
అనామకుని సంరక్షణ!

న్యాయవర్తనులకు హామి
మాయముడుతలేని సామి
ప్రతిభకు సరిపడు వెల
రసములు చిలికెడి జల!

నిజాయితీకి ప్రోత్సాహం
మజా నీటికి మృత్యూహం
పనిదొంగల కాట కట్టు
పనిదొరకాయువు పట్టు!

సంరక్షక పౌర మతము
స్వాతంత్రమునకు హితము
హక్కుల కాపాడు కోట
మక్కువ వికసించు చోట
నెయ్యము పెంచెడి మడి
నీతుల నేర్పెడి బడి
ఆర్ద్రత ఆరని తడి
అమ్మ కడుపు దాచిన బడి!
ప్రజాస్వామ్యమంటే అది.
ప్రజా రాజ్యమంటే అది.

1963లో ఈ కవిత రాసేప్పటికి రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తయ్యాయి. చైనాతో యుద్ధం జరిగింది. మానవీయతతో నిండిన ప్రజాస్వామ్యాన్ని ఈ కవితలో వర్ణిస్తాడు. సౌజన్యాలు, సామరస్యాలు, సహకారాలు, సహజీవనం, ఆకతాయి సంహరణ, అనామక పౌరుడి సంరక్షణ, అభయం, నీతివంతమైన పాలన అంశాలన్నింటిని ఆయన కాంక్షించాడు. నెహ్రూ సోషలిజం, సమానత్వం అని మాట్లాడుతున్నాడని, లౌకికవాదిగా, ప్రజాస్వామ్యవాదిగా ప్రజలు కీర్తిస్తున్నారని కవి కూడా



*విరసం సభల్లో శివసాగర్‌తో కాళోజీ*



విరసం సభల్లో పాల్గొన్న వరవరరావు, శివారెడ్డి, ఎం.టి.ఖాన్, కళ్యాణరావు, కాళోజీ, కన్నాభిరాన్, విమల

ప్రజాస్వామ్యంపై తను వెలిబుచ్చిన ఆకాంక్షలకు అద్దం పట్టేటట్టు పాలన ఉంటుందని ఆశించాడు.

కాని 1966లో రాసిన 'అమ్మయ్యో! అభ్యుదయం!!' అన్న దీర్ఘ కవితలో పటాపంచలైన తన ఆకాంక్షల గురించి వివరిస్తాడు. 'అభ్యుదయం' తలచుకుంటే తనకు 'జెర్లు ప్రాకు జలదరింపు' కలుగుతుందని, రాజకీయాల్లో విలువల రాహిత్యం, భ్రష్టుపడ్తున్న సంస్కృతి, ఎన్నికల్లో గెలవడమే పరమావధిగా మారిన రాజకీయాలు, ఇతర సామాజిక, రాజకీయ రుగ్మతలను ఎత్తిచూపి నెహ్రూ సామ్యవాదాన్ని ఎకసెక్కం చేస్తాడు. కాళోజీ దృష్టిలో ప్రజాస్వామ్యం అంటే ప్రజల హక్కులకు రక్షణ ఇచ్చే వ్యవస్థ మాత్రమే కాదు, సామరస్యం, సహకారం, సహజీవనం ఆ వ్యవస్థలో మిళితమై ఉండాలని 'నా గొడవ' (పరాభవ వసంతం) కవితలో పేర్కొంటాడు. అంటే ప్రజాస్వామ్య భావన విస్తరించిన ఆత్మీయ, మానవ విలువల, మానవీయ సంబంధాల వ్యవస్థగా ఉండా లంటాడు. ఇటువంటి వ్యవస్థ నిర్మాణంలో ప్రజల పాత్ర గురించి, వాళ్ళ భాగస్వామ్యం గురించి చాలా వివరంగా చెప్తాడు. 'ప్రజాకీయాలు' అనే కవితలో ప్రజలు సంసిద్ధపడి పూనుకొంటేనే రాజకీయాలు ప్రజాకీయాలుగా పరిణామం చెందుతాయంటాడు. ప్రజలు పూనుకోవడ మంటే 'ఉద్యమించడం' అనేది స్పష్టంగా 'ప్రజల ప్రజలు' అనే కవితలో చెప్తాడు.

ప్రజలు ప్రజలు మేటి ప్రజలు!
ప్రజాస్వామ్యమందు ప్రజలు!
మౌనంగ ఉన్నారేం? మరణాంతర స్థితి మాదిరి
ప్రజాస్వామ్య జీవనది పట్టు తప్పలేదు కదా?
అనవరతము జాగరణము అనివార్యము ప్రజలకను
ప్రజాస్వామ్య మూల మంత్ర పారమేల మరచెను ప్రజ?

అంతేకాదు 'మళ్ళీ విప్లవం రావాలె' అనే కవితలో తిరుగుబాటు ఉప్పెన రావాలని ప్రబోధిస్తాడు కూడా.

విచ్చలవిడితనం హెచ్చింది. స్వైరవిహారం హెచ్చింది.
... ప్రజలే ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోవలసింది
లేవండి! లేవండి!! జాగ్రత్త పడండి!!
... మళ్ళీ ఒక దుమారంగా రేగండి
మళ్ళీ ఒక ఉప్పెనగా లేచి దూకండి
మళ్ళీ ఒక తిరుగుబాటు చేయండి
నిర్భయులు కండి. నీతిని నిలువ ద్రొక్కుకోండి
అవినీతిని గద్దె దించండి. లేవండి! లేవండి!!

ఈ ప్రజాస్వామ్యాన్ని రక్షించుకునేది, పటిష్టంగా తయారుచేసుకునేది ప్రజలు మాత్రమే అని కాళోజీ ధృడంగా విశ్వసించాడు. ప్రజలు ఓట్ల ద్వారా తమ ప్రతినిధిని ఎన్నుకుంటారు. తమతమ శక్తుల్ని ఒక్క ప్రతినిధికిచ్చి ఆయనకు అధికారమిచ్చి తమ బాగోగులు చూసుకొమ్మంటారు. ఓటు అనేది ప్రజాస్వామ్యంలో ప్రజల దగ్గరున్న బలమైన ఆయుధం. ఆ ఆయుధాన్ని డబ్బుకో, సారాకో, ఇతర ప్రలోభాలకు లొంగి అమ్ముకుంటే అది ప్రజాస్వామ్యానికి ప్రమాదం అంటాడు కాళోజీ. ఆ ఓటును పౌరుడు దేశం కోసం, ప్రజాస్వామ్య మనుగడ కోసం చాలా జాగ్రత్తగా వినియోగించుకో వాలని ఆయన చాలా కవితల్లో చెప్తాడు.

ఓటిచ్చునప్పుడే ఉండాలి బుద్ధి
ఎన్నుకొని తల బాదుకొన్న నేమగును?
తర్వాత ఏడ్చినను తప్పదనుభవము

అంటూ మనం బజారులో వస్తువులు కొన్నప్పుడు ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తాం, ఓటును పిల్లలాటలాగా భావించకూడదు అని చాలా ఉదా





హరణలతో చెప్తాడు. ఇంకొక కవితలో ప్రజాస్వామ్యానికి ఓటరే కాపరి వంటివాడని చెప్తూ ఎద్దు తప్పుతోవలో పోతే కాపరివాడిదే దోషం అంటాడు.

అయితే కాళోజీ కవితలలో రాజ్యాంగబద్ధ ప్రక్రియ, పాలన మాత్రమే మనకు కనపడదు. ప్రజలు ఎంతో విశ్వాసంతో ఎన్నుకున్న ప్రభుత్వం ప్రజలతో అప్రజాస్వామ్యంగా వ్యవహరించినా, అణచివేత, హింస ప్రయోగించినా, బలప్రయోగానికి పూనుకున్నా ప్రజలకు ప్రతిహింస చేసే హక్కు ఉందని అభిప్రాయపడ్డాడు. హింసాత్మక పరిస్థితులను కల్పిస్తున్నది ప్రభుత్వమే అయితే దాన్ని ప్రజలు ఎదిరిస్తే అది హింస కాదు, ప్రతిహింస అని నిర్ద్వంద్వంగా చెప్తాడు. 1941లో జనగాం దగ్గరి, బైరాన్‌పల్లిలో రజాకార్ల దుష్టచర్యల గురించి విన్నప్పుడు జైలులో రాసిన కవితలో, తెలంగాణా రైతాంగ పోరాటం సమయంలో రాసిన పలు కవితల్లో, 1970లో రాసిన 'మార్చ్ ఆన్' కవితలో, 1971లో రాసిన 'తిరగబడమంటే తప్పా' కవితలోనూ ప్రతిహింస గురించి బోధిస్తాడు.

కాళోజీ గాంధేయవాది అని చెప్పుకున్నప్పటికి అన్యాయానికి, సామాజిక వివక్షకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలనెప్పుడు హింస- అహింస కొలమానంతో చూడలేదు. విప్లవ, రైతుకూలీ యోధులు భూమయ్య, కిష్టాగౌడ్‌ను ప్రభుత్వం ఉరితీసినప్పుడు కాళోజీ రాసిన కవిత ఆయనకు ప్రజాస్వామ్యంలో ప్రజలకు ఉండే అన్నిరకాల హక్కులపై ఉన్న అచంచల విశ్వాసానికి ఉదాహరణ.

కిష్టాగౌడు భూమన్న  
విప్లవ కాళీసత్తా  
కన్న కవలల్రా ఓరన్నా  
చావు అంటె భయంలేని  
మొండివాళ్ళు దండివాళ్ళు  
సాయుధ పోరాటానికి  
దిగిన నాడె మొండివాళ్ళు  
అన్యాయాన్నెదిరిస్తూ  
చేయగలిగినంత చేసి  
అన్నమాటె నిలుపుకొన్న  
ధీరులంటె వారు అన్న  
ఉరిశిక్షకు గురి అయ్యి  
ప్రాణభిక్ష కొరనట్టి  
ధీరులు వీరులు కళ్ళను  
దానం చేసిరి అన్నా...  
పేదవాని కోపమంత  
పెదవి చేటే కాదన్న  
కసితో ముందుకుపోతే  
అగ్ని రగులుతుందన్న.



*కాళోజీ గాంధేయవాది అని చెప్పుకున్నప్పటికి అన్యాయానికి, సామాజిక వివక్షకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలనెప్పుడు హింస- అహింస కొలమానంతో చూడలేదు. విప్లవ, రైతుకూలీ యోధులు భూమయ్య, కిష్టాగౌడ్‌ను ప్రభుత్వం ఉరితీసినప్పుడు కాళోజీ రాసిన కవిత ఆయనకు ప్రజాస్వామ్యంలో ప్రజలకు ఉండే అన్నిరకాల హక్కులపై ఉన్న అచంచల విశ్వాసానికి ఉదాహరణ.*



కాళోజీ రాజ్యాంగబద్ధ పాలనను కాంక్షిస్తున్నట్టు కనిపించినా దుర్మార్గ ప్రభుత్వాల దౌర్జన్యాలను ఎదిరించే మార్గాలను ప్రజలే నిర్ణయించు కుంటారని భావించాడు. ఆయన ఎమర్జెన్సీలో ప్రహ్లాదుని చరిత్ర చెప్పినా, రామాయణ మహాభారతాలలోంచి కథలు ఉటంకించి చెప్పినా దుర్మార్గ ప్రభుత్వాలను కూలదోసే హక్కు ప్రజలకుందనే విశ్వాసాన్ని వెలిబుచ్చాడు. అందుకే ఏ సంఘంలో, సంస్థలో సభ్యుడు కాకున్నా విప్లవ ప్రజా సంఘాలలో, హక్కుల సంఘాలలో, అన్ని నిరసన ఉద్యమాలతో అడుగులేసి నడిచినాడు. కాళోజీ కమ్యూనిస్టు కాకున్నా 1944లో జరిగిన భువనగిరి మహాసభలో రావినారాయణరెడ్డి నాయకత్వాన్ని బలపర్చాడు. నక్సలైటు ఉద్యమం ప్రారంభం అయిన తర్వాత 'సర్వోదయమో, చారుమజుందారీయమో' అన్నప్పుడు, ప్రజాస్వామ్య పరిరక్షణలో విప్లవం కూడా ఉంటుందనే ఆయన భావన మనకు స్ఫురిస్తుంది.

తాను స్వయంగా గాంధేయవాది అయి వుండి కూడా నైజాం పాలనలోని దుష్ట లక్షణాలన్నీ వ్యతిరేకించడమే కాకుండా, జీవితమంతా తానే ఒక ప్రతిపక్షమై వ్యవహరించాడు. నక్సలైట్ల ఎన్‌కౌంటర్ల విషయం ప్రస్తావిస్తూ తనను కూడా ఎన్‌కౌంటర్ చేసి ఒక నక్సలైట్‌ను చంపామని ప్రకటించే ఒక సంస్కృతిని ప్రభుత్వం ప్రోత్సహిస్తుందని, ఇది ప్రజాస్వామ్యానికి ప్రమాదమని ఉపన్యాసాల్లో పదేపదే చెప్తుతుండేవాడు. ఎమర్జెన్సీని వ్యతిరేకించడం, గూండాయిజం, ఆశ్రిత పక్షపాతం, రాజకీయ పార్టీల్లో ముఠాతత్వం, దగుల్బాజీతనం లాంటి అన్ని అంశాలపై గొంతెత్తి నిరసించడం ఆయనలోని ప్రజాస్వామిక స్వభావానికి తార్కాణం. ఆయన ఇట్లా అన్యాయాన్నెదిరించే తిరుగుబాటుతత్వాన్ని సామాజిక స్థాయిలోను, వ్యక్తిగత స్థాయిలోనూ ప్రదర్శించటంలోనూ అంతర్లీనంగా ఆయన ఆలోచనల్లో ఒక ప్రజాస్వామ్య భావన వ్యక్తీకరణ అవుతుంది.

దాదాపు డెబ్బై సంవత్సరాలు ప్రభుత్వంలోని అవకతవకలకు వ్యతిరేకంగా, సమాజంలోని అన్యాయాలపై ఆక్రోశించిన ఏకైక ప్రజాస్వామిక వాది కాళోజీ. ఆయన అన్యాయాలను వ్యతిరేకించడంలో, ఆస్తి పోగు చేసుకోవడంలో, అసమ సమాజంలో అక్రమ అర్జనలో, దౌర్జన్యంలో, రాజ్యం సంస్కృతిలో అప్రజాస్వామిక ధోరణుల్నే చూసాడు. ఇటువంటి అరుదైన, సహజమైన ఆలోచనాపరుడి ప్రజాస్వామిక ఆకాంక్షలను మనలో భాగం చేసుకొని మెరుగైన సమాజం కోసం మన వంతు కృషి చేయడమే ప్రజాస్వామిక హక్కుల కార్యకర్తల బాధ్యత.

*రచయిత సెల్: 98489 86286*

కాసుల ప్రతాపరెడ్డి

# వాళ్లూ- మనమూ- అతనూ



కాళోజీని యాది చేసుకుంటే తెలంగాణను యాది చేసుకున్నట్టే. తెలంగాణను యాది చేసుకున్నా కాళోజీని యాది చేసుకున్నట్టే. ఆయనకూ తెలంగాణకు విడదీయరాని అనుబంధం ఉంది. ఆయన ఎప్పుడూ బలహీనుల పక్షాన్నే ఉన్నారు. ఆయన కళ్లముందు డెబ్బయ్యేళ్ల తెలంగాణ కదిలిపోయింది. ఇందులో ప్రజల కన్నీళ్లు, అనేకానేక ఉద్యమాలు ఉన్నాయి. దగాపడ్డ తెలంగాణను తలుచుకుంటే ఆయన నిలువెల్లా కన్నీరవుతారు. ఇందులో భాగంగానే ఆయన కవిత్వం రాసినారు. ఆయన జీవితం నుంచి కవిత్వాన్ని వేరు చేసి చూడడం సాధ్యంకాదు. అట్లాగే, ఉద్యమాల నుంచి కూడా ఆయనను వేరు చేసి చూడలేం. అట్లని ఆయన ఏ ఒక్క సిద్ధాంతానికో కట్టుబడి పనిచేయలేదు. అట్లాగ కట్టుబడి పని చేయడాన్ని ఆయన ఇష్టపడలేదు.

"ఎన్నో రకాలుగా తమతమ ఆలోచనల పరిధిలోనే మార్గాన్ని నిర్ణయించి, ఆ మార్గాన్నే మనిషిని నడిపింపజేయాలనే మేధావి వర్గంలోని వ్యక్తుల కృషి, దానికి ఎన్నో ఇజాలు, చాదస్తాలు. ఇదంతా ఎందుకంటే మనిషి సహజంగా ఆలోచించి స్వంత నిర్ణయానికి రాకుండా చేయడానికి" అని ఆయనే చెప్పుకున్నారు. అంతేకాదు, "ఏదో సూత్రానికి, ఇజానికి కట్టుబడిపోయి జీవిస్తున్న ప్రాణాలకు స్వేచ్ఛా జీవనం సున్న" అని కూడా స్పష్టంగా చెప్పినారు. అందువల్లనే ఆయన ప్రజల పక్షాన జరిగిన ప్రతి ఉద్యమంలోనూ ఉండగలిగినారు. ప్రతి అన్యాయం పట్ల ఆగ్రహం వెలిబుచ్చినారు. పౌరహక్కులకు భంగం వాటిల్లినప్పుడు, రాజ్యహింస పెచ్చరిల్లినప్పుడు, ప్రభుత్వాలు నిరంకుశంగా వ్యవహరించినప్పుడు ఏ జంకూ గొంకూ లేకుండా, మొహమాటాలు లేకుండా ధైర్యంగా తన గొంతు విప్పినారు. ఇందులో భాగంగానే ఆయన కవిత్వం వెలువడింది. నిజానికి కాళోజీ 'కవి' కారు. కానీ, అంతకు మించినవారు. కబీరు, వేమనల వంటి ఒక సంతు. దోహాలు వినిపిస్తూ సమాజాన్ని జాగృతం చేసే ఆ సర్వసంగ పరిత్యాగుల లక్షణాలు కాళోజీకి, ఆయన కవిత్వానికి ఉన్నాయి. ఆధునిక కవుల్లో కవిత్వాన్ని ఒక ఆయుధంగా వాడుకున్న వచన కవులు కాళోజీ తప్ప మరొకరు లేరు. తనది కవిత్వం అవునా, కాదా అన్న మీమాంస ఆయనకు లేదు. తన కవిత్వాన్ని కవిత్వంగా గుర్తించలేకపోయినా ఆయనకు బాధేం లేదు.

> "మొత్తం మీద, ఒక సర్వసంగ పరిత్యాగి, తెలంగాణ సమాజం కోసమే నిరంతరం తపిస్తున్న ఒక సామాజిక కార్యకర్త, ఖలీల్ జీబ్రాన్, కబీరుదాసు వంటి కవి అయిన కాళోజీ కవిత్వమంతా ఒక పుస్తకంగా వచ్చింది. అది తెలంగాణకు ఒక వరంలాంటిది."

తెలంగాణ సామాజిక, రాజకీయ చరిత్రను, ముఖ్యంగా మనిషి జీవనచరిత్రను పట్టిచ్చే కాళోజీ కవిత్వాన్నంతటినీ ఒక దగ్గర చేర్చి హైద్రాబాద్, వరంగల్‌లకు చెందిన



సుప్రభాతం సంపాదకులు కె.వాసుదేవరావుతో...



కాళోజీ ఫౌండేషన్ వారు 'నా గొడవ' పుస్తకంగా వెలువరించినారు. దాదాపు 450 పేజీల పుస్తకం ఇది. దాదాపుగా కాళోజీ కవిత్వమంతా ఇందులో ఉంది. ఈ సంకలనంలో 1953లో మొదటిసారిగా అచ్చయిన 'నా గొడవ' సంపుటిలోని కవితల నుంచి 1966-67లలో జనరల్ ఎలక్షన్లను దృష్టిలో వుంచుకొని రాసిన 'పరాభవ వసంతం', 'పరాభవ శిశిరం' మొదలైన వాటితోపాటు 1962లో భారత, చైనా యుద్ధ సమయంలో రాసిన గేయాలు, 1975, 1977 మధ్య కాలంలో రాసిన కవితలు, 1969 తెలంగాణ ఉద్యమ కాలంలో రాసిన కవితలు ఉన్నాయి. కాళోజీ కవిత్వ సమగ్ర సంకలనం ఇది. ఈ పుస్తకానికి డాక్టర్ దాశరథి రంగాచార్య, వరవరరావు, బి.తిరుపతిరావు, తూర్పు మల్లారెడ్డి ముందు మాటలు ఉన్నాయి.

ఇందులో దాశరథి రంగాచార్య కాళోజీ సమకాలికులు, సన్నిహిత మిత్రులు. వరవరరావు కాళోజీని అత్యంత సన్నిహితంగా ఎరిగినవారు. తూర్పు మల్లారెడ్డి కాళోజీ సాహిత్యంపై అమూల్యమైన పరిశోధనను వెలువరించినవారు. ఇందులో తిరుపతిరావు మాత్రమే ప్రాంతీయంగా, సాహిత్యపరంగా కాళోజీకి దూరం.

నా గొడవ కవితా సంకలనానికి కాళోజీ తన దృక్పథాన్ని జంకూ గొంకూ లేకుండా చెప్పుకున్నారు. ఆయన తను నమ్మిన విశ్వాసాల కోసం జీవితాంతం నిలబడ్డారు; నిలబడుతున్నారు. ఏదో ఒక విశ్వాసానికి తాను కట్టుబడి లేనని ఆయనే చెప్పుకున్నారు. అయితే, కాళోజీ తెలంగాణకు కావాల్సిందేమిటో బాగా ఎరిగినవారు కాబట్టే ఆ విధంగా ఉన్నారని పిస్తుంది. తూర్పు మల్లారెడ్డి అన్నట్టు "కాళోజీ ప్రజాస్వామ్యవాది. రాజ్యాంగ బద్ధంగా ప్రజాస్వామ్య సూత్రాలకు అనుగుణంగా పాలన జరగాలనేది ఆయన నిశ్చితాభిప్రాయం." ఈ అభిప్రాయం వల్లనే ఆయన ఎక్కడా ఆగిపోకుండా, నిరంతర జీవనదిలా నిరసన గళం వినిపిస్తూ రాగలిగారు. అందుకే శ్రీశ్రీ- "యుద్ధంలో ఫ్రాన్స్ కవులంతా చెల్లాచెదురుగా పారిపోతే లూయీ ఆరగాన్ ఒక్కడే దేశంలో నిలబడి మహా ప్రజా విశ్వాసాన్ని వెల్లడించే గీతాలు రాశాడు. కాళోజీ లూయీ ఆరగాన్ వంటివాడు. తెలంగాణ మూగ జీవాల హృదయార్తిని ప్రతిబింబింపజేశాడు" అని ప్రశంసించినాడు.

కోస్తాంధ్రపై ఉన్న పాశ్చాత్య ప్రభావం తెలంగాణపై లేదు. అందుకే అక్కడ దేవులపల్లి కృష్ణశాస్త్రి వంటివారు భావ కవిత్వాన్ని పండిస్తున్న కాలంలోనే ఇక్కడ కాళోజీ వంటి వారు సామాజిక ప్రయోజనాన్ని ఆశించి కవిత్వం రాసినారు. కోస్తాంధ్ర వచన కవిత్వం లక్షణాలు తెలంగాణ కవుల కవిత్వంలో ఉండవు. కోస్తాంధ్ర కవులు, రచయితలు పాశ్చాత్య ప్రభావంలో, బెంగాలీ ప్రభావంలో పడిపోతే, ప్రజలకు అత్యంత సన్నిహితంగా, ఇంకా చెప్పాలంటే ప్రజల జీవితాల్లో భాగమైన ఉర్దూ, పార్సీ కవుల ప్రభావం తెలంగాణ కవులపై పడింది. వచన కవిత్వాన్ని మెరుపులతో, వ్యంగ్యంతో తెలంగాణ కవులు పండించడానికి కారణం ఇదే. ఇదే సంప్రదాయం కాళోజీది. పైగా కాళోజీది నానా భావాల సంగమం కాదు. ఆయనే ఒక లక్ష్యం కోసం నిలబడ్డారు. నిలబడుతున్నారు. ఆయనలో వైరుధ్యాలు లేవు. అట్లాగే ఆయన కవిత్వంలోనూ వైరుధ్యాలు లేవు.



కవి, కథకుడు, జర్నలిస్టు కాసుల ప్రతాపరెడ్డితో...

మొత్తం మీద, ఒక సర్వసంగ పరిత్యాగి, తెలంగాణ సమాజం కోసమే నిరంతరం తపిస్తున్న ఒక సామాజిక కార్యకర్త, ఖలీల్ జీబ్రాన్, కబీరుదాసు వంటి కవి అయిన కాళోజీ కవిత్వమంతా ఒక పుస్తకంగా వచ్చింది. అది తెలంగాణకు ఒక వరంలాంటిది.

"కాళోజీ జీవననది" పేర పుస్తకానికి వరవరరావు మంచి ముందు మాట రాసినారు. కాళోజీ సామాజిక దృక్పథాన్ని ఆయన కవితా నిర్మాణ పద్ధతిని, ఆయన కవిత్వంపై కనిపించే ప్రభావాలను ఆయన వివరించారు. కాళోజీ "నిరంతరం లేవదీసే చర్చ- పోరుడు" అని వరవరరావు చెప్పినారు. "జీవించడం ఆయన జీవన దృక్పథం. నది వలె, ప్రవాహం వలె" అని కూడా చెప్పినారు. వరవరరావు మార్క్సిస్టుల పరిభాషలో కాళోజీని ఆదర్శవాది లేదా మానవతావాది అన్నారు. ఈ వాదాలను మార్క్సిజం భావవాదంలో చేరుస్తుందని కూడా చెప్పినారు. బహుశా వ్యక్తివాదంలో చేరుస్తుందని కూడా చెప్పినారు. అయితే, మార్క్సిస్టులు, విప్లవకారులు, పౌరహక్కుల నేతలు చేయలేని పనులు ఎన్నో ఒంటి చేతితో చేసినారు. ఏ వాదం అయితేనేం పని జరగడం- ఆ పని బల హీనుల పక్షాన నిలబడి చేయడం ముఖ్యం కాదా? కాళోజీ ఏడు దశాబ్దాల రచనావ్యాసంగం, కార్యాచరణ తెలంగాణ మేధావులకు ఒక మార్గాన్ని చూపడం లేదా? తెలంగాణ పౌరహక్కుల ఉద్యమాలకు, సాంస్కృతికోద్యమాలకు కాళోజీ బాట తప్ప మరో మార్గం లేదని అనుభవంలోకి రాలేదా? మనం ఇదంతా ఆలోచించే స్థితిలో ఉన్నామా? ఒక్క కాళోజీయే నిరంతరం "మీ రాజ్యాంగాన్ని మీరు అమలుచేయండి, మీరంటున్న ప్రజాస్వామ్య విధానాలకు మీరు కట్టుబడి ఉండండి" అని అడుగుతుంటేనే ఇంత ప్రభావం ఉన్నదే! అందరూ ఒకటై కేవలం కాళోజీ నినదిస్తున్న ఆదర్శం కోసం పనిచేస్తే ఇంకెలా ఉంటుంది? కాళోజీ కవి త్వం, ఆచరణ గురించి మాట్లాడాల్సి వచ్చినప్పుడు ఆయన మార్గం గురించి మనం మాట్లాడకుండా ఉండలేం. అందుకే ఈ మాటలు.

*(కాసుల ప్రతాపరెడ్డి వ్యాసాల సంపుటి 'కొలుపు' లోంచి)*

*రచయిత సెల్: 98489 56375*





'దాసి' సుదర్శన్

పీడిత, తాడిత ప్రజల వేదనలూ,
రోదనలు తనవిగా పలవరించి,
సమాజంలోని అవినీతి,
అసమానతలూ, దోపిడీ
దౌర్జన్యాలను నిరసించి పామర
పండితులందరికీ అర్థమయ్యే
రీతిలో అందించిన ప్రజాకవి
కాళోజి. మనకోసం మళ్లీ జన్మించిన
యోగి వేమన అంటే అతిశయోక్తి
కాదనుకుంటా.



# ఈకాలపు వేమన మన కాళోజి

లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్ మరణించిన సందర్భంగా ఇది కాళోజి రాసిన మినీ కవిత అయినప్పటికీ జీవితాంతం ప్రజల పక్షాన నిలిచి, మన గొడవను తన గొడవగా ప్రకటించిన ప్రజాకవి కాళోజికి కూడా ఇది బాగా వర్తిస్తుందనడం అక్షర సత్యం.

నిజాం నిరంకుశ పాలనకూ, దొరలూ, పెట్టుబడిదారుల దౌష్ట్యాన్ని వ్యతిరేకించి జైలు జీవితాన్ని, లాఠీదెబ్బలనూ చవి చూసిన కాళోజి అన్నార్తుల పరివేదనే తన నినాదంగా దోపిడీ పీడనలకు, పేదరికం నిర్మూలనకూ పోరాటమే సరైన మార్గమని వేదికలపై నినదించినాడు.

"అవనిపై జరిగేటి అవకతవకలు చూసి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు" అని అనునిత్యం పరితపించిన కాళోజిని పలకరిస్తే చాలు గుండెల నిండా ఆర్ద్రత... కన్నుల నిండా జలపాతాలు... స్వాతంత్ర్యోద్యమం, సాయుధ రైతాంగ పోరాటం, ఆంధ్ర మహాసభలు, ఆర్యసమాజం, పౌరహక్కుల సంఘం... ఇట్లాంటి అనేకానేక ప్రజా ఉద్యమాలలో ప్రత్యక్షంగా పాల్గొన్న మన కాళన్న ఏడు దశాబ్దాల ఉద్యమాల చరిత్రకు సాక్షీభూతమై నిలిచినారు.

బతుకు పట్ల మమత, గౌరవం, విలువ,నిత్య చైతన్య స్పృహ కలిగి ఉన్న కాళోజి ప్రభావానికి లోనుకాని తెలంగాణా కవులు అరుదు. తెలంగాణ సామెతలు, నుడికారాలు, పలుకుబడులతో సులభ గ్రాహ్యంగా ఉండే ఆయన కవితా, సాహిత్య రూపాలు అన్ని వర్గాల పాఠకుల మనసుకు సూటిగా తాకుతాయి. దశాబ్దాల క్రితం వివిధ సందర్భాలలో రాసిన కాళోజి కవితలు, గేయాలలోని అప్పటి సమస్యలు, సందర్భాలూ ప్రస్తుత కాలంలో కూడా చాలావరకు యథాతథంగా ఉండడం మన దౌర్భాగ్యం. ఏడు దశాబ్దాల పాటు వివిధ ప్రక్రియల్లో రచనా వ్యాసంగం సాగించిన ప్రజాకవి కాళోజి. 1948లో బైరాన్‌పల్లి ప్రజలపై రజాకార్లు జరిపిన అత్యాచారాలపైన...

సారస్వత పరిషత్తు ప్రథమ వార్షికోత్సవాల సభల ఏర్పాట్లను రజాకార్లు ధ్వంసం చేసినప్పుడు...

ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు శాఖాధిపతిగా ఉన్న రాయప్రోలు సుబ్బారావు 1943లో తెలంగాణా ప్రజల నిజాం వ్యతిరేకోద్యమంలో పాలుపంచుకోనందుకు అధిక్షేపిస్తూ గేయాలు రాసినారు.

1959లో ఎం.ఎల్.సి.గా ఉన్న కాళోజి అప్పటి ముఖ్యమంత్రి ప్రవేశ పెట్టిన బడ్జెట్ ప్రతిపాదనపై ఘాటుగా స్పందించి 'అంకెల గారడి' అని గేయం రాసుకున్నరు. నీలం సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి, జలగం వెంగళ రావు వంటి ముఖ్యమంత్రులకు కాళన్న తన సహజమైన వ్యంగ్య ధోరణిలో చురకలంటించినారు. సురవరం ప్రతాపరెడ్డి, జమలాపురం కేశవరావు, కొత్వాల్ వెంకట్రామ రెడ్డి, రావి నారాయణరెడ్డి మొదలు మహాకవి శ్రీశ్రీ, సి.నా.రె., దాశరథి వంటి ప్రముఖ కవులను అభినందిస్తూ, విమర్శిస్తూ గేయాలూ, కవితలను రాసినారు.

1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమకాలంలో ప్రజాకవి కాళోజి స్పందించిన తీరు నాలుగున్నర దశాబ్దాల తర్వాత ప్రస్తుత ఉద్యమకారులు సైతం ఉద్యమ స్ఫూర్తిని, ఉత్తేజాన్ని నింపేవిగా ఉండడం ఆశ్చర్యమే మరి.

"ప్రత్యేక తెలంగాణా అంటే/ పక్కలిరగ తన్నేందుకు/
ఆం.ప్ర. రాష్ట్ర ప్రభుత్వానికి/ అధికారం ఎక్కడిది?" అని నిలదీసినాడు.

"దోపిడి చేసే ప్రాంతేతరులను/ దూరము దాకా తన్ని తీరుతం/

ప్రాంతం వాడే దోపిడి చేస్తే/ ప్రాణంతోనే పాతర వేస్తం/"

అని అప్పుడే హెచ్చరించిందు. 'తెలంగాణ వేరై నిలిచి భారతాన వెలయు ముమ్మాటికి' అని ప్రగాఢమైన విశ్వాసాన్ని ప్రకటించిందు మన కాళన్న.

తెలుగు భాష ఎన్ని తీర్లో, తెలుగు యాస ఎన్ని తీర్లో 'నా గొడవ'లో సవివరంగా వివరించినారు. "ఉచ్చరించేదే ఉచ్చారణ. రాసింది దస్తూరి. అందరి దస్తూరి ఒక్క తీరుగ ఉండదు. ఎవరి దస్తూరి వారిదే అని ఒప్పుకున్నప్పుడు ఎవరి ఉచ్చారణ వారిదే అని కూడా ఒప్పుకోవాలి. ఉచ్చారణ తీరును బట్టి అక్షర రూపం మారుతుంది. కృష్ణా, గుంటూరు జిల్లాలకు సంబంధించిన చదువుకున్న కుటుంబాల వారు మాట్లాడుకునే భాషనే విలేకరులు రాస్తున్నారు. దాన్నే ప్రామాణిక భాషగా గుర్తించడమనేది చాలా తప్పు. పేపరోళ్ళ భాష పేదోడిది కాదు.

వరంగల్ భాషను కృష్ణా, గుంటూరు జిల్లాలపై రుద్దినా అక్కడి భాషను ఇక్కడ రుద్దినా అన్యాయమే. ఈ విషయంలో తెలంగాణాకు ఎంతో కొంత అన్యాయం జరిగింది.

"గద్దరు, వంగపండు రాసేది, మాట్లాడేది సామాన్యుల భాష. అందుకే వాళ్ళవి అర్థమవుతాయి. భాష యొక్క మాధుర్యం, సౌందర్యం అప్పుడే అర్థమవుతాయి" అని 2000 సంవత్సరంలో ఈ వ్యాసకర్తకు ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో కాళోజి చాలా స్పష్టంగా తెలిపారు.

ఎంత పెద్ద సభైనా, ఎంతటివారితో అయినా నిర్మొహమాటంగా, నిక్కచ్చిగా తన అభిప్రాయం చెప్పటం కాళోజి సహజ స్వభావం. నేను నాగార్జునసాగర్లో నిర్వహించిన గురజాడ వర్ధంతి- రావిశాస్త్రి సంస్మరణ సభల్లో ఒక యేడాది కాళోజి ముఖ్యఅతిథిగా పాల్గొనడం.

నాకు కాళోజిని ఇంటర్వ్యూ చేసే అవకాశం రావడం, మడికొండలో ఘనంగా జరిగిన కాళోజి 87వ జన్మదిన వేడుకలలో నేనూ పాల్గొనడం, కాళోజి ఇంట్లో జరిగిన సంబరంలో పాలుపంచు కోవడం, నా జీవితంలో మరిచిపోలేని గొప్ప సంఘటనలు. కాళోజితో నా అనుభవాలనూ, జ్ఞాపకాలనూ ఈ సందర్భంగా మరో సారి మననం చేసుకునే అవకాశం రావడం సదవకాశంగా భావిస్తాను.

1993 డిసెంబరు 4, 5 తేదీల్లో నా ఆధ్వర్యంలో నాగార్జునసాగర్లో 'అల' కళల వేదిక నిర్వహించిన 'మహాకవి గురజాడ వర్ధంతి- రా.వి.శాస్త్రి సంస్మరణ' సభలకు ప్రజాకవి కాళోజి ముఖ్యఅతిథిగా హాజరయినారు. ప్రతి యేటా ఈ సందర్భంగా ఓ పెద్దాయనను సన్మానించుకోవడం ఆనవాయితీగా వస్తుంది. ఈసారి కాళోజిని సన్మానించుకోవాలను కున్నాము. అదే విషయం కాళోజికి విన్నవించాం. సన్మానానికి కాళోజీ నహీ అన్నారు. సభలో పాల్గొన్న పెద్దలు డాక్టర్ అమ్మంగి, నోముల, జ్వాలాముఖి ఇత్యాది ప్రముఖులు నిరుత్సాహపరచకండి అని కాళోజీని ఒప్పించడం జరిగింది. ఆ రకంగా కాళన్నను సన్మానించుకొన్నాము.



*కాళోజీ పక్కన లోకేశ్వర్, మరో సృజనశీలి*

సన్మానం తర్వాత గురజాడ మీద ఉపన్యాసం ప్రారంభించిన కాళోజి 'గురజాడ వర్ధంతి ఏందో.. కాళోజికి సన్మానం ఏందో! ఇదేం పనిరా!' అని విసుక్కున్నారు. గురజాడ గురించి మాట్లాడుతూ క్రాంతదర్శి గురజాడ కన్యాశుల్కం రచించి నూరేళ్ళు గడిచినప్పటికి అది నిత్య నూతనంగా నిలిచి ఉందని, కన్యాశుల్కం నాటకంలోని అద్భుతాలు రోజురోజుకూ ఓ కొత్త కోణంతో బయటకు వస్తున్నాయన్నారు.

ఎక్కడైనా సరె అన్యాయాన్ని ఎదిరిస్తే నా గొడవకు సంతృప్తి అంటూ ముగించారు.

గురజాడ సభలు జరిగిన ఆ రెండు రోజులు తుఫాను వాతావరణం నెలకొంది. ఎడతెరిపిలేని వర్షం కురుస్తుంది. ఈ వాతావరణంలో జరిగిన సభలకు గురజాడ- రావిశాస్త్రి గారలపై గౌరవంతోనూ, నా పట్ల ప్రేమతోనో వర్షంలో తడుస్తూ, చలిగాలికి ఓర్చి, ప్రకృతి బీభత్సాన్ని వెక్కిరిస్తూ ఆహ్వానించిన ప్రముఖులందరూ హాజరై సభలను జయప్రదం చేసిన సంఘటన ఇరవై ఏళ్ళు గడిచినా ఇప్పటికీ నా మదిలో తాజాగా మెదులుతుంది.

నా అభ్యర్థన మేరకు ప్రముఖ కవి, ఆత్మీయ 'జయమిత్రులు', కాళోజికి అత్యంత సన్నిహితులు అయిన వి.ఆర్.విద్యార్థి దంపతులు, మంకీ క్యాపు, స్వెట్టరు, శాలువాలతో, పొత్తిళ్లలో పసిపాపను తెచ్చినట్లు అతి జాగ్రత్తగా కాళోజిని వరంగల్ నుండి సాగర్కు కారులో తీసుకొచ్చినారు.

అతిథులందరూ మా ఇంట్లోనే విడిది చేసారు. నా శ్రీమతి స్వతంత్ర చేతి వంటను ఎంతో యిష్టంగా ఆరగించారు. కాళోజి వేడివేడి చపాతీకి



*గురజాడ గురించి మాట్లాడుతూ క్రాంతదర్శి గురజాడ కన్యాశుల్కం రచించి నూరేళ్ళు గడిచినప్పటికి అది నిత్య నూతనంగా నిలిచి ఉందని, కన్యాశుల్కం నాటకంలోని అద్భుతాలు రోజురోజుకూ ఓ కొత్త కోణంతో బయటకు వస్తున్నాయన్నారు.*




రచయిత్రి కె. రామలక్ష్మితో...


విరసం సభల్లో ప్రసంగిస్తున్న కాళోజీ


అఫ్సర్ అలీ ఇంజనీరుతో...

బాగా నెయ్యి పట్టించి, పంచదార జోడించి తృప్తిగా తినడం చూసి ఎంత ఆనందపడ్డామో. నా శ్రీమతి చేసిన మునక్కాయ చారు, కూరలు చాలా బాగున్నాయని నిదానంగా, యిష్టంగా భోం చేసిన తర్వాత బయట చినుకు లు పడుతున్నాయి, ఇందులో చేతులు కడుక్కోండని ఒక బేసిన్ ఉంచితే పుక్కిలిచ్చి ఉయ్యొద్దరా? అని గడపలో నిలబడి బయట పుక్కి లించి, చేతులు కడుక్కున్నారు కాళోజి. ఈ జ్ఞాపకాలను ఎవరు మాత్రం ఎట్లా మరచిపోగలరు.

రెండువేల సంవత్సరంలో వరంగల్‌లో కవి మిత్రులు వి.ఆర్. విద్యార్థి గారు ఒక టేప్‌రికార్డర్ సమకూర్చి కాళోజీగారింట్లోనే వార్త పత్రిక కోసం అయిదారు గంటలపాటు కాళోజిని సావకాశంగా ఇంటర్వ్యూ చేసే అవకాశం కల్పించారు. కాళోజితో అంత సన్నిహితంగా ఎన్నెన్ని విషయాల మీదనో ఇంటర్వ్యూ చేయడం. ఆయన భావోద్వేగాలను, ఫీలింగ్స్‌ను పంచుకున్న సందర్భం మాటలకందని అనుభవం.

కాళన్న 87వ జన్మదిన వేడుకల్లో పాల్గొనడానికి నేనూ, డాక్టర్ నోముల, వేణు సంకోజు ఒక రోజు ముందే వరంగల్లుకు చేరుకున్నాం. కవులు, కళాకారులు, అభిమానులతో కాళన్న ఇల్లు, పరిసర ప్రాంతాలూ, పండగ వాతావరణంతో కళకళలాడుతుంది. ప్రొఫెసర్ జయశంకర్, శంకరన్, చలసాని ప్రసాద్, రత్నమాల, ప్రొఫెసర్ బియ్యాల జనార్దనరావు, నాకు తెలియని అనేకమంది ప్రముఖులు రావడం కాళోజీ దంపతులను అభినందించడం అందరితో కలిసి కాళన్న ఎంతో ఉత్సాహంగా మాటా ముచ్చట్లతో గడపడం చూస్తే ఎంతో ఆనందమనిపించింది. ఆ సాయంత్రం పేరు తెలియని ఓ గొప్ప కళాకారిణి సుమారు గంటన్నర పాటు వీణ కచేరి చేసి వినిపించిన శాస్త్రీయ సంగీతం అందరినీ మంత్రము గ్ధులను చేసింది. తర్వాత తెలిసింది ఆ కచేరీ చేసిన కళాకారిణి రత్నమాలగారి కూతురని.

మడికొండ హైస్కూల్లో కాళోజి 87వ జన్మదిన వేడుకలు వందలాది మంది అభిమానుల మధ్య 9.9.2000 రోజు అత్యంత ఘనంగా జరిగినై. అన్ని దారులూ మడికొండకే అన్నట్లు తెలంగాణా అన్ని జిల్లాల నుండి విశాఖ, ఇతర ఆంధ్రా ప్రాంతాల నుండి కవులు, అభిమానులు తరలి వచ్చారు. నేను కాళోజీతో చేసిన ఇంటర్వ్యూ అదే రోజు వార్త మెయిన్ పేజీలో వచ్చింది. వేదిక మీద ఉన్న అతిథులు సామల సదాశివ, పేర్వారం జగన్నాథం వంటి పెద్దలు నీ ఇంటర్వ్యూ బాగుంది, ఈరోజే పత్రికలో రావడం చాలా ఆప్ట్‌గా ఉందని మెచ్చుకున్నారు. చాలామంది చేతుల్లో అదే పేపరు కనిపించడం, నన్ను కలిసి మీరేనా ఈ ఇంటర్వ్యూ చేసిందని కనుక్కుని అభినందించిన ఆనాటి సన్నివేశం గుర్తుకొచ్చినపుడల్లా చెప్పలేని సంతృప్తి, ఆనందం కలుగుతుంది.

తెలంగాణా ఉద్యమం గురించి ఏ ఇద్దరు తెలంగాణావాదులు కలిసి మాట్లాడుకున్నా పిల్లల నుండి పెద్దల వరకు తక్షణం గుర్తుకొచ్చేది ప్రొఫెసర్ జయశంకర్, ప్రజాకవి కాళోజీల పేర్లే. ఈ నేపథ్యంలో....

కాళోజి, జయశంకర్ సార్లు భౌతికంగా మన మధ్య ఉండి ఉంటే తెలంగాణా ప్రకటన పట్ల, ఏవిధంగా స్పందించేవారో... తెలంగాణా ప్రజలకు ఎలాంటి మార్గదర్శనం చేసేవారో అనిపిస్తుంది.

చిరంజీవి కాళోజికి జయహో...
మన కాలపు వేమనకు జయహో...
శత వసంతాల కాళన్నకు జయహో... జయహో!







డా॥ పగడాల నాగేందర్

కాళోజీ సహజ కవి.
స్వేచ్ఛ ఊపిరిగా బతికిన కవి.




కాళోజీ తన ఆత్మకథలో చెప్పుకున్నట్టు "మొదటి ప్రపంచ యుద్ధంతో పాటు నేను భూమి మీద పడ్డను. 9.9.1914"న

ఈ భూమి మీద పడ్డది మొదలు, ఆఖరి శ్వాస విడిచేదాక కాళోజీ స్వేచ్ఛే ఊపిరిగా బ్రతికిన మనిషి.

కాళోజీ ప్రజల నాలుకల మీద నాలుగు కాలాల పాటు నిలబడే కవిత్వం రాసాడు. అందరికీ అర్థమయ్యే భాషలో 'అభినవ వేమన'లా రాసాడు. సంప్రదాయ బద్ధమైన కవిత్వాన్ని ద్వేషించి, వాడుక భాషలో కావాలనే అకవిత్వం రాసిన మేధావి ఆయన. కవిత్వాన్ని సామాన్యుని ముంగిట నింపడానికి ఆయన ఆ శైలిని ఎన్నుకున్నారు.

నిజాం రజాకారుల దురాగతాలపై ఆయన రాసిన 'కాటేసి తీరాలె' కవిత నాకు బాగా ఇష్టమైన కవిత.

**"మన కొంపలార్చిన మన స్త్రీల చెరచిన**
**మన పిల్లలను చంపి మనల బంధించిన**
**మానవాధములను మండలాధీశులను**
**మరిచి పోకుండగ గురుతుంచుకోవాలె.**
**కసి ఆరిపోకుండ బుసకొట్టు చుండాలె**
**కాలంబు రాగానే కాటేసి తీరాలె**

**.......**

**కనుగీటిన కళ్ళ కారాలు చల్లాలె/ తన్నిన కాళ్ళను 'దాకలి'గ వాడాలె**
**కందకందగ కోసి కాకులకు వెయ్యాలె/ కాలంబు రాగానే కాటేసి తీరాలె"**

ఎంత కోపం, ఎంత కసి ఈ కవిత్వంలో. ప్రజాగ్రహాన్ని తన కలంలో నింపుకోవడం కాళోజీకే సాధ్యమైన ప్రక్రియ.

ముఖ్యంగా కాళోజీ పుట్టి పెరిగిన గడ్డ 'తెలంగాణ' విముక్తి కోసం, ఆయన కలం నిజాల్ని నిప్పురవ్వల్లా ప్రజ్వలింపజేసింది. ఏ మొహమాటం లేకుండా మాట్లాడాల్సిన సమయంలో, ధైర్యంగా మాట్లాడిన పెద్ద మనిషి ఆయన. కోస్తాంధ్ర ప్రభుత్వాల కుట్రల్ని తన కవిత్వంలో విప్పి చెప్పారు. ఎంతో ముందుచూపుతో ప్రాంతీయ దోపిడిని ఖండించాడు.

**"దోపిడి చేసే ప్రాంతేతరులను/ దూరం దాకా తన్ని తరుముతం**
**ప్రాంతం వాడే దోపిడి చేస్తే/ ప్రాణంతోనే పాతర వేస్తం"**

అని స్పష్టంగా చెప్పిన తెలంగాణా కవి కాళోజీ.

కాళోజీ రచనలన్నింటిలో నాకు బాగా నచ్చింది 'ఇదీ నా గొడవ" అనే ఆయన ఆత్మకథ. ఏ శషభిషలు లేకుండా ఉన్నది ఉన్నట్టుగా, కుండ బద్దలు కొట్టినట్లుగా చెప్పే ఆయన వ్యక్తిత్వం మనల్ని కట్టి పడేస్తుంది. విశాలాంధ్రలో తెలంగాణ భాషకు జరిగిన అన్యాయాన్ని, వాళ్ళు మనల్ని అవహేళన చేసిన తీరును తన ఆత్మకథలో కాళోజీ అద్భుతంగా వివరిం చారు. కాళోజీ మాటల్లోనే... "అరబ్ దేశం నుంచి వచ్చి ఇరవై తరాలైనా, గొప్పగా 'మేం సీదా అరేబియా నుంచీ వచ్చిన వాండ్లం' అని చెప్పు కుంటూ... ఇక్కడి వాళ్ళకి మా ఉచ్చారణ ఏమొస్తది, ఏం మాట్లాడతరు? అని ఈసడిస్తరు- బెజవాడ వాండ్లు, సర్కారు జిల్లాల వాండ్లు మమ్మల్ని "మీకు తెలుగేం ఒస్తుంది" అన్నట్టు. వీడు తెలుగు రాదంటడు, వాడు ఉర్దూ రాదంటడు, మరోడు ఇంగ్లీషు రాదంటడు. మరి మన కొచ్చేదిదే మిటని ప్రశ్న. ఇక్కడి యాసను కూడా 'నీ యాస పనికి రాదు' అనబట్టె" అని ఆవేదన వ్యక్తం చేసారాయన.

భద్రిరాజు కృష్ణమూర్తి లాంటి భాషాశాస్త్రవేత్తలు తెలంగాణ భాషను, యాసను గౌరవించారు. భాష తొలి రూప మాండలికమే, యాసే నని ఘంటాపథంగా చెప్పారు. అంత గొప్ప భాషా శాస్త్రవేత్తలకు దొరకని, వారు పట్టుకోలేని జీవిత సత్యాలని తన ఆత్మకథలో ఉన్నది ఉన్నట్టుగా ఆవిష్కరించాడు కాళోజీ. తెలంగాణ ఉద్యమానికి పాదులు తీసి, నీరు పోసి పెంచి పెద్ద చేసి, పందిరిని నిర్మించి, ఫలాలు ఆరగించకుండానే వెళ్ళిపోయిన మహానుభావుడు కాళోజీ నారాయణరావు. కాళోజీ ఆత్మకథ ఎన్నోసార్లు చదివాను. ఈ వ్యాసం రాయడానికి మరోసారి చదివాను. శ్రీశ్రీ మహాప్రస్థానానికి చలం యోగ్యతా పత్రంలాగా, కాళోజీ ఆత్మకథకు వరవరరావు ముందుమాట సరిగ్గా సరిపోయింది, నన్ను అమితంగా ఆకట్టుకుంది. వరవరరావు అన్నట్లు, ఎవరైనా హనుమకొండకు పోతే అక్కడ ముఖ్యంగా చూడవల్సినవి రెండు

1. వేయిస్థంభాల గుడి- అణగారిన శ్రమజీవులు సృష్టించిన కళా ఖండం. 2. కాళోజీ- అణగారిన శ్రమజీవులు నిర్మిస్తున్న పోరాట చరిత్రతో పాటు నడుస్తున్న బతుకంతా దేశానిదైనా మనిషి.

నిజంగా ఈ మాటలు అక్షర సత్యాలు. అతిశయోక్తి లాగా అనిపించే కఠోర వాస్తవాలు. అందుకే ఈ ఆత్మకథ మనల్ని కుదురుగా కూర్చోనీదు. నిలువనీదు. కాళోజీ మాటలు, వాటిలోని తెలంగాణ యాస మన అంతరాంతరాలలోని పురాతన జ్ఞాపకాలని మేలుకొల్పుతుంది. కాళోజీ గారికి పి.వి.నరసింహారావులాంటి గొప్ప రాజకీయ నాయకుల స్నేహం వుంది. దేన్నీ తన స్వార్థానికి ఉపయోగించని మహానుభావు డాయన. అందుకే ఇలాంటి ఉన్నతమైన వ్యక్తిత్వమున్న కాళోజీ శతజయంతి ఉత్సవాల నిర్వహణ ఏడాది పొడుగునా ఘనంగా జరగాలని ప్రముఖ సినీ దర్శకులు బి.నరసింగరావు సంకల్పించడం ఎంతయినా ముదా వహం. కాళోజీ స్ఫూర్తిని ఈతరం అందిపుచ్చుకోడానికి ఈ ఉత్సవాల నిర్వహణ ఉపకరిస్తుంది. ఆ దిశగా కాళోజీ రచనల మీద, జీవిత ఔన్నత్యం మీద.

కాళోజీది తెలుగునాట, తెలంగాణ నేలమీద విశిష్ట వ్యక్తిత్వం. అలాంటి అరుదైన వ్యక్తిత్వం గల మహానుభావులు మళ్ళీ మనకు కనబడరు.

*రచయిత సెల్ నెం: **98498 72230***

చింతపట్ల సుదర్శన్



*"Ring the bells back ward! I am allon fire*
*Not all the buckets in a country quire*
*Shall quench myrage. A poet should be feared*
*When angry, like a courets flaming beard"*

అన్నాడు Satirist Cleveland. కాళోజీ కవితా తత్వమూ యిదే!

నేను ప్రస్తుతాన్ని
నిన్నే నివురు కప్పిన నిప్పుకణాన్ని
నేటి రాజిన రోజుని
నిగనిగలాడే నెగణ్ణి
రేపును రేపే దగణ్ణి

అధిక్షేప కవి సమాజాన్నీ రాజకీయాలనూ వెక్కిరిస్తాడు. ఈ వెక్కిరింత ఒక్కొక్కసారి నవ్వించినా ఆ నవ్వు అగ్నికణాల మీద నివురులాంటిదే. వ్యంగ్యం, అధిక్షేపం కవికి సాహసోపేతమైన విప్లవతత్వాన్ని సమకూరుస్తాయి. కవి శృంఖలాల్ని తెంచివేసి విశ్వమంతా తన 'వాణి' వినేటట్లు చేస్తాడు. సర్వతంత్ర స్వతంత్ర మనస్తత్వం వుండటం వల్ల సమాజాన్నీ, వ్యక్తుల్నీ ఆఖరుకి భగవంతుణ్ణీ నిర్మొహమాటంగా ప్రశ్నిస్తాడు. ఎవరినీ లక్ష్యపెట్టడు. సత్యాన్ని స్పష్టంగా, సులభంగా, సూటిగా చెప్పేస్తాడు.





కాళోజీ కవితలో గుండెచప్పుడు వినిపిస్తుంది. గుండె లయబద్ధంగా కొట్టుకున్నట్టు ఆయన కవితా పంక్తులు శబ్దిస్తవి. అవి ఒక్కోసారి గేయాల వుతవి, సూక్ష్మ కవితలవుతయి మొత్తం మీద సమాజపు దుర్మార్గాన్ని తూర్పారబడ్తయి. అది ఒక్కోసారి ఏదో ఒక పద్ధతిననుసరిస్తయి. ఒక్కోసారి యే పద్ధతినీ అనుసరించవు. అన్ని కవితల్లోనూ 'ప్రాణశక్తి' ఒక్కటే అవి చిన్నవీ కావచ్చు పెద్దవీ కావచ్చు.

కాళోజీ కవితల్లో దీర్ఘమైన కవితలు నూరు పంక్తులు దాటిన కవితల్లోనూ నిరాటంకంగా చదివించే గుణం వుంటుంది. కనిపించని Magical Music వుంటుంది. కాళోజీ దీర్ఘ కవితలుగా చెప్పుకోవలసినవి తొమ్మిది కవితలు. నా గొడవ- 2 పరాభవ వసంతం మార్చి 1966లో గణనాయకా! యాదగిరి యాది నా గొడవ- 4 పరాభవ వర్షం జూలై 1966లో మళ్లీ విప్లవం రావలె, నా గొడవ- 5 పరాభవ శరత్తు అక్టోబర్ 1966లో ప్రజా గజేంద్రుని మొర దిగులు, భువనేశ్వర తీర్మానం, నా గొడవ- 6 పరాభవ హేమంతం డిసెంబర్ 1966లో నేస్తం మనకేమి భయం! నేతలు ఇవ్వగలరభయం, దేశపు గోడు, నా గొడవ- 7 పరాభవ శిశిరంలో 'ఆ కళ్ళు'. ఈ దీర్ఘ కవితల్లో రాజకీయాల ప్రస్తావన ఉంటుంది. సమాజం లోని రుగ్మతలు, సంఘం ఒక సిండికేటుగా మిండమొగనిగా మారడం, బచ్చానేతలు, ప్రజాసేవకుల కుహనాతత్వం, పార్లమెంటు డెమొక్రసీ, సోషలిజం, జాతీయ ఆదాయం, తలసరి ఆదాయం, పంచవర్ష ప్రణాళికలు మొదలగు వాటి ప్రస్తావన ఉంటుంది. క్రోధం, ఆక్రోశంతో పాటు ప్రజా గజేంద్రుడ్ని పట్టి పీడిస్తున్న ప్రభుత్వ మకరి నుంచి ప్రజాస్వామ్యాన్ని రక్షించు కుందాం అన్న సందేశం ఉంటుంది.

వీటిల్లో నా గొడవ-2 పరాభవ వసంతం మార్చి 1966లోని 'గణ నాయకా!', 'యాదగిరి యాది' కవితలను వివరణాత్మకంగా పరిశీలిద్దాం.

'ఇది మా వెత/ ఇది నీ కత'

అని కాళోజీ ముగించిన గణనాయకా కవితలోని వాక్యాలు ఈ కవిత గణనాయకుడి కతతోపాటు సామాన్య జనం వెత కూడా ఉన్నది. రెండు అంశాలనీ Simulataneous గా నడిపిస్తాడు. వినాయకుడి కతలో నేతల బండారం బయటపెడ్తాడు. ఆ నేతల కారణంగా జన అగచాట్లు యేమిటో వివరిస్తాడు. నూట ఇరవైకి పైగా పంక్తులున్న ఈ కవితలో గణనాథునికి సముచిత స్థానం యిస్తూనే ఆయన అనుచరులు, వాహనమైన ఎలుకల రూపంలో వుండి ఎన్ని ఆగడాలు చేస్తున్నారో చెప్తాడు.

వినాయకుడ్ని ప్రార్థిస్తూ మొదలవుతుందీ కవిత. గణనాయక, విఘ్నే శ్వర, వక్రతుండ, ఏకదంత, లంబోదర అని సంబోధిస్తూ ఆయన రూపాన్ని తనది మాత్రమే అయిన శైలిలో వర్ణిస్తాడు.

అడ్డంకుల దొడ్డోడా/ వంకర మొగము కలాడా
ఒంటి పంటి మొనగాడా/ కడలి కడుపు సామి! దొరా!

విఘ్నాలు కలిగించే అడ్డంకుల దొడ్డోడితో నీ బొజ్జ నింపనిది యే పనీ సాగదు, నిన్ను మెప్పించితే తప్ప యే పనీ కాదు అందుకే నీ తండ్రి చేదు గొంతు శివుడి కంటే నువ్వంటేనే అందరికీ భయం. ఆయన ఎప్పుడో ప్రళయం వచ్చినప్పుడు కదా 'కొసరు' కన్ను తెరిచేది. నువ్వు మాత్రం అడుగడుగునా అడ్డం పడతావు.

'నీ అడ్డము లేకుండిన/ ఏ అడ్డము లేదు మాకు'

అంటూ గణనాథుడ్ని మెప్పించి, ఆయన తండ్రి శివయ్య ప్రస్తావననూ తీసుకువచ్చి తరువాత ఆయన వాహనాన్ని గురించి చెప్తూ 'నీ వాహనాన్ని చూస్తే మా గుండెలే ఆగిపోతయి' అనీ అందుకు కారణాలని ఏకరువు పెడ్తాడు. ఈ సందర్భంలో వినాయకుడి వాహనమైన ఎలుకకీ, శివుడి



వాహనమైన నందికీ తేడా గురించి 'ప్రళయ భీకరాకారుడు ఆ రుద్రుడు, భూతప్రేత పిశాచాల నాయకుడికి వాహనమైన నందీశుడికి ముక్కుతాడు వేసి బండ చాకిరీ చేయించగల బలం మాకుంది. కానీ నీ వాహనమూ దాని సంతానమూ క్షుద్ర ప్రాణులే కానీ మా తలలపైన తైతక్కలాడుతాయి' అంటాడు. ఎలుకలలో రకాలని వాటి ఆగడాలని హాస్యం జోడించి చెప్తాడు.

చిట్టెలుకలు పొట్టెలుకలు/ పందికొక్కు సమూహాలు
ఆడవెలుకలు కొండ వెలుకలు/ చుండెలకలు మెత్తన గాళ్లు
వేలూ లక్షలు కోట్లు/ పిల్లుల చెవులను కొరుకుచు
ఎల్లెడలను తిరుగాడగ/తల్లడిల్లు సామాన్యుల
సంగతి ఏమని చెప్పను?

ఎలుకలు సామాన్యులను తల్లడిల్లేట్టు చేయడమేమిటో కూడా విశదీకరి స్తాడు. అవి మా జేబులు తమ చిరు 'పన్నుల' కత్తెరలతో కత్తిరిస్తున్నయి. నీకు ఒకే దంతం వున్నా నీ వాహనానికీ వాటి సంతానానికీ ఉన్న పళ్ళ తో అవి దేన్నైనా మటుమాయం చేస్తాయి. వినాయకుడి 'సవారి' సంతానం ఎడతెగనిది, ఎటు చూస్తే అటు ఎక్కడ పడితే అక్కడ పాగా వేసి ఆహార భాండాగారాన్నే కాదు జ్ఞాన భాండారాన్ని (పుస్తకాల్ని) కూడా దిగ మింగేస్తు న్నాయి. మా గోడల కన్నాల్లో తల ఎత్తి చూస్తయి. కిచకిచమని ఇగి లిస్తూ మమ్మల్ని 'సవాల్' చేస్తయి. వాటిని ఎదిరించడం మావల్ల కాదు నీది ఏనుగు తల. మొసలికి చిక్కి హరి కృపచే ముక్తమైన గజరాజులనే లొంగదీసిన మనుషులు కానీ నీ వాహన సంతానాన్ని ఏమీ చెయ్యలేక పోతున్నాం.

ఇంక మాకు మిగిలినట్టిదేమున్నది
గరళము, పచ్చి విషము, పాషాణము
అదియైనను మీ నాయన గొంతులోన దాగున్నది
గణనాయక! వక్రతుండ! విఘ్నేశ్వర!
ఏకదంత! లంబోదర! వినాయకా



కాళోజీ కవితలో గుండెచప్పుడు వినిపిస్తుంది. గుండె లయబద్ధంగా కొట్టుకున్నట్టు ఆయన కవితా పంక్తులు శబ్దిస్తవి. అవి ఒక్కోసారి గేయాల వుతవి, సూక్ష్మ కవితలవుతయి మొత్తం మీద సమాజపు దుర్మార్గాన్ని తూర్పారబడ్తయి. అది ఒక్కోసారి ఏదో ఒక పద్ధతిననుసరిస్తయి. ఒక్కోసారి యే పద్ధతినీ అనుసరించవు. అన్ని కవితల్లోనూ 'ప్రాణశక్తి' ఒక్కటే అవి చిన్నవీ కావచ్చు పెద్దవీ కావచ్చు.





అంటూ ముగిస్తాడు. నేతల పట్ల, వారి చేతల పట్ల కాళోజీ తన అభిప్రాయాన్ని తెలిపే ఈ పొలిటికల్ సెటైర్‌లో పరోక్ష అధిక్షేపం తప్ప కవికి వారి పట్ల వ్యక్తిగత ద్వేషం లేదని, సెటైర్‌ని ఆయన కొందరి ప్రవర్తనను అద్దంలో చూపి వారిలో మార్పు రావాలని భావించినట్టు కనపడు తుంది.

కాళోజీ రాసిన మరో దీర్ఘ కవిత 'యాదగిరి యాది'. ఈ కవితలో కొంత భాగం కాళోజీ స్వీయ జీవిత వివరాల్ని తెలుపుతుంది. యాదగిరి క్షేత్రంలో వెలసి వున్న శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవస్థానం కమిటీ 'సత్తా అమల్' అధికారిచేత 'నా గొడవ'ను వినడానికి ఆ స్వామి పిలిపించుకున్నాడంటాడు.

కాళోజీ వంశస్థుల కులదైవం బీదర్‌లో కొండ సొరికె లోపల ఉన్న ఝర్ణి నరసింహస్వామి (జల నరసింహస్వామి) నువ్వూ ఒకరేనా? అని ప్రశ్నిస్తాడు. కాళోజీ చిన్న తాత కాళోజీ నరసింహుడు. నాయన లక్ష్మీ నరసింహ రంగరాయుడు. కాళోజీ తన తండ్రి గురించి చెప్తూ ఆయనకు అచ్చంగా నీ (నరసింహస్వామి) కోపమేననీ, దుష్టుల్ని ఎదిరించడంలో, సత్యనిష్ఠలో ప్రహ్లాదుడనీ, హత్యానేరం పైబడ్డా బొంకని వాడనీ అంటాడు. కాళోజీ తనకు పోతన ప్రహ్లాద చరిత్ర నాల్క చివర ఉండటానికి కారణం తండ్రినోటంట ప్రహ్లాదుని గాథను అనేకసార్లు విని వుండడమే నంటాడు. కాళోజీ అన్నయ్య రామేశ్వరుడు. ఆయన్ను చిన్ననాట తల్లీ, తనూ, బాల్యస్నేహితులు 'బాబూ' అని సంబోధించే వాళ్ళమనీ, ఆయన కొసరు పేరు ఝర్ణి శ్యామ రాజు అనీ వివరిస్తాడు. సహనంలో భూమికీ అన్నయ్యకీ తేడా లేదంటాడు.

నరసింహస్వామిని నువ్వీ అడవిలో ఉంటానికి కారణమేమిటి? మనుషులు వెంటపడితే వేగలేక వచ్చావా అని ప్రశ్నిస్తాడు. నేను ఒకటి రెండుసార్లు విహార యాత్రకు ఓరుగల్లు నించి యిక్కడికి వచ్చాను కానీ నిన్నెప్పుడూ ఏదీ కోరలేదు. నువ్వు మా కులదైవానివి కనుక అక్షరాలు రాకముందే, వేమన సుమతీ శతకాలు చదవకముందే నీకు సంబంధించిన ఒకటి రెండు పోతన పద్యాలు వచ్చాయి అని మనసులోని మాటను ఏ జంకూ లేకుండా చెప్తాడు. ఇక నరసింహుని అవతార వృత్తాంతాన్ని ప్రస్తావిస్తాడు.

ఆనాడు! వేయి యుగంబులు గడచిన
యపుడుగాని రాకూడని కోపమేదో నీకొచ్చెను
దుస్సహతేజుండగు దితిపుత్రుని చీల్చి చెండాడిననూ
నీ కోపం పోదయ్యెను ఆనాడు!
లక్ష్మీ సైతము తడబడి నీ చెంతకు చేరవెరచె
అట్టి నీ కోపము దైత్యసుతుడు ప్రహ్లాదుడు చేరి మ్రొక్క
చప్పున చల్లారెను. మా కొంపలు ఆరెను.

'మా కొంపలు ఆరెను' అనే పదాలు ఈ కవితకు 'Key words' అనే విషయం రానురాను తెలుస్తుంది.

ప్రహ్లాదుడి పిన్నయ్యల్లాంటి వారు, వారి బంట్లు, ఏజంట్లు నీ దగ్గరికి ప్రహ్లాదుని చనువుతో రావడం మొదలుపెట్టారు. అవాళటి దితి పుత్రుడు హిరణ్యకశిపుడు నీ శత్రువు అయ్యి ప్రాణాల మీదకు తెచ్చుకున్నాడు కానీ ఇవ్వాళటి దితిపుత్రులు అతి చతురులు. నీ నామ సంకీర్తన చేస్తూ నీ లక్ష్మిని వశపరచుకుంటాడు. భక్తితో పాడే ప్రహ్లాదుడ్ని పక్కకు తోసి నిన్ను నమ్మిస్తారు. మోసం చేస్తారు. 'క్రయ వికార పరిణామం' వల్ల నర వృకాల నరజంబుకాల సమూహాలు ఏర్పడ్డవి. వీరి దుర్మార్గాలకు అమాయ కులు బానిసలై అగచాట్లు పడుతున్నారు. ఈ నరవృకాల, నర జంబుకాల పసికూనల వినోదంకోసం వనరాజు సంతానం ఇనుప కటకటాల వెనుక మురుగుళ్ళ మధ్య మాంస ఖండాల్ని ఆరగిస్తున్నాయి. కొన్ని సింహాలు సర్కసులో తోకముడ్చుకుని వున్నవి. పందుల వంటి, నక్కలవంటి దుర్మార్గుల కారణంగా జనం బావురుమని భోరుమని ఏడుస్తున్నారు. నువ్వేమీ పట్టించుకోకుండా కూచోడం వల్లే హేతువాదులు నిన్ను 'లేవు' అంటున్నారు. మాక్కావలసింది మామూలు సింహం కాదు నరసింహమే!

కాళోజీ 'మా కొంపలు ఆరెను' అన్న పదాలను వాడిందెందుకో యిప్పుడు అర్థమవుతుంది. ప్రళయ భీకరాకారుడవైన నీ కోపం ప్రహ్లాదుడు మొక్కడం వల్ల చల్లారిపోయింది. నీ కోపం చల్లారడం వల్ల మా కొంపలు ఆరినయి. దితిపుత్రుల వంటి వారు సమాజంలో పెట్రేగిపోతున్నారు. అమాయకులను హింసిస్తున్నారు. ఇందుకు కారణం నీ కోపం చల్లారడమే దీనికంతకూ కారణం అంటూ కాళోజీ సమాజంలోని దుష్టశక్తుల్ని శిక్షించడానికి నరసింహుడు మళ్ళీ అవతరించాలంటాడు. అదుపు తప్పుతున్న సమాజాన్ని నియంత్రించటానికి సింహం తల అవసరమని భావిస్తాడు.

అందుకనే నాకేమో మళ్లీ మళ్లొక్కసారి
ఆనాటి నీ రూపము ప్రళయ భీకరాకారము
చూడవలెను అనెడి బులుపు!
అంటూ ముగిస్తాడు.

కాళోజీ గణనాథా! దీర్ఘ కవితలో సామాన్యుల పరిస్థితిని, నేతల అకృత్యాలను వివరించాడు. 'యాదన్న యాది'లో అకృత్యాలకు పాల్పడుతున్న వారిని ఉపేక్షించకుండా శిక్షించాలన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. ఆయన ఈ రెండు కవితల్లోనూ పురాణ కథలను, వ్యక్తులను ప్రవేశపెట్టి అధిక్షేపానికి 'పదును' పెట్టడం జరిగింది. రెండు కవితల్లోనూ 'దైవం'పట్ల భక్తిగా కనిపించేది ఆయనకు సామాన్యుల మీద ఉన్న 'భక్తి'గా మనకు బోధపడు తుంది. కవితలు దీర్ఘమైనవైనా వాటి పరుగులోనూ, ఆయన పదాల వాడిలోనూ ఎక్కడా తేడా కనిపించదు. కాళోజీ 'కలేజా' ఉన్న అధిక్షేప కవి అని కొత్తగా చెప్పాల్సిన అవసరమూ లేదు.

*రచయిత సెల్: 92998 09212*



*శైలజా, జింబోలతో...*





గోపగాని రవీందర్



# నా గొడవ
# [illegible]

సాహిత్యం చలనశీలమైంది. సాహిత్యం చదవటం వల్ల మనలో మంచి ఆలోచనలు కల్గుతాయి. మనకు కలిగే అనేక రకాలైన భావాల్లో మనకు కావల్సినవి ఎన్నుకోవటానికి సృజనకారుల రచనలు తోడ్పడుతాయి. అందుకు నిదర్శనంగా రచయితల అనుభవాల ఆత్మకథలు మనకు అందుబాటులో ఉన్నాయి. మన మధ్యనే ఎనిమిది దశాబ్దాలకు పైగా జీవించి, మనలో నిద్రాణమైయున్న పోరాటపటిమను మేల్కొల్పిన అతి కొద్దిమంది ప్రజాకవుల్లో అగ్రగణ్యులు కాళోజీ. ఆయన సమర నినాద కవిత్వమైన 'నా గొడవ'లో అసమ్మతి, నిరసన, ధిక్కారం లక్షణాలుగా మనకొక దిక్సూచిని అందించారు.

తెలంగాణలో నిరంకుశ నిజాంపాలనను ఎదిరించి నిలిచిన ధీశాలి. పర ప్రభుత్వాన్ని తన కవితలతోనే కాదు మాటలతో సైతం వణికించిన ప్రజాకవి కాళోజీ. శ్రీశ్రీ మహాప్రస్థానం తర్వాత అంతే కదలికతో చదువుకున్న కవిత్వం నా గొడవ. ఆయనకు 1966లో వరంగల్లులో జరిగిన సన్మానం సందర్భంగా రాసిన 'నా గొడవ' కవిత వర్తమాన కవులకు పెద్ద బాలశిక్ష లాంటిది. ఆయన చెప్పదలుచుకున్నది సూటిగా, స్పష్టంగా నేను ఎవరి వైపో తెల్సుకోమంటున్నారు. "అన్యాయాలను చూసి ఊరక కూర్చుండే మనిషిని కాదు నేను" అంటున్న ఆయన ఈ కవితలో ఇలా రాశారు చూడండి.

*'కాలమునకే కాదు మహా/ కాలునకు ఏనాడును*
*'జీ' అనని 'కాలెజా'తో/ కాళోజీ అనునది*
*నా గొడవనునది/ నఖరాలు లేనట్టిది*
*నాజుకుది కానట్టిది/ నా గొడవనునది*
*అక్షరాల జీవనది...'*

ప్రజాకవి కాళోజీ నారాయణరావు కవిత్వ ముచ్చట్లను గూర్చి నా సాహితీ గురువైన ముప్పా మల్లేశంగారు, ప్రముఖ కవి, మిత్రమండలి నిర్వాహకులు వి.ఆర్.విద్యార్థిగారు, తెలంగాణ సాహితి శిఖరం సామల సదాశివగారులు సందర్భం వచ్చినప్పుడల్లా చెప్పేవారు. వరంగల్లులో జరిగే సాహితీ సభల్లో ఆయన మాటలు వినే అవకాశం అప్పుడప్పుడు కలిగింది. కిక్కిరిసిన సమావేశాల్లో చివరగా నిలబడి ఆయన మాటలు విన్న రోజుల్ని మరువలేను. ఆయన కవిత్వం ఎంత ఆత్మీయంగా ఉంటుందో ఆయన మాటలు అలాగే ఉండేవి. బాకులాంటి పదాలతో బతికినంత కాలం పాలకుల అణిచివేతపై రాసారు. రజాకార్ల దౌర్జన్యాలను చూసి 'కాటేసి తీరాలే' అనే గేయంలో ఇలా చెప్పారు.

*"మన కొంపలార్చిన మన స్త్రీల చెరిచిన*
*మన పిల్లలను చంపి మన కొంపలార్చిన*
*మానవ ధనములను మండలాధీశులను*
*మరిచి పోకుండగ గురుతుంచుకోవాలె*
*కసి ఆరిపోకుండ బుసకొట్టు చుండాలె*
*కాలంబు రాగానే కాటేసి తీరాలే."*

కాళోజీ గారు తన సమగ్ర కవితల సంకలనంకు 'నేను-నా గొడవ'అని రాసుకున్న ఈ వాక్యాలు మనల్ని ఆలోచింపజేస్తాయి. వీటి ద్వారా తన దృక్పథాన్ని చాటుకున్నారు. 'బ్రతుకు సాగిపోతున్నది. దాన్ని ఏదో ఒక సూత్రానికి బిగించి వేలాడి బతుకుదామనుకుంటే ఆ సూత్రం పుటుక్కుమనగానే చతికిలబడటం. నా గతిని ఆ కట్టడానికి, నన్ను అదుపులో పెట్టడానికి ఎన్ని శాస్త్రాల కట్టడాలు. ఎన్నెన్ని ఇజాల గతులు. ఏదో సూత్రానికి తత్వానికి, ఇజానికి కట్టుబడిపోయి జీవిస్తున్న ప్రాణులకు స్వేచ్ఛా జీవనం సున్న. పరాయి భావాలు, పరాయి చూపులు, పరాయి చెవులు, పరాయి బాస, పరాయి నడక, పరాయి చేతలు అన్నీ పరాయివే. అట్లా కాకూడదని నా తిక్క. చిరకాలం బతకాలని వుండగా చావొస్తే ఎట్లా అని కాదు ప్రశ్న. అనుక్షణం చావుకై నిరీక్షిస్తూ బతకడం ఎట్లా అన్నది ప్రశ్న. పరిస్థితులెట్లా వున్నాయని కాదు, వున్న పరిస్థితుల్లో మన మెట్లా వున్నామని అన్నదే. ఇట్లా వుంది మానవుని మనుగడ. ఇదంతా మమతలేని మనుగడ అని నా గొడవ.'

విప్లవోద్యమంలో పాల్గొంటున్న వాళ్ళను భౌతికంగా లేకున్నా చేస్తున్న తీరుపై ఆగ్రహం ప్రకటించిన కవి కాళోజీ. భూమయ్య, కిష్టగౌడులను ఉరి తీసిన సందర్భంలో 'తస్మాత్ జాగ్రత్త' కవితను రాశారు.

*"కిష్టగౌడు భూమన్నలు/ తిరుగుబాటు మానధనులు*
*తలలెత్తుక తిరుగుతారు/ అధికృత హింసను ఎదురగ*
*ప్రతి హింసను బూనుతారు/ ఉరిత్రాళ్ళను త్రెంచుతారు*
*ఉగ్రూతలు ఊగుతారు/ హిరణ్యాక్ష సోదరులు*
*హిట్లరు మొస్సలీన్లు/ వారి క్రొత్త ఎడీసన్లు*
*మటుమాయం అవుతాయి/ తిరుగుబాటు గెలుస్తుంది*
*సమవాదం మొలుస్తుంది/ అరుణోదయమవుతుంది*
*సామాన్యుని మేలుకొలుపు/ తప్పకుండ జరుగుతుంది"*

భారతీయ సాహిత్య నిర్మాతల్లో ఒకరుగా గణతికెక్కిన తెలంగాణ వైతాళికులు కాళోజీ. ఆయన జీవితము సాహిత్యము వేరువేరు కాదు. బహుభాషా కోవిదులుగా కూడా పేరు గడించారు. బతికినంత కాలం తెలంగాణ రాష్ట్రం కోసం పరితపించిన త్యాగశీలి ఆయన. ఆయన శతజయంతి ఉత్సవాల కాలంలోనే తెలంగాణ ఏర్పాటు కావటం అత్యంత హర్షణీయం. కాళోజీని స్మరించుకోవడమంటే ఆయన ఆశయా లను కొనసాగించటమే కదా. అంటే ఆయన ఎప్పుడు చెప్పే పలుకులను పాటించడమే.

*రచయిత సెల్:* ***94409 79882***





ఆచార్య డి.చెన్న కేశవరెడ్డి

# తెలంగాణ ఆత్మగౌరవానికి ప్రతీక

మిత్రులు రాములు విద్యార్థి ఫోను చేసి కాళోజి మీద ఏదైనా ఒక వ్యాసం రాయండి. పదిరోజులలో కావాలి అని అడిగిండు. 'ఏ విషయం మీద రాయమంటారు' అని అడిగిన. 'మీ ఇష్టం' అని అన్నడు. విద్యార్థి ఫోను చేసిన కొద్దిగంటలకే తెలంగాణ ఇవ్వనున్నట్లు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానాన్ని దిగ్విజయ్‌సింగ్ వెల్లడించిండు. అప్పుడనుకొన్న కాళోజి ఉండుంటే ఎంత సంతోషించు. ఆయన కళ్లల్లో ఎంత వెలుగు చూసేటోణ్ణి. ప్రత్యేక తెలంగాణ కోసం, తెలంగాణ యాస కోసం ఎంత గోసపడిండు. ఆయన జీవిత కాలాన తెలంగాణ రాకపాయెనే. ఆ విషయమే రాద్దామనుకొని, కాళోజి తెలంగాణ రైతాంగ ఉద్యమం మీద, నిజాం రాచరికం మీద, రజాకార్ల దుశ్చర్యల మీద, ప్రత్యేక తెలంగాణ ఉద్యమం మీద రాసిన కవితలు మళ్లీ చదివిన.



కాళోజి స్వేచ్ఛాజీవి. నౌఖరీ చాకిరీ చేసి ఎరుగని వ్యక్తి. 1969లో తలెత్తిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నుంచే మనసా వాచా కర్మణా తెలంగాణను కోరుతూ ఉవ్వెత్తున కవితలు రాసిన వ్యక్తి. కాలంతోపాటు నడిచిన వ్యక్తి. ఉద్యమానికి హృదయమిచ్చి, గళం విప్పి గర్జించిన వ్యక్తి. ఉద్యమంలో పాల్గొన్న వ్యక్తి. ఉద్యమాన్ని నడిపించిన వ్యక్తి. ఎన్నికలలో తెలంగాణ నాదాన్ని గెలిపించమని ప్రచారం చేసిన వ్యక్తి. అన్యాయం ఎక్కడ ఏ రూపంలో ఉన్నా, పసిగట్టే వ్యక్తి, ఎదిరించే వ్యక్తి కాబట్టే తెలంగాణకు జరుగుతున్న అన్యాయాన్ని తొందరలోనే గ్రహించి, తాను మేల్కొని 'ఎవరనుకున్నారు ఇట్లేనని, ఎవరనుకున్నారు, ఆంధ్ర తెలంగాణలకు అన్యత ఏర్పడు తుందని, హామీలిచ్చిన వారే అంత స్వాహా చేస్తారని' అంటూ ఇతరులను మేల్కొల్పడం మొదలుపెట్టిండు. తెలంగాణను కలిపి ఆంధ్రప్రదేశ్ ఏర్పరచిన సందర్భంలో తెలంగాణకు ఇచ్చిన హామీ ఒప్పందాల అమలుకు వామహస్తం చూపడం గమనించిన కాళోజి 'మర్మఘాతుక చర్య ఫలితము, ధర్మసాగర మెండిపోయె'నని గగ్గోలు పెట్టిండు.

కోస్తాంధ్రులు తెలంగాణలో 'ముల్కి' సర్టిఫికెటును పొంది, దాని మీద ఉద్యోగాలు సంపాదించడం గమనించి 'నమ్ముకొని పెత్తనము ఇస్తే, నమ్మకము పోగొట్టుకొంటివి, దొంగ ముల్కి సనదులిచ్చి దొరతనమ్ము వెలిగిస్తివి, బ్రతుకు తెరువులన్ని ఆంధ్ర బాంధవులే కాజేసిన తెలంగాణ, రాళ్లసీమ తిండికి గుతపలు ఎత్తవ? దోపిడి దౌర్జన్యాలకు దోసిలొగ్గి జీవించుట పౌరుషంబు కాదనుచు పలుకలేద గాంధి తాత, చిత్తశుద్ధిగా అహింస వృత్తి బూనలేనపుడు కదతేర్చుమనెను గాంధి తాతే' అని గాంధి గిరితోనే స్ఫూర్తిని కలిగించిండు.

తెలంగాణ విషయంలో ఒప్పందాలన్నీ అమలుకాకపోవడం వల్ల, ఉద్యమం వేడి చల్లార్చడానికి అప్పటి ప్రధానమంత్రి ఇందిరాగాంధి తెలంగాణకు మరికొన్ని రక్షణలు ప్రకటించినప్పుడు 'ప్రకటన ఎందుల కమ్మ, రక్షణ ఒప్పందాల రక్షణ యిప్పుడానమ్మ, అస్తిత్వము మాసినాక అమృతమెందుకు తల్లీ ఆంధ్రదేశము రాజ్యము అయినది తునకలు అమ్మ... కోటిన్నర ప్రజల కోర్కె యిపుడు నేరమ్మ, వేర్పాటు తప్ప యిపుడు వేరు మాట లేదమ్మా' అని తెగేసి చెప్పిండు. 'నా నోటికాడి బుక్కను నాణ్యంగా కాజేసిన నాగరికుడా? విను?' 'నానాగటి చాలులోన నాజూకుగ పవ్వళించి, నను కాటేసిన నాగరికుడా విను?' 'తెలంగాణ వెలిసి నిలిచి ఫలించాలె భారతాన, భారతమాతకి జై, తెలంగాణ జిందాబాద్' అని ఎలుగెత్తి అరిచిండు. 'హామీ ఒప్పందా లు అమలు సున్న అయినపుడు, తెలంగాణ వేరైతే దేశము పాడౌతుందా?' అని, 'కుండలు వేరైనంతనె, తిండి సరుకు మారుతుందా? తొమ్మిది జిల్లాలల్లో తెనుగు తనము పోతుందా? తొమ్మిది జిల్లాలల్లో బాస మాసిమాసి పోతుందా? తొమ్మిది జిల్లాలల్లో పని పాటలు వేరౌతాయా' అని ప్రశ్నల వర్షం కురిపించిండు. తెలంగాణకు



ఇచ్చిన రక్షణల విషయమై సీమాంధ్రలో వ్యతిరేకత వచ్చినప్పుడు 'ప్రాంతం వారీ రక్షణ పనికిరాదు అన్నప్పుడు ప్రత్యేకంగా రాజ్యం పాలు కోరడం తప్ప'దన్నాడు కాళన్న.

కోస్తాంధ్రులు తెలంగాణ భాషను తక్కువగా చూస్తుంటే కాళోజి మండి పడ్డడు. రెండున్నర జిల్లాల బాస పెత్తనాన్ని తిరస్కరించిండు. 'బాస చాన వయ్యారం అయినపుడు, మాండలికపు మర్యాదల మాటలు చేదయిన పుడు... రెండున్నర జిల్లాలదె, దండి బాస అయినపుడు, తక్కినోళ్ల యాస నొక్కి పెట్టబడ్డప్పుడు- ప్రత్యేక తెలంగాణ కోరక తప్పదన్నాడు'. 'తెలుగు బాస ఎన్నితీర్లు, తెలుగుయాస ఎన్ని తీర్లు, వాడుకలున్నన్ని తీర్లు', 'వాడుక' ఏ తీరుగున్న తెలుగు బాస వాడుకయే అన్ని తీర్ల వాడుకకు'- అని, 'రోడ్దం'టె తప్పుకాని వేత్తలంత, 'సడకంటె' చెవులు మూసుకొను టెందుకు 'టీ' హాయిగ చప్పరిస్తు 'చా' అంటే 'ఛాఛా' అని మొగమేదో వ్రేలాడించద మెందుకు?' అని ఆధునిక భాషా శాస్త్రజ్ఞుడిలా, భాషపట్ల శాస్త్రీయమైన అవగాహనతో కవితలెన్నో రాసిండు.

ఉద్యమం నాయకులు లేవదీసిన ఉద్యమం కాదని, ప్రజల నుంచి పుట్టుకొని వచ్చిన ఉద్యమమని, అది ప్రజల కోరిక ఫలించేవరకు ఆగదని, ఆరదని ఆక్రోశించిండు.

కాళోజి తెలుగు భాషను ఎంతగా ప్రేమించిండో చెప్పలేము. తాను ఉర్దూ మీడియంల చదువుకొన్నా, తనింట్లో మరాఠి భాష మాట్లాడుతున్నా, నిజాం రాష్ట్రంలో తెలుగు భాష పట్ల, తెలుగు ప్రజల పట్ల చూపుతున్న నిరాదరణను గురించి 1942లోనే "ఏ భాషరా నీది? యేమి వేషమురా? ఈ భాష వేషమెవరి కోసమురా! ఆంగ్లమందున మాటలాడ గలుగగనే, ఇంతగా గుల్కెదవు? ఎందుకోసమురా, ఉర్దూ మాటలాడి యుబ్బుబ్బి పడుటకు, కారణంబేమిటో కాస్త చెప్పుమురా! లాగు షేర్వాణీలు బాగుందు ననుచు, మురిసిపోయెదవంత మురిపమేమిటిరా? తెలుగు బిడ్డడవయ్యు తెల్గు రాదంచును, సిగ్గు లేక ఇంక చెప్పుటెందుకురా... అన్య భాషలు నేర్చి ఆంధ్రంబురాదందు, సకిలించు ఆంధ్రుడా! చావవెందుకురా" అని తన ఆక్రోశాన్ని, ఆవేదనను వెళ్లగక్కిండు.





కోస్తాంధ్రలో ఆంగ్ల పదాలనే ఎక్కువగా వాడుతూ, అదే తెలుగని వాళ్ళనుకొన్నప్పుడు, ఇక్కడ ఉర్దూ మాటల కలయికతో కూడుకున్న తెలుగు బాస తెలుగు కాకుండా పోతుందా! రాజకీయ, చారిత్రక కారణాలవల్ల బాసలో, కట్టుబాట్లలో తేడాలు కన్పించడం సహజమే. ఆ సహజమైన మార్పును గమనంలోకి తీసుకోవలసింది పోయి, తెలంగాణ సంస్కృతిని, బాసను చిన్నచూపు చూడటంవల్లనే తెలంగాణ ఉద్యమానికి బీజం పడింది. ఇదే విషయాన్ని కాళన్న కాహళి సంధించి చెప్పిండు పదేపదే. అయినా ఎవరికీ చెవికెక్కలేదు. దాని ఫలితమేమిటో తెలిసివచ్చింది చివరికి.

తెలంగాణ పోరుబాటలో ఎందరో యువకులు బలిదానాలు చేసుకొన్న ప్పుడు 'తెలంగాణ ఏర్పాటును లక్షించెడి ప్రతి ఎదంద, తెలంగాణ మృత వీరుల స్మృతిఫలకమ్మై వెలయగ, మృతవీరుల స్మృతిచిహ్నము ప్రజ్వలన ముగా జ్వలించునని' ఉద్ఘోషించిండు. 'ప్రత్యేక తెలంగాణ అవుతే అది దక్షిణ పాకిస్తానము' అవుతుందని ఒక కోస్తాంధ్ర కవి రాస్తే 'కలం గారడీ కాదా, కన్నీటి గాదా' అని తగు రీతిలో జవాబిచ్చుండు. నిర్బంధం వల్ల ఉద్యమం అణగారదని 'ప్రముఖుల పట్టైస్తె ఎపుడు ప్రజల ఉద్యమము ఆగదు. ఉద్యమము ప్రజలదైతే ప్రతి ఒక్కడు ప్రముఖుడేను' అని తెలంగాణ

తన పూర్వులు మహారాష్ట్రం నుంచి వచ్చినా, కాళోజి ఇక్కడి ప్రజలతో, భాష యాసతో, సంస్కృతితో మమేకమైండు. కాళోజిలాగా సీమాంధ్రులు అయి ఉంటే ఈ పరిస్థితి వచ్చేది కాదేమో! తెలంగాణ బాసను, సంస్కృతిని గౌరవించకపోగా, అశాస్త్రీయంగా చిన్నచూపు చూడటం మొదలు పెట్టింద్రు. ఎవరి భాష యాస, ఎవరి సంస్కృతి వారికి గొప్ప. ఇతరులవి గొప్ప కాదనుకోవడం, చిన్నచూపు చూడటం అశాస్త్రీయం, అనాగరికం. కోస్తాంధ్రులు తమ సంస్కృతిని, తమ బాసను తెలివిగా తెలంగాణపై రుద్దడం మొదలు పెట్టింద్రు. ఈ విషయాన్నే కాళోజి 'ఇపుడు తెలంగాణ ఆంధ్రత్వం ఎటు చూచిన, 'చా''టీ'అయి మసలు తాంది, సడకు రోడ్డై సాగుతున్నది... వచ్చిండని, పోయిండని అంటలేదు ఎవడిప్పుడు, వచ్చాడని, చచ్చాడని అంటున్నరు చచ్చినట్లు...ఆంధ్రుల సభ్యత సంస్కృతి రెండున్నర జిల్లాలది, ఆటలు పాటలు అన్నీ రెండున్నర జిల్లాలవి, తక్కి నోళ్ల తెలుగుతనం కోల్పోయిన దౌర్భాగ్యులు' అని వ్యంగ్యంగా ఎత్తి చూపిండు.

తెలంగాణ సంస్కృతిని ప్రతిబింబించే 'బతుకమ్మ'ను గురించి కాళోజి "గుమ్మడి పూలు పూయగ బ్రతుకు,తంగెడి పసిడి చిందగ బ్రతుకు,

గునుగు తురాయి కులుకగ బ్రతుకు, కట్ల నీలిమలు చిమ్మగ బ్రతుకు అమ్మను మరవని సంతానముకని, బతకమ్మా బ్రతుకు బతుకు బ్రతికి బతుకుల బ్రతికిస్తూ 'బతుకమ్మా బ్రతుకు" అని రాసిందు. బతుకు పట్లఎంతో మమత, విలువ, గౌరవం ఉన్నోడు కన్కనే ఇంత గొప్పగ, గుండెతో పలికినట్లు రాసిందు.

వీర తెలంగాణ నాది వేరు తెలంగాణ నాది
వేరై ఊద తెలంగాణ వీర తెలంగాణ ముమ్మాటికి
తెలంగాణ వేరై నిలిచి భారతాన వెలయు ముమ్మాటికి

అని ఎంతో ఆత్మవిశ్వాసంతో పలికిన పలుకులు నిజమైనవి ఈనాటికి. ఆయన పలుకులను మరింత దృఢంగా, నిశ్చయంగా నిజం చేయవలసిన బాధ్యత మనందరిది. హైదరాబాదు నగరం వివిధ భాషీయుల, వివిధ సంస్కృతుల కూదలి. ఉత్తర, దక్షిణ రాష్ట్రాల సంస్కృతుల సంగమ స్ధానం. హిందూ ముస్లింల ఐక్యతకు పేరెన్నిక గన్నది. కొన్ని స్వార్ధపర శక్తుల వల్ల అప్పుడప్పుడు ఈ ఐక్యతకు మబ్బులు కమ్మినా, మళ్లీ ఎప్పటి సుహృద్భావపు వెలుగులు నిండి ఉంటయి ఈ నగరంలో. అట్లాగే రాష్ట్రాలు రెండైనా, భాష ఒక్కటిగా, జాతి ఒక్కటిగా మసలుకొన్నప్పుడే తెలుగు భాష, తెలుగు వాడి బావుటా భారతదేశంలో సగర్వంగా, సమున్నతంగా నిలుస్తాయి, వెలుస్తాయి.



# కాళోజీ రచనలను సిలబస్‌లో చేర్చాలి



తెలంగాణ మీద కాళోజి కున్న ప్రేమాభిమానాలు అమోఘమైనవి, అనన్యమైనవి. నిజాం నిరంకుశ పాలనను అంతమొందించే పోరాటం నుంచి, సీమాంధ్రుల దోపిడీని, దౌర్జన్యాన్ని సహించలేక వేర్పాటు ఉద్యమానికి ఊపిరి పోసేలా పోరుబాటలో తాను నడిచి ఇతరులను నడిపించిన అచ్చమైన, అరుదైన ప్రజా కవి. కాళోజియే జయప్రకాశ్ నారాయణ్ మీద చెప్పినట్లు, ఆయనను గురించి 'చావు నీది, పుటుక నీది, బతుకంతా తెలంగాణది' అని చెప్పవలసి వస్తుంది. కాళోజి బాటలో తెలంగాణ ఉద్యమం విషయంలో వరవరరావు, గద్దర్, నందిని సిద్ధారెడ్డి, దేశిపతి శ్రీనివాస్, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, జూలూరు గౌరీశంకర్, అల్లం నారాయణ, వేణు సుంకోజు, అందెశ్రీ, గోరటి వెంకన్న, అమ్మంగి వేణుగోపాల్, రసమయి బాలకిషన్, సంధ్య, విమలక్క వంటి కవులు, వాగ్గేయకారులు, కళాకారులు నడిచి తెలంగాణ ఉద్యమాన్ని ఉచ్చస్థాయికి తీసుకొని వెళ్లినందువల్లనే తెలంగాణ సాకారమైంది. ఈ విషయంలో తెలంగాణ కోసం తమ అసువులను బాసిన అమర వీరుల త్యాగాన్ని కూడ స్మరించవలసిందే.

తెలంగాణ వచ్చిన సంవత్సరమిది. కాళోజి శతజయంతి సంవత్సరమిది. ఈ రెండిటినీ ఈ ఏడాది పొడవునా సంబరంగా జరుపుకొందాం. అదే ఆయనకు ఘనమైన నివాళి.

*(పూర్వ సంచాలకులు, విజ్ఞాన సర్వస్వ కేంద్రం*
*పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం)*

***రచయిత సెల్: 94920 47027***





అన్నవరం దేవేందర్

కాళోజీ జీవితమంతా పసివాడని తనం. అంటే సంటి పిలగాని తనం. ఆయన మనస్సు ఇప్పుడే తెంపుకచ్చిన కోతిమీర ఆకు లెక్క వల్లి పోని తనం. అందుకే ఆయన నిరంతరం దుక్కపడుతడు కోప్పడుతడు కొట్లాడు తడు. కాళోజీతో మాట్లాడిన వాళ్లు ఆయన కళ్ళ నుంచి జలజల దుంకే కన్నీళ్ళను చూసే ఉంటారు. అన్యాయం అధర్మం అన్పిస్తే చాలు దుక్కం కోపం తన్ను కస్తయి. తన కవిత్వం కూడా దుక్కం కోపం కలెగలిపిన కన్నీళ్ళు. ఆ కోపంలో మాలిన్యం ఉండదు. చక చక రాసుక పోతడు. అది కవిత్వమై కాళోజీ గొంతుకై బయటికి వస్తది. ఇందుట్ల శిల్పమున్నదా అని పిస్కి సూసేటోల్లకు ఏం కనపడది. కాళోజీ కవిత్వం చదువుతాంటే తాను ఇప్పటికి పక్క పొన్న కూసోని మనతోని ముచ్చట పెట్టినట్టే అన్పిస్తది.

తెలంగాణ రచయితల వేదికకు ఆవిర్భావంలో కాళోజీ నారాయణ రావు గౌరవాధ్యక్షుడు. ఆయనతో ఆవిర్భావం సందర్భంగా 2001లో ఇంటికి పోతె నాకైతె గుండె నిండినట్టు అయ్యింది. అప్పుడే వచ్చిన నా మొదటి కవితా సంకలనం 'తొవ్వ' చేతిలో పెట్టితె 'ఈ 'తొవ్వ' ఎటు తీసకపోతదిరో' అన్న మాటలు గుర్తుకస్తయి. అట్లనే మా హుస్నాబాద్ కవుల 'సిమాంట' కవితా సంకలనం (నూతన సాహితి ప్రచురణ) తనకు ఇస్తే సిమాంట అంటే ఇక రాలేదనో ఏందో ఏందీ ఏందీ అని రెండుసార్లు అడిగిండు. సిమాంట సిమాంట పని మొదలుపెడుదం సూడు, ఆ పదము అని పక్కనే ఉన్న రామశాస్త్రి చెప్పంగనే అబ్బో ఎన్ని ఏండ్ల కింద మాట అంటు గుడ్లల్ల నీళ్ళు తీసికున్నడు. ఇట్ల ఎన్ని మన తెలంగాణ మాటలు మరిచిపోతిమిరా... అనుకుంట అందులో ఉన్న 'నా బాల్యం బాలశిక్షలో దాచుకున్న నెమలి కన్ను' కవిత్వాన్ని సద్విండు.

తాను ఒక పదం మరిచిపోయిన దాన్ని తిరిగి కన్పించగానే సంతోషం తో పటపట నీళ్ళు రాల్చుకోవడం చూసి అక్కడున్నవాల్లం మౌనంగా ఉన్నం. మహాత్మాగాంధీ గూర్చి ఐనిస్టెన్ ఒక మాట అంటాడు 'భవుష్యత్ తరాలు గాంధీ జీవితచరిత్ర చూసి గతంలో ఇలాంటి మనిషి భూమి మీద ఉండేవాడా! అని' సరిగ్గా అట్లాంటి వ్యక్తీకరణ కాళోజీ పట్ల కూడా అన్వయించుకోవచ్చు.

ఆయన రుషిలాంటి మనిషి. ఏ విశ్వవిద్యాలయంలోగానీ ఇంకెక్కడా ఉద్యోగం లేదు. ఏ సంఘంలో సభ్యుడు కాదు. ఏ వృత్తీ లేదు. కేవలం ఉద్యమకారుడు, కవి, రచయిత. వృత్తి ఉద్యోగాలు ఉన్నవారు జీవిక కోసం కొనసాగుతు ఉద్యమంలో పాల్గొంటారు. కాళోజి అలాకాదు, నైజం రజాకార్లకు వ్యతిరేకంగా పోరాడినా ఆ తర్వాత విశాలాంధ్రను సపోర్ట్ చేసిన ఆ తర్వాత హక్కుల ఉద్యమాన్ని ఆవాహన చేసికున్న తెలంగాణ ఉద్యమం కోసం నిలబడ్డా ఆయన కేవలం నికాలస్ ఉద్యమకారుడే. ఆయనకు ఏ పదవి లేదు. ఏ జీతభత్యాలు లేవు. ఎవరికి వంగేది లేదు. లొంగేది లేదు. అందుకే కాళోజీ చాలా అలవోకగా ఎంత పెద్ద పెద్దోల్ల నయినా ఏరా... పోరా అని పిలిచే దమ్ము, ప్రేమ ఉన్న వ్యక్తి. అందుకే ఆయన రుషసోంటోడు. ఆయనతో ఏరా అన్పించుకోవడం ఆయన సమకాలీకులకైనా చిన్నవాల్లకైనా ఒక అందమైన అనురాగ అనుభవమే. హోదాలను బట్టి సంబంధ బాంధవ్యం మారదు. ఆయనకు స్నేహితుడు ప్రధానమంత్రి సీటు మీద కూర్చున్నా ఏరా పివి అని సంబోధిస్తాడు. ఆయన సన్నిహితుడు వైస్ చాన్స్లర్ అయినా ఏమిరో విసీ అని యన్.గోపిని పలకరిస్తాడు. ఇలా స్నేహసంబంధాలను హృదయపూర్వక మానవ సంబంధాలుగానే కొనసాగిస్తాడు. ఇట్లాంటి అరుదైన ప్రేమ తత్వం గలవాళ్లు మనకు ఎక్కడా కన్పించరు. ఈ రోజుల్లో మన క్లాస్‌మేట్లైనా చిన్నప్పటి స్నేహితులై ఏదైనా పెద్ద హోదా గల ఉద్యోగం చేస్తే చాలు ఆ చిన్ననాటి రారా పోరాలు చనువు అన్నీ పోతాయి. బలవంతంగా తెచ్చుకున్న గంభీరత 'అంజాన్ కొట్టె' తనం చాలామంది లో చలామణిలో ఉన్నది.

కాళోజీ మాట్లాడే భాష అచ్చు తెలంగాణ పదాలు. తన కవిత్వం రాతలు కూడా అన్నీ తెలంగాణ పల్లె భాషలోనే ఉంటాయి. ఆ తరంలో పి.వి.నరసింహారావు, కె.అంజయ్య, శ్రీపాదరావుల ఉపన్యాసాలు కూడా మన ఊల్లె మాట్లాడుకున్నట్టే ఉంటాయి. మనందరి దస్తూరి ఒక్క తీరుగా లేదు. భాష కూడా అట్లనే ఉంటది. అంతా తెలుగే అయినా ఎవని వాడుక భాష వాల్లది అని కాళోజీ చాలాసార్లు చెప్పిండ్రు. ఆంధ్ర తెలంగాణ విలీనం అయినంక ముందుగల మన భాష చెడగొట్ట మంచిగ లేదని షోగ లేదని దెప్పిండ్రు. అటెన్క సంస్కృతి పండుగలను సత్తె నాశనం చేసిండ్రు. వాల్ల రెండున్నర జిల్లాల భాషనే పాఠ్య పుస్తకాలల్ల, పత్రికల్లో, సినిమాల్లో, రేడియోలో, పరిపాలనలో వాడిన్రు. మనలను న్యూనత పరిచినారని చాలా సందర్భాల్లో కాళోజీ చెప్పుతుండె.

ఎన్నో రోజుల నుంచి తెలంగాణలో జరుగుతున్న రైతుకూలీ ఉద్య మాలు, పౌరహక్కుల ఉద్యమాలు, భూస్వామ్య వ్యతిరేక ఉద్యమాలు, నక్సలైట్ ఉద్యమాలు, తెలంగాణ ప్రజాస్వామ్య ఉద్యమాలకు కాళోజీ సాక్షే కాదు, అన్ని ఉద్యమాలను తనదైన రీతిలో వ్యాఖ్యానించినవాడు. తను వాటితో మమేకం అయినవాడు. తానే ఉద్యమ దీపమై వెలిగిన వాడు. వెరసి తెలుగు నేల మీద కాళోజి మహాత్ముడు. మచ్చలేని మనిషి. సర్వ స్వతంత్రుడు. తను నమ్మిన దాని కోసం ఎంతటి నిర్బంధం అయినా ఎదిరించిన వీరుడు, ధీరుడు. ఆఖరుకు కాళోజీ తన దేహాన్ని కూడా కాకతీయ వైద్య కళాశాలకు పరీక్షల కోసం దానం ఇచ్చిన మహావ్యక్తి.

కాళోజి చరిత్ర, ఆత్మకథ, నా గొడవ, ఇతర కథలన్నీ రానున్న తెలంగాణా రాష్ట్రంలో వివిధ స్థాయిల్లో విద్యార్థులకు పాఠ్యాంశాలుగా రావాల్సిన అవసరం ఉన్నది.

కాళోజి తెలంగాణ కలేజా

అమర్ హై కాళన్న

రచయిత సెల్: 94407 63479





డా॥ ఐన్న అయిలయ్య

# సమైక్య పాలనపై కలం కత్తి నెత్తిన ప్రజాకవి



ప్రజాకవి కాళోజీ నారాయణరావు కాలంతో నడిచిన కవి. తనను క్షోభపెట్టిన ప్రతి సంఘటనను కవిత్వం చేసిన మహానుభావుడు. కవిత్వానికి అలంకార శాస్త్రాలు, విమర్శకులు ప్రమాణము కాదని, సామాన్య ప్రజల బాధలని, గాథలని చిత్రించేటప్పుడు సామాన్యుడికి అర్థమయ్యే రీతిలోనే కవితా శిల్పం ఉండాలని కాంక్షించాడు. తాను రాసినంత కాలం దాన్నే నమ్ముకొని అట్లాగే రాసిండు. భావ, అభ్యుదయ, దిగంబర, చేతనావర్త, విప్లవ కవితా ప్రవాహాలు ఆయన కళ్ళముందే ప్రవహించాయి. స్త్రీ దళిత వాదాలకు కూడా అతను ప్రత్యక్ష సాక్షి. వాటి వడిని, మలుపులని గమనిస్తూనే తానే ఒక కవితా ప్రవాహమైనాడు. ఆయనకు ప్రజలే ప్రమాణము. ఆయన కవితకు వారే అలంకారం. నడుస్తున్న చరిత్రే ఆయన కవితేతి వృత్తం.

ప్రజాకవి కాళోజీ ప్రజాస్వామ్యానికి చెక్. నియంతలనే నిలదీసి ఖతర్‌నాక్‌గా పేరు తెచ్చుకొన్న కాళోజీ పద్మవిభూషణ్ తర్వాత కూడా ప్రజా కవిగానే పిలువబడ్డాడు. నిత్యం ప్రజా సమస్యల కోసం పోరాడిన కాళన్న మానవత్వమే ఆభరణముగా వెలిగిన నిరాడంబరుడు. అలతి అలతి పదాలతో కవిత్వాన్ని రాసి ఆధునిక వేమనగా పేరు గాంచాడు. ప్రతి పదాన్ని పదునైన ఆయుధంగా చేసి అవ్యవస్థను వేటాడాడు. రాజరికంలోనైనా, ప్రజాస్వామ్యంలోనైనా పాలకులెప్పుడూ ప్రజాశ్రేయస్సు కోసం పాటుపడటం లేదని కాళోజీ నిష్కర్షగా చెప్పాడు. కాళోజీకి పార్టీ ప్రత్యం లేదు. కనకనే దుర్గమారణ్యంలో తిరిగే సింహంలా రాజసంగా ఈ సమాజంలో తిరిగాడు. నిర్భయుడైన కాళన్నను చూస్తే అప్రజాస్వామిక వ్యవస్థ గజగజలాడేది. అతనెక్కడున్నా, ఎప్పుడైనా ప్రశ్నించడం నేర్చుకున్నాడు. ప్రశ్నించనినాడు మనం జీవించడం మరిచినవాళ్ళ మవుతామని సూటిగా చెప్పాడు కాళన్న. ప్రజల బాణాలు సంధించే కాళోజీ కవిత సామాజిక నిబద్ధమైనది. 1969 నుండి 1972 వరకు తెలంగాణా ఉద్యమంలో పాల్గొని ఆ ఉద్యమ వేగాన్ని రికార్డు చేసిన కవి కాళోజీ.

ఐదు దశాబ్దాలకు పైగా ఇక్కడ సమైక్య పాలన కొనసాగుతుంది. 1969 ఉద్యమ కాలంలో ప్రజాకవి కాళోజీ రాసిన కవిత్వాన్ని చదివితే నేటి సందర్భానికి కూడా తగినట్లుగా ఉందనిపించడం ఆశ్చర్యం.

సమైక్య పాలనలో లంచాలు పెరిగిపోవడం, అవినీతిపరులు అందల మెక్కడం, అసమర్థులు రాష్ట్ర నాయకత్వాన్ని అధిష్టించడం, సాధారణ పరిపాలనలోను తెలంగాణా, ఆంధ్ర ప్రాంతం పట్ల ద్వంద్వ విధానం అనుసరిస్తూ, విద్య, వైద్యం, ఆరోగ్యం, నీళ్ళు, నిధులు, ఉద్యోగాల కేటాయింపుల్లో పక్షపాత వైఖరిని ప్రదర్శించి తెలంగాణ అభివృద్ధికి ఆటంకంగా నిలువడం చరిత్రలో ఒక విషాద ఘటన. అన్ని రకాలుగా తెలంగాణా ప్రజలు వివక్షకు గురవుతున్నారని, తమ ప్రాంతంలోనే తాము పరాయీకరింపబడుతున్నామని, తమ తోటి తెలుగు వారే తమకు ద్రోహం చేస్తున్నారని ఇక్కడి ప్రజలు గుర్తించాకే మలివిడత తెలంగాణా ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసిపడింది. తెలంగాణా ప్రజల చిరకాల వాంఛ రాష్ట్రం ఏర్పాటు చివరి అంకానికి చేరుకుంది. ఈ సందర్భములోను ఐదు దశాబ్దాల

> "మంచిగా ఉన్నవారితో మంచిగా ఉండి, స్నేహం చేయడం, ఎంతకు అంత అంటే మిగిలిన వాళ్ళు తక్కువ కారు అనేది సమాజంలో ఉంది. దీన్నే కవి తెలంగాణ,కోస్తావాళ్ళకు మధ్య ఉన్న దోపిడి, మంచిచెడు, సంబంధ బాంధవ్యాల గురించి మాట్లాడుతున్నాడు. తెలంగా ప్రజావాణిని బద్దలు కొట్టినట్లు చెప్పుట కాళోజి ప్రత్యేకత."



క్రితం కాళోజీ రాసిన 'నా గొడవ' కవిత్వానికి రిలవెన్సు ఉందనే విషయాన్ని నాటికి నేటికి తెలంగాణ ప్రజల జీవితాల్లో మార్పులేదనే వాస్తవాన్ని తెలుసుకోవచ్చు.

1. కలం బడితే రూపాయి
2. కూళ చేతిలో తాళపు చెవులు
3. ధర్మసాగరమెండిపాయె
4. ప్రాంతం వాడే దోపిడి చేస్తే
5. దొంగముల్కి పట్టణాలు
6. మనిషివన్నది మరువకు
7. గుడుగుడు గుంచెం.

అవినీతి సమాజానికి రాచపుండులాంటిది. మెల్లగా మొదలై సమాజాన్నంతా రోగగ్రస్తం చేస్తుంది. శస్త్ర చికిత్సకు కూడా నయంకాని రోగం అవినీతి. సమైక్య పాలనలో అవినీతిని పసిగట్టి దాన్ని వ్యతిరేకించిన కవి కాళోజీ. వ్యాపార రూపంలో వాగ్దానాల రూపంలో అధికార రూపంలో వివిధ రకాలుగా ఈ అవినీతి ఉంటుందని ఎపుడో పసిగట్టాడు. ఏదో నిజాం కాలంలో రకరకాల రూపాల్లో తెలంగాణ దోపిడికి గురైంది. ఆ కాలంలో దోపిడీ వారసులు- నేటికి సజీవంగానే ఉన్నారు. ఇక బ్రిటీషాంధ్రులకు దోపిడీ వెన్నతో పెట్టిన విద్యయే.

"దోపిడి చేసే ప్రాంతేతరులను/ దూరం దాకా తన్ని తరుముతం/ ప్రాంతం వాడే దోపిడి చేస్తే/ ప్రాణం తోనే పాతర నేస్తం/ దోస్తుగ ఉండే వారితో మేమును/ దోస్తే చేస్తం- ప్రాణమిస్తం/ ఎంతకు అంత అన్న ధోరణితో/ చింతమాని బతకుకును సాగిస్తం"/ (ప్రాంతం వాడే దోపిడీ చేస్తే... పుట. 366) దోపిడీదారులకు కులం, మతం, ప్రాంతం, దేశమని ఉండదు. కాని ప్రతి ప్రాంతంలో దోపిడీ దొరలున్నట్లే, నిజాయితీ పరులూ ఉన్నారు. మంచిగా ఉన్నవారితో మంచిగా ఉండి, స్నేహం చేయడం, ఎంతకు అంత అంటే మిగిలిన వాళ్ళు తక్కువ కారు అనేది సమాజంలో ఉంది. దీన్నే కవి తెలంగాణ,కోస్తావాళ్ళకు మధ్య ఉన్న దోపిడి, మంచిచెడు, సంబంధ బాంధవ్యాల గురించి మాట్లాడుతున్నాడు. తెలంగా ప్రజావాణిని బద్దలు కొట్టినట్లు చెప్పుట కాళోజి ప్రత్యేకత. "తెలంగాణ మాది- తెలంగాణ మాది/ తీరానికి దూరాన వున్నది/ ముంచే యత్నం చేస్తే తీరం/ మునుగును తానే మునుగును తప్పక" (ప్రాంతం వాడే దోపిడి చేస్తే... పుట. 366).

నియంత నిజాం పాలననే అంతం చేసిన తెలంగాణ ఇది. దీన్ని దోచుకోవాలని, దోచుకొని ఈ ప్రాంతాన్ని ముంచేయాలని చూస్తే కుదరని పని. ముందు మునిగేది కోస్తా ప్రాంతం. అది సముద్ర తీర ప్రాంతంలో ఉందని కాళోజి వ్యంగ్యంగా చెబుతాడు. ఇక్కడ పుట్టి పెరిగి, స్థానికంగా జీవించేవారు ముల్కి (దేశస్థుడు). కాని, వలసవాదుల ముల్కి నిబంధనలు తనకు వర్తిస్తాయని బుకాయించడం సరికాదు. ఇదే విషయాన్ని కాళోజి "దొంగ ముల్కి పట్టణాల్లో/ నంగనాచివై మెలగుచు/ ముద్యోగం తేని 'ములిక'/ ఉద్రేకం కాదనకు/ బ్రతుకు తెరవులన్ని ఆంధ్ర బాంధవులే కాజేసిన/ తెలంగాణ, రాళ్ళసీమ/ తిండికి గుతుపలు ఎత్తవ"... ప్రజాస్వామ్య పద్ధతిపై/ పాలన చేయక మందిని/ దోచుకొనెడి కాంగిరేసు/ దొరలారా! నిజమేనా!! (దొంగముల్కి పట్టణాలలో, పుట. 388). నిబంధనలకు నీళ్ళొదిలి పాలించడం కూడా ఒక రకమైన అవినీతే అనేది కాళోజీ అభిప్రాయం.

స్వచ్ఛమైన పాలనను అందించేదం ప్రభుత్వం లక్ష్యం కావాలి. అందు కోసం ప్రభుత్వంలో కూడా స్వచ్ఛమైన నాయకులే ఉండాలి కూడా. కాని జైల్లో ఉండాల్సిన వ్యక్తులంతా ప్రజా నాయకులుగా గెలుపొందుతూ,



కవి వేగుంట మోహనప్రసాద్ ఇతర మిత్రులతో..

ప్రజా పంపిణీ రంగాలను ప్రైవేటుపరం చేయడం, వారి వద్ద నుండి లంచాలను తీసుకోవడం చూస్తున్నాం. ఇది చట్టబద్ధమైన దోపిడే. కావలివాడే కంచ తీయడమంటే ఇదే. ప్రజా ధనాన్ని, వనరులను కాపాడమని ఓటు రూపంలో వాడికి అధికారం ప్రజలిస్తే, వాడు మాత్రం 'గూడు పఠానీ, గుండా రాజ్యం'కు మద్దతు పలకడం ఏవిధంగాను ప్రజాస్వామ్య వ్యవస్థకు ఆరోగ్యకరం కాదు. అందుకే మంచి వాళ్ళను నాయకులుగా ఎన్నుకోవాలి తప్ప 'కూళ'లను కాదు అంటాడు కాళోజీ. "'తాళపుచెవులూ', 'ఖాతా'/ కూళ చేతిలో ఉండగ/ రొక్కం తప్పించి లెక్క 'పక్కా' చేస్తే దిక్కుండదు." (కూళ చేతిలో తాళం చెవులు, పుట. 344) అంటూ ప్రజలను కాళోజీ హెచ్చరిస్తున్నాడు.

దోపిళ్ళకు 'కానూరు'కు/ దోస్తి కుదిరి వెలుస్తుంటే/ విసుగెత్తిన వాలంత/ వికట వర్తనులె ఔతరు" (కూళ చేతిలో తాళపు చెవులు, పుట 344) అని కాళోజీ ఘంటాపథంగా చెప్పాడు. రాజకీయాధికారమే కీలకం. ఇక మంచివారు, అవినీతిపరులు కానివారుండే చట్టాన్ని ఆపరేట్ చేస్తూ అవినీతి రహిత సమాజాన్ని తయారుచేయవచ్చు. కానీ అంత స్వచ్ఛమైన వాళ్ళకు ఈ సమాజంలో స్థానం ఉందా? ఆలోచించాలి! ఓటును కొనేవాడికి సంపాదన ఎక్కడి నుండి వస్తుంది. వారు సామాన్య ప్రజల నోరుగొట్టి సంపాదిస్తే తప్ప వాడికి ధనం రాదు. వాడొక అధికారి కావచ్చు, రాజకీయ నాయకుడు కావచ్చు. వాడి సంతకానికి విలువున్న ప్రతిచోట అవినీతికి పాలుపడడం కనిపిస్తుంది. "కలిసికట్టు వ్యాపారము/

*నియంత నిజాం పాలననే అంతం చేసిన తెలంగాణ ఇది. దీన్ని దోచుకోవాలని, దోచుకొని ఈ ప్రాంతాన్ని ముంచేయాలని చూస్తే కుదరని పని. ముందు మునిగేది కోస్తా ప్రాంతం. అది సముద్ర తీర ప్రాంతంలో ఉందని కాళోజీ వ్యంగ్యంగా చెబుతాడు*

గొలుసు కట్టు వ్యవహారము/ సులువుగా సాగిస్తున్నాయి/ కొలువు దీరి కూసున్నయి/ కలసి మనల దోస్తున్నయ్/ కలు బడితే రూపాయి." (కలము- బడితే రూపాయి, పుట 343). "దీనిలో కలాన్ని అధికారానికి, బడితెను సైన్యానికి, రూపాయిని ధనానికి ప్రతీకలుగా వాడాడు" (కాళోజీ నారాయణరావు జీవితం- సాహిత్యం, తూర్పు మల్లారెడ్డి, పుట. 180), కాళోజీ 1969లో తెలంగాణ ప్రాంతం అనావృష్టికి గురైంది. తీవ్రమైన నీటి ఎద్దడి ఉండేది. వరంగల్లులోని ధర్మసాగర్ చెరువు ఎండిపోయింది. ఎంత కరువు కాటకమచ్చినా ఈ చెరువు ఎండిపోయేది కాదు.

హన్మకొండలోని నక్కలగుట్ట వాటర్ ట్యాంకుకు ఎలాంటి మోటార్లు లేకుండా ధర్మసాగర్ నీళ్ళు వచ్చే ఏర్పాటు చేసింది నిజాం ప్రభుత్వం. కాని సమైక్య ప్రభుత్వం అవినీతిలో కూరుకుపోయి తెలంగాణ ప్రాంత అభివృద్ధిని మరిపించింది. అన్యాయాలు, అక్రమాలు చేస్తున్న ప్రభుత్వానికి ప్రకృతి కూడా సహకరించదని ఈ ప్రభుత్వ చర్యల వల్లనే మునుపెన్నడూ ఎండిపోని ధర్మసాగర్ చెరువు ఎండిపోయిందని కాళోజీ "నీతి బాహ్యమైన మార్గము/ రీతి నవలంబించి పదవులు/ చేరి పాలన పేర జేసిన/ వారి పన్నెండేండ్ల రాజ్యము/ మర్మ ఘాతుక చర్య ఫలితము/ ధర్మసాగర మెండి పోయెను. (ధర్మసాగరమెండె పాయెను, పుట. 351)అంటూ వేదన చెందాడు.

తెలంగాణ ప్రాంత అవసరాలు ఏమిటో పట్టించుకోకుండా తమ స్వార్థానికే పనిచేస్తుంది ప్రభుత్వం. ప్రజా ప్రభుత్వం పేర సీమాంధ్ర ప్రభు త్వం రహస్య ప్రణాళిక రూపొందించుకొని తమ ప్రాంతం అభివృద్ధికి పాటుపడుతూ తెలంగాణపై సవతి తల్లి ప్రేమ కురిపించడం కూడ అవినీతిలో భాగమే.

*రచయిత సెల్: 9949106968*



**కళాకారులు, సృజనశీలురతో...**

# నేతాజీ!



బానిసత్వపు కారుచీకటి
పారదోలగ నుదయ మొందిన
భారతీజాతీయ జీవిత భానుడా!
ఓ బోసుబాబు!
పట్టపగలే ప్రొద్దుగుంకినదా? ఆ
పాడుచావుకు కండ్లు గుట్టినవా?
పేరు వూరు లేక పృథ్వికి
భారమైన క్షుద్రజీవులు
పిరికిపందలు వేలు లక్షలు
చిరంజీవులుగా చరింపగ
వీరుడా నీకింత వేగిరమా? లేక
కరుణలేని కాల నిర్ణయమా?
శుక్లపక్షపు రోజులందును
చూడ పున్నమరేయినాడే
కటిక చీకటి క్రమ్ముకొనుటకు
కారుమబ్బులు కారణము గావా? మా
మందభాగ్యమె కొంపముంచినదా?
మా చందురునకమావాస్య వచ్చినదా?
గాంధితాతతో జగడమాడి
గద్దెనెక్కిన గడుసుతనము
మాయకారి ఆంగ్లనీతిని
మాయజేసిన ఇంద్రజాలము
చావుకే చవిచూప జంకితివా? చాలు
ఈ భవమని తలంచితివా?
చచ్చు పనులను చేయలేదని
చచ్చువాడవు కానెకావని
చావలేదని చావులేదని
చాటి చెప్పుచునుండ హృదయము-ఈ
చచ్చు వార్తల నమ్మమంటావా?
స్వామీ! వచ్చి దర్శనమివ్వనంటావా?

- కాళోజీ







# ప్రశ్నలు

పరిస్థితులెట్లా వున్నాయని కాదు
పరిస్థితుల్లో మనమెట్లా వున్నామని?
కొత్త ఏడెట్లా వుంటుందని కాదు
మనం కొత్త ఏట్లో ఎట్లా మునిగి తేలుతామని.
బ్రతకాలనే ఆరాటముండగా చావడం ఎట్లా అని కాదు
అనుక్షణం చావాలనిపిస్తూనే బ్రతకడం ఎట్లా అని?
"గడించిన అలౌకిక శాస్త్రీయ జ్ఞాన విజ్ఞానం ఎంతని కాదు
పోగొట్టుకున్న సామాన్య జ్ఞాన మెంతని?"
'బ్రతికి వున్నామని
చచ్చేదాకా బ్రతికి వుంటామని
చావువేళ తప్పేది కాదని
ముందు కూడ రానే రాదని'
మనకెంత మాత్రం తెలిసిందని ప్రశ్న.
అనుక్షణం చావుకై నిరీక్షించే
మనం బ్రతికి చచ్చిందెప్పుడు?
ఇంతకూ మనం ఇప్పుడు చావడం మాత్రం ఎట్లా?
మనం పడే పాట్లెన్నని కాదు
ఈ పాట్లన్నీ ఎందుకూ అని ప్రశ్న?
ఎప్పటి ఏడ్పు అప్పుడు ఏడిస్తే సరిపొయ్యే దానికి
ఎట్లా ఏడిస్తే
అసలు ఏడ్వన్నది లేకుండా పోతుందని ఏడ్పు ఎల్లప్పుడు
ఏమిటీ విపరీత బుద్ధి!
జిట్టెడు పొట్టకు చేరెడు నేల పండిస్తే చాలు
చిట్టెడు అలికితె పుట్టెడు
ఈ మాత్రం తెలిస్తే బ్రతుకు తేలిక
భారీ మనుషులకు బ్రతుకు తేలిక కావడం గిట్టదు
'మరేం'ద్రులు వారు
చేతుల, చేతలు వారి మరలకు సరిపడవు
'కు'బేరులు వారు
పంటలు వారి బేరాలు సాగనీయవు
వారసామాన్యులు
సామాన్యులంటే వారి కసహ్యం
సామాన్యుల సంఖ్య పెరిగితే వారికి భయం
తమ ఆటకట్టకుండా చూసుకుంటారు
ఎప్పుడు సరికొత్త ఎత్తులు వేస్తారు
ఉన్నవారికి బ్రతుకు లేకుండా చేస్తారు
ముందు వారిని పుట్టకుండా చూస్తారు
ఇదంతా మన కోసమంటారు
కాని మనం దీన్ని నమ్మడం ఎందుకని ప్రశ్న
ఉన్నదాన్ని - పూటపూటకు పుట్టుకొచ్చే దాన్ని
ఎప్పటికప్పుడు తీర్చుకుంటే తీరేదాన్ని-
అసలు లేకుండా చేద్దామని ఆరాటం, ఏడ్పు, ఎందుకని ప్రశ్న
ఏదో అడుగు తీసి అడుగేసే దానికి
ఏ అడుగెట్లా పడుతుందోనని
ప్రతి అడుగూ ఆచితూచి వేద్దామని
కంటకాలు లేకుండా చూచి
పూల మీదే పాదం మోపుదామని
పూలబాటే ఏర్పడ్డాక
ప్రయాణం ప్రారంభిద్దామని ఉపేక్ష
కంటకాలు లేని బాటే లేదాయెనని
ఏడ్పు ఎల్లప్పుడు
మరల మహిమా ప్రాబల్యమెంతని కాదు
ముడుచుక కూర్చున్న చేతులది ప్రశ్న
తుడిచిన అద్దం వంటి పట్టణ వీధులది కాదు
ముక్కు పుటాలను చీల్చే మురికి పేటలది ప్రశ్న
చంద్రమండలంలో ఆవాసమెప్పుడని కాదు
భూమండలం మీద ఆదిమ వాస మెన్నాళ్ళని ప్రశ్న
మరేంద్రుని మజా ఎంతని కాదు
సామాన్యుని బ్రతుకు యిరుసు, గీరలకు మధ్య
జనుమూ ఆముదం ఎంతని ప్రశ్న
పరిస్థితులెట్లా వున్నాయని కాదు
పరిస్థితుల్లో మనం ఎట్లా వున్నామని
కొత్త ఏడెట్లా వుంటుందని కాదు ప్రశ్న
కొత్త ఏట్లో మనమెట్లా మునిగి తేలుతామని ప్రశ్న
స్థాయి జంగమమై కూడ
స్థితి, గతి లేక స్థావరమెందుకైందని ప్రశ్న
వాడెవడో బోడంతా చేస్తున్నాడని కాదు
మనం వాని చేతులో తలెందుకు పెడుతున్నామని

- కాళోజీ





డా॥ గంటా జలంధర్‌రెడ్డి




కాళోజీ మొట్టమొదటగా కవి. ఆ తర్వాతే కథకుడు, విమర్శకుడు, దార్శనికుడు. ఇతర భాషల్లోని కవితలు తనకు నచ్చినట్లయితేవాటికి స్పందించి తెలుగువాళ్ళకు వాటిని పరిచయం చెయ్యాలని అనేక కవితల్ని అనువాదం చేశారు. అంతేకాక కథల్ని కూడా అనువాదం చేశాడు. కవితలలో ముఖ్యంగా చెప్పుకోదగ్గది, విశేషమైనది, ప్రపంచ ప్రఖ్యాతి గాంచినది ఖలీల్ జిబ్రాన్ రచించిన 'ది ప్రాఫెట్'. అనువాదం కాళోజీ ఈ కావ్యాన్ని చాలా సహజంగా తెలుగు భాషలో ఒదిగిపోయేటట్లుగా చేశాడు. కాళోజీ ఈ కావ్యాన్ని అనువాదం చెయ్యడానికి ఒక సంఘటన మూల కారణమ య్యింది. అంటే దీనికొక నేపథ్యం ఉంది అని అర్థం.

ఏల్చూరి సుబ్రహ్మణ్యంగారు ఒకసారి కాళోజీ రచించిన 'నాగొడవ' కవితలోని 'చెలిమి' గేయం చదివి ఖలీల్ జిబ్రాన్ రచనలు బాగా చదివి నట్లున్నారు అని కాళోజీతో అన్నాడట. అతనెవరో నాకు తెలియదని ఉన్నదున్నట్లు చెప్పాడు. చదువకుండానే ఆ కవి భావాలు, మీ భావాలు ఎలా కలిశాయి- ఇది ఆశ్చర్యంగా ఉందే అని, 'ది ప్రాఫెట్' పుస్తకాన్ని ఏల్చూరి వారు వెతికి తెచ్చి ఇచ్చారు. దాంతో ఆ పుస్తకం మొత్తం చదివి అనువదించేదాకా నిద్రపోలేదు- కాళోజీ. 'ఈ విశ్వంలో ఒక కవికి తెలియకుండా మరో కవి గాని ఒక తాత్త్వికుడు చెప్పిన విషయం మరో తాత్త్వికుడు చెప్పినట్లయితే దాన్ని 'స్టిల్ పాయింట్' అంటారని ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు అన్నట్లు ఆదవాని హనుమంతప్పగారు అన్నారు. అలాంటి సామ్యమే ఖలీల్ జిబ్రాన్ భావనకు, కాళోజీ భావనకు ఉంది. ఇక 'జీవన గీత'లో ఉన్న తాత్త్వికతను దర్శిద్దాం.

ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్' కావ్యాన్ని అఖండ కావ్యంగా రచించాడు. కవితలో ఎక్కడా శీర్షికలు లేవు. ఈ రచనా పద్ధతే అద్భుతంగా ఉంది. అనేక విషయాలు ఇందులో ఉన్నాయి. కాళోజీ దీన్ని 'జీవనగీత'గా అనువదించాడు. జిబ్రాన్ చిన్న వయస్సులోనే అరబ్బీ భాషలో రచించి తన తల్లికి వినిపించాడు. తల్లి బాగానే ఉంది కాని, ఇంకా పరిపక్వత రాలేదన్నది. దాంతో ఏడుసార్లు పదేళ్ళపాటు రాశాడు. సరిగ్గా అదే పరిస్థితి కాళోజీకి ఎదురయింది. కాకపోతే అనువాదం బాగులేదని కాదు, ఒకసారి అనువాదం చేసిన తర్వాత అది పోగొట్టుకుపోవడంతో మళ్ళీ వ్రాశాడు. సుమారు రెండు మూడు సార్లు వ్రాసినా వ్రాత ప్రతులు పోయాయి. దాంతో కాళోజీ 'జీవన గీత'ను మళ్ళీమళ్ళీ వ్రాశాడు. ఇలా మూల కవి,అనువాదకుడు ఇద్దరూ అనేక పర్యాయాలు ఈ కవిత ను రచించడం కాకతాళీయమే అయినా అది పరిపక్వత పొందడానికి ఉపయోగపడిందని అనుకోవచ్చు.

ఈ 'జీవన గీత'లో శీర్షికలు లేవని చెప్పుకున్నాం. అయితే అనేక అంశాలు ఇందులో ఉన్నాయి. ఒక విషయానికీ, మరొక విషయానికీ అనుసంధానం ఉంది. పట్టణంలోని ప్రజల్లో ఎవరో ఒకరు ఒక విషయాన్ని అడగటం, 'ఆల్ ముస్తఫ' అనే తాత్త్వికుడు దానికి సమాధానం చెప్పడం ఇలా సంవాదంలాగా సాగుతుంది ఈ కవిత. ఆ తర్వాత మరొకరు మరొక విషయాన్ని అడగటం, ఇతడు దానికి సమాధానం చెప్పడం. ఇలా అనేక విషయాలు ప్రస్తావనకు వస్తాయి. ప్రేమ, వివాహబంధం, దానం, కాయకష్టం, సంతోషం- దుఃఖం, తన్నుతాను తెలుసు కోవడం, మంచి-చెడు మొదలైన విషయా లెన్నో ఈ కవితలో ప్రస్తావనకు వస్తాయి.

## ప్రేమ

అల్ మిత్ర అనే ఆమె ప్రేమ, వివాహ బంధం అనే విషయాలను అడిగింది. దానికి అల్ ముస్తఫ ఇలా చెప్పసాగాడు.

ప్రేమ యిచ్చునది ప్రేమయె/ ఇవ్వలేదు ఇంకేదియు
ప్రేమ తీసుకొను ప్రేమయె/ తీసుకొనదు ఇంకేదియు
ప్రేమ వశము చేసుకొనదు/ వశము కాదు తానెప్పుడు
ప్రేమకు ప్రేమయే చాలును

ప్రేమ ప్రేమను ఇస్తుందే తప్ప ఇంకేదాన్నీ ఇవ్వదు. ప్రేమిస్తే ప్రేమ పుడుతుంది. ద్వేషిస్తే ద్వేషమే పుడుతుంది. ప్రేమలో వ్యక్తి యొక్క వ్యక్తిత్వం లుప్తమవుతుంది. ఏ ఇద్దరి మధ్య అయినా అహం (ఇగో) చోటు చేసుకుంటే అక్కడ ప్రేమ ఫలించదు. అహం అణచుకుంటేనే ప్రేమ పుడుతుంది. అహం నశిస్తేనే ప్రేమకు తావు ఉంటుంది. ప్రేమ ప్రేమనే తీసుకుంటుంది. ప్రేమప్రేమనే ఇస్తుంది. ప్రేమ ఇంకేదాన్నీ తీసుకోదు. ప్రేమ దేనికీ వశం కాదు, ప్రేమకుప్రేమే చాలు.ప్రేమ మిమ్మల్ని పిలవగానే దానివెంట పొండి. ప్రేమ త్రోవ ఎంత కఠినమైనా నిటారైన దాని వశం కాండి. ప్రేమ మీ పెంపునకు కారణమైనట్లే మీ తెంపునకు కూడా కారణమవు తుంది.

ప్రేమ ఇంకా ఏమేమి చేస్తుందో వ్యవసాయ వృత్తిపదాలతో, పంటలు ఒడుపుకునేటప్పుడు కల్లంలో నూర్పిళ్ళు ఎలా చేస్తారో వాటితో పోల్చడం అద్భుతంగా ఉంది.

ఎన్నులుగల కర్రల వలె/ ప్రేమ మిమ్ము ఏరికోరి
తన కల్లములో మెదవేయును/ బంతి గట్టి గడ్డి నుండి విడదీయును
పొట్టంతయు రాలునట్లు/ రోళ్ళబోసి మిము దంచును
చేటల చెరగును, జల్లెడ పట్టును/ పిండిజేయు మిము
తిరుగళ్ళలో బోసి విసరు/ జిగి, బిగి చేకూర్చుటకని
మిమ్ము తడుపు, నలుపు, ప్రేమ/ ఆ తడుపరి రొట్టెలుగా కాల్చి

మిమ్ము నైవేద్యముగా నొసగును

కాసేపు ప్రేమ విషయం అటుంచి కవి పోల్చిన వ్యవసాయ వృత్తి పదాలను పరిశీలిద్దాం. రైతు వరి, కొర్ర, జొన్న మొదలైన పంటలు పండించేటప్పుడు, పంటలు దిగుబడి చేసుకునేటప్పుడు ముందుగా పైరు కోసి మెదలు మెదలుగా పెడతారు. తర్వాత కర్రలను, ఎన్నులను వేరు చేస్తారు. అంటే వరి కంకులు, కొర్ర కంకులు, జొన్న కంకులు మొదలైనవి. వరి కల్లమయితే వరి కుప్పలు వేసి ఎద్దులకు గుండు కట్టి గడ్డి మీద బంతిని తిప్పుతారు. అప్పుడు పొట్టంతా గింజలతోసహా రాలి పోతుంది. ఇంకా సరిగా కంకుల నుంచి గింజలు రాలకపోతే రోళ్ళలో పోసి దంచే వారు. చేటలతో చెరుగుతారు. జల్లెడ పడతారు. ఆ తర్వాత తిరుగళ్ళతో (విసరురాళ్ళలో) పోసి విసరుతారు. అటు తర్వాత పిండి జేస్తారు. జొన్నపిండితోనూ, రాగిపిండితోనూ రొట్టెలు చేస్తారు. వడ్లతో అయితే బియ్యం చేసుకుంటారు. ఇలాగే ప్రేమ కూడా ఎన్నులు గల కర్రలలాగా ప్రేమ ఏరి కోస్తుందట. కల్లంలో మెద వేస్తుంది. గడ్డి నుంచి గింజలను విడదీసినట్లు విడదీస్తుంది. రోళ్ళలో పోసి దంచుతుంది. విసరురాళ్ళలో (తిరుగళ్ళలో) పోసి పిండి జేస్తుంది. ప్రేమ అనే పిండిని తడుపుతుంది. నలుపుతుంది, తర్వాత రొట్టెలు కాలుస్తుంది. నైవేద్యంగా ఇస్తుంది. ప్రేమ మిమ్మల్ని ఇన్ని తీర్లుగా పుటం బెడుతుంది. ఆ ఎరుక వల్ల మీకు జీవన హృదయ భాగ్యమైన భాగ్యం కలుగుతుందని ముస్తఫ తెలియజేశాడు. కవి ఇక్కడ మంచి రైతు వ్యవసాయ పదాలను నుడికారాలుగా వాడాడు. కల్లంలో మెదలు వేయడం, బంతి కట్టడం, రోళ్ళబోసి దంచడం, తడపడం, నలుపడం, జిగిబిగి చేకూర్చడం, రొట్టెలు కాల్చడం మొదలైనవాటిని నుడికారాలుగా వాడాడు కవి. పంటలు ఒడుపుకునేటప్పుడు అవి వ్యవసాయ పదాలు అవుతాయి. ఇక్కడ అనువాదకుడైన కాళోజీ నేర్పు- మెలకువ మెచ్చుకోదగ్గది. చివరగా ప్రేమ సారాంశాన్ని ఇలా తెలియజేశాడు కవి- అల్ ముస్తఫ మాటల్లో.

**నీవు ప్రేమించినపుడు- / "దేవుడు నా హృది కల"దని**
**అనకూడదు / అంతకన్న / "దేవుని హృదయాన నేనున్నా"నని**
**అనవచ్చును/ ప్రేమకు మార్గము చూపుట శక్యంబని**
**తలచరాదు / మీరు ప్రేమ కర్హులైన ప్రేమ మీకు**
**బాట జూపు / ప్రేమకు మరో కోర్కె లేదు**
**స్వయం సంతుష్టి తప్ప**

'దేవుడు నా హృదయంలో ఉన్నా'డనే దానికంటే 'దేవుని హృదయంలో నేనున్నా'నని అనాలట. ప్రేమకు వేరే కోరిక ఏమీ లేదు. ప్రేమకు స్వయంగా సంతృప్తి తప్ప వేరే ఏమీ ఉండదని చాలా చక్కని సందేశమిచ్చాడు- ముస్తఫ రూపంలో కవి.

సంతోషం - దుఃఖం

అర్ఫలీజు పట్టణం నుంచి వచ్చిన స్త్రీలలో ఒకతె 'సంతోషమంటె ఏమిటి? దుఃఖమంటే ఏమిటి?' అని ప్రశ్నించింది. అప్పుడు అల్ ముస్తఫ ఇలా బదులు చెప్పాడు.

'మీ సంతోషం అనే ముసుగును తొలగిస్తే అదే మీ దుఃఖం అవుతుంది. మీ నవ్వులు, మీ సంతోషాలు పొంగిపొర్లే బావికి గల ఊటలన్నీ గతంలో మీరు మీ దుఃఖం ఒనగూర్చిన కన్నీళ్ళే. ఇంకా ఎక్కువగా మీ దుఃఖం మిమ్మల్ని తొలిచేకొద్దీ సంతోషం నింపుకునే మా పాత్రత పెరుగుతూనే ఉంటుంది.' అంటే సంతోషాన్ని అనుభవించడానికి మీకు అర్హత మరింత పెరుగుతుందని భావం.

అల్ ముస్తఫ మీకు దుఃఖం కలిగినప్పుడు ఏ మాత్రం బాధపడవద్దంటాడు. ఎందుకంటే ఇప్పుడు దుఃఖపడుతున్నామంటే సమీప భవిష్యత్తులో సంతోషం రాబోతోందని అర్థం.దీన్ని దృష్టాంతపూర్వకంగా నిరూపించాడు. కుమ్మరము (వామి)లోని మట్టికుండ మంటల్లో కాలటంచేతనే కదా! ఆ మట్టికి మధుర రసం నింపుకునే అర్హత కలిగింది. వెదురు బొంగు తాను కత్తిపోట్లకు గురై దాని ఎదపై రంధ్రాలు (తూట్లు) పడటం వల్లనే కదా అది మురళిగా మారి అంత మధురమైన స్వరాలాపనకు అర్హత పొందినది. కాబట్టి సంతోషం కలిగినప్పుడు ఎవరంతకువారు వాళ్ళ హృదయాల్లో ఒకసారి వెనుకకు తేరిపార చూసుకుంటే ఇంతకుమునుపు వాళ్ళ దుఃఖానికి కారణమైనదే ఇప్పుడు వాళ్ళ సంతోషానికి కారణమయిందని కచ్చితంగా చెప్పవచ్చు.అలాగే ఇంతకు మునుపు పొందిన సంతోషానికి కారణమైనదే ప్రస్తుత దుఃఖానికి కారణమవుతున్నదని కూడా కచ్చితంగా తెలుస్తుంది. దీన్నిబట్టి అర్థమవుతున్నదేమిటంటే సుఖదుఃఖాలు మానవ జీవితంలో కావడికుండలని. అవి ఒకదాని వెంబటి ఒకటి వస్తాయని తెలుస్తుంది. సుఖం కలిగినప్పుడు పొంగిపోవడం, దుఃఖం కలిగినప్పుడు కుంగిపోవడం రెండూ తగదని హితోపదేశం చేశాడు కవి. అందుకే అల్లీసాహెబు అనే మరొక తత్త్వవేత్త (1800-1895) తన తత్త్వగీతంలో ఇలా సుఖదుఃఖాల జంటలను సమానంగా భావించాలని తెలియజేశాడు.

అల్ ముస్తఫ పురప్రజలనుద్దేశించి ఇంకా ఇలా చెబుతూ పోయాడు. దుఃఖంకన్నా సంతోషమే గొప్పది అని కొందరు అంటారు. మరికొందరు కాదు కాదు దుఃఖమే గొప్పది అని అనుకుంటారు. అలాగాక నేను చెప్పేదేమిటంటే "ఆ రెండును ఒక్కటెయని విడదీయుటకు వీలు లేనట్టివియని, అవి యెప్పుడు కలిసిమెలిసియే వచ్చును" అని అన్నాడు.

ఈవిధంగా అల్ ముస్తఫ రూపంలో ఖలీల్ జిబ్రాన్ కవి చెప్పిన విషయాలను కాళోజీగారు చాలా జాగ్రత్తగా అనువదిస్తూ, అందులోని తాత్త్వికతను పాఠకులకు అర్థమయ్యేటట్లుగా తెలుగు నుడికారాలతో, తెలుగు ఒడుపుతో అనువదించాడు. ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్' కవితల వల్ల, ఈ అనువాదం వల్ల అభివ్యక్తమైన తాత్త్వికత ద్వారా జాతీయ సమగ్రత మాత్రమే కాకుండా అంతర్జాతీయ సమగ్రత చేకూరుతుందనడంలో ఏమాత్రమూ సందేహం లేదు.


*(అధ్యక్షులు, తెలుగుశాఖ, ఏ.వి. కళాశాల, హైదరాబాద్)*

***రచయిత సెల్: 98482 92715***





నాగిళ్ళ రామశాస్త్రి

# ఆ నెలరోజులు...





*దసరా పండుగ, అక్టోబర్ 15, 2002 ఎప్పటి వంతుగనే తెల్లారింది. వాణి దగ్గర్నించి తొమ్మిదిన్నర- పదిగంటలకు ఫోన్- "చిన్న తాతయ్య పడ్డడు తుంటి విరిగింది గద బావా" అని వెంటనే బయలుదేరి పోయిన. చిద్విలాసంగ పండుకొని ఉన్నడు కాక. వివరాలు చెప్పింది వాణి. పండుగనాడు, కిరాయిదారు వేంకటేశ్వర్లు, నాస్తా కోసం పిలిచిండట. స్నానం చేసి కొత్తబట్టలు కట్టుకొని, వేంకటేశ్వర్లింటికి పొయ్యేవరకల్ల ఆయన స్నానం చేస్తుంటే, మళ్ళ వస్తనని మెట్లు దిగబొయి దర్వాజల్లనే పడ్డడు తుంటి బొక్క విరిగింది. అంత సీరియస్ విషయాన్ని- కాళోజీ- 'ఇదెర్కేనా నీకు- పడితె విరిగింది బొక్క అంటరు గాని, విరిగినాంకె పడ్తమట' అని అన్నడు నవ్వుకుంట.*

కాళోజీ శ్రేయోభిలాషులు డా॥ లక్ష్మణమూర్తి, వి.వి.ఎన్.శాస్త్రి, సతీష్‌చందర్, డా॥ వెంకట్రావులకు ఫోన్ చేసిన. వాండ్లు వచ్చింద్రు. ఈ లోపటనే వేలూరు రాములు కుటుంబంతోసహా వచ్చిండు. జై శంకరు సారూ వచ్చిండు 'క్యా ఈద్ ముబార్ బోల్నేకే వాస్తే ఆయేక్యా'- అనుకుంట 'ఈద్ ముబారక్' అన్నడు. డాక్టర్లందరూ చర్చించుకున్నరు. కాళోజీ వయసు దృష్ట్యా, ఆయనకు ఒక్కటే ఊపిరితిత్తి ఉన్న దృష్ట్యా, పోస్ట్ ఆపరేషన్ కాంప్లికేషన్సు ఏమన్న తలెత్తే వీలున్న దృష్ట్యా, హైద్రాబాదు పోవడం మంచిదన్న అభిప్రాయం వ్యక్తం చేసింద్రు. అక్కడైతే నిమ్స్‌లో ట్రీట్‌మెంట్ బాగుంటదని. ప్రభుత్వం చికిత్స చేయిస్తదని జిల్లా కలెక్టరు ప్రభాకర్‌రెడ్డిగారికి ఫోన్ చేసినా. ఆయన వెంటనే వచ్చిండు. నమస్కారం అన్నడు.

కలెక్టరుగారు వచ్చింద్రని చెప్పిన. గ్లకోమా కారణంగా వచ్చిన వాండ్లు మాట్లాడితినే లేకుంటే చెప్తేనో తెల్సేది. కాళోజీకి చెప్పిన. కలెక్టరుగారు వచ్చిండని 'కలెక్టరుతో మనకేం పనిలేదు గద' అన్నడు. ప్రభాకర్‌రెడ్డి గారు సౌమ్యులు, 'నేను ప్రభాకర్ రెడ్డిగనే వచ్చిన, కలెక్టర్‌గ రాలేద'ని అన్నడు. 'అయితే మంచిదే ఏమన్న చాయ్ పానీ? ఆ...' అన్నడు. కలెక్టరు గారు జిల్లా మంత్రి కడియం శ్రీహరికి ఫోన్ చేసిండు, నిమ్స్ సూపరింటెండెంట్‌కు ఫోన్ చేసిండు, సాయంకాలం 5 గంటలకల్లా తీసుకవస్తే చికిత్స ఆరంభిస్తమన్నరట వాండ్లు.

డా॥ శాస్త్రిగారు తన అంబులెన్స్ ఇస్తే వేంకటేశ్వర్లుకు డ్రైవింగ్ వచ్చు గనక హైద్రాబాద్ పోవాల్నని డిసైడైనం. నేను, వాణి, సంతోష్ ముగ్గురం. వేలూరు రాములుకు వాండ్లబ్బాయి ఎంగేజ్‌మెంట్ దగ్గర్లో ఉండె. కనక రాలేని స్థితి. అంబులెన్స్ వచ్చింది అండ్ల ఎక్కించినం- చిన్నమ్మ ఏడుస్తుండె, చెంపలు పట్టుకొని ఎందుకేడుస్తున్నవ్ అని ధైర్యం చెప్పిండు కాళోజి. "శాస్త్రీ కాకను నీ చేతుల బెడ్తున్న పదిలంగ తీసుకవచ్చే జిమ్మెదారి నీదేనన్నది చిన్నమ్మ", ఏమంట? మంచిదన్న.

ఈలోపట తెలంగాణ ప్రభాకర్‌కు ఫోన్ చేసిన వస్తున్నమని. మరి అక్కడ అడ్డా ఆయనింట్లనే









ప్రభాకర్ నేనూ వాణి అందరం లోపలికి బోయినం. లోపట అప్పటి వరకెదిరి చూసి బొక్కల డాక్టర్ వెళ్ళిపోయిండట. కాకర్ల సుబ్బారావు సూపరింటెండెంట్ అప్పుడు. ఆయన, ఇంక డ్యూటి డాక్టర్లు వున్నరు. జూనియర్ డాక్టర్లు వున్నరు. కేస్ హిస్టరీ రాయాలె గద.

ఇదివరకు వచ్చిన జబ్బుల వివరాలడిగింద్రు. స్టెత్ పెడ్తె ఊపిరితిత్తులు రెండున్నట్లు లేవు. అదేందంటే, తను ఇంటర్మీడియట్‌ల ఉండంగ టి.బి. వస్తే దాన్ని ఇనాక్టివ్ చేసింద్రన్నడు కాళోజీయే. జూనియర్ డాక్టర్‌కు అర్థంగాలే. డాక్టరు నీకు తెల్వకుంటెట్లనయ్యా, ఆనాడు ట్రీట్‌మెంట్ అదే. దానికి స్ప్రోక్స్ చేసి ముడుచుకుపోయేటట్టు చేసింద్రు అని చెప్తే ఆ జూదాకు అర్థంగాక సీనియర్ను అడిగిండు. తర్వాత కాకర్ల సుబ్బారావు వచ్చి చూచిండు. ఏంచేద్దాం అంటే, పైకి పంపించండి అన్నడు. ఆయన ఎట్లన్నడో నాకు తెల్వదు గానీ పైన వార్డుకనీ అనుకున్న. బొక్కల వార్డు పైనే ఉన్నది. ఆ రోజు రాత్రి కొన్ని పరీక్షలు చేసింద్రు.

రాత్రి ప్రభాకర్ ఇంట్ల పనిచేసే పిల్లవాడు దస్రు గూడ ఉండే, నేను సరేసరి. తెల్లారి డా॥ నరేంద్రనాథ్, ఆర్థో చీఫ్ వచ్చిండు- అయితే మర్చి పోయిన ఈ పదివేల సంగతి శ్రీహరి గారికి చెప్పిన. ఎవదయ్యా పైసలు దీస్కున్నది నేను చెప్పిన గద, రాష్ట్ర ప్రభుత్వం భరిస్తది పైసలు- ఆయన ఫ్రీడమ్ ఫైటర్ గదా, నేను మాట్లాడుత మరొక్క పైస కట్టకుంద్రి అన్నడు. వాండ్లు పైసలడిగినప్పుడల్లా నేను శ్రీహరి గారి పేరు చెప్పిన.



గద. శ్రీహరిగారు, హైద్రాబాద్ అవుట్ స్కర్ట్స్ రాంగనే తనకు ఫోన్ చేయమన్నడు. కాళోజీ అంబులెన్స్‌ల పన్నడు. సరిగ్గా జనగామ బైపాస్ రోడ్డు తిరగంగనే రోడ్డు దిక్కు చూడకుండనే- జనగాం బైపాసా! అన్నడు ఎట్లు తెల్సిందో నాకైతే ఆశ్చర్యమే. ఉప్పల్ రింగ్ రోడ్డు దగ్గరా అంతే- చక్కగ రామంతపూర్ మీంచి పోంద్రి అన్నడు. వెంకటేశ్వర్లకు ఆ రూట్ సరిగ్గ తెల్వదట, నాకు సరిగ్గ దెల్వదు. ఇటు తార్నాక దిక్కు బండి మలిగింది. బేవకూఫ్! చెప్తున్న వెనబడ్తలేదా, ఇట్లెందుకు దిరుగుతున్నరు అన్నడు. బండిలో ఆయన లేచి చూసే పరిస్థితుల్లోనే లేడు. కాని రూట్ గుర్తు పట్టిండు. తిట్లబడుడు నాకలవాటే గనక నేనేం మాట్లాడలే. విసుక్కున్నడు.

తార్నాక రాంగనే శ్రీహరి గారికి ఫోన్ చేసిన "నేనిదివరకే మాట్లాడిన, మీరు చక్కంగ బోంద్రి" అన్నడు. ప్రభాకర్‌రెడ్డి కలెక్టరు మాట్లాడిండు గద. అయినతోటి టచ్‌లనే ఉన్న. బండి జాగ్రత్తగ నడపటం వల్ల కొద్దిగ ఆలస్యం అయింది, నిమ్స్ పొయ్యే వరకు. ఓ.పి.లకు పోయిన అడ్మిషన్ దగ్గర పదివేలు కట్తెనె అడ్మిషన్ చేసుకుంటం అన్నరు. పదివేలు గట్టిన.



**అనుకోకుండ, యు.ఎస్.ఎ.లో ఉన్న నా చిన్న కొడుకు ఓ 15 రోజుల కోసం ఇండియాకు వచ్చి నవంబర్ 4వ తారీఖున వెళ్లిపోతూ కాళోజీని చూడదానికి వచ్చిండు. వాడంటే కాళోజీకి ప్రత్యేక అభిమానం. వాడు కూడ 9వ సెప్టెంబర్ నాడే పుట్టిండు. ఆయన 60వ సంవత్సరం లో ప్రవేశించిన రోజు. ఇద్దరి బర్త్‌డేలు ఒక్కటే. వాడు ఐ.సి.యు.లోనే ఆయనను కలిసిండు. కాళోజీ బాగానే మాట్లాడిండు. మేంటేన్ అవుతున్నది హెల్త్ అనుకున్నం.**



అన్ని పరీక్షలు నెత్తురు, మూత్రం, ఎక్స్-రే, యం.ఆర్.ఐ. స్కానింగ్, బ్లడ్ గ్రూప్ వాండ్లిష్టం. చేయని పరీక్ష లేదు. ఆయనకు కాన్‌స్టిపేషన్, మోషన్ ఫ్రీ ఉండదు. మోషన్ కోసం మందులు వేసుకున్నా అంతే, వేలుతో ఎవాక్యుయేట్ చేయాల్సి వచ్చేది. నేనూ- దస్రూ- అట్ల చేసేటివాండ్లం. 16 నాదు పరీక్షలన్నీ చేసింద్రు. 17 నాదు ఆపరేషన్ చెయ్యాలని ఫిక్స్ చేసింద్రు. బ్లడ్ తెచ్చుకోమన్నరు. మళ్ళీ శ్రీహరిగారికి ఫోన్ చేసిన. ఆయన వీళ్ళ ఫోన్ సూపరింటెండెంట్‌కు ఫోన్ చేసి- మందులు అన్ని క్రెడిట్ పెట్టండి. ప్రభుత్వం భరిస్తుందని చెప్పినట్టున్నాడు గట్టిగా. ఇగడగలేదు నన్ను.

17 పొద్దున్న ఆపరేషన్ థియేటర్లకు తీస్కపోయింద్రు. మేమంతా వరండాల తిరుగుకుంట ఉన్నం. అక్కడదో తిప్పలు, ఉండనీయరు వాండ్లను తప్పించుకుంట ఉండాలె. ఆపరేషన్ చేసి ప్లేట్ వేస్తరు అన్నరు. డా॥ నరేందర్‌నాథ్‌గారు మంచిగ మాట్లాడిండ్లు. రెండు మూడు గంటల తర్వాత థియేటర్ల నుంచి తీసుకవస్తున్నరు. డాక్టర్‌గారు ముందర వచ్చి హూ ఈజ్ శాస్త్రి- ఆయన ఒకటే కలువరిస్తున్నడు. ముందర ఆయనను రమ్మనుంద్రి అన్నడు. నేను బోయిన దగ్గరికి కాక! శాస్త్రిని అన్న, ఉన్నవా ఇక్కడే అంటే ఉన్న అన్న. సగం మత్తులోనే ఉన్నడు. ఐ.సి.యు.లోకి తీస్కపోయింద్రు నన్ను రానిచ్చింద్రు, అందరూ వచ్చి చూసింద్రు.

నరేంద్రనాథ్ గారు చెప్పింద్రు- ఆయన వి.ఐ.పి. అని మాకెర్కేగాని, చాలామంది వచ్చిపోతుంటే- ఇన్‌ఫెక్షన్ వచ్చే అవకాశం ఉంటది. తర్వాత నన్ననవద్దు. ఎంత తక్కువ మందివస్తె అంత మంచిదన్నాడు. ఆపరేషన్ చాలా బాగ జరిగింది. భయం లేదన్నడు. ఆ రోజు గడిచింది. ప్రభాకర్ ఇంట్లనే మా తిండి. రికాన, కాళోజీ అభిమానులందరికి చెప్పినం మతలబు. ప్రభాకర్ తన ఫోన్ మా దగ్గరే ఉంచిండు. అప్పుడు సెల్‌ఫోన్ల వాడకం ఇంత విరివిగ లేదు. దవాఖాన ఏమేం టెస్టలు చేస్తున్నరు. ఏం రిజల్ట్సు వస్తున్నయి, ఏం మందులు రాస్తున్నరు. నేను కేసు షీటు ప్రకారం వెంటవెంటనే డా॥ లక్ష్మణమూర్తి గారికి చెబ్తుండేవాణ్ణి. ఓపిగ్గా ఆయన జవాబు చెప్తుండే వాడు. ఆ నెల రోజుల ఫోన్ బిల్లు పదివేల పైనయింది. వరంగల్‌ల మిగిలిన డాక్టర్లకు ఈ విషయాలు తెలియ జేసినం.

ఒకటి రెండు రోజులు గడిచినయి. కొంత ఇంప్రూవ్‌మెంట్ ఉన్నది- ఐ.సి.యు.లో ఎసి ఉంటుంది. ఆయనకు ఎసి పడదు. కొద్దిగా దగ్గు వస్తుండే- ఆ దగ్గు వల్ల కఫం జమైతది గనుక, రోజు రెండు సార్లు ఫిజియోథెరపీ డాక్టరు వచ్చేవాడు డా॥ కిశోర్ అని వచ్చి ఛాతి మీద, వీపు మీద చేత్తో గొట్టి కఫం తీసేవాడు. 'తబలా వాయించుడు మంచిగనే







నేర్చుకున్నవు గద' అన్నడు, ఓ రోజు ఆయనతోటి కాళోజీ. నార్మల్ ఫుడ్ పెట్టమన్నరు.

ఒకరోజు డా॥ నరేంద్రనాథ్ వచ్చి నారాయణరావు గారూ ఎట్లా వున్నారు అని అడిగిండు, గిన్ని గొట్టాలు పెట్టి ట్యూబులు పెట్టి, ఎట్లడగబుద్ధె తున్నదయా నీకు మంచిగున్నవా అని కాళోజీ అంటే నవ్విండు డాక్టరు. ఓ రోజు ప్రభాకర్ చితపల్క పండ్లు తింటరా అన్నడు. తింట గాని ఇప్పుడెక్కడివి అన్నడు. ప్రభాకర్ వ్యాన్ వేసుకొని హైద్రాబాద్ అంతా తిరిగి పండ్లు తీసుకొని ఇంట్ల గింజలు తీసి గ్రైండ్ చేసుకుని వచ్చిండు. అంత ప్రేమ కాళోజీ అంటే ప్రభాకర్‌కు. తెస్తే రెండు మూడు చెంచాల కంటె ఎక్కువ తిన్లేదు.

ప్రభాకర్ ఇంట్ల స్వయంగా కాళోజీకిష్టమైన వంటకాలు, మెడికల్ అడ్వైజ్ ప్రకారం చేసి పట్క వచ్చేటోడు. నేను, వాణీ, సంతోష్ ప్రభాకరింట్లనే తింటి. ప్రభాకర్ భార్య సరస్వతి గారు, పిల్లలు అజిత, సూరజ్-సీత అందరూ కాళోజీని అమితంగా ఇష్టపడేవాళ్ళే. మాకు, ముఖ్యంగా నాకైతే, మా ఇంట్లనే ఉన్నట్లనిపించింది. ఐ.సి.యు.ల ఉండగనే, జైశంకర్ సారు వచ్చిండు. కాళోజీ ఆయనతోటి చట్టాలు, ప్రజలు ప్రభుత్వ ఇన్ ఆక్టివ్‌నెస్ గురించి మాట్లాడిండు చాన సేపు. కొంత కొహిరెన్స్ లేకపోవడం ఉంటుండె. కొద్దిగ భయమూ ఐతుండె. కోదాటి నారాయణ రావు వచ్చిండు ఓ రోజు. నారాయణ త్రయంల ఒకడు. కాళోజీకి ఆయనకు వయసుల మూణ్ణెల్లే తేడా. ఇంకొకాయన, కొమరగిరి ఖమ్మం.

ఒక రోజు పి.వి. వస్తున్నడని దేవులపల్లి ప్రభాకర్‌రావు వచ్చి చెప్పిండు. కాని, కాళోజి ఐ.సి.యు.ల వున్నడు ఎవర్నీ కలవనిస్తలేదని సూపరింటెండెంట్ చెప్పిండట అని రాకుండనే వెళ్ళిపోయిండు. ఒకనాడు జితేందర్, వాండ్ల బంధువొకడు ఆర్.యం.ఓ.గా ఉండె. ఆయనతో వచ్చిండు. కాళోజీతో మాట్లాడుతుండె. అప్పుడే నరేంద్రనాథ్‌గారు వచ్చిండు. ఇక ఆరోజు ఆయన నా మీద ఎగిరిండు గదా- తెల్లారి నన్ను రానీయదనుకున్న, నేనిదివరకు చెప్పిన. ఇన్‌ఫెక్షన్స్ వస్తదని. జనం రావద్దని నాకు తెల్సు ఆయన వి.ఐ.పి. అని కాని ఆయన హెల్త్ ఆయనకంటె మాకు ముఖ్యం. మీ ఇష్టం ఏమన్నయితె నన్ను బ్లేమ్ చెయ్యొద్దు అని చాలా కోప్పడ్డడు. తెల్లారి మామూలుగనే మాట్లాడింది.

కాళోజీ ఆరోగ్యం గురించి ఎంక్వైరీ- అదీ. మధ్యల, డా॥ ఎ.గోపాల క్రిష్ణ (నెఫ్రాలజీ, వడ్డెపల్లి) వచ్చి చూసిండె. చాలామంది వస్తుండిరి. కాళోజీని ఓ రోజు వి.ఐ.పి. సూట్‌లోకి మార్చిండ్రు. విజిటర్లకు సోఫాలు, వంట గది, ఎ.సి. అన్ని ఉన్నయి అండ్ల- నన్ను మీ మనుషుల మధ్యనే ఉంచండి. మనుషులు చుట్టు లేకపోతే నాకు తోచదని కాళోజీ అన్నా అక్కడ్నే ఉంచిండ్రు. ఓరోజు వీల్‌చైర్ల అటూ ఇటూ తిప్పుతుంటి వరండాల. రమణ, అన్వర్ వచ్చిండ్రు. తన సహజ ధోరణిలోనే మాట్లాడిండు కాళోజీ. మధ్యమధ్య ఒక రోజు మంచిగ ఉండుడు, ఒక రోజు ఉండకపోవుడు. ఒక రోజు లంగ్స్‌ల ఇన్‌ఫెక్షన్ వచ్చిందని, ఆక్సిజన్ సరిపోవటం లేదని రెస్పిరేటరీ ఐ.సి.యు.లో పెట్టిండ్రు. అప్పుడే డిజిపి పి.రాములు వచ్చిండు. ఆఫ్రాన్, నోటికి మాస్క్ నెత్తికి టోపి పెట్టి లోపలికి తోలిండ్రు అధికారులు. ఇన్ని ముసుగులున్నా కాళోజీ గుర్తుపట్టి మాట్లాడిండు. 'ఓ రాములా! బాగున్నవా' అని. ఇవతలికి రాగానే రాములన్నడు 'పెద్ద మనిషి బాగానే గుర్తు పట్టిండయా ఆయన యాది పెద్దది' అన్నడు.

తరువాత రొటీన్ నడుస్తూనే ఉండే. డా॥ లక్ష్మణమూర్తితో రోజూ మాట్లాడుతనే ఉంటి. నేను వాణి హాస్పటల్‌ల ఉంటుంటిమి. సంతోష్ మధ్యమధ్యల వరంగల్ కాలేజికి పోయి వస్తుండే. ఈ నడుమనే వేలూరు



*కాళోజీ కవిత అక్షరం కాదు నాదం- నినాదం. నాదం-నినాదం పెదవులు పలుకవు. గుండెలు పలుకుతాయి. గర్జిస్తాయి. నిప్పులు రాలుస్తాయి. పూలు రాలుస్తాయి. కన్నీరు రాలుస్తాయి.*

*కాళోజీకి కల్ల, కపటం, ద్వేషం, కార్పణ్యం, పగ, వగ తెలియవు. అతడు నిర్మలమైన అద్దంలాంటివాడు. అతని ప్రతి పలుకు, ప్రతి పదం స్వచ్ఛంగా, నిర్మలంగా, ఎండలా, వెన్నెలలా, అగ్గిలా, ఆరాటంలా మంద హాసంతో దర్శనం ఇస్తాడు.*

*కాళోజీ గొడవ- లొల్లి, ఆగంకు హద్దులు లేవు. అది విశాలాచప్పుర్వీ, అది గాలి వంటిది. కాంతి వంటిది. దావానలం వంటిది. మందానిలం వంటిది.*

దాన్ని దర్శించే కన్ను కావాలి! ఎడద కావాలి!
కాళోజీకి ఆడంబరాలు లేవు!
కాళోజీ కవితకు అంబరాలు లేవు.
కాళోజీ మంది మనిషి
కాళోజీ కవిత ప్రజల పరువం.

*కాళోజీ రూపాన్ని దర్శిస్తే మానవతా మూర్తిగా, ఎడద స్వరూపంలా, కవితా శిల్పంలా, సామాన్యతా విలక్షణంగా, కన్నీటి కన్నులా, పన్నీటి మాటలా కనిపిస్తారు.*

*(కాళోజీ నాగొడవ కవితల సంపుటానికి డాక్టర్ దాశరథి రంగాచార్య రాసిన ముందుమాట నుంచి)*

రాములు పిల్లలు వచ్చి పోయిండ్రు.

వేలూరు రాములు కాళోజీ సన్నిహితుడు, బంధువు కూడా. ఆరోగ్యం ఓ రోజు మెరుగ్గా ఉంటే ఓ రోజు కొద్దిగ పరేషాన్ చేస్తుండె. ఓ రెండ్రోజులు మోషన్స్ అయినవి. అన్నిటిని కో-ఆర్డినేట్ చేసుకుంట చికిత్స నడుస్తుండే. మధ్యమధ్య డా॥ శ్రీనివాస్, డా॥ గోపాలకిషన్ వస్తుండిరి. మళ్ళ వి.ఐ.పి సూట్‌కైతే మార్చలేదు. దవాఖానల నర్సులు మందులు అని, టెస్టులు అని అనుడు, నేను శ్రీహరి గారికి ఫోన్ చేసుడు. శ్రీహరి గారు మళ్ళ ఓ రోజు వచ్చి దవాఖాన అధికారులతోటి



మాట్లాడిండు. కాళోజీ కుటుంబాన్ని ఏమీ అడగకుండ్రి. అన్ని ప్రభుత్వం భరిస్తది. ప్రత్యేకంగా ఆయన దగ్గర నర్సులను పెట్టండ్రి. అటెండెంట్లను పెట్టండ్రి అని గట్టిగ చెప్పిండు. అప్పట్నుంచి మమ్మల్ని ఏమీ అడగలె. ప్రభాకర్‌రెడ్డి కలెక్టర్ గారు కూడా 2,3 సార్లు వచ్చిపోయిండు. ముగ్గురు అటెండెంట్లను మూడు షిఫ్టులల్ల పెట్టిండ్రు. అట్టిట్ల 20 రోజులు అయింది.

అనుకోకుండ, యు.ఎస్.ఎ.లో ఉన్న నా చిన్న కొడుకు ఓ 15 రోజుల కోసం ఇండియాకు వచ్చి నవంబర్ 4వ తారీఖున వెళ్లిపోతూ కాళోజీని చూడడానికి వచ్చిండు. వాడంటే కాళోజీకి ప్రత్యేక అభిమానం. వాడు కూడ 9వ సెప్టెంబర్ నాడే పుట్టిండు. ఆయన 60వ సంవత్సరం లో ప్రవేశించిన రోజు. ఇద్దరి బర్త్‌డేలు ఒక్కటే. వాడు ఐ.సి.యు.లోనే ఆయనను కలిసిండు. కాళోజీ బాగానే మాట్లాడిండు. మేంటేన్ అవుతున్నది హెల్త్ అనుకున్నం.

నా పెద్ద కొడుకుకు బిడ్డ పుట్టి బొంబాయిలో ఫంక్షన్ ఉండె. పోవాల్నా వద్దా అని విచికిత్స. ప్రభాకర్, వాణి అన్నరు గద మేమంత ఉన్నం కదా 2, 3 రోజులే కదా పోయిరండ్రి. నవంబర్ 7న పోవాల్నని టికెట్స్ బుక్ చేసిండు మావోడు. సరే అనుకొని 5వ తారీఖు వరంగల్ వచ్చినం. నా బిడ్డ కూడ మాతోటి వచ్చేదుండె. కాని 6నాడు అకస్మాత్తుగ ఆరోగ్యం బాగాలేక ప్రయాణం క్యాన్సల్ చేసుకున్నం. ఆ రాత్రి నా బిడ్డకు బాగా సీరియస్ అయ్యింది. ఎమర్జెన్సీ ఆపరేషన్ చేయకపోతే ప్రాణానికే ముప్పు అన్నరు. మా కాన్‌సెంట్ వరకు కూడా ఎదురు చూడకుండ వెంటనే ఆమెను తన కార్లనే డా॥ సంధ్యారాణి రోహిణి దవాఖానకు తీసుకొని పోయింది. మేమంతా పరేషాన్. బ్లడ్ కావాల్సి ఉండె. నా పెద్ద కొడుకు, వాడి స్నేహితులు బ్లడ్ ఇచ్చిండ్రు. ఆపరేషన్ కొద్దిగ ఆలస్యమైనా పొజిషన్ సీరియస్ అయ్యేది. అదృష్టవంతులు మీరు, సమయానికి ఆపరేషన్ అయ్యింది అని అన్నది డాక్టర్.

నేను, మా అల్లుడు, కుటుంబం అంతా ఆ రాత్రి దవాఖానలనే. అట్ల వారం రోజులు మా బిడ్డతోటి దవాఖానలోనే ఉన్న. విషయం వివరంగ ప్రభాకర్‌కు ఫోన్ చేసిన. నేనున్నగదా అని ధైర్యం చెప్పిండు ఆయన. ఇంక ఎవ్వరు హైద్రాబాద్ పోలె. ఈ లోపట వాణి తమ్ముని పెండ్లి 13 నవంబర్‌న నిశ్చయం అయ్యిండె. కాళోజీ ఇంటి నుండే తరలిపోవుడు. ఈ వారం రోజులు డా॥ నరేంద్రనాథ్, శాస్త్రిగారు ఏరి అని అడిగిండట. కాళోజీ గూడ అడిగితె ప్రభాకర్, వాణి ఏదో జవాబు చెప్పిండ్రు కాని ఏదో ఉన్నదని అనుకున్నడట కాళోజీ. 12 నాడు నా బిడ్డ హాస్పిటల్ నుండి డిశ్చార్జి అయి ఇంటికి వచ్చింది. తెల్లవారి వాణి తమ్ముని పెండ్లి దృష్ట్యా అప్పటికే వారం రోజులు అయ్యింది గనుక 13 నాడు పొద్దున్నే హైద్రాబాద్ పోదామని తయారు అయిన నేను. హైద్రాబాద్‌లో కాళోజీ, కోడలును పిలిచి మీ తమ్ముని పెండ్లికి పోవాలె నువ్వు అని వాణిని 12 పొద్దున్నే పంపించిండు; 12 నాడే సాయంకాలం బహుశా మధ్యాహ్నం కావచ్చు వేలూరి రాములు హైద్రాబాద్ పోయిండు. వాణి వరంగల్ వస్తది, కాళోజీ దగ్గర ఉండాలని. ఏదన్న అవసరం ఉంటె అటెండ్ అవటానికి ఇంకా కాళోజీ ఐ.సి.యు.లోనే ఉన్నడు. 12 నాటి రాత్రి సంతోష్‌ను పిలిచి మీ మామ పెండ్లికి ఎప్పుడు పోతవురా బయల్దేరు అని ఆ రాత్రే బయల్దేర దీసిండు.

సంతోష్ తోటి మాట్లాడిందే ఆఖరి మాట అయితదని ఎవరు అనుకోలేదు. 13 నాడు పొద్దున నేను హైద్రాబాద్‌కు తయారవుతున్న, ప్రభాకర్ నుంచి ఫోన్. మ్యాటర్ సీరియస్ అని, చిన్నమ్మను, వాణిని, సంతోష్‌ను తీసుకొని తొందరగా హైద్రాబాద్ బయల్దేరమని, వెంటనే కాళోజీ ఇంటికి పోయిన. వాండ్లు పిలగాన్ని తరలిపోయే ఏర్పాటులో





ఉన్నరు. వాణి మరిదిని పిలిచిన రవిందర్! మీరు మళ్ళ వాపసీల ఇక్కడికి రాకుండ్రి. వేరే ఏర్పాటు చేసుకోండ్రి, హైద్రాబాద్ నుండి వచ్చిన మతలబు కొంత అనుమానంగా ఉన్నది అని చెప్పిన.

కారు మాట్లాడుకొని నిమ్స్‌కు పోయినం. అక్కడ అప్పటికే వాతా వరణం గంభీరంగా ఉన్నది. వరవరరావు, మిత్రులు నిలబడి ఉన్నరు. ప్రభాకర్, లక్ష్మణ్, ఇంకా చాలామంది ఉన్నరు. అర్థమయ్యింది. వరవరరావును చూడంగనే.

నాకు దుఃఖం ఆగలేదు. "నీ చేతుల బెడ్తున్న మీ కాకను మళ్ళీ నాకు తెచ్చియ్యాలన్న చిన్నమ్మకు ఏం జవాబు చెప్పాలి" అని వరవరరావుతో అంటే వరవరరావు నన్ను ఓదార్చిండు.

ఇద్దరం లోపలికి పోయినం.

ప్రభాకర్ చెప్పిండు 6 గంటలకు కాళోజీ చివరి శ్వాస విడిచిండని. నెలరోజుల నుంచి ఆయన దగ్గర ఉన్న మమ్మల్ని ఏమార్చి పోయిండు. ఆయన అన్నట్లే అతిథివోలె ఉండి ఉండి అవని విడిచి వెళ్ళి పోయిండు. తన చివరి క్షణాలు ఎవరూ చూడవద్దనుకున్నడేమో మౌనంగా నిష్క్రమించిండు. సంతోష్, వాణి, రాములు దుఃఖం చెప్ప వశం కాదు. చిన్నమ్మను వేరే రూములో కూర్చుండ బెట్టినం. కడియం శ్రీహరి వచ్చిండు. అప్పటికే సి.యం. వచ్చి పోయిండట.

తదుపరి కార్యక్రమం ఎట్లా? ప్రభుత్వం అంత్యక్రియలు ప్రభుత్వ లాంఛనాలతోటి చేయాలని నిర్ణయించింది అన్నడు శ్రీహరి. అయితే కాళోజీ తన దేహాన్ని మెడికల్ కాలేజికి ఇయ్యాల్నని చెప్పిండు. ఆయన కండ్లను దానం చేయాలని చెప్పిండు అని చెప్పినం. అట్లేమన్న రాతపూత లున్నాయా అన్నడు శ్రీహరి. సంతోష్ అన్నడు మా తాత మా అందరితో చెప్పిండు, రాసి లేకపోయినా ఆయన చెప్పినట్లే చేస్తం అన్నడు. ఇంకా ఎవరెవరో వస్తూ పోతున్నరు. బాడీ ఎంబామింగ్ చేయాలంటే నిమ్స్‌లో వసతులు లేవంట, ఉస్మానియాకు తీసుకుపోయింద్రు. ఈ లోపలనే రెండు కండ్లలో నుంచి కార్నియాలను తీసుకున్నరు.

సినారె వచ్చిండు చూడటానికి. ఆయనకు దుఃఖం తన్నుకు వస్తున్నది కాని ఆపుకున్నడు. వార్త అంతటా పాకింది. ఆ రోజు ప్రభాకర్ ఇంట్లో ఉంచి తెల్లవారి వరంగల్‌కు తీసుకుపోయేటట్లు నిర్ణయించింద్రు. అంటే 14కు వరంగల్‌కు అన్నమాట. ప్రభాకర్ తన ఇంట్ల ఒక ఫ్లోర్ ఖాళీ చేయించిండు. కాళోజీ పార్థివ దేహాన్ని అక్కడ ఉంచినం. సినారే, దాశరథి, లక్ష్మణ్, కేశవరాజ్ జాదవ్, గద్దర్, కన్నాభిరాన్, వసంత, బాలగోపాల్, విమల, నర్సింగరావు, ఇంకా ఎందరో మధుసూదన్‌రెడ్డి, రత్నమాల, హరినాథ్, ఇంకా కొందరు రాత్రంతా వస్తునే ఉన్నరు.

15 పొద్దున్నే వ్యాన్‌లో కాళోజీ భౌతిక కాయాన్ని పబ్లిక్ గార్డెన్ ముందటి అమరవీరుల స్థూపం ముందుకి తీసుకొని వచ్చి అక్కన్నుంచి వరంగల్ తీసుకపోవాల్నని నిర్ణయం. అయితే ఖైరతాబాద్ నుంచి జనమంతా కాళోజీ దేహాన్ని మోసుకొని అమరవీరుల స్థూపం వద్దకు వచ్చి నివాళులు అర్పించినాక వరంగల్ బాట పట్టినం. సంగతంతా హన్మకొండలో స్నేహితులకు, మా శిరీష్‌కి, వి.ఎస్.రెడ్డికి చెప్పి ఏర్పాట్లు చేయమన్నం. కలెక్టర్‌గారికి ఈ విషయం చెప్పినం ఫోన్ల. అరేంజ్‌మెంట్స్ చేయమని. మెడికల్ కాలేజ్‌కి ఈ వార్త చెప్పినం. నేను, వరవరరావు, ప్రభాకర్, జీవన్, ఇంకా కొంతమంది మిత్రులు- సంతోష్, చిన్నమ్మ, వాణి వాండ్లు వేరే కారులో- ఫ్రీజర్‌లో కాళోజీ పక్కన మేం.

14 పొద్దున్న బయల్దేరితే ఎక్కడికక్కడ ఉప్పల్ దగ్గర్నించి ఘట్‌కేసర్, బీబీనగర్, బోనగిరి ప్రతిచోట వ్యాన్‌ను ఆపడం, కాళోజీని చూడడం. హైద్రాబాద్- వరంగల్ రహదారి అంతా కాళోజీ అమర్ హై అనే నినాదంతో మోరెత్తింది. భువనగిరిలో మిత్రుడు తూర్పు మల్లారెడ్డి, ఆయన మిత్రులు, కాలేజి పిల్లలు భువనగిరి ప్రవేశించి నిర్గమించే వరకు కిలో రెండు కి.మీ.లు వ్యాన్ వెంట నడిచింద్రు, పాటలు పాడుకుంట. తరువాత ఆలేరు, జనగామ, ఘణపురం తరువాత మడికొండ. మడికొండ కాళోజీ ఊరు. ఆయన సావాసగాండ్లు ఉన్న ఊరు. మడికొండ మొత్తం ఊరవ తల రోడ్డు దగ్గర చేరింది. ఊళ్ళోకి రావాలని లొల్లి. వాళ్లను సంఝా

**కాళోజీ తన దేహాన్ని మెడికల్ కాలేజికి ఇయ్యాల్నని చెప్పిండు. ఆయన కండ్లను దానం చేయాలని చెప్పిండు అని చెప్పినం. అట్లేమన్న రాతపూత లున్నాయా అన్నడు శ్రీహరి. సంతోష్ అన్నడు మా తాత మా అందరితో చెప్పిండు, రాసి లేకపోయినా ఆయన చెప్పినట్లే చేస్తం అన్నడు. ఇంకా ఎవరెవరో వస్తూ పోతున్నరు. బాడీ ఎంబామింగ్ చేయాలంటే నిమ్స్‌లో వసతులు లేవంట, ఉస్మానియాకు తీసుకుపోయింద్రు. ఈ లోపలనే రెండు కండ్లలో నుంచి కార్నియాలను తీసుకున్నరు.**



కాళోజీ అత్యంత ఆర్ద్రహృదయుడు. ఏ కొంచెం బాధకల్గినా ఆయన కన్నులు కన్నీళ్ళను వర్షించేవి. ఆయన అచ్చమైన ప్రజాస్వామ్య వాది. ప్రజాస్వామ్య భావనను తన రక్తంలో జీర్ణించుకున్న వ్యక్తి- 'నీ అభిప్రాయాలతో నేను ఏకీభవించకపోవచ్చు. కానీ నీ అభిప్రాయాల్ని స్వేచ్ఛగా ప్రకటించే నీ హక్కుల కోసం అవసరమయితే నా ప్రాణాలైనా ఇచ్చి పోరాడతాను' అన్న వాల్టేర్‌ను కాళోజీ ఎప్పుడూ గుర్తు చేస్తుండేవాడు. అలాంటి ప్రజాస్వామ్యవాదికి, ఆర్ద్ర హృదయుడికి, మానవతావాదికి, ఆ మహామనిషికి నా జోహార్లు.

*('కాళోజీ యాదిలో...' అంపశయ్య నవీన్ రాసిన వ్యాసం నుంచి)*









కాళోజీ జీవితమే ఉద్యమం. ఉద్యమమే ఆయనకు జీవితం. కాళోజి జీవితమే కవిత్వం. కవిత్వమే కాళోజీకి జీవితం. నిబద్ధత, నిమగ్నతలు కాళోజి కవిత్వానికి ప్రాణం. సామాన్య జీవితం గడుపుతూ అసామాన్యుడుగా లోకోత్తర సత్యాలను, సృజనాత్మకమైన పద్ధతిని కవితల్లో అభివ్యక్తపరిచాడు.

*"We make out of quarrel with others, rhetoric, but of the quarrel with ourselves, 'poetry'.*
ఇతర్లతో కలహం వల్ల మనకు వాక్చాతుర్యం వస్తుంది. స్వయంగా మనతోనే కలహం వల్ల కవిత్వం వస్తుందని యీట్సు కవి అంటాడు. కాళోజి విషయంలో ఇతర్లతో కలహం వల్ల కవిత్వం వచ్చింది. స్వయంగా మనతో కలహం వల్ల వాక్చా తుర్యం వచ్చింది. కాళోజి జీవితం యొక్క పవిత్రాశయాల్లో ఒకటి స్వేచ్ఛగా జీవించడం, స్వేచ్ఛగా ఆలోచించడం. కాళోజి నాలాంటి చిన్నవారితో స్నేహం చేసాడు. పెద్దవారితోను చేసాడు. కొన్ని విషయాల్లో అందరితో విభేదించాడు. ఆయన స్నేహశీలం తెలంగాణా అంతా వ్యాపించింది. స్నేహితులను ఎంతగా ప్రేమించాడో అంత నిష్పాక్షికంగా, నిర్భీతిగానూ వారితో విభేదించాడు. వారి కష్టాలకు, సుఖాలకు స్పందించాడు. జీవితాన్ని విచక్షణాత్మకంగా అనుభవించాడు. స్థితప్రజ్ఞుడుగా జీవించాడు. 'మితవాదుల్లో' అతివాదిగా, అతివాదుల్లో మితవాదిగా సంచరించాడు.

***(సామల సదాశివ, కాళోజి యాదిలో... నుంచి)***



యించి బయల్దేరినం. అక్కడికి జిల్లా ఎస్.పి. తరఫున స్పెషల్ పోలీస్ ఆఫీసర్ వచ్చిండు, అక్కన్నించి కాళోజీ పార్థివ దేహం వెంబడి గౌరవ సూచకంగా నడవటానికి ప్రభుత్వం తరఫున. కాజీపేట, వడ్డెపల్లి, నక్కలగుట్ట పోయే వరకు అక్కడ అప్పటికే అన్ని ఏర్పాట్లు చేసి ఉన్నవి. శిరీష్, వి.యస్.రెడ్డి ఇంకా సీతారాంరావు, జీవన్, జితేందర్, మిత్రమండలి, ఎందరెందరో.

పోలీస్ బందోబస్తు ఉన్నది. వ్యాన్ బయల్దేరేటప్పుడు హైద్రాబాద్‌లో వరవరరావు అన్నడు మొదటి కన్వీనర్‌ను నేనున్న. ప్రస్తుత కన్వీనర్ నువ్వున్నవు. మిత్రమండలి మొత్తం కాళోజీతో ఉన్నట్టే అని, అప్పటికే కాంగ్రెస్ భద్రయ్య కాళోజీ స్నేహితుడు. కాంగ్రెస్ జండా పట్టుకొని వచ్చిండు. కాళోజీ బంధువులు, అభిమానులు, వరంగల్ ఆబాలగోపాలం వచ్చింది. ఎస్.పి. వచ్చిండు. కలెక్టర్, కాకతీయ విశ్వవిద్యాలయం వి.సి.తో సహా. అన్ని విద్యాలయాల విద్యార్థులు వచ్చినారు. 15 పొద్దున్నే అంతిమ యాత్ర నక్కలగుట్ట నుండి కాకతీయ మెడికల్ కాలెజి వరకు అలంకరించిన వ్యాన్‌పైన కాళోజీ ఫోటోతో కాళోజీ పార్థివ దేహంతో మొదలైంది.

ఎవరేం చేస్తున్నరో, వాండ్లు స్వచ్ఛందంగానే బాధ్యతలు తీసుకున్నరు. వరంగల్ దారి పొడవున నల్లజండాలు, కాళోజీ అమర్ హై, కాళోజీ జోహార్ అని రాసిన నల్ల గుడ్డలు. 15 పొద్దున్నే పత్రికలన్నీ కాళోజీ మరణ వార్త హెడ్డింగ్‌తో ప్రత్యేక సంచికలు వేసినవి. ట్యాబ్లాయిడ్స్ అన్ని కాళోజీ జీవిత విశేషాలతో నిండినవి.

జైశంకర్ సారు విషణ్ణ వదనంతో బయట. మాకు సలహాలు ఇవ్వ వల్సింది ఆయనే, ఆయనతో మాట్లాడుతనే ఉన్నం. ప్రెస్ వాండ్లు అడిగిన ప్రశ్నలకు జవాబులు చెబుతనే ఉన్నం. హైద్రాబాద్ నుంచి మిత్రులందరు వచ్చిండ్రు. విశాఖ నుంచి ప్రసాద్, కృష్ణాబాయి వచ్చిండ్రు. ఆర్.ఇ.సి.లోని స్నేహితులు, జిల్లా అధికార అనధికార వర్గాలు, ప్రజలు, పిల్లలు వరుసగా ఆయనను దర్శించి చివరి నివాళులు అర్పించిండ్లు. జానపద గిరిజన పీఠం భక్తవత్సల రెడ్డి తన కెమెరామెన్ సతీష్‌తో అంతిమయాత్ర వెంబడే





గద్దర్, విమలక్క ఇంకా ఎందరో ప్రజా గాయకులు ఎవరి పద్ధతిన వాండ్లు పాటలతోటి, నినాదాలతోటి కాళోజీని స్మరిస్తూ యాత్ర సాగింది.

ఆనాటి అంతిమ యాత్రలో ఎంత జనం! వరంగల్ అంతా రోడ్ల మీదనే, ఆ ప్రొసెషన్‌లనే ఉన్నట్టనిపించింది. కాళోజీకి అట్ల నివాళులర్పించి తన ప్రేమను, గౌరవాన్ని చాటుకున్నది వరంగల్ ప్రజ అనిపించింది. ఎంత ప్రేమను సంపాదించిండు ప్రజల్లో కాళోజి. మెడికల్ కాలేజీ చేరింది అంతిమ యాత్ర. కాళోజీ పార్థివ దేహానికి ప్రభుత్వం వారు గౌరవ సూచకంగా తుపాకులు పేల్చిండ్రు. మెడికల్ కాలేజీ ఛైర్మన్ హోదాలో కలెక్టర్, మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్ ఇద్దరు కాళోజీ రవికుమార్ గారి నుంచి కాళోజీ దేహాన్ని స్వీకరించి, స్వీకరించినట్లు ధృవపత్రం ఇచ్చినారు. అక్కడ కొంతమంది మిత్రులు కాళోజీని స్మరిస్తూ మాట్లాడినారు.

చిన్నమ్మ నా చేతుల్లో పెట్టిన కాళోజీకి బదులు ప్రాణం లేని శరీరం తెచ్చిచ్చిన చిన్నమ్మకు. వరవరరావు, హేమక్క నిమ్స్‌కు వస్తే- బ్రతకటానికి పోరాటం చేయాలె, కష్టపడాలె గాని, చావటానికి కూడా ఇంత కష్టపడాల్నా అన్నడట కాళోజీ. ఎంత బాధపడ్డడో.

వరంగల్ బయల్దేరేముందట డా॥ నరేంద్రనాథ్, వరవరరావు, నేను, ప్రభాకర్ కూర్చున్నం. నరేంద్రనాథ్ అన్నడు శాస్త్రిగారు మీరు కనబడలేదు ఈ 5-6 రోజులు. నేను నా మజ్బూర్ సంగతి చెప్పిన. పాపం ఆయన తమ బంధువుల అమ్మాయి- ఆమె డాక్టరే. ఆమె భర్త, అత్త మామ, తల్లిదండ్రులు అందరు డాక్టర్లేనట. ఆమెకు నా బిడ్డకు వచ్చిన పరిస్థితే వచ్చిందట. కాని ఆమె బ్రతకలేదట. ఈ సంగతి చెప్పి కాళోజీ ఆశీస్సులే మీ అమ్మాయిని కాపాడినవని అన్నడు.

అంతక్రితం ఒక రోజు దవాఖానలో కాళోజీ- 'శాస్త్రి! మీ చిన్నమ్మ అమాయకురాలు, రవి కూడా అమాయకుడే, వాణి వాడిని చూసుకుంటుంది, నేనున్నప్పుడు ఎట్ల అరుసుకున్నవో అట్లనే నేను పోయినంక కూడ చిన్నమ్మను, కుటుంబాన్ని అరుసుకో అన్నడు. ఇవ్వన్ని ఎందుకు కాకా ఇప్పుడు అంటే, ఎప్పుడో అప్పుడు చెప్పాలి కదా అన్నడు. ఎన్ని జ్ఞాపకాలో.

ఎప్పటెప్పటివో ఈ నెల రోజులు కాళోజీ వెంబడున్నా చివరి క్షణాల్లో దగ్గర్లో లేకపోయానే అనే బాధ నా జీవితమంతా మిగిలే ఉంటది. అట్లనే ప్రభాకర్‌కు కూడా. సంతోష్, వాణికి కూడా. కాళోజీ మరణించిందంటే మా నాయన మళ్ళొక్కసారి మరణించిందనిపించింది. అట్లాటి ప్రేమ ఇచ్చిండు నాకు. వాణి కోడలైనా ఎంత సేవ చేసిందో. మధ్యలో ఒకసారి చిన్నమ్మ కాకను చూడడానికి వస్తే రుక్మిణి నువ్వేమి భయపడకు అని అన్నడట. రుక్మిణి అని పిలిచినందుకే ఆమె ఎంత సంతోషించిందో. తరువాత చిన్నమ్మ ఎట్ల ఉంటదో? అని ఎన్నో ఆలోచనలు నాడు. 13 అక్టోబర్ నుంచి 16 నవంబర్ వరకు కాళోజీ ప్రస్థానం అదొక 'మహాప్రస్థానం' అనుకుంట.

*రచయిత సెల్: **97041 12830***

















ఎలనాగ

# కాళోజీ వ్యక్తిత్వం - కవిత్వం





కాళోజీతో నాకు వ్యక్తిగత పరిచయం అంతగా లేదు కాని పత్రికల ద్వారా, వ్యక్తుల ద్వారా ఆయన గురించి బాగానే తెలిసింది. నేను 1998లో పి.జి. కోర్సు చదువుతున్నప్పుడు మాత్రం ఒకసారి హనుమ కొండలోని నక్కలగుట్టలో వున్న ఆయన యింట్లో ఓ చిన్న సాహిత్య కార్యక్రమం జరిగినప్పుడు, ఆదిలాబాదు నుండి వచ్చి అక్కడ ప్రసంగించనున్న సదాశివగారిని కలవటం కోసం అక్కడికి వెళ్లినప్పుడు, సదాశివగారే నన్ను కాళోజీకి పరిచయం చేశారు. కార్యక్రమం అప్పుడే ప్రారంభం కాబోతుండటం వల్ల నమస్కారం అంటే నమస్కారం అనటం వరకే తప్ప పెద్దగా వేరే ఏమీ మాట్లాడుకోలేదు. తర్వాతి కాలంలో నేను హైదరాబాద్‌కు తిరిగి రావటం చేత కాళోజీ గారిని మళ్లీ కలిసే అవకాశమే దొరకలేదు. కాని అంతకు ముందు 1989 నుండి 1995 వరకు నేను ఆదిలాబాదు జిల్లాలో పనిచేసిన కాలంలో సదాశివగారు కాళోజీ గురించీ, వారి అన్న రామేశ్వరరావు గురించీ చాలాసార్లే ముచ్చటించారు. ఒకసారి యిలా అన్నారు వారు– "కాళోజీల యింటికి వెళ్తే మీకు ఫైవ్‌స్టార్ హోటల్లో దొరికే సత్కారం కన్న పెద్ద సత్కారమే దొరుకుతుంది. అదేమిటంటే కాళోజీయే స్వయంగా తన చేతుల మీదుగా యిచ్చే చాయ్‌ను తాగుతారు మీరు." ఈ వ్యాఖ్య ద్వారా కాళోజీ గొప్పతనమే కాక, సదాశివగారి గొప్పతనం కూడా వెల్లడి అవుతున్నదని ప్రత్యేకంగా వేరే చెప్పాల్సిన అవసరం లేదు.

నిర్భీకతకు మారు పేరు కాళోజీ– అనటం అతిశయోక్తి కాదేమో. తాను సమంజసమని నమ్మిన దాన్ని ఎటువంటి సందేహం, జంకు లేకుండా కుండబద్దలు కొట్టినట్టు, ఢంకా బజాయించినట్టు ముఖం మీదే చెప్పేయటమనే అలవాటు కాళోజీలోని ప్రత్యేకత అంటారు ఆయనను తెలిసిన వాళ్లు. ప్రజాస్వామ్యంలోని విధానాల్ని వ్యతిరేకించే నక్సలైట్లు "ఎన్నికల్లో ఎవరైనా ఓటు వేస్తే వాళ్ల చేతుల్ని నరుకుతాం" అని హెచ్చరిక జారీ చేశారట ఒకసారి. ఓటుహక్కును ఉపయోగించు కోకపోవటం కంటె పెద్ద తప్పు మరొకటి లేదని, స్వేచ్ఛను కాల రాయటం నేరమని గట్టిగా నమ్మే కాళోజీ "అయితే నేను ఓటు వేయబోతు న్నాను. ధైర్యముంటే వచ్చి నా చేతులు నరకండి" అన్నాడట. అటువంటి కాళోజీయే ఒకసారి ఒక నక్సలైటును రక్షించిన వృత్తాంతాన్ని వింటే విస్తుపోతాం మనం. జైలు నుండి విడుదలైన ఆ నక్సలైటుకు పోలీసుల ద్వారా, ఇతరుల ద్వారా ప్రాణ హాని జరిగే అవకాశమున్నప్పుడు కాళోజీ జైలుకు వెళ్లి, ఆ నక్సలైటు తన సొంత యిల్లు చేరే దాకా అతని వెంటనే ఉన్నాడట! యువ కవులతో, కళాకారులతో ఎప్పుడైనా కఠినంగా మాట్లాడినా ఆ తర్వాత వాళ్లను దగ్గరకు తీసుకుని, ప్రేమను కనబరచటం కాళోజీ వ్యక్తిత్వంలోని ఒక భాగమని ఒకరిద్దరు సాహితీ మిత్రుల ద్వారా తెలిసింది నాకు.

ఎక్కడైనా సాహిత్య సభ జరిగితే దానికి రమ్మని తనకు ఆహ్వానం లేకపోయినా అందులో మంచి వక్తలుంటే ఫలానాయన బాగా మాట్లాడుతాడనీ, దానికి వెళ్తే కొత్త విషయాలు తెలియవచ్చుననీ ఆ కార్యక్రమానికి పోయి వస్తాడట కాళోజీ. ఇదెంత గొప్ప లక్షణం!

ఇక కాళోజీ రాసిన కవిత్వం విషయానికి వస్తే, నేను హైస్కూల్లో ఉన్న రోజుల్లో 'నా గొడవ' సంపుటాలు నాలుగైదు చదివాను. ఆ కాలంలో సాహితీ వర్గాల్లో నా గొడవ గురించిన టాక్ బాగానే వినవస్తుండేది. మానవ హక్కుల పట్ల, ప్రజాస్వామ్య విలువల పట్ల తనకున్న బలమైన విశ్వాసం ఆయన కవిత్వంలో ప్రతిఫలించింది. ఆ కవిత్వాన్ని చదివితే కాళోజీ అచ్చమైన ప్రజా కవి అని తెలుస్తుంది మనకు. సూటితనం, భాషలో సరళత్వం ఆయన కవిత్వంలోని లక్షణాలు. "అన్య భాషలు నేర్చి ఆంధ్రంబు రాదంచు/ సకిలించు ఆంధ్రుడా/ చావవెందుకురా"







*సదాశివగారు ఒకసారి యిలా అన్నారు– "కాళోజీల యింటికి వెళ్తే మీకు ఫైవ్‌స్టార్ హోటల్లో దొరికే సత్కారం కన్న పెద్ద సత్కారమే దొరుకుతుంది. అదేమిటంటే కాళోజీయే స్వయంగా తన చేతుల మీదుగా యిచ్చే చాయ్‌ను తాగుతారు మీరు." ఈ వ్యాఖ్య ద్వారా కాళోజీ గొప్పతనమే కాక, సదాశివగారి గొప్పతనం కూడా వెల్లడి అవుతున్నది.*

అన్న పంక్తులు ఆ నాటి పరిస్థితులకు బాగా వర్తిస్తాయనుకుంటే ఆ సమస్య ఇంకా జటిలమైన ఈనాటి పరిస్థితులకు అవి ఇంకా ఎక్కువగా వర్తిస్తాయి. "అన్నపు రాసులు ఒక చోట/ ఆకలి మంటలు ఒక చోట. వాసన నూనియలొక చోట/ మాసిన తలలింకొక చోట" అన్న పంక్తులు సమాజంలోని అసమానతల పట్ల కాళోజీకి గల వేదనను ధ్వనింప జేస్తాయి.

కాళోజీ కవితల్లో గేయ లక్షణమున్నవే మనకు ఎక్కువగా కనిపిస్తాయి. ప్రక్రియాపరంగా అచ్చమైన వచన కవిత్వమున్న కవితలు అరుదు. లయాత్మకంగా సాగుతూ త్రిశ్రగతిలో నడిచే ఈ గేయ భాగాన్ని పరిశీలించండి. విపణి వీధి– తపోవనం/ చాకిరేవు– శాసనసభ/ సానికొంప– సాధు మఠం/ మూత్రశాల– యాత్రాస్థలి/ ఎచటైతేం? ఎచటైతేం?/ పోటీపడి కాటులాడ. కళలూ, యుద్ధాలూ, ఆధ్యాత్మిక చింతనలూ మొదలైనవన్నీ కడుపులోకి అన్నం పోయినంత వరకే కొనసాగుతాయని చెప్తూ అవన్నీ "కర్షకా, నీ కఱ్ఱు కదలినన్నాళ్లే" అంటాడు. ఆ రోజుల్లో బాగా వాడుకలో ఉన్న అంత్యప్రాసలను కూడా కాళోజీ తన కవిత్వంలో ఉపయోగించాడు. ఉదాహరణకు– మేధావుల కార్యాచరణము/ సామాన్యుల పాలిట మరణము. దండెగొట్టు తెలివే చాలు/ జోక వచ్చు గింజలు తాలు. అంత్యప్రాసలనే కాక, అర్ధ ప్రాసను కూడా కాళోజీ కొన్నిచోట్ల చాలా బాగా ప్రయోగించాడు. రాయి రువ్వినా రాకెట్ విసరినా/ గిట్టని వానిని కొట్టుటకే కద/ కాల నడచినా కారు యెక్కినా/ కోరిన చోటకి చేరుటకే కద– అంటాడొక చోట. గాఢమైన తాత్వికతను వెలిబుచ్చుతూ కొన్నిచోట్ల చక్కని కవిత్వాన్ని మెరిపిస్తాడు కాళోజీ. ఆ పంక్తుల్లో సార్వజనీనత ఉంటుంది. ఉదాహరణకు ఈ పంక్తుల్ని గమనించండి. ఉదయం/ కానే కాదనుకోడం/ నిరాశ/ ఉదయించి/ అట్లానే వుంటుంద నుకోడం/ దురాశ. ఎవరినైనా ఎండగట్టాలనుకున్నప్పుడు ఎంత మాత్రం నీళ్లు నమలకుండా కాళోజీ ఎంతో ధైర్యంగా నిలదీస్తాడనటానికి పింగళి వెంకట్రామారెడ్డిని "గౌండ్ల గుడిసెల మీది/ గడ్డి సైతము అమ్మి/ చిక్కబట్టిన సొమ్ము/ లెక్క జెప్పెదవా" అనటమే నిక్కమైన నిదర్శనం.

ఎమర్జెన్సీ కాలంలో కాళోజీ రాసిన కవిత్వంలో అతని నిర్భీతి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మర్రి చెన్నారెడ్డి, జలగం వెంగళరావు, ఇందిరా గాంధీ, భారత రాష్ట్రపతి మొదలైనవాళ్ల మీద ఆయన రాసిన కవితల్లో ఈ విషయాన్ని మనం అవలీలగా గుర్తించగలుగుతాం. ఇవికాక, కాళోజీ బంగ్లాదేశ్ మీద, తెలంగాణ ఉద్యమం గురించి ఎన్నో కవితలు రాశాడు. ఉర్దూ కవితలను తెలుగులోనికి అనువదించాడు కూడా. అయితే మిగతా వాటిలో కన్న నా గొడవ మొదటి సంపుటంలోనే కవిత్వం పాలు ఎక్కువగా ఉంది.

ఈవిధంగా– వ్యక్తిత్వ పరంగా చూసినా, కవిత్వ పరంగా చూసినా కాళోజీ తనదైన ఒక ప్రత్యేకమైన, విలక్షణమైన ముద్రను కనబరిచాడు.

*రచయిత సెల్: **98669 45424***







అన్వర్



రఘువీర్ నారాయణ్ లక్ష్మీకాంత్
శ్రీనివాసరావు రామ్‌రాజా కాళోజి
ఇది మనిషి పేరు
కాని కాళోజి ఈ మూడక్షరాల పేరు
ప్రజా సమూహం.

# మేరి ముర్తి కాళోజీకా
# మై భీ నా కాళోజీకా..



కాళోజీ : ప్రజల పక్షాన గొడవ చేసిన వీరుడు
ప్రజల గొంతుక
దట్టించిన మందుగుండు
గురిచూసి వదిలిన బాణం.
కాళోజీ : పోరాటాల కలేజా
ఉద్యమాల కాలేజీ
సాహిత్య సాంస్కృతిక కేంద్రం
కాళోజీ : మానవత్వపు బడి
మనిషికి చిరునామా

వరవరరావు సార్ అన్నట్టు వరంగల్‌లో చూడాల్సినవి రెండే.
ఒకటి– వేయిస్తంభాల గుడి
రెండు – కాళోజీ బ్రదర్స్

***

మడికొండ మెట్టుగుట్టకు నేను పెట్టుకున్న పేరు కాళోజీ బ్రదర్స్.

మెట్టుగుట్ట మీద ఉన్న రెండు కొండలు– ఒకదానికొకటి పక్క పక్కన అపురూపంగా ప్రకృతిలో వేరే ఎక్కడా లేనివిధంగా ప్రత్యేకంగా ఎత్తుగా నిలబడి వుంటయ్– కాళోజీ సోదరుల బతుకులాగా, విడదీయని జోడిలాగా– స్ఫూర్తిగా.

కాళోజీ బాల్యమంతా మడికొండ మెట్టుగుట్ట చుట్టూతా గడిచింది. స్వతహాగా ఏర్పడిన అందమైన కొండల చిత్రాలు నేను గూగుల్‌లో సర్చ్ చేసిన. ఈ ప్రపంచంలో రకరకాల కొండలున్నయి. కానీ మెట్టుగుట్ట మీది కొండలలాగా నాకు వేరే కన్పించలేదు.

అట్లనే పెద్ద కాళోజీ, చిన్న కాళోజీలాగా అపూర్వ సోదరులను నేను ఈ జీవితంలో మళ్లీ ఎక్కడా చూడలేదు. నా జీవితంలోకి తారసపడడం కాదు– ఈ నేల మీదనే కాళోజీ లాంటి బ్రదర్స్ ఎవ్వర్కి కూడా తారసపడి వుండరు. చిన్న, పెద్ద, ఆడ, మగ, కూలీ, పనిమనిషి, మేధావి, పోరాట యోధుడు... ప్రతి ఒక్కరితో ఒకే రీతిగా, ఒకే తీరుగా కలిసిపోయే ఒక మానవ సుగుణం వారిలో ఉండేది. అదీ కాళోజీల వ్యక్తిత్వం, గొప్పతనం.

పెద్ద కాళోజీ పుస్తకమైతే
చిన్న కాళోజీ పోరాట పాఠం.

***

కాళోజీతోనే పరుగుపెట్టింది తెలంగాణ యావ, తెలంగాణ యాస, తెలంగాణ పోరాటం.

ఏ వేదికైనా, ఏ ప్రాంతమైనా కాళోజీ తన మాటే మాట్లాడిండు.



తెలంగాణే మాట్లాడిండు. అది ఆంధ్ర ప్రాంతంలోని మీటింగ్‌లో కావచ్చు, రాయలసీమ ప్రాంతం కావచ్చు. తెలంగాణ నేలమీది ఏ పల్లెల్లోనైనా కావచ్చు. ఆ తర్వాతనే తెలంగాణ భావజాలం విస్తృతంగా ప్రతి ఒక్కరిలో నాటుకుంది.

రాత్రికి రాత్రే ప్రజాకవి కాలేదు కాళోజీ.

రాసిన కవిత్వమంతా (దాదాపు నలభైయేండ్లు- నాలుగు వందల కవితలు) 'నా గొడవ' అన్నడు.

ఖలీల్ జిబ్రాన్ రాసిన అక్షరాలకు నిలువెత్తు రూపమై 'జీవన గీత'గా నిలబడ్డడు.

రవీంద్రనాథ్ టాగోర్, మదర్ థెరెస్సా, కొమురం భీం, శ్రీశ్రీ, చారు మజుందార్, చాకలి అయిలమ్మ, షేక్ బందగీ, లూయీ అరగాన్, సోమర్‌సెట్ మామ్, గోర్కీ, రొమరోలా మొదలైన ఎందరో అపురూప విశిష్టమూర్తుల అపూర్వ సమ్మేళన రూపం- కాళోజీ.

పేదవారి కోసం, శ్రమజీవుల కోసం, స్త్రీల కోసం ఈ నేల మీద జరుగుతున్న అనేక ఆత్మగౌరవ ఉద్యమాల ఆర్తి- కాళోజీ.

ఒంటి ఊపిరితోని పోరాటాలకే ఊపిరి పోసిన మట్టి ముద్దుబిడ్డ- కాళోజీ.

ప్రజాస్వామ్య హక్కుల కోసం, ప్రజల కోసం పోరాడిన కాళోజీని నక్సలైట్ అన్నరు. తీవ్రవాది అన్నరు. అరాచకవాది అన్నరు. నాయకుడు అన్నరు. స్వాతంత్ర్య సమరయోధుడు అన్నరు.

కాళోజీ నిజంగా ధర్మాగ్రాహి. సత్యాగ్రాహి. సాటి మనిషి కోసం నిరంతరం తపించిన మానవతా వాది.

వ్యక్తిగా పోరాటాన్ని, ఆత్మగౌరవాన్ని నూరిపోసిన శక్తి- కాళోజీ.

***

కాళోజీ భౌతికంగా లేకపోయినా కాళోజీ లేదని అన్పించదు. నా ప్రతి సామాజిక, పనిలో, ప్రతి పోరాటంలో నేను యాది జేసుకునే మొదటి వ్యక్తి- చాలాసార్లు ఒకే ఒక వ్యక్తి- కాళోజీ.

కాళోజీ పోరాటం ఎంత సహజ సిద్ధమైనదో అంతే సహజ సిద్ధమైనది కాళోజీ ప్రేమ.

చిన్నపిల్లల్ని ఎత్తుకోవడం, స్కూల్ పిల్లలతో ఆడుకోవడం, పేదల తోని, కూలీలతోని మాట్లాడడం, భేషజాలు లేకుండా బేషరతుగా బత కడం, సుదీర్ఘంగా మనసువిప్పి మాట్లాడడం - కేవలం కాళోజీకే సాధ్యమైంది.



పిచ్చివాళ్ళను వెతకడానికి బయలుదేరితే 'ఏక్‌కు ఢూండో హజారోం మిల్తే' అంటరు.

'లాకో ఇన్ సానోంకో ఢూండో,

కాళోజీకే జైసా ఫిర్ కోయీ నహీఁ మిలేగాఁ'-ఏ మేరా వాదా హై.

***

అన్యాయాన్నెదిరిస్తే- కాళోజీ

అన్యాయం అందరిస్తే - కాళోజీ

అన్యాయాన్నెదిరించినోడే - కాళోజీ

*రచయిత సెల్: 9866089066*



**ఒంటి ఊపిరితోని పోరాటాలకే ఊపిరి పోసిన మట్టి ముద్దుబిడ్డ- కాళోజీ.**

**ప్రజాస్వామ్య హక్కుల కోసం, ప్రజల కోసం పోరాడిన కాళోజీని నక్సలైట్ అన్నరు. తీవ్రవాది అన్నరు. అరాచకవాది అన్నరు. నాయకుడు అన్నరు. స్వాతంత్ర్య సమరయోధుడు అన్నరు. కాళోజీ నిజంగా ధర్మాగ్రాహి. సత్యాగ్రాహి. సాటి మనిషి కోసం నిరంతరం తపించిన మానవతా వాది.**

దర్భశయనం శ్రీనివాసాచార్య



*ఒక కవినో, రచయితనో ప్రత్యక్షంగా చూడకముందే అతని రచనల్ని చదవడం చాలా సందర్భాల్లో జరుగుతుంది. నాకూ, కాళోజీకి నడుమ సంబంధం అలాగే మొదలైంది. వ్యవసాయ కళాశాలలో బి.ఎస్సీ (అగ్రి) చదువుతున్న రోజుల్లో మొదటిసారి కాళోజీ కవిత్వాన్ని చదివాను. 'నాగొడవ' పాత పుస్తకాన్ని ఎవరో నాకిస్తే ఒక వూపులో- బహుశా ఓ రాత్రి పూట అనుకుంటాను- చదివేసాను. అప్పటికే తిలక్‌నూ, దాశరథినీ, శ్రీశ్రీని కొంత చదివాను. సరళంగా, సూటిగా వున్న ఆయన శైలి నన్ను ఆకట్టుకుంది. చాలా కవితల్లోని గేయ లయకు నేను దగ్గరయాను. ముఖ్యంగా 'కర్షకా' అనే కవిత నాకు కంఠస్థమైంది. ఈ భూమ్మీద ఏది జరగడమైనా, ఎవరెన్ని ఘనమైన పనులు చేసినా 'కర్షకా!' నీ కర్రు కదిలినన్నాళ్ళే' అని కాళోజీ ఆ కవితలో చెప్పాడు.*

అలా కాలేజి రోజుల్లో (1978–84) కవితల ద్వారా అప్రత్యక్షంగా పరిచయమైన కాళోజీని వెంటనే చూళ్ళేదు. 1985లో తుమ్మపూడిలోని సంజీవదేవ్‌ను కలుస్తూండేవాణ్ణి. అలా కలుస్తున్నపుడు ఓసారి ఆయన కాళోజీ ప్రస్తావన చేశాడు. గొర్రెపాటి వెంకట సుబ్బయ్యతో కలిసి కాళోజీ తుమ్మపూడికి వచ్చిన సందర్భాన్ని జ్ఞాపకం చేసుకున్నారు. కాళోజీ వ్యక్తిత్వాన్ని గురించీ, కవితా రీతిని గురించీ వివరంగానే మాట్లాడాడు.



# ఒక తమ్ముడి జ్ఞాపకాలు

ఉద్యోగ బదిలీ మీద వరంగల్‌కు వచ్చాక ఆయన్ను కలవాలనుకున్నాను. పత్రికల్లో ఆయన పేరు తరుచుగా కనపడేది. ఓ రోజు- సాయంత్రం వేళ- నా బ్యాంక్ సహోద్యోగి, సాహిత్య ప్రియుడైన రామ్‌కిషన్‌రావుతో కలిసి కాళోజీని కలవడానికి ఆయనకు 'పద్మవిభూషణ్' ప్రకటించబడిన సందర్భం. ఇంట్లోకి వెళ్ళగానే మెత్తని నవ్వుతో పలకరించాడు. నా పరిచయం చేసుకున్నాను. ఇంతలోనే అక్కడే వున్న మరెవరో 'పద్మ విభూషణ్' ప్రస్తావన తెచ్చి ఏదో అడిగారు. కాళోజీ చిరాగ్గా బదులిచ్చారు. ఇటు తిరిగి, మాతో కాసేపు నెమ్మదిగా మాట్లాడాడు. సంజీవదేవ్ ప్రస్తావనను నేను తెస్తే, కాళోజీ సంక్రాంతి సాహిత్య సమావేశాల గురించి వివరంగా ముచ్చటించారు. సంక్రాంతి పండుగ సందర్భంగా సాహిత్య మిత్రులు కలిసి సమావేశాలు జరుపుకునే ఒక సంస్కృతిని గురించి అలా నేను తెలుసుకున్నాను. అలా మొదటిసారి కల్సిన తర్వాత కాళోజీతో నా అనుబంధం దినదిన ప్రవర్ధమానమైంది.

ప్రతినెలా రెండో శనివారం హన్మకొండలో జరిగే మిత్రమండలి సమావేశాలకు వెళ్ళేవాణ్ణి. అక్కడ కాళోజీ, ఆయన అన్నగారు కాళోజీ రామేశ్వరరావుగారు, ఇంకా అనేకమంది సాహిత్యప్రియులం కూర్చుని ఐదారు గంటల సేపుసాహిత్య సంభాషణలో మునిగి తేలేవాళ్ళం. కవిత్వం కేవలం చదవడమే కాకుండా, దాని మీద చర్చను వినే అవకాశం కవులకు





**మిత్రమండలి సమావేశాలు అరవైమంది వచ్చినా, కేవలం ఆరుగురే వచ్చినా కాళోజీ ఒకే రకమైన ఉత్సాహాన్ని చూపించేవాడు. ఒకే రకమైన ఆర్తితో మాట్లాడేవాడు. ఆ ధోరణి నాకు బాగా నచ్చేది. ఎవరైనా రచన విన్పించినపుడు దానిలోని భాషా విషయమై చర్చ మొదలైతే 'ఆచార్యుల వారూ! మీరు చెప్పండి' అని నా అభిప్రాయం అడిగేవారు. నా జ్ఞానపరిధిలోంచి అభిప్రాయం చెప్పేవాణ్ణి. చెప్పినపుడు చెవొగ్గి శ్రద్ధగా ఆలకించేవాడు, వాత్సల్యంతో.**

కలిగేది. అలాగే కథలూ, ఇతర రచనలు కూడానూ. ఎంతో ఆసక్తితో కూర్చునేవాడు కాళోజీ. ఆసక్తితో వినేవాడు. ఆసక్తితో దానిమీద మాట్లాడేవాడు. ఆయనది Active Voice. Passive గా వుండడం ఆయనకు ఇష్టం వుండదు. మాట్లాడ్డమంటే ఏదో సోది మాట్లాడ్డంగాదు. లోతైన విషయాల్ని సులువైన మాటల్లో చెప్పడం కాళోజీ ప్రత్యేకత. నడుమ నడుమ సందర్భాన్ని బట్టి తను గతంలో రాసిన కవితా భాగాల్ని విన్పించేవాడు. వాటిని అంతకుముందు విన్నప్పటికీ, ఆయన గొంతులోంచి మళ్ళీ వినడం నాకెప్పుడూ వినూత్నంగా వుండేది.

మిత్రమండలి సమావేశాల్లో అరవైమంది వచ్చినా, కేవలం ఆరుగురే వచ్చినా కాళోజీ ఒకే రకమైన ఉత్సాహాన్ని చూపించేవాడు. ఒకే రకమైన ఆర్తితో మాట్లాడేవాడు. ఆ ధోరణి నాకు బాగా నచ్చేది. ఎవరైనా రచన విన్పించినపుడు దానిలోని భాషా విషయమై చర్చ మొదలైతే 'ఆచార్యుల వారూ! మీరు చెప్పండి' అని నా అభిప్రాయం అడిగేవారు. నా జ్ఞానపరిధిలోంచి అభిప్రాయం చెప్పేవాణ్ణి. చెప్పినపుడు చెవొగ్గి శ్రద్ధగా ఆలకించేవాడు, వాత్సల్యంతో.

కదిలిపోవడం, కంట తడిపెట్టడం ఆయన జీవితంలో సహజాంశాలైపోయాయి. ఎదుటి మనిషి అంతరంగంలోకి వెళ్ళి చూసే తాత్విక దృష్టి వల్ల కాళోజీ ఆర్ద్ర స్వభావి అయ్యాడని నాకన్పిస్తూ వుండేది. ఓసారి నేను మిత్రమండలికి ఆలస్యంగా వెళ్ళాను. మా రెండో అమ్మాయికి జ్వరంగా వుండడం వల్ల ఆసుపత్రికి వెళ్ళి ఇంటికి చేరేసరికి సమయం పట్టి 'మిత్రమండలి'కి ఆలస్యమైందని నేను కాళోజీకి చెప్పాను. ఆ తర్వాత చాలా నెలల దాకా కనపడగానే పిల్లలు ఎలా వున్నారని ప్రత్యేకంగా అడిగేవాడు. మనుషుల పట్ల ఆయన మమకారం చెదరనిదని గమనించాను.



అలిశెట్టి ప్రభాకర్ మరణించినపుడు నేనొక కవితను రాశాను, స్మృతిలోంచి. ఆ నెలలో వి.ఆర్.విద్యార్థి ఇంట్లో జరిగిన మిత్రమండలి సమావేశంలో ఆ స్మృతి కవితను విన్పించాను. "సూర్యుడు/ ఒక స్నేహ కలశం/ ఒక ఉష్ణ సంచలనం" అనే మాటల్తో ఆ కవితను ముగించగానే కదిలిపోయాడు కాళోజీ. చిన్న వయసులో జనధ్యాస వున్న కవి మరణానికి కన్నీటి పర్యంత మయాడు. నాటి సమావేశంలో తడితడి వాతావరణం అల్లుకుపోయింది. ప్రభాకర్ గురించి ఉద్విగ్నంగా మాట్లాడాడు ఆనాడు.

ఆయనతో కల్సి ప్రయాణించడం ఓ గొప్ప అనుభవం. ఓసారి మంజీరా రచయితల సంఘం వారు తమ సమావేశాలకు నన్నూ, కాళోజీనీ ఆహ్వానిస్తూ, కాళోజీని సిద్దిపేట కు కార్లో తీసుకువచ్చే బాధ్యతను నాకు అప్పగించారు. దారి పొడుగూతా ఆయన మాట్లాడ్తూనే వున్నాడు. ఎందరెందరి గురించో, ఎన్నెన్ని ఘటనల గురించో అలుపెరగక చెప్పాడు. ఇంత ఓపిక ఈయనకు ఎక్కణ్ణుంచి వచ్చింది అని నేను ఆశ్చర్యానికి లోనయేవాణ్ణి. ఒక్క సాహిత్య విషయాలని కాదు, రాజకీయ విషయాల్నీ ఆయన ప్రస్తావించేవాడు.

నాకు చాలా సందర్భాల్లో ఓ సందేహం కలిగేది- కాళోజీలో వైరుధ్యాలున్నాయా అని. గాంధీని ఇష్టపడే ధోరణి లోనే గద్దర్‌నూ ఇష్టపడేవాడు. శ్రీశ్రీని శ్లాఘిస్తూ పలికిన గొంతుతోనే తిలక్‌ను ప్రశంసించేవాడు. రోమారోలా ఇష్టమైనట్లే ఉద్యమకారుడూ ఆయనకు ఇష్టమే. చాలాకాలం దగ్గర నుంచి ఆయన్ని గమనించాక ఇవన్నీ వైరుధ్యాలు కావని కాళోజీలో తనదైన దర్శనాశక్తి వుందని, దాని ద్వారానే భిన్నమార్గాల్లో ప్రయాణించేవాళ్ళలోని సుగుణాంశాల్ని గుర్తించి ఇష్టపడేవాడని నాకర్థమైంది. ప్రత్యేకించి తన అన్నగారి పట్ల ఆయనకున్న గౌరవ భావం గురించి ఎంత చెప్పినా తక్కువే. ఎనభై యేళ్ళు వచ్చినా అన్నగారి ముందు ఆయన బాలుడిగానే వున్నాడు. అన్నగారు కుటుంబం పట్ల తనకన్నా బాధ్యతాయుతంగా వుండడమూ, తాను స్వేచ్ఛా ధోరణితో సమాజంలో పోతూంటే వెనక వెన్ను దన్నైన శక్తిగా వుండడమూ- బహుశా వీటి వల్ల కాళోజీ తన అన్నగారి పట్ల వినయశీలతతో వుండే వాడనుకుంటాను. అలాంటి అన్నగారు కాలం చేసినపుడు కాళోజీ కూలి పోతాడా అని ఆయన సన్నిహితులం భయపడ్డాం. విచలించాడు. ఓదార్చడం సులువు కాలేదు. ఐతే ఆ వేళలో ఎక్కువ నిశ్శబ్దమైపోయాడు. అందరమూ ఆ రోజు రామేశ్వరరావు గారి పార్థివ దేహాన్ని కాకతీయ వైద్యశాలకు అప్పగించాం, ఆయన జీవించి వున్నప్పుడు కోరుకున్న ట్లుగానే. ఒక మాట చెప్పి తీరాలి- అన్నగారు మరణించాక కాళోజీ సగమైపోయాడు. ఎన్నో సంబంధాలూ, పరిచ యాలూ, వున్నా అవేవీ ఆ లోటును పూడ్చలేక పోయాయి.

నా మూడో కవితా సంపుటి 'ముఖాముఖం'ను ఆయన ఆవిష్కరించాడు. అది నా సౌభాగ్యంగా భావించాను. నా నాల్గో సంపుటి 'వేళ్ళు మాట్లాడేవేళ" ఆవిష్కరణ సభకు

ఆయన ముఖ్యఅతిథి. ఆ రోజు ఆయన మాటల్ని విన్నాక నాకన్పించింది– కాళోజీ తాను చదివిన దాన్నీ, విన్నదాన్నీ ధ్యానిస్తాడని. ఏ సమావేశానికి ఎవరు పిలిచినా వెళ్ళి తనదైన ధోరణిలో నిర్భయంగా మాట్లాడ్డం ఆయన పద్ధతి. నిర్మొహమాటంగా చురకలు పెట్టేవాడు, నచ్చనపుడు. ఏ వేళకు సమావేశం ప్రారంభమవుతుందని చెబుతారో, ఆ వేళ కు ఖచ్చితంగా సమావేశ స్థలికి చేరుకునేవాడు. ఆలస్యంగా రావడం అసలే ఇష్టపడేవాడు కాదు.

ఖలీల్ జిబ్రాన్‌ను అనువదించడం వల్లనేమో, ఆ తాత్వికతను పుణికిపుచ్చుకోవడం వల్లనేమో– కాళోజీలో ఓ తాత్వికుడు ఉద్భవించాడని నాకనిపిస్తుంది. ఆడంబరాలకు ఆవల వుండేవాడు. సాదాసీదాగా వుండడం ఆయనకు ఇష్టం. ఒక్కడే కూర్చుని ఎదురుగా పేకముక్కలు పేర్చుకుని ఆడగలడు. క్రికెట్ పట్ల ఆసక్తిని కనపరిచేవాడు. ఆయనకు బహుముఖమైన ఇష్టాలుండేవి.

సెప్టెంబర్ 2001లో కాళోజీ కవితల సంపూర్ణ సంకలనం 'నాగొడవ' గా విడుదలైంది. అపుడు నేను కరీంనగర్‌లో ఉద్యోగం చేసేవాణ్ణి. ఓ రోజు కాళోజీకి అత్యంత సన్నిహితుడైన నాగిళ్ళ రామశాస్త్రిగారు కరీంనగర్‌కు వచ్చినపుడు మా ఆఫీసుకొచ్చి 'నా గొడవ' ప్రతినొకదాన్ని నాకిచ్చాడు. తెరిచి చూశాను. మొదటి పేజీలో తెల్లని కాగితమ్మీద 'తమ్ముడు దర్భశయనానికి' – 'కాళన్న' అని రాసి వుంది. అది కాళోజీ రాత. కాళన్న సంతకం. తేది 4.10.01. నేను ఉప్పొంగిపోయాను. కాళోజీకి ఎందరో తమ్ముళ్ళు. ఆ తమ్ముళ్ళలో నేనొకణ్ణయినందుకు కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు. పుస్తకాన్ని గుండెకు హత్తుకున్నాను. ఆ అనుభూతిని చెప్పడానికి ఇవాళ నాకు మాటల్లేవు.

నవంబర్ 13, 2002– ఒక దుర్దినం. కాళోజీ కాలం చేసాడు. హక్కుల గురించి ఎంత ఎలుగెత్తి చెప్పాడో, బాధ్యతల గురించీ అంత నిర్దుష్టంగా మాట్లాడిన అరుదైన మనిషి అంతర్ధానమయాడు. వరంగల్ శోక సంద్రమైంది. ఆయన భౌతికదేహాన్ని ఆయన కోరిక మేరకు కాకతీయ వైద్యశాలకు అప్పగించడమైంది. అలా అప్పగించి తిరిగొచ్చాక కాళోజీ ఇంట్లో నేనూ, నాగిళ్ళ రామశాస్త్రి, పొట్లపల్లి శ్రీనివాసరావు, వి.ఆర్.విద్యార్థి, ఇంకా ఒకరిద్దరే కూర్చున్నపుడు కాళోజీలేని లోటు ఎంతటిదో అర్థమైంది. మాలోంచి అంతర్గత శక్తి ఏదో ఎగిరి పోయినట్లనిపించింది. ఆత్మ గతమైనదేదో ఆవిరైనట్లనిపించింది.

ఆ తర్వాత ఓ ఏడాదిపాటు మథనపడి ఎలిజీ రాశాను 'అందరి గొడవ' అని. 'వర్తమానంలా కనిపించే త్రికాలశీలి కాళోజీ' అనే పంక్తితో ఆ కవితను ముగించాను. నలభైయాభై డ్రాఫ్టుల తర్వాత ఆ కవితకు తుది రూపమివ్వగలిగాను.

ఆయన శబ్దం నన్ను కదిలించినంతగానే, ఆయన కన్నీరూ, నిశ్శబ్దమూ నన్ను కదిలించాయి. ఇష్టమైన దాన్ని నిర్భయంగా పలకడం– ఆయన నుంచి నాలోకి ప్రవహించిన లక్షణమనుకుంటాను. కాళోజీ ప్రభావం వల్ల నా కవితల్లో వేగమూ, ఆవేశమూ, విసురూ పెరిగాయని అనుకుంటున్నాను. ఆయన జీవన శైలిలోని సాదాతనం నన్నెప్పటికీ నడిపించే బాట యింది.

కాళోజీ గురించి ప్రస్తావించకుండా నా కవితా ప్రస్థానం గురించి మాట్లాడలేనేమో! జయప్రకాశ్ నారాయణ గురించి "పుటక నీది/ చావు నీది/ బతుకంతా దేశానిది" అని రాశాడు కాళోజీ. ఓ కవితను ఇంత Crisp గా రాయడం ఎంత కష్టం! విశాలమైన దారుల్లో యాత్రించిన కాళోజీని గురించి 'Crisp' గా చెప్పడం మాత్రం కష్టమేననుకుంటాను. ఈ మాటల్ని రాస్తున్నపుడు నాకనిపిస్తున్నది– కాళోజీ జీవితాన్ని జీవించడానికి. జీవించడం గురించి తనదైన గొంతుతో వ్యాఖ్యానించాడని. వెళ్తూవెళ్తూ తన ముద్రను గొంతుతోసహా ఇక్కడ వదిలాడని. నాలాంటి వాళ్ళ కోసం! ఆయన జ్ఞాపకాలు కమ్మినపుడల్లా గొంతు వున్నది నిర్భయంగా పలకడానికేనని అన్పిస్తుంది. అలా పలకడమే ఆయనకివ్వగల్గిన నిజమైన నివాళి!

*రచయిత సెల్: 94404 19039*

## మనుషులున్నంత కాలం కాళోజీ ఉంటడు

1986లో మిత్రుడు జర్నలిస్టు రామలింగారెడ్డి సభా వివాహానికి కాళోజి వచ్చిండు. వేముగంటినీ, కాపు రాజయ్యనూ జ్ఞాపకం చేసి కలిసిండు. అప్పటికప్పుడు రాజయ్యగారు కాళోజీ చిత్రం గీసిండు. పెళ్లి అయిపోయిన తర్వాత అందరం భోజనానికి నడుస్తున్నం. నడుస్తున్న వాండ్లల్లో సిద్ధిపేట ఎంపి కూడా వున్నాడు. "వాడు మొయ్యడా వాడేం జేస్తడు" అని ఎంపికి సంచి ఇచ్చిండు. పాపం ఎంపికి కూడా కాళోజీ అంటే గౌరవం. సంచి పట్టుకున్నడు. అట్లా ఆదేశించగలిగిన స్థాయి ఆయనది. కాళోజీ అట్ల బతికిండు. అది మరెవ్వరికీ సాధ్యంకాదు. నిరంతర స్పందన, సతతం సంభాషణ తరుచుగా గర్జన. కాళోజీకి తప్ప ఎవరికి సాధ్యం? ఆక్షేపించుతూనే తాను చంద్రబాబు నాయుడిలాంటి వాళ్ళ అంజలి పొందగలిగిండు. చివరి వరకు ఘర్షణ పడుతూనే నళిన్ ప్రభాత్ వందనం పొందిండు. అభిమానించిన వాళ్లతోపాటు ఆక్షేపించిన వాళ్ల గౌరవం పొందటం కాళోజీకి తప్ప ఎవరికి సాధ్యం?

తెలంగాణ రచయితల వేదిక గౌరవాధ్యక్షుడు కాళోజీ. వరంగల్ ప్రథమ మహాసభలో ఆయన అధ్యక్షోపన్యాసం చిరస్మరణీయమైంది. కాళోజీని చూతామని అనిశెట్టి రజిత, పొట్లపల్లి శ్రీనివాసరావు, నేనూ నిమ్స్‌కు వెళ్ళినం. నన్ను గుర్తు పట్టలేదు. శ్రీనివాసరావు గుర్తు చేసిండు. ప్రభాకర్ పక్కనే ఉన్నడు. నా చెయ్యి పట్టుకొని "తెలంగాణను ఆగం జెయ్యకుండ్రి" అన్నడు దుఃఖమొచ్చింది. తెలంగాణ మీద ఎంత ప్రేమా? మృత్యుశయ్య మీద పండుకొని తెలంగాణ కోసమే పలకరించిండు. కలవరించిండు.

తెలంగాణంటే కాళోజీకి అంత ఆరాటం. కాళోజీ అంటే తెలంగాణకు అంత ఆరాటం. అన్ని జిల్లాల నుంచి ఆయన అంతిమ యాత్రకు కదలి వచ్చింద్రు. కాళోజీని తెలంగాణ ప్రజలు ఎప్పుడూ మరువరు. మనిషి కోసం తండ్లాడిండు కనుక మనుషులున్నంత కాలం కాళోజీ ఉంటడు. కాళోజీ మాటలుంటాయి.

"నే పాకని ఎత్తులేదు
నే జారని లోతులేదు
మూల జేరి మునులవోలే
మూగనోము పట్టినాను"

(నందిని సిధారెడ్డి, కాళోజీ యాదిలో... నుంచి)



టి.జితేందర్ రావు

# ప్రజాస్వామ్యానికి ప్రాణం

పద్మ విభూషణ్ శ్రీ కాళోజీ నారాయణరావు గారు ప్రజా కవిగా ప్రసిద్ధి. వారి కవితా సంకలనం 'నా గొడవ' కూడా కాళోజీ లాగే సుప్రసిద్ధమైంది. కాళోజీని, నా గొడవను విడదీయలేము. కాళోజీ అంటేనే 'నా గొడవ', 'నా గొడవ' అంటేనే కాళోజీ. కాళోజీ ఎవరితో గొడవ పెట్టుకున్నాడు? ఎందుకు పెట్టుకున్నాడు? నా గొడవ ఆయన వ్యక్తిగత గొడవా? తన కోసం గొడవ పడ్డాడా? గొడవ అంటే ఎవరికైనా చిన్న చూపే. గొడవ పడే వాళ్లను కొంత దూరంగానే ఉంచుతారు. కానీ విచిత్రంగా ఈ 'నా గొడవ'కు ఇంత గౌరవం, ఇంత ఆదరణ, ఇంత ప్రఖ్యాతి, ఇంత ప్రత్యేకత ఎందుకు వచ్చాయి. గొడవ ఇంత గొప్పది ఎలా అయింది? గొడవపడే వ్యక్తి ప్రజలకు ఎందుకింత అభిమానపాత్రుడయ్యాడు?



'నా గొడవ'

గైడ్.
రైట్ వే,
గేట్ వే,
ఫైట్ వే,
ఫేట్ వే,
గార్డియన్,
మోస్ట్ వాంటెడ్ వే.

కాళోజీ ఒక కవి, ఒక రచయిత, ఒక ఉద్యమకారుడు, ఒక న్యాయ వాది, ఒక మేధావి, ఒక తెగింపు, ఒక నిరసన, ఒక ధిక్కారం, ఒక ఉద్య మ సారధి, ఒక ఉద్యమ సైనికుడు, ఒక రాజీ పడని ఖలేజా, ఒక ప్రశ్న, ఒక నిలదీయడంలతో బాటు ఒక కట్టుబాటు. ఏ కట్టుబాట్లకు లొంగడని కాళోజీ మీద ఒక అపవాదు ఉంది. నిజమే ఎవరికి లొంగడు, దేనికి కట్టుబడడు ఒక్క చట్టానికి తప్ప ఒక చట్టపరమైన వ్యవస్థకు తప్ప. ఎందు కంటే చట్టం సిద్ధాంత రీత్యా ఎవరికి అన్యాయం చేయదు. ఎవరికి అప కారం చేయదు. ఎవరినీ అణిచివేయదు కానీ చట్టాన్ని తన చేతిలో ఉంచు కున్న అధికారం మాత్రం తప్పులు చేస్తుంటుంది. అన్యాయాలు చేస్తుం టుంది. అక్రమాలు చేస్తుంటుంది. అమాయకులను అణగదొక్కు తుం టుంది. అటువంటి అధికారం చట్టానికి లోబడి ఏదైనా చేస్తే ఎవరికి ఏ అన్యాయం జరగదు అనేదే కాళోజీ మాట. అందుకే కాళోజీ లొంగింది, ఆచరించింది ఈ ఒక్క సూత్రానికే. ఈ ఒక్క లొంగుబాటే ఈ ఒక్క కట్టుబాటే



'సరిహద్దులు లేని సంధ్యలు' పుస్తకావిష్కరణ సభలో...

ఆయన ప్రత్యేకత, ఆయన ఖ్యాతికి ఆయనకు ఉన్న ఆదరణకు కారణం. సమాజ సముద్రంలో హాయిగా సాగిపోయేందుకు ఏర్పాటు చేసుకున్న పడవే కాళోజీ 'నా గొడవ'. ఈ గొడవ పడవ లేకుంటే ఈ అసమాన సమాజ సముద్రంలో అమాయకులు కొట్టుకుపోతారు. అక్రమార్కుల ఆగడాలకు అంతుండదు. కాళోజీ తనకు తాను ఏర్పరుచుకున్న బాటే ఆ కట్టుబాట. బ్రతికినంత కాలం ఆ బాట మీదే తను నడిచాడు. చనిపోయి ఈ సమాజానికి తానే ఓ బాటయ్యాడు.

కాళోజీ జీవితం అంటే ఒక నిఖార్సయిన పౌరుడి జీవితం, జీవించే విధానం. కాళోజీ కవిత్వం అంటే ఒక నిఖార్సయిన పౌరుడి ఆలోచన, ఆవేశం, ఆశయం. కాళోజీ ఉద్యమం అంటే ఒక నిఖార్సయిన పౌరుడి జీవిత లక్ష్య సాధన కోసం పోరాటం.

'నా గొడవ' అని చెప్పింది ఆయన స్వంత గొడవ కాదు.అది ఈ రాష్ట్ర ప్రజల, ఈ దేశ ప్రజల, ఈ ప్రపంచ ప్రజల గొడవ. ఎవరు చదువుకుంటే వారి గొడవ. ఎవరు తాము పౌరులమనుకుంటారో ఎవరు తమకు తాము సమాజంలో తల ఎత్తుకొని ఒక గౌరవంతో, హక్కులతో హుందాగా బ్రతకాలనుకుంటారో వారు ఏమి చేస్తే అలా బ్రతుకుతారో ఎలా ఉంటే అలా బ్రతుకుతారో చెప్పేదే కాళోజీ 'నా గొడవ'. తనకు ఊహ తెలిసినప్పటి నుండి, పౌరుడిగా నిటారుగా నిలబడ్డ నాటి నుండి చివరి శ్వాస వదిలే దాకా కాళోజీ సంధించిన ప్రశ్నల పరంపరే 'నా గొడవ'. ఆ ప్రశ్నలు సంధించాల్సిన అవసరం వచ్చిన చరిత్ర సందర్భాల మాలికే కాళోజీ 'నా గొడవ'. 'నా గొడవ'లోని ప్రతి పంక్తి అప్పటి చరిత్రలో జరిగిన అవకతవకలను నిలదీసే ఓ అక్షర కరవాలమే. కాళోజీ ఒక ఏక వ్యక్తి సైన్యం. ఈ ప్రపంచంలోని అందరు ప్రజలు తనలాగే ఏక వ్యక్తి సైన్యాలుగా మారాలనేదే ఆయన ఆశయం. ఎందుకంటే ఒక ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలే ప్రభువులు. ప్రజలే రక్షకులు. ప్రతి పౌరుడు తనను తాను రక్షించుకునేందుకు తనకు తాను ఒక ప్రభువులా బ్రతికేందుకు అడ్డుపడే ఏ సందర్భాన్నైనా ముందు తాను ఒక ప్రశ్నై ప్రశ్నించాలి. జవాబు రాకుంటే నిలువెత్తు నిరసనై నిలబడాలి, అదీకా కుంటే గొడవ పడైనా వ్యవస్థను గొడుగు పట్టి కాపాడాలని చెప్పేదే కాళోజీ 'నా గొడవ'. గొడవ అనగానే ఒక నేరం అనే ఆలోచన అన్నివేళలా సరికాదు అని చెప్పేందుకే కాళోజీ అంటాడు హింస తప్పు కానీ, ప్రతి హింస తప్పు కాదు అని. పౌరుడు స్వేచ్ఛగా రాజ్యాంగం ఇచ్చిన అన్ని హక్కులతో హుందాగా బ్రతకడం ముఖ్యం. దాని కోసం కొంత గొడవ పడినా సమంజసమే. ప్రశ్న ప్రజాస్వామ్యానికి ప్రాణం. ప్రశ్నించడమే ప్రజాస్వామ్యాన్ని బ్రతికించు కోవడం.

కాళోజీది ఊహల కవిత్వం కాదు. వ్యవస్థకు ఊపిరిలూదే కవిత్వం. మనం నిర్మించుకున్న వ్యవస్థను మనమే కాపాడుకోవాలన్నదే ఆయన ఉద్యమ లక్ష్యం. ఆయనకు వ్యక్తిగతంగా ఎవరూ శత్రువులు లేరు. మిత్రుని మిత్రుడు మిత్రుడే, మిత్రుడి శత్రువు శత్రువే అన్నట్టు ప్రజల మిత్రులు, పౌరుల మిత్రులు తనకు మిత్రులు, ప్రజల శత్రువులు, పౌరుల శత్రువులు తనకు శత్రువులు. మనుషులు మనుషుల్లాగే బ్రతకాలి అనేదే ఆయన సిద్ధాంతం. అంటే అన్యాయాలకు ఆహుతి కాకుండా, అక్రమాలకు గురికాకుండా దర్జాగా, హుందాగా, చట్టం కల్పించిన అన్ని హంకులు, అన్ని అవకాశాలు అనుభవిస్తూ ఆత్మగౌరవంతో బ్రతకాలన్నదే ఆయన సిద్ధాంతం. ఆయనదంతా సిద్ధాంత మిత్రుత్వం, సిద్ధాంత శత్రుత్వం.

ఊకదంపుడు ఉపన్యాసాలు, ఊసుపోని ఉద్యమాలు కాళోజీకి తెల వవు. ప్రజా సమస్యలు లేని ఉపన్యాసం కానీ, ఉద్యమం కానీ కాళోజీ జీవితంలో ఎప్పుడూ చేయలేదు. కాళోజీ మాట, కాళోజీ బాట, కాళోజీ గోడు, కాళోజీ గొడవ, కాళోజీ ఆలోచన, కాళోజీ ఆవేదన, కాళోజీ ఆవేశం అన్నింటిని అంటిపెట్టుకొని ఉన్న ఒకే ఒక సూత్రం ప్రజాస్వామ్యంలో ప్రజలు ప్రభువులుగానే బ్రతకాలని.

కాళోజీ 'నా గొడవ' రౌడీల గొడవ కాదు. ప్రజా రాజుల గొడవ. అది చట్టబద్ధ గొడవ. ప్రజాస్వామ్య ఫలాలను అందరికి అందించే గొడవ. దొడ్డి దారిన చేసే దొమ్మీల గొడవ కాదు. రాచబాట మీద చేసే రాజ్యాంగ బద్ధ గొడవ. అందుకే ఆ గొడవ సమాజానికి ఎంతో అవసరం, అత్యవసరం. బ్రతికేందుకు ప్రాణికి ఆక్సిజన్ ఎంత అవసరమో సమాజం ఆరోగ్యంగా ఉండేందుకు పౌరుడికి ఈ గొడవ అంత అవసరం.

కాళోజీ భౌతికంగా ఈ సమాజంలో లేదు. సమాజంలో ఉన్న వారికి ఏ గోడులు ఉండొద్దన్న ఆశతో, ఆశయంతో గోడులకు గోరీ కట్టే గొడవల గైడ్ ఇచ్చిపోయాడు. 'నా గొడవ' ఒక గైడ్.ఒక గార్డియన్, ఒక గేట్ వే, ఒక ఫేట్ వే, ఒక ఫైట్ వే, ఒక రైట్ వే, మోస్ట్ వాంటెడ్ వే.

*రచయిత సెల్: 99486 12082*



# మార్చ్ ఆన్

తిరుగుబాటు మనిషి బ్రతుకు
బ్రతకనదగు బ్రతుకు
బ్రతక దలచినట్టి మనిషి బ్రతుకు
తిరుగుబాటు.

మతము యిజము ఏదైనను
ఏకీభవించనోని పీక నొక్కు సిద్ధాంతము
పూని మిడిసిపడినప్పుడు
ఎదిరి నిలుచు మనిషి బ్రతుకు
తిరుగుబాటు.

పార్టీప్రత్యము బోనుల పగల చీల్చి
మతముల గోతుల మూతుల దాక పూడ్చి
భావదాస్య పరంపరల కుళ్ళంతయు
పుల్లాకుల వలె ఎగురగ
'ఝంఝా' రూపాన వీచి





ఎప్పటికప్పుడు
క్రొత్త చీకట్లను పారదోల
ఉదయించెడి సూర్యుని వలె
వెలుగుతున్న దీపము వలె
తల ఎత్తుక
'మార్చ్ ఆన్' అను మనిషి బ్రతుకు –
తిరుగుబాటు.

'తల వూడినను నేను
తలను తాకట్టు బెట్ట'
అని అనగల మనిషి బ్రతుకు –
తిరుగుబాటు.

'మెడకురిబడినను నేను
గళమును తాకట్టు పెట్ట'
అని అనగల మనిషి బ్రతుకు –
తిరుగుబాటు.

'నా చేతులు నరికినను
నా కలమును తాకట్టు బెట్ట'
అని అనగల మనిషి బ్రతుకు –
తిరుగుబాటు.

దోపిడి దౌర్జన్యానికి కారకులగు
దుష్టుల దొంగల ముఠాల
రక్షించెడి అధినేతల
రూపు మాపు ధీమాతో
బ్రతుకుదలచినట్టి మనిషి బ్రతుకు –
తిరుగుబాటు –

– కాళోజీ





ఏనుగు నరసింహారెడ్డి



# నవ్వించే ఉడికించే మనిషి

కాళోజీ మిత్రుల సంఖ్య అపరిమితం. ఆయన స్నేహానికి వయోపరిమితులు కూడా ఉండవు. పెద్దల్నీ, పిల్లల్నీ సమానంగా ప్రేమించగలడు, నవ్వించగలడాయన. హైద్రాబాద్‌కొస్తే టి.ప్రభాకర్ నివాసమే ఆయన అడ్డా. తెలంగాణ ప్రభాకర్‌గా పేరు పొందిన తక్కళ్ళపల్లి ప్రభాకర్ తన వామపక్ష విద్యార్థి రాజకీయాలలో వేలాది మందిని కలిసినట్లుగానే కాళోజీని కూడా కలిసిండు. కానీ కాళోజీని కలిసాక ఆయన ప్రభావాన్ని తప్పించుకోలేకపోయిండు. కాళోజీ చివరి శ్వాస దాకా వెన్నంటే తిరిగిండు. నవంబర్ 13, 2002న కాళోజీ మరణవార్తను వరంగల్లుకు, ఆంధ్ర రాష్ట్రానికి ఆయనే తెలియజేసిండు. పార్థివ దేహాన్ని తన ఇంటికి తీసుకువచ్చి కాళోజీకి శ్రద్ధాంజలి ఘటించిండు. కాళోజీ జన్మించి 99 ఏళ్ళు నిండుతున్న సందర్భంగా రాష్ట్రవ్యాప్తంగా ఆయన జయంతిని సంవత్సర కాలంపాటు ఉత్సవంగా చేయాలని సంకల్పించారు. కాళోజీ ఫౌండేషన్ తరపున 'కాళోజీ నా గొడవ కవితలు', 'కాళోజీ యాదిలో...' ప్రచురించిన టి.ప్రభాకర్‌ను ఈ సందర్భంగా పాలపిట్ట తరపున ఏనుగు నరసింహారెడ్డి ఇంటర్వ్యూ చేసారు. అందులోని ముఖ్య భాగాలు.





**కాళోజీ ఒక నానాజాతి సమితి. ఆయనకు జిల్లా, ప్రాంతం, రాష్ట్రం పరిమితులు లేవు. కులాలు, మతాలు, చివరికి వయసుతో సంబంధం లేకుండా ఆయన స్నేహాలుండేవి. కాబట్టి ఆయన జయంతి ఉత్సవాలు రాష్ట్రవ్యాప్తంగా జరపాలి. అన్ని సాహిత్య సంఘాలు భాగం పంచు కోవాలి.**

**కాళోజీతో మీ పరిచయం ఎలా మొదలయింది? అది అనుబంధంగా ఎలా పరిణమించింది?**

విద్యార్థి ఉద్యమాలలో నేను చురుకుగా పాల్గొనేవాన్ని. పి.డి.ఎస్.యు.కు ఫౌండర్ ప్రసిడెంటుగా పనిచేసాను. అయితే వామపక్ష భావజాలానికి చెందినవారితోనే కాక ఇతరత్రా మిత్రులతో కూడా నాకు మంచి స్నేహమే ఉంది. మేం ఒక ప్రింటింగ్ ప్రెస్ నడిపే వాళ్ళం. లెఫ్టిస్టుల కరపత్రాలు చాలా వేసేవాళ్ళం. ప్రజాసంఘాలు కరపత్రాలకు, పోస్టర్లకు డబ్బులు లేక వస్తే మేమెలాగో ప్రచురించి ఇచ్చేవాళ్ళం. ఇలా బహుముఖీనమైన ప్రజా సంబంధాల వల్ల, తరచూ చర్చలు జరిపేవాళ్ళం. ఆ చర్చల సారాంశంగా తెలంగాణ అనేకవిధాలుగా వెనకబడి పోతున్నదని ఒక అభిప్రాయానికి వచ్చాం. తెలంగాణ ఉద్యోగుల పట్ల వివక్ష కొనసాగుతుందని తెలియవచ్చింది. మావంతు ప్రయత్నంగా 1987లో 'తెలంగాణా ఇన్ఫర్మేషన్ ట్రస్ట్'ను ఏర్పాటు చేసాం. ప్రొ.జయశంకర్, కేశవ్‌రావ్ జాదవ్, భూపతి కృష్ణంరాజు, ప్రతాప్ కిషోర్, కాళోజీ మొదలగు పెద్దల్ని అప్పుడే కలిసాం. అలా కాళోజీతో ఏర్పడ్డ పరిచయం తర్వాత చేసిన కార్యక్రమాల వల్ల మరింత బలపడింది.

**తర్వాత ఎలాంటి కార్యక్రమాలు చేసారు?**

తెలంగాణ ఇన్ఫర్మేషన్ ట్రస్టును రిజిష్టర్ చేసాం. 'మా తెలంగాణ' పత్రిక నడిపాం. బసంత్ టాకీస్‌లో మా తెలంగాణ పత్రిక రిలీజ్ ఫంక్షన్ చేసాం. న్యాయమూర్తి మాధవరెడ్డి, జయశంకర్, కాళోజీ లాంటి ఎందరో ప్రముఖులు హాజరయ్యారు.

**మాటకూ, చేతకూ మధ్య అంతరంలేని మనిషిగా కాళోజీని చూడవచ్చా? కాళోజీలో వైరుధ్యాలు లేవా?**

అలాంటి వైరుధ్యాలు ఆయనలో లేవు. ఆయన స్వతహాగా గాంధేయ వాది. చెప్పిందే ఆచరించే మనిషి. 'పిరికిపందకన్న అహింస వేయిరెట్లు మిన్న' అన్న మహాత్ముడి మాట ఆయనకు తలమానికము. ఒకసారి పీపుల్స్‌వార్ ఎన్నికలను బాయ్‌కాట్ చేయమని పిలుపు ఇచ్చింది. అలా ఇచ్చిన పిలుపును బేఖాతరు చేసి ఎవరైనా ఓటువేస్తే వాళ్ళ కాళ్ళుచేతులు విరగ్గొడతామని స్థానిక క్యాడర్ భయపెట్టింది. అప్పుడు కాళోజీయే స్వయంగా మొదటి ఓటు వేసి చేతనైతే తన కాళ్ళు చేతులు విరగ్గొట్టుమని సవాల్ చేసిండు. అదే సందర్భంలో వ్యక్తి చేసే తప్పు వల్ల జరిగే నష్టం కన్నా, రాజ్యం చేసే తప్పిదం వల్ల సమాజానికి ఎక్కువ కీడు జరుగుతుందని ఆయన నమ్మేవాడు.

**ఆయన పద్మవిభూషణ్ స్వీకరించడాన్ని మనం ఎలా చూడాలి?**

ఆయన ఎవరో చెబితే వినే మనిషి కాదు. పద్మ విభూషణ్ తీసుకోవాలా వద్దా ఆయనే నిర్ణయించుకున్నాడు. నిజానికి ఆయన దానికి జవాబు కూడా చెప్పుకున్నాడు. తన వ్యక్తిత్వం చూసి అవార్డు ఇస్తున్నట్లు చెప్పినందుకు అంగీకరించడంలో తప్పులేదనుకున్నాడు. ఆనాటి ప్రధాని నుండి ఫోను వచ్చినప్పుడు ఆయన సమయస్ఫూర్తి చూసి మనం ఆశ్చర్యపోవలసిందే. ఢిల్లీ నుండి ఫోన్లో ప్రధాని పి.వి. 'నేనొక మాటడుగుత, ఒప్పుకుంటవా?' అన్నడట. దానికి కాళోజీ వెంటనే 'ఏంరో, ఏందో చెప్పకుంటనే ఒప్పుకోమంటున్నవ్. ఏంది కత' అన్నడు. ఆయన చమత్కారానికి, నిజాయితీకి, సమయస్ఫూర్తికి మచ్చుతునక అది.

**కాళోజీ సాహిత్యాన్ని బయటి ప్రపంచానికి పరిచయం చేయడమెలా?**

ఆయన సాహిత్యమంతా హిందీ, ఇంగ్లీషులోకి అనువాదం చేయాలి. ఈ ఉత్సవాలలో ఆ ప్రణాళిక కూడా ఉంది.

**ఆయన్ని తెలంగాణ కవిగా చూడడం సరైందేనా?**

కాదు. ఆయన గొప్ప తెలుగు కవి. భాషకు అతీతంగా చూసినప్పుడు ఆయన పోరాటవాది. జాతీయవాది కూడా. చైనా యుద్ధం సందర్భంగా జాతీయ కవిత్వం రాసిండు.

నిజాంకు వ్యతిరేకంగా రాసిండు.

**కాళోజీ శతజయంతి ఎలా జరపడం అవసరం.**

(నవ్వుతూ) కాళోజీ ఒక నానాజాతి సమితి. ఆయనకు జిల్లా, ప్రాంతం, రాష్ట్రం పరిమితులు లేవు. కులాలు, మతాలు, చివరికి వయసుతో సంబంధం లేకుండా ఆయన స్నేహాలుండేవి. కాబట్టి ఆయన జయంతి ఉత్సవాలు రాష్ట్రవ్యాప్తంగా జరపాలి. అన్ని సాహిత్య సంఘాలు భాగం పంచుకోవాలి. బి.నర్సింగరావుగారు ఈ ప్రయత్నం చేస్తున్నారు.

**నా గొడవ ప్రచురణ ఎలా జరిగింది?**

నాలుగైదు ఏండ్ల పాటు నా గొడవ ప్రతులు అనేకమంది చేతులు



కాళోజీ, ప్రభాకర్‌ల సంభాషణ సన్నివేశం





మారినాయట. అది ఎక్కడా ప్రచురణ కాలేదు. చివరకు ఆ బాధ్యత నేను తీసుకున్నాను. అయితే ఆ ప్రతి నా దగ్గర నాలుగైదు నెలలు ఉండిపోయింది. అప్పటికీ అవి నాలుగైదేండ్లుగా ఇతరుల వద్ద ఆగిపోయినాయనే కోపంతో 'నువ్వెన్నేండ్లు' అన్నాడు కోపంలో కాళోజీ. నా ప్రాణం చివుక్కుమంది. ఆ మాటతో ఆయన జన్మదినం లోపల ప్రచురణ పూర్తిచేసి ఆవిష్కరణ కంటె ముందు పది ప్రతులు తనకి అందజేశాను. ఆ గ్రంథావిష్కరణ రోజు కాళోజీ కళ్ళల్లో ఆనందాన్ని ఇప్పటికీ మరవలేను.

**కవిత్వం విషయానికొస్తే కాళోజీ వస్తువు మీద పెట్టిన శ్రద్ధ శిల్పం మీద పెట్టలేదని కొందరంటారు! మీరు...**

అవును ఆయనది వస్తు దృష్టి. సాహిత్యం లోతులు నాకంతగా తెలియవు కానీ ఆయన ప్రాధాన్యం వస్తువుకే. కవిత్వం కవిత్వం కోసం కాదని కూడా ఆయనకు తెలుసు. చైనా వార్, ఎమర్జెన్సీ నక్సలిజం, నిజాం వ్యతిరేకత, ఆంధ్ర వలసవాద ధోరణి ఆయన కవిత్వ వస్తువులు. ఆయన ప్రజా కవి. ఆయనే అంటడు 'నాది కవిత్వమని నేను జెప్పిన్నా? ఇది నా గొడవ.'

**ఈ తరానికి కాళోజీ స్ఫూర్తి ఏమిటి?**

నిబద్ధంగా ఉండాలి. నిజాయితీగా స్పందించే అలవాటు కావాలి. కాళోజీ ప్రకారం దేనికైనా తక్షణ స్పందన కావాలి. 1948 సాయుధ





పోరాటం గురించి సుందరయ్య, రావి నారాయణరెడ్డి అనంతర కాలంలో పుస్తకాలు రాస్తే ఆయన దాన్ని తప్పు బట్టాడు. వాళ్ళు నిజాయితీగా రాసేవాళ్ళే అయితే పోరాట కాలంలో రాయాల్సి ఉండే. ఇప్పుడు లెక్కలు, పత్రాలు సరిజూసుకొని వాదనలు సిద్ధం చేసుకొని రాయడం మోసం అంటాడాయన.

**ఆయన మీకు ఆత్మీయుడు కావడానికి కారణమేమంటారు?**

ఆయన హైద్రాబాద్ వస్తే ఖైరతాబాద్ ఆయన అడ్డా. ఆయన వచ్చిండంటే జస్టిస్ సుదర్శన్‌రెడ్డి, సురమౌళి, బూర్గుల నర్సింగరావు, భూపతి కృష్ణమూర్తి, జయశంకర్ ఖైరతాబాద్ వచ్చేవారు. కొందరి దగ్గరకు నేనే కాళోజీని తీసుకొని తిరిగేవాన్ని. మోకాలి నొప్పుల వైద్యం కోసం డా॥ గురుకుల మిత్రా దగ్గరికి తీసుకువెళ్ళేవాన్ని. ఆయన వైద్యంతో మోకాలు నొప్పులు మాయమైనాయని ఓరోజు మేడ మెట్లు ఎక్కుతూ చేతికర్రను విసురుగా బయటకు పడేసాడు. ఎక్కడున్నా రాత్రంతా ముచ్చట్లు నడిచేవి. పాత విషయాలు తేదీలతో సహా పూసగుచ్చినట్లు చెప్పేవాడు. అయినా కాళోజీకి ప్రభాకర్‌తో అనుబంధం అనడంకంటే ఈ వేదికతో అనుబంధంగా చెప్పడం కరెక్ట్. అయితే వరవరరావు అన్నట్లు ప్రభాకరే వేదిక అయిండన్నా తప్పుకాదు.

**జీవితంలో ప్రతి సందర్భంలో అత్యంత ధైర్యవంతుడిగా, మొండివాడుగా పేరుపడ్డ కాళోజీ మరణాన్ని ఎదుర్కోవడంలో ఎలా కనిపించారు?**

జవాబు: వరంగల్లు నుండి నిమ్స్ వచ్చాక ఆసుపత్రి బెడ్ మీద ఉన్నా ఆయనలో హ్యూమర్ ఎంతమాత్రం తగ్గలేదు. నేను ఆసుపత్రికి వెళ్ళి 'దావత్‌కు పోయి పడ్డవట గదా?' అన్న. 'దావత్ తినకుంటనే పడ్డరా' అన్నడు. ఆనాటి మంత్రి కోడెల శివప్రసాద్ నిమ్స్‌కు వస్తే 'వీడు గూడ డాక్టరట గదరా?' అన్నడు. డాక్టర్లు తరచూ వచ్చి చూసిపోతుంటే 'ఒకడు కాలు డాక్టరు, ఒకడు చేయి డాక్టరు, ఒకడు కన్ను డాక్టరు, ఒకడు నెత్తి డాక్టరు. మరి ఈ తనువు మనదా ఆళ్ళదిరా?' అన్నడు. 'చచ్చెటందుకు కూడా గిన్ని అవస్థలారా?' అని చమత్కరించిండు. పి.వి. రంగారావు మీద జోకులు పేల్చిండు. అన్నను గుర్తు చేసుకుండు. మరణం దిగులు నాకెప్పుడూ కన్పించలేదు.

**ఏనుగు నరసింహారెడ్డి ఫోను నెం: 94408 15870**

ఏనుగు నరసింహారెడ్డి



కాళోజీ యాదిలో
వెల: రూ. 150/-
ప్రచురణ: కాళోజీ ఫౌండేషన్, హైదరాబాద్
ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు

**కాళోజీ** పేరు చెబితే నిలువెత్తు స్వేచ్ఛ కళ్ళముందు నిలబడుతుంది. మోసాల మూలాల్ని కనిపెట్టే స్వేచ్ఛ, అన్యాయాన్ని నిటారుగా నిలబెట్టి కడిగేసే స్వేచ్ఛ. ఆయనకెంత స్వేచ్ఛ ఉందంటే నిజాంను నిర్భయంగా తిట్టిపోసేంతగ, ప్రధానమంత్రి మీద ఎదురుబడి చురకలేసేటంతగ. ఆయన వ్యక్తుల్ని విమర్శించేవాడు, వ్యవస్థల్ని విమర్శించేవాడు, రాజ్యానికి వ్యతిరేకంగా నినదించేవాడు. అయితే విచిత్రంగా ఏ మూల నుండీ ఆయన విమర్శకు జవాబు సరిగ్గా వచ్చేది కాదు. దానికి కారణం ఆయనలోని నిజాయితీ. ఆ నిజాయితీ ఆయనను గాంధేయవాదిని చేసింది, పోరాటవాదిని చేసింది, హక్కుల ఉద్యమం వెంట నడిపించింది. అదే నిజాయితీ ఆయనను ప్రజాకవిని చేసింది. ఆయన కవిత్వం ఎల్లెడలా ఆవేశమే ఉంటుంది. అది నిజాయితీతో కూడిన ఆవేశం. అది ప్రణాళికా బద్ధంగా ఉండదు మరి! ప్రణాళికాబద్ధంగా ఉండకూడదనే అంటాడు తను. జనగాం తాలూకా బైరాన్‌పల్లి గ్రామంలో రజాకార్లు చేసిన హత్యా కాండకు చలించిన ఆయన ప్రతీకారం ప్రబోధిస్తాడు. గాంధేయవాది ప్రతిహింసను కోరుకుంటడా అనే వివేచన అప్పటికి ఆయన మదిలోకి రాదు.

'మన కొంపలార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచిపోకుండ గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసకొట్టుచుండాలె
కాలంబు రాగానె కాటేసి తీరాలె'

అంటడు. ఇక్కడ శాంతి మంత్రం పనికిరాదని అంటడు.

'సత్యమ్మహింస'యని సంకోచపడరాదు
'దయయు ధర్మం'బనుచు తడుముకో పనిలేదు
'శాంతి'యని చాటినను శాంతింపగా రాదు
'క్షమ'యని వేడినను క్షమియింపగారాదు
'చాణక్యనీతి' నాచరణలో పెట్టాలె
కాలంబురాగానె కాటేసి తీరాలె'

ఇదే నిజాయితీని కొందరు ద్వంద్వమని పొరపడే ప్రమాదముంది. కానీ ఆయన మనస్ఫూర్తిగా నమ్మిందే మాట్లాడేవాడు. మాట్లాడిందే చేసే వాడు. అంతటి స్వేచ్ఛావాది ఆయన. 1956లో కె.వి.రంగారెడ్డి, చెన్నారెడ్డి లాంటి వాళ్ళు ఆంధ్రప్రదేశ్ ఏర్పాటును వ్యతిరేకించినప్పుడు కాళోజీ మాత్రం స్వాగతించాడు. ప్రజాభిప్రాయం మేరకు 1969లో జై తెలంగాణ ను సమర్థించిండు. ఎమర్జెన్సీ, చైనావార్ తదితర సందర్భంలో తనదైన విలక్షణ అభిప్రాయాలు వ్యక్తం చేసిండు.

ఒంటరి ఊపిరితిత్తితో ఎనభై ఎనిమిదేండ్లు మనల్ని నవ్వించి, ఉత్సాహ పరిచి, ఉద్రేకపరిచి ముందుకు నడిపించిన ప్రజాకవి కాళోజీ 2002 నవంబర్‌లో కన్నుమూసిండు. యావత్ తెలుగు జాతిని ఏడిపించిండు. కవులు, రచయితలు, స్నేహితులు, ప్రజాస్వామ్యవాదులు, ఉద్యమకారులు ఆయన సజీవ స్మృతుల్ని నెమరు వేసుకున్నారు. కాళన్నతో తమ అనుభవా ల్ని, అనుభూతుల్ని అక్షరబద్ధం చేస్తూ 'కాళోజీ యాది లో' అన్న పుస్తకం ప్రచురించారు.

వ్యక్తులు రాసిన అభిప్రాయాలు, సంస్థలు వ్యక్తం చేసిన స్పందనలు, పత్రికలు ప్రచురించిన నివేదికలు, కాళోజీని స్మరిస్తూ రాసిన కవితలు, కాళోజీకి సంబం ధించిన విలువైన ఫోటోలు ఇందులో ఉన్నాయి.

పి.వి.నరసింహారావు, వరవరరావు లాంటి భిన్న ధృవాలకు ఆత్మీయుడై వెళ్ళిపోయిన కాళోజీ కవిత్వం మీద ఆచార్య పేర్వారం జగన్నాథం రాసిన వ్యాసం కాళోజీ కవిత దృక్పథాన్ని పట్టి ఇస్తుంది. కాళోజీ మన భవిష్యత్తు అన్న వ్యాసంలో గుజ్జ భిక్షం *'Kaloji will be a major influence on my future thinking too'* అన్న మాట తెలుగు ప్రజలలో ప్రజాపక్షవాదులందరికీ వర్తిస్తుంది. కోదాటి నారాయణ రావు వ్యాసం వాళ్ళ మధ్య ఉన్న వైయక్తిక సంబంధాన్ని చెప్పినట్లుగా ఉండి తెలంగాణ చరిత్రలో ఇటీవలి రోజులను జ్ఞప్తికి తెస్తుంది. ఈ పుస్తకంలో 149 అభిప్రాయాలే రికార్డయినవి కానీ తెలంగాణ ప్రజా హృదయాలలో ఆయన కవిత్వం పునశ్చరణగా మిగిలిపోయింది.

'గడియ గడియకూ మారు ప్రపంచం
గవ్వ గవ్వకూ కొరగాని ప్రపంచం
ఆశపెట్టి ఆడించు ప్రపంచం
మోసపుచ్చి మురిపించు ప్రపంచం'

విడిచిపోయిండు కాళోజీ. అవును!

'పెద్దాయన పదునైన మాట రువ్వుకుంటనే
విస్రులు విసురుకుంటనే
ఎన్కకెన్కకు మర్లిపోయిండు
ఎవలకు జెప్పకుంటనే ఎల్లిపోయిండు'

అంటుంది అనిశెట్టి రజిత, కాదు కాళోజీ యాది.

సమీక్షకుని సెల్: 94408 15870



డా.ఎన్.గోపి

కన్నీళ్లు ఏడుంటే
కాళన్న ఆడుంటడు
కాళన్న ఏడుంటే
'కలేజాగాండ్లు' ఆడుంటరు –
గోడ అడుగును తాకినప్పుడల్లా
గొంతు అడ్డం పడ్తది కాళన్నకు,
ఎంతో చిక్కు సంగతులను
'గింతే' అని తేల్చేస్తడు కాళన్న
మూడు అంతరాలు చూసి
లావు లావు ఎగుర్తాండు
దమ్మున్న పోరగాల్లను
రమ్మని సవాలు చేస్తాండు
కాళన్న ముంగల
నువ్వన్న మాటలె నీ మీదికి తిరగబడతై
కాళన్న వెనకాల
ఆయనన్న మాటలే వినబడతై

కాళన్న కవిత్వానికి
అక్షరాలు చాలై
కాళన్న గర్జిస్తే
కాయితాలు వొనుకుతై
కాళన్న మాటలు
పునాదులల్ల ఆడుకునె పసిపిల్లలు
లొసుగుల్లేవు
ముసుగుల్లేవు
సిసలైన వ్యవహారం కాళన్నది
కాళన్న అడుగుపెట్టిన ఇల్లు
కాళన్న మెట్టిన ఇల్లే
కాదంటే ఆ ఇల్లాలు
కాళన్న ఒడిలో పిల్లే
కాళోజీ అడుగులు పడ్తే చాలు
'కాళోజీ తాత' అంటూ
వీధులు వెంట పడతై
నువ్వాయన కోసం పోయినప్పుడు
నీ కోసం ఆయన
మీ యింట్లుంటడు
కవిత్వాలు కాయితాలు
సదువుకున్నోన్ని అటుబెట్టు
కష్టనిష్టూరాలు తెలిసిన ప్రతోడు
కాళన్న ముందు కరిగి పోతడు
కష్టనిష్టూరాలు రెండూ
కాళన్న ముందు కరిగిపోతయి
కాళన్న ఒక మెత్తని వజ్రం
కాళన్న కాళన్నే

కవి సెల్: ***93910 28496***

డా॥పంతంగి వెంకటేశ్వర్లు

# కాళోజీ పాఠాల బోధనలో...

ప్రజాకవి కాళోజీని నేను మొదటిసారిగా కలుసుకున్నది 1993లో. నా పిహెచ్.డి పరిశోధనలో భాగంగా కాళోజీని ఇంటర్వ్యూ చేయడానికి ఒకరోజు నక్కలగుట్టలోని వారి ఇంటికి వెళ్ళాను. అంతకు ముందు కొన్ని సమావేశాల్లో కాళోజీ సోదరులను చూసినా కలుసుకున్నది, మాట్లాడింది అప్పుడే. 'అభ్యుదయ కవులపై తెలంగాణ విమోచనోద్యమ ప్రభావం' అనే అంశంపై ఆచార్య పేర్వారం జగన్నాథం గారి పర్యవేక్షణలో చేస్తున్న నా పరిశోధన అప్పుడు చివరి దశలో ఉంది. నిజాంకు వ్యతిరేకంగా పోరాడిన ప్రత్యక్ష కవుల్లో దాశరథి తరువాత కాళోజీనే ముఖ్యమైన వ్యక్తి గనుక నేను కాళోజీని ఇంటర్వ్యూ చేయడం తప్పనిసరి. పైగా స్థానికంగా ఉన్న కవి కూడా. చేతిలో చిన్న టేప్‌రికార్డర్, జేబులో అడాగాల్సిన ప్రశ్నల లిస్ట్‌తో కొంచెం భయం భయంగానే కాళోజీ ఇంటికి వెళ్లాను.

కాళోజీ సోదరులు అప్పటికే లబ్ధప్రతిష్టులైన కవుల కావడం, వయసులో చాలా పెద్దవాళ్ళు కూడా కావడంతో వాళ్లతో మాట్లాడాలంటే సహజంగానే భయం వేసింది. 'కళామేషాద్'గా బిరుదున్న కాళోజీ రామేశ్వరరావు గారు మొదట నన్ను చూసి బయటకు వచ్చి ఏం కావాలని అడిగారు. అప్పుడు కాళోజీ మనుమడు (రవికుమార్ గారి కుమారుడు) రామేశ్వరరావు గారిని ఏదో విషయంలో అల్లరి చేస్తూ ఆటపట్టిస్తున్నాడు. నేను చెప్పింది ఆయనకు మొదట వినపడక పోవడంతో 'ఏ ఊర్కో బేవ కూఫ్' అంటూ మనుమడిని గట్టిగా మందలించి మళ్ళీ నా వైపు తిరిగి ఏం కావాలని అడిగారు.

నేను నారాయణరావు గారిని కలవాలని చెప్పగానే లోపలికి వెళ్ళి కాళోజీని పిలుచుకొని వచ్చారు. కాళోజీ రాగానే నేను పేర్వారం గారి విద్యార్థిని అని పరిచయం చేసుకొని వచ్చిన విషయం చెప్పాను. వెంటనే అక్కడే కూర్చోబెట్టుకొని కాళోజీ నాకు ఇంటర్వ్యూ ఇచ్చారు. కాళోజి చెప్పిన ప్రతి మాటను నేను రికార్డు చేసుకున్నాను. ఇంటర్వ్యూ అయిపోవడంతోనే గబా గబా ఇంట్లోకి వెళ్ళిన కాళోజీ ఒక రేడియో సెట్టు పట్టుకొని బయటకు వచ్చారు. దాన్ని చెవికి దగ్గరగా పెట్టుకొని తదేక దీక్షతో వినసాగారు. నేను వెళుతున్నానని చెప్పలేదు గనుక అక్కడే నిలబడి వారి అనుజ్ఞ కోసం ఎదురుచూస్తున్నాను. కాళోజీ నావైపు చూసే స్థితిలోగాని, నా ఉనికిని గమనించే స్థితిలోగాని లేరు. కాళోజీ అంత దీక్షగా వింటున్నది క్రికెట్ కామెంట్రీనే.

కాళోజీకి క్రికెట్ పట్ల ఉన్న ఇష్టం నన్ను ఒకవైపు సంభ్రమాశ్చర్యాలకులోను చేస్తుంటే నేను కొద్దిసేపు అలాగే మొద్దుబారినట్లు నిలబడి చూస్తున్నాను. కాసేపటి తరువాత తలపైకెత్తి చూసిన కాళోజీ 'నీవు ఇంకా వెళ్ళలేదురా' అంటూ గద్దించినట్లు అనేసరికి నేను బతుకు జీవుడా అంటూ బయటపడ్డాను.

నేను వరంగల్ ఎఫ్.ఎమ్. రేడియోలో క్యాజువల్ ప్రొడక్షన్ అసిస్టెంట్‌గా పని చేస్తున్న సమయంలో ఒక సాహిత్య కార్యక్రమ కవరేజీ కోసం మడికొండకు బయలుదేరాను. విశ్వభారతి సాహిత్య సంస్థ తరపున కామారపు సురేష్ ఆ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. నేను సిటీబస్సు ఎక్కి కాజీపేట వరకు వెళ్లిన తరువాత అనుకోకుండా నా ముందు సీట్లోకి కాళోజీ వచ్చి కూర్చున్నారు. నేను వెళుతున్న కార్యక్రమానికే కాళోజీ ముఖ్యఅతిథిగా వస్తున్నారు. కాళోజీ ఒక్కడే సిటీబస్సులో ఒక సాధారణ పౌరుడిలాగా రావడం నన్ను అబ్బుర పరచింది. ఆయన నిరాడంబర త్వాన్ని తెలిపే కవితా వాక్యాలు రెండు అప్రయత్నంగా నాకు ఆ సమయంలో గుర్తుకువచ్చాయి. "పల్లెపట్టణంబులనక పల్లెరై తిరిగినాను. మురికి నీటి నడుమనున్న ఇరుకులలో ఇరికినాను" అన్న కవితా వాక్యాలు అవి.



**కాళోజీ మాట్లాడిన చివరి సందేశాన్ని కూడా అనుకోకుండా నేను ఆ రోజు రికార్డు చేసుకున్నాను. ఆ తరువాత కొద్ది రోజులకే కాళోజీ ఇంట్లో గడపదాటుతూ జారిపడ్డారు. తొంటి ఎముక విరగడంతో హైద్రాబాద్ నిమ్స్‌లో శస్త్రచికిత్స జరిగింది. మృత్యువు మరోరూపంలో వచ్చి ఆయనను తీసుకెళ్ళింది.**

కాళోజీ కూర్చున్న సీటుకు వెనుకనే కూర్చున్న నేను కొంచెం ముందుకు వంగి కాళోజీకి నమస్కరించాను. కాళోజీ తల వెనకకు తిప్పకుండానే ఎవరు నువ్వు? అన్నారు. నేను గతంలో కాళోజీ ఇంటికి వెళ్లిన విషయాన్ని గుర్తు చేయగానే ఆప్యాయంగా తన పక్క సీట్లోకి ఆహ్వానించారు.. మడికొండలో ఆ రోజంతా కాళోజీతోనే ఎక్కువ సమయం గడిపాను. కాళోజీ సొంత ఊరు కూడా మడికొండ కావడంతో కాళోజీ బంధువులు, గ్రామస్థులు ఆయనను వచ్చి కలిసారు. భోజనం కూడా కాళోజీ బంధువుల ఇంట్లోనే ఏర్పాటు చేశారు. నేను కూడా ఆ రోజు కాళోజీతోనే కలిసి భోజనం చేయడం గొప్ప అనుభూతి. కాళోజీ నిరాడంబరతను ఆ రోజు నేను ప్రత్యక్షంగా చూసాను.

ఆ తరువాత కొంతకాలానికి నేను ఒక ప్రముఖ దినపత్రికలో సాంస్కృతిక విలేకరిగా చేరాను. విలేకరిగా ఉన్నరోజుల్లో చాలా సంద ర్భాలలో కాళోజీని కలుసుకునే అవకాశం కలిగింది నాకు. నన్ను గుర్తుపట్టి పిలవగలిగే పరిచయం, సాన్నిహిత్యం కూడా కాళోజీతో ఏర్పడ్డాయి. నెలనెల జరిగే మిత్రమండలి సమావేశాలు కాళోజీ ఇంట్లోనే జరుగు తుండేవి. కాళోజీ పుట్టిన రోజు వేడుక లకు సుదూర ప్రాంతాల నుండి అభిమానులు వచ్చి కలిసిపోతుండేవారు. ఈ వార్తల కవరేజికోసం ఎప్పుడు వెళ్ళాల్సి వస్తుండేది. ఈ క్రమంలో ఒకసారి ఒక చిన్న సంఘటన జరిగింది. మా పత్రికవాళ్ళు ఒక కొత్త ఫీచర్‌కు రూపకల్పన చేశారు. వరంగల్‌లోని గొప్ప వ్యక్తులను ఇంటర్వ్యూ చేసి సంక్షిప్తమైన సమాధానాలతో వారి జీవితాన్ని పరిచయం చేయడం ఆ ఫీచర్ ఉద్దేశ్యం. అడిగిన ప్రశ్నలకు టకీమని చెప్పే ఆబ్జెక్టివ్ టైప్ సమాధా నాలతో ఆ ఫీచర్ ఉండాలి.

కాళోజీని ఇంటర్వ్యూ చేసే పనిని నాతోపాటు జగన్ అనే మా మిత్రునికి అప్పగించారు. ఇద్దరం కలిసి కాళోజీ ఇంటికి వెళుతూ ఎందుకైనా మంచిదని మధ్యలో నాగిళ్ల రామశాస్త్రి గారిని కూడా తీసుకుని వెళ్ళాం. కాళోజీకి అప్పుడు వినికిడి శక్తి కూడా చాలా వరకు తగ్గింది. మేం అడిగిన ప్రశ్నలను తప్పుగా అర్థం చేసుకున్నారు కాళోజీ. పుట్టిన ప్రాంతం, పెరిగిన ప్రాంతం, అంటూ మా ఇంటర్వ్యూ మొదలు కాగానే కాళోజీకి చాలా కోపం వచ్చింది. పుట్టిన సంవత్సరం, తల్లిదండ్రుల వివరాలు లాంటివి కూడా ఇంకా నేను చెప్పుకోవాలా? అంటూ తీవ్ర స్థాయిలో అసహనానికి గురయ్యారు. ఆ ఫీచర్ అలాగే ఉంటుందని చెప్పి చివరికి రామశాస్త్రిగారే కాళోజికి సర్దిచెప్పగలిగారు.

వరంగల్ జానపద గిరిజన విజ్ఞాన పీఠంలో జరిగిన ఒక సాహితీ కార్యక్రమమే కాళోజీ చివరి సాహితీ కార్యక్రమం అయింది. కాళోజీ చనిపోవడానికి రెండు మూడు నెలల ముందు ఆ సమావేశం జరిగింది. ప్రొఫెసర్ ఎన్. భక్తవత్సలరెడ్డి నిర్వహించిన ఆ సమావేశంలో దాశరథి రంగాచార్య కూడా పాల్గొన్నారు. సభ ప్రారంభం అయిన తరువాత కాళోజీ సభలోకి అడుగు పెట్టారు. వేదిక మీద కూర్చున్న రంగాచార్య ఒక్కసారిగా నిలబడి కాళోజీకి జై అంటూ పదే పదే నినదించారు. సభా ప్రాంగణం అంతా ఒక్కసారిగా ఒక ఉద్విగ్న వాతావరణానికి లోనయింది. అనారోగ్యంతో అప్పటికే కాళోజీ చాలా సమావేశాలకు వెళ్లడం మానే శారు. ఆ సభలో కాళోజీ ఆకారంలోను ఏదో చెప్పలేని మార్పు కొట్టొచ్చి నట్లు కనిపించింది.

కాళోజీ మాట్లాడిన చివరి సందేశాన్ని కూడా అనుకోకుండా నేను ఆ రోజు రికార్డు చేసుకున్నాను. ఆ తరువాత కొద్ది రోజులకే కాళోజీ ఇంట్లో గడపదాటుతూ జారిపడ్డారు. తొంటి ఎముక విరగడంతో హైద్రాబాద్ నిమ్స్‌లో శస్త్రచికిత్స జరిగింది. శస్త్రచికిత్స విజయవంతమైనప్పటికీ కొద్ది రోజులు మంచానికే పరిమితం కావాల్సి రావడంతో మృత్యువు మరో రూపంలో వచ్చి ఆయనను తీసుకెళ్ళింది.

చివరికి కాళోజీ మరణవార్తల కవరేజి బాధ్యత కూడా ప్రధానంగా నా మీదే పడింది. మా పత్రిక యూనిట్ మేనేజర్, స్టాఫ్ రిపోర్టర్ ఇద్దరు నేను పనిచేస్తున్న కళాశాలకు నన్ను వెతుక్కుంటూ వచ్చారు. కాళోజీ గొప్ప వ్యక్తి. మనం మిగతా పత్రికల కంటే అద్భుతమైన కవరేజి ఇవ్వాలంటూ నన్ను రిక్వెస్టు చేశారు.

యూనిట్ మేనేజర్ స్వయంగా రావడంతో నేను కూడా సీరియస్‌గా తీసుకొచ్చిన వార్తలు రాశాను. కాళోజీ మీద నాకు అప్పటికే ఒక అవగాహన ఉండటం తో అనేక కోణాల్లో కాళోజీపై వార్తలు రాసి అప్పటికి అప్పుడే అందించగలిగాను. కాళోజీ ఇంటి నుండి కాకతీయ మెడికల్ కళాశాల వరకు కొనసాగిన అంతిమ యాత్రలో వేలాదిమంది ప్రజలు పాల్గొన్నారు. కాళోజీకి పద్మవిభూషణ్ బిరుదు కూడా ఉండటంతో అధికార లాంఛనాలతో అంతిమయాత్ర కొనసాగింది.

ఆ యాత్రా విశేషాలను కూడా సమర్థవం తంగా అందించ గలిగాను. కాళోజీ మరణవార్తలకు విస్తృత మైన కవరేజి ఇచ్చినందుకు, నాకు డెస్కువారు ప్రత్యేకంగా బహుమతిని ఇచ్చి అభినందించారు. ఒక మహానుభావుడి గొప్పతనాన్ని చివరి సమయంలోనైనా ఏదో ఒక రూపం తో స్మరించుకోగలిగానన్న తృప్తి తప్ప ఆ బహుమతి వచ్చి నందుకు సంతోషపడాలో బాధపడాలో నాకు ఎప్పటికీ అర్థం కాని విషయమే. ఇప్పుడు విశ్వవిద్యాల యంలో అధ్యాపకుడిగా కాళోజి పాఠాలు బోధించడం మరొక సంతృప్తి.

*(తెలుగు విభాగం,*
*కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు)*

**రచయిత సెల్: 99492 79733**

ముదిగంటి సుజాతారెడ్డి



# కాళోజీ జీవిత చరిత్ర తెలంగాణ చరిత్ర

కాళోజి (1914-2002) చరిత్ర తెలంగాణ ఉద్యమాల చరిత్ర. తెలంగాణలో ఉవ్వెత్తున లేచిన ఉద్యమాలన్నిటిలో కాళోజి పాల్గొన్నాడు. తెలంగాణ ఉద్యమాల చరిత్ర కాళోజి చరిత్ర! కాళోజి చరిత్ర తెలంగాణ ఉద్యమాల చరిత్ర అని చెప్పవచ్చును. కుటుంబం, కుటుంబ జీవితం కన్నా సమాజం, ప్రజల శ్రేయస్సును కోరాడు.

"నేనింకా 'నా' నుండి మా వరకే రాలేదు
మన అన్నప్పుడు కదా ముందడుగు"

అని కాళోజి ప్రజల మనిషిగా మారే ప్రస్థానాన్ని ఈ కవితలో సూచించాడు. ఆ రోజుల్లో అంటే తెలంగాణ రాజకీయోద్యమం కాలంలో వట్టికోట ఆళ్వారుస్వామి, కాళోజి, రావి నారాయణరెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి, భాగ్యరెడ్డి వర్మ అట్లా అందరూ 'ప్రజల మనిషి'గానే మారారు. గ్రంధాలయోద్యమం బీజరూపంలో ఆరంభమైనప్పుడు నాలుగేండ్ల పసిప్రాయంలో వున్నాడు. 1901లో హైద్రాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం స్థాపించబడింది. గ్రంథాల యోద్యమమే తెలంగాణ ప్రజలను వాళ్ళ భాష, సాహిత్యం, సంస్కృతిపై మక్కువను కలిగించి జాతీయ భావాలను వెదజల్లి స్వాతంత్ర్య పోరాటం వైపు తీసుకపోయింది. అటువంటి గ్రంధాలయ స్థాపననాడే కాళోజి తెలంగాణ ఉద్యమ ప్రవేశం జరిగింది.

1920లో అప్పుడు కాళోజి వయస్సు ఆరు సంవత్సరాలు. కాళోజి తండ్రి రంగారావు మడికొండలో ప్రతాపరుద్ర గ్రంథాలయం ఆరంభించారు. ఆ గ్రంథాలయం అక్కడి పుస్తకాలు కాళోజి ఎదుగుదలలో భాగమయ్యాయి. ఆవిధంగా గ్రంథాలయోద్యమం అతనిలో ఉద్యమ బీజాన్ని నాటింది. 1930లో ఆంధ్ర జనసంఘం నుంచి ఆంధ్ర మహాసభ ఏర్పాటు నాటికి కాళోజి వయస్సు 16 ఏండ్లు. జోగిపేటలో 1930లో మొదటి ఆంధ్ర మహాసభ జరిగింది. తర్వాత వరుసగా 12 మహాసభలు జరిగాయి. ఆ సభలన్నిటిలో కాళోజి పాలుపంచుకున్నాడు. కాళోజీ ఇంటర్ చదువుతుండగానే క్షయ రోగ పీడితుడయ్యాడు. అప్పుడు డాక్టర్లు క్షయరోగం సోకిన ఊపిరితిత్తిని తీసేసారు. కాళోజి కోలుకున్నాడు. అప్పట్నుంచీ కాళోజి ఒంటరి ఊపిరిగాడే అయినా పోరాట పటిమతో శక్తిని మాత్రం కోల్పోలేదు. హైస్కూల్లో చదువుకుంటున్న సమయంలో గణపతి ఉత్సవాల్లో పాల్గొనే విద్యార్థులకు ఒక్కపూట సెలవు ఇయ్యలేదని పదహారు వందల మంది విద్యార్థుల సంతకాలు సేకరించి విద్యార్థులే సెలవు ప్రకటించు కున్నట్లుగా ప్రిన్సిపాల్‌కు విజ్ఞప్తి పత్రం ఇచ్చాడు కాళోజీ. అటువంటి తిరుగుబాటు తత్త్వం, స్వేచ్ఛా ప్రియత్వం కాళోజీలో 16 ఏండ్ల వయస్సులోనే ఆరంభమయ్యాయి. ప్రజల అభీష్టం వైపు నిలబడడం ప్రజలకేది కావాలో దానికోసం పోరాడటం అతని తత్త్వమైంది. అందుకే ఆయన ఎప్పుడూ 'పార్టీ వ్రత్యం' చేయలేదు. అన్యాయాన్ని ఎదిరించాడు. ప్రజల పక్కన నిలబడ్డాడు. ఆయన సాహిత్యాన్ని వరించింది ప్రజాహితం కోసం. గంటల కొద్ది ఉపన్యాసాల్లో చెప్పే మాటలను కొద్ది మాటల్లో సాహిత్యంలో చెప్పి ప్రజలను ప్రభావితం చేయవచ్చునని కాళోజి అభిప్రాయం. ప్రజల్లో చైతన్యాన్ని కలిగించి అన్యాయాన్ని ఎదిరించే శక్తిని ఇయ్యాలని కొద్ది మాటల్లో కవితలో వ్రాసాడు-

**"అన్యాయాన్నెదిరిస్తే
నా గొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తే
నా గొడవకు ముక్తి ప్రాప్తి
అన్యాయాన్నెదిరించినోడు
నాకు ఆరాధ్యుడు."**

పౌరులకు స్వేచ్ఛ వుండాలని జీవితమంతా పౌర హక్కుల పోరాటంలో భాగమయ్యాడు. నిజాం నిరంకుశ పాలనలో ప్రజలకు ఎటువంటి హక్కులు, స్వేచ్ఛ లేకుండా వున్న పరిస్థితులు కనిపెట్టిన కాళోజి, వట్టికోట, సురవరం వంటి తెలంగాణ వైతాళికులు పౌరహక్కుల పోరాటం ప్రాధాన్యాన్ని గుర్తించారు. సురవరం ప్రతాపరెడ్డి 1938లోనే "ప్రాథమిక సత్వములు" పేరుతో పౌరహక్కులను గురించి వ్యాసాలు వ్రాస్తే వట్టికోట ఆళ్వారుస్వామి వాటిని దేశోద్ధారక గ్రంథమాలలో పుస్తకంగా ప్రచురిం

చాడు. ఇదే పుస్తకం 'ప్రజాధికారములు' పేరుతో ప్రజాస్వామ్య విధానాన్ని ఇంకా విస్తరింపజేస్తూ 1950లో ప్రచురింపబడింది. దీనిలో రజాకార్ల దమనకాండ కూడా నిరసింపబడింది. కాళోజీ ఏ ఉద్యమంలో పాల్గొన్నా ఏ పార్టీలో, ఏ సమాజంలో వున్నా ఆయన ప్రజల కోసం ప్రజల పక్షాన నిలబడ్డాడు. ఏ ఉద్యమాన్ని సమర్థించినా ప్రజల కోసమే. అందుకే ఆయనను 'ప్రజాకవి, ప్రజల మనిషి' అనటం చాల ఔచిత్యమే. అతిశయోక్తి ఏమాత్రం లేదు.

కాళోజీ తెలంగాణ ప్రజలతో మమేకమై మాట్లాడాడు. పోరాటం చేసాడు. జైలుకు వెళ్ళాడు. తెలంగాణలో గ్రంథాలయ స్థాపనతో మొదలు కొని ఆర్య సమాజాన్ని సమర్థించటం, గణేశ్ చతుర్థి ఉత్సవాలను తాను విగ్రహారాధకుడు కాకున్నా నాస్తికుడైనా సమర్థించటం ఆంధ్ర మహాసభల్లో పాల్గొనటం, ఆంధ్ర మహాసభ 1943లో చీలిపోయినప్పుడు అతివాదులు రావి నారాయణరెడ్డి పక్షంలో నిలబడటం, మళ్ళా రామానందతీర్థులతో తిరగటం కాంగ్రెసును సమర్థించటం, రజాకార్ల దౌర్జన్యాలను ఖండించటం, ఎలక్షన్లలో నిలబడటం, విశాలాంధ్ర సమర్థన తర్వాత అనుభవంతో తెలంగాణ వేర్పాటువాదాన్ని సమర్థించి స్వయంగా ఆ ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళటం ప్రజల ప్రాథమిక హక్కులను హరించిన ఎమర్జెన్సీని ఎదిరించటం నక్సలైట్ ఉద్యమాన్ని సమర్థిస్తూ పౌరహక్కుల, మానవహక్కుల కోసం పోరాడటం, మరోసారి జరిగిన తెలంగాణ వేర్పాటువాదాన్ని సమర్థించటం మొదలైన ఉద్యమాలు పోరాటాల్లో కాళోజీ పాల్గొన్నాడు. తొమ్మిదవ ఆంధ్ర మహాసభలో హరిజనోద్ధరణ విషయం గురించి ప్రసంగించి మాటలకన్నా చేతలు ముఖ్యమని అన్నాడు.

హరిజనోద్ధరణ వస్తువుగానే కాళోజీ "తెలియక ప్రేమ తెలిసి ద్వేషము" అనే గొప్ప కథను వ్రాసాడు. కాళోజీ ఎక్కడికి పోయినా అన్నపాన విషయంలోగాని పక్కపక్కన కూర్చోవటం తాకటం ఏ విషయంలోనైనా అంటరానితనాన్ని ద్వేషించేవాడు. 1943లో తెలుగు భాషా సాహిత్యాల వికాసానికి ఏర్పడిన ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపనలోనూ కాళోజీ క్రియాశీలమైన పాత్ర వహించాడు. పోలీసు చర్య తర్వాత ఏర్పడిన "తెలంగాణా రచయితల సంఘం"లోనూ తెలుగు సాహిత్యాన్ని ప్రజల్లోకి తీసుకుపోయేందుకు ప్రముఖ పాత్ర పోషించాడు. ఎమర్జెన్సీ కాలంలో జరిగిన బూటకపు ఎన్‌కౌంటర్ల (1975-77) గురించి వేసిన తార్కుండె కమిటీలో కాళోజీ కూడా వున్నాడు. ఈవిధంగా ఆయన తెలంగాణలో జరిగిన ప్రతి చారిత్రక సందర్భంలో తన పాత్రను పోషించాడు. వీటన్నిటినీ వరుసగా చూసినప్పుడు కాళోజీ భావ ప్రపంచంలో విశ్వాసాల్లో వైరుధ్యాలున్నాయా? అన్న అనుమానం రావచ్చును. కాని ఈ ఉద్యమాలను ప్రజల స్వేచ్ఛకు ప్రజాక్షేమం కోసం చేసినయి. ప్రజల పక్షంలో నిలబడి చేసినయి. ప్రజలను అణచివేసిన వారికి వ్యతిరేకంగా చేసినయి.





అందుకే కాళోజీలో ఇన్ని భిన్న పార్శ్వాలు, విభిన్న వైరుధ్యాలు!

ప్రజలను వాళ్ళ భాష సంస్కృతి విషయంలో మేల్కొల్పే ప్రయత్నంగా గ్రంథాలయోద్యమంలో భాగంగా గ్రంథాలయ స్థాపనలో భాగమయ్యాడు. ఆర్య సమాజంతో ముడివడింది ఆయన నిజాంకు వ్యతిరేకతను చూపటానికే. తన నిరసనను, ధిక్కార స్వరాన్ని వినిపించటానికే గణేశ్ చతుర్థి ఉత్సవాలను నిర్వహించటానికి తన మత విశ్వాసాలకు విరుద్ధంగా ముందు నిలబడి నడిచింది నిజాం ప్రభుత్వానికి తన ధిక్కారాన్ని వినిపించటానికే. వ్యక్తి స్వేచ్ఛను కోరిన కాళోజీ కేవలం తన కోసమే కాదు, ప్రజలందరికీ స్వేచ్ఛ కోరుకున్న కాళోజి నిరంకుశ నిజాంను వ్యతిరేకించటం కోసమే ఇన్ని అవతారాలెత్తాడు. ఇన్ని ఉద్యమాల్లో పాల్గొన్నాడు. తెలంగాణ 20వ శతాబ్దారంభంలోని గ్రంథాలయోద్యమం నుంచి నక్సలైట్ ఉద్యమం, పౌరహక్కుల, మానవహక్కుల పోరాటాల నుంచి 20వ శతాబ్దం చివర, 21 శతాబ్దారంభంలో ఉవ్వెత్తున లేచిన తెలంగాణ ప్రాంతీయవాదం తెలంగాణ వేర్పాటువాదం వరకు ఒక శతాబ్దపు తెలంగాణ రాజకీయోద్యమాలన్నిటిలో కాళోజీ పాల్గొన్నాడు. కవిగా, ఉద్యమకారుడుగా, ప్రజల మనిషిగా విభిన్నమైన పాత్రలను పోషించాడు.

నిజాం కాలంలో నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా తన ధిక్కార స్వరం వినిపించాడు కాళోజీ. రజాకార్లకు వ్యతిరేకంగా గొంతెత్తి వాళ్ళ దుర్మార్గాలను ఖండించిన ఫ్యూడల్ వ్యవస్థను నిరసించిన కాళోజీ నక్సలైట్ ఉద్యమం నడుస్తున్న కాలంలో పౌరహక్కుల కోసం తన గొంతెత్తాడు. డా. నారాయణరెడ్డిని రజాకార్లు హత్య చేసినపుడు గుండె పగిలిన కాళోజీ, పోలీసులు డా. రామనాథాన్ని హత్య చేయటాన్ని అంతే దుఃఖంతో నిరసించాడు. నిజాం కాలంలో హిందూ ముస్లింల సఖ్యత, సుహృద్భావాలతో కలిసిమెలిసి వుండేవారని కాళోజి తన ఆత్మకథలో చెప్పాడు. కాళోజీకి ఎందరో ముస్లిం స్నేహితులుండేవారు. ఆపదలో వారిని ఆదుకునేవాడు. కాని రాజకీయ దురుద్దేశంతో కాళోజీ చిన్ననాడే విన్న ప్రహ్లాదకథ చేత ప్రభావితుడయ్యాడు. గాంధీజీని 'సత్యహరిశ్చంద్ర' ఎంతగా జీవితమంతా ప్రభావితం చేసిందో కాళోజీ జీవితాన్నంతగా 'ప్రహ్లాదకథ' ప్రభావితం చేసింది. ప్రతి హింస, అధికృత హింస భావనలను గురించి 'తిరగబడమంటె తప్పా' కవితలో (1971) ఈవిధంగా



ప్రహ్లాదకథను ప్రతీకగా చేసుకొని ఈవిధంగా అంటాడు-

"ప్రతిహింస తప్పెట్లౌనో చెప్పు
హిరణ్యకశిపుని పొట్ట చీల్చి
నరసింహుడు చేసిందే ప్రతిహింస
నువ్వు చేస్తున్నది
హిరణ్యకశిపుని అధికృత హింస'

నిజాం పాలనలో సొంత వేషభాషలకు ఆదరణ లేకపోవటం అనే భాషా సాంస్కృతిక దాస్యాన్ని నిరసించాడు కాళోజీ.

నిజాం కాలంలో తొమ్మిది వరకు ఉర్దూ దినపత్రికలుండేయని ఎక్కువ పత్రికలు హిందువులు, ముస్లిం రాజ్యాన్ని పడతోయాలని కుట్రలు పన్నుతున్నారని రాసాయి అని కాళోజీ తన ఆత్మకథలో తెలిపారు. మాతృభాషాభిమానం వదిలిపెట్టి హిందువులు ఆ ఉర్దూ పత్రికలను చేతిలో పట్టుకునే తిరిగేవారని అంటాడు. ఆ భావ దాస్యాన్ని నిరసిస్తూ కాళోజీ ఈ కింది కవిత వ్రాసాడు-

"నీ వేషభాషలను నిర్లక్ష్యముగ జూచు
భావ దాస్యంబెపుడో బాసిపోవునురా
నీ భాషయందును నీ వేషమందును
స్వాభిమానముడిగిన చవట నీవేరా"

అని నిజాం కాలంనాటి ధిక్కార స్వరాన్నే కాళోజీ 1969 నాటి తెలంగాణ ఉద్యమ కాలంలోనూ వినిపించాడు. చెన్నారెడ్డి చేసిన వెన్నుపోటుకు చాల మధనపడినాడు కాళోజి.

"కోటిన్నర మేటి ప్రజల
గొంతొక్కటి గోడొక్కటి
తెలంగాణ వెలిసి నిలిపి
ఫలించాలె భారతాన..."

అని కోరుకున్న కాళోజి కవి రాయప్రోలు కవి తెలంగాణ యెడల చూపిన ఉపేక్షను, నిరాదరణను సహించలేకపోయాడు. తెలంగాణాలోని ఒక విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్యుడిగా పనిచేస్తూ తెలంగాణా ఉప్పు తింటూ తెలంగాణాలో జరుగుతున్న ప్రజా పోరాటాన్ని గురించి పెదవి విప్పకపోవటం తెలంగాణా కవి పండితులతో పొత్తు పెట్టుకోక పోవటం కాళోజీ సహనాన్ని దెబ్బతీసింది. దేశభక్తి కవితలు వ్రాసి పేరొందిన రాయప్రోలు సుబ్బారావు తెలంగాణ ప్రజా పోరాటానికి మద్దతు చూపకపోవటాన్ని నిరసిస్తూ ఒక కవి సమ్మేళనంలో కాళోజీ రాయప్రోలును అన్యాపదేశంగా ఈవిధంగా కవితను చదివానని కాళోజీ తన ఆత్మకథలో చెప్పాడు.

"లేత మావిచిగురును లెస్సగా మేసేవు
ఋతురాజు వచ్చెనని అతి సంభ్రమముతోడ
మావి కొమ్మల మీద మైమరచి పాడేవు
అన్న తిండెవ్వారిదే కోకిలా!
పాడు పాటెవ్వారిదే కోకిలా!"

అట్లా ఎందుకు వ్రాసావయ్యా అని రామానుజరావు వంటి పెద్దలు అన్నారట. అయినా కాళోజీ అన్యాయాన్ని సహించలేని ఆగ్రహం నిర్మొహమాటంగా మాట్లాడే తత్త్వానికి నిదర్శనం.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చింతర్వాత నేషనల్ కాంగ్రెసును రద్దు చేయాలని వేరువేరు పార్టీలు ఏర్పడాలని గాంధీజీ కోరుతున్నాడు.



కాంగ్రెసు నుంచి బయటికి వచ్చి సుభాష్ చంద్రబోసు ఫార్వర్డు బ్లాక్ స్థాపించాడు. కాజీపేట మీదినుంచి రైలు పోయినప్పుడు ఆగిన చోటల్లా సుభాష్‌చంద్రబోసు ఉపన్యాలిచ్చేవాడు. కాళోజీ ఆ ఉపన్యాసాలు విని కదిలిపోయేవాడు.

కాళోజీకి ఆ అభిప్రాయాన్ని ఆమోదించినవాడే. కాంగ్రెసు అప్పటికే కుళ్ళిపోయిందని "ఆగస్టు పదిహేను" అనే కథను 1959లో రచించి ప్రచురించి పదివేల ప్రతులను పంచిపెట్టాడు. ఆవిధంగా పంచిపెట్టటం పిచ్చికాదా! మాట మాటికి కన్నీళ్ళు పెట్టుకోవటం ఆయన బలహీనత కాదా! అని మనకు అనిపించవచ్చును. కాని ఆయన ప్రగాఢ అభివ్యక్తికి స్పందనకు భావోద్వేగానికి అవి నిదర్శనాలు. అదేవిధంగా తెలంగాణ విమోచనానంతరం తెలంగాణలో మిలటరీ ప్రభుత్వ కాలంలో జరిగిన అవకతవకలను నిరసిస్తూ రామాయణంలోని ఇతివృత్తాల్ని చెప్తున్నట్లుగా "లంకా పునరుద్దరణ" కథలో అన్యాపదేశ పద్ధతిలో విమర్శిస్తూ నిరుప మానంగా రచించాడు. అనేక ఉపన్యాసాల్లో చెప్పే రాజకీయ విషయాలను కొద్ది మాటల్లో చెప్పటానికే సాహిత్యాన్ని రచించాను, సాధనంగా చేసుకున్నానని కాళోజి చెప్పుకున్న ట్లుగానే ఆయన కవితలు, కథలున్నాయి.

కాళోజీ గాంధేయవాది. గాంధీ అభిమాని. 1940లో హయగ్రీవాచారి మొదలైన 50, 60 మంది స్నేహితులతో కలిసి వార్ధా పోయి భారతీ యులం రెండో ప్రపంచ యుద్ధంలో పాల్గొనమనే కాంగ్రెసు సభలో పాల్గొ న్నాడు. గాంధీ అంటే ఇష్టమున్నా ఆయన వేరే నాయకులను అభిమానించ కుండా వుండలేదు. సుభాష్ చంద్రబోస్, జయప్రకాశ్ నారాయణలన్నా అతనికి అభిమానం. కాంగ్రెసు నుంచి బయటికి వచ్చి సుభాష్ చంద్రబోసు ఫార్వర్డు బ్లాక్ స్థాపించాడు. కాజీపేట మీదినుంచి రైలు పోయినప్పుడు ఆగిన చోటల్లా సుభాష్‌చంద్రబోసు ఉపన్యాలిచ్చేవాడు. కాళోజీ ఆ ఉపన్యాసాలు విని కదిలిపోయేవాడు. బోసు ఆజాద్ హింద్ ఫౌజును స్థాపిం చాడు. దీన్నంతా కాళోజీ తన ఆత్మకథలో ఆరాధనాభావంతో స్మరించాడు. 1942లో క్విట్ ఇండియా మూమెంటులో ప్రధాన పాత్ర వహించిన, 1977లో ఎమర్జెన్సీ తర్వాత ఇందిరాగాంధీని ఎదిరించి జనతాపార్టీని పెట్టిన జయప్రకాశ్ నారాయణ అన్నా కాళోజీకి గౌరవం. "స్వాతంత్ర్యం అనేది ఒకరిని అడిగి తీసుకునే వస్తువు కాదు. మనంతట మనంగా సంపాదించుకోవలసినది. తనకు స్వేచ్ఛనిమ్మని ఇతరుల్ని ప్రాధేయపడే వ్యక్తి స్వేచ్ఛ లభించినా బానిసగానే ఉండిపోతాడు"- అనే సుభాష్‌చంద్రబోసు మాటలు కాళోజీ భావజాలంతో చాలా కలుస్తాయి.

కాళోజీకి పద్య రచనను నేర్పిన గార్లపాటి రాఘవరెడ్డి, స్నేహితుడు పి.వి.నరసింహారావు అన్నా చాలా గౌరవం, ప్రేమ. కాళోజీ "నా గొడవ" కవితలు అప్పుడప్పుడు గోలకొండ పత్రికలో అచ్చయినా అవి పుస్తకంగా రావటానికి ముఖ్య ప్రేరేపకుడు సురవరం ప్రతాపరెడ్డి. కాళోజీ స్వేచ్ఛా ప్రియత్వం ఎంత గొప్పదో దేనికీ లొంగని స్వభావం కూడా అంతే గొప్పది. జీవితమంతా కుటుంబ పోషణకు అన్నగారి మీద ఆధారపడివున్నా ఆయన ది ఒక్క ఊరికి కట్టుబడి వుండే స్వభావం కాదు. ఆఖరికి చనిపోయినంక కూడా ఎవరికీ పని పెట్టుకోదలచుకోలేదు. కర్మకాండలకు విరోధి అయిన కాళోజీ తన శరీరాన్ని వైద్య ప్రయోగాలకే అప్పగించి వెళ్ళిపోయిన ధన్యజీవి.

*రచయిత్రి ఫోను: 040-2756 6534*



## అక్షరత్రయం

కన్నీటి చుక్కలు మూడు
కాలం చెక్కిట రాలినప్పుడు
మూడు నేత్రాలు మూడు
మాడు వెనక మండినప్పుడు
సంధ్యలు మూడూ కూడి
చైతన్య చర్చలో పడ్డప్పుడు
కాలాలూ మూడు కలిసి
కవిత్వంలో తడుస్తున్నప్పుడు
అనుకోండి అక్కడెక్కడో
అక్షరత్రయి ఉంటుందని.
దానినే మన తెలంగాణం
కాళోజీ అంటుందని.

*- డా॥ సి.నారాయణరెడ్డి*

కె.పి. అశోక్‌కుమార్

తొలితరం తెలంగాణ కథకులలో కాళోజీ ఒకరు. కాళోజీ మంచి కథకుడని బహుశా ఇప్పటి తరానికి తెలియకపోవచ్చు. కవిత్వానికున్న ప్రచార గుణం వల్ల కాళోజీ 'నా గొడవ' కావ్యానికి వచ్చినంత ప్రశస్తి, గుర్తింపు ఆయన కథలకు రాకపోవడం వల్ల కాళోజీ అనగానే కవిగానే గుర్తుకువస్తారు. ఆనాటి సమకాలీన సంఘటనల పట్ల ప్రతిస్పందిస్తూ, నిబద్ధతతో రాసిన కాళన్న కథలు అప్పట్లో సంచలనం రేకెత్తించాయి. వాటిని అణా గ్రంథాలయం వారు 'కాళోజీ కథలు' పేరిట అచ్చువేశారు. మారుమూల పాత గ్రంథాలయాలలో తప్ప మరెక్కడా దొరకని ఈ పుస్తకాన్ని ఈనాటి తరానికి పరిచయం చేయాలనే ఉద్దేశంతో కాళోజీ ఫౌండేషన్ పేరిట ఆయన మిత్రులు పుస్తకంగా వేయడం, దానికి వరవరరావు ముందుమాట రాయడం ప్రత్యేక ఆకర్షణ అనే చెప్పుకోవాలి.

ఒక మనిషికి సహాయం చేయాలంటే కులం, మతం, ఆచారం, సంప్రదాయాలు అన్నీ గుర్తుకు వస్తాయి. అంతేకాదు, ఎక్కడ ఆ భారం తమ మీద పడుతుందోనని ఎవరికి వారు తప్పుకోవడానికి ప్రయత్నిస్తారు. అదే భక్తి పేరిట, దేవుడి పేరిట తమకున్నదంతా అర్పించుకోవడానికి పోటాపోటీగా ముందుకు వస్తారు. ఎంతో నాగరికులైనా, విద్యాధికులైనా ఈ మనస్తత్వం నుండి ఇంకా బయటపడలేదు. అందుకే మతాన్ని అడ్డుపెట్టుకుని మోసం చేసే అవకాశవాదులు, వాటికి చేయూతనిచ్చి లాభపడాలనుకునే రాజకీయాలు పెరుగుతూనే వున్నాయి. ప్రజల్లో చైతన్యం రానంతకాలం ఈ పరిస్థితి ఇలాగే కొనసాగుతుంది. ఆకలితో, చలి బాధతో ఏడుస్తున్నా అప్పుడే పుట్టిన పిల్లవాడ్ని పట్టించుకోని జనం, దొరికిన రాతి విగ్రహానికి రాచమార్గాలతో గుడికట్టించ డానికి పూనుకోవడంపై వున్న మక్కువను నిరసిస్తూ ఇదా మన "భూతదయ" అని రచయిత ప్రశ్నిస్తారు. జాతీయోద్యమ కాలంలో సంఘ సంస్కరణోద్యమంలో భాగంగా హరిజనాభ్యుదయ కార్యక్రమాలు రాజకీయ పార్టీల ఎజెండాగా మారాయి. అప్పట్లో హరిజనాభ్యుదయం అంటే హరిజనుల దేవాలయ ప్రవేశం ఒక్కటే అత్యంత ముఖ్యమైన చర్యగా గాంధీ, కాంగ్రెస్ వారు

ప్రజల్లో చైతన్యం రానంతకాలం ఈ పరిస్థితి ఇలాగే కొనసాగుతుంది. ఆకలితో, చలి బాధతో ఏడుస్తున్నా అప్పుడే పుట్టిన పిల్లవాడ్ని పట్టించుకోని జనం, దొరికిన రాతి విగ్రహానికి రాచమార్గాలతో గుడికట్టించ డానికి పూనుకోవడంపై వున్న మక్కువను నిరసిస్తూ ఇదా మన "భూతదయ" అని రచయిత ప్రశ్నిస్తారు.



సంకల్పించారు. హరిజనుల దేవాలయ ప్రవేశాన్ని నిరోధించడానికి పూనుకొన్న సవర్ణులు–దళితుల మధ్య జరిగిన పోరాటాలు, అవి ఊళ్ళలో రేపిన ఉద్రిక్తతలను "తెలియక ప్రేమ– తెలిసి ద్వేషము" అనే కథలో చిత్రీకరించగలిగారు. అలా గొడవల్లో చనిపోయిన ఒక బ్రాహ్మణుడు, దళితుడు చచ్చిన తరువాత కూడా కుల ప్రసక్తితో కొట్లాడుకోవడం మన సమాజంలో కరడుగట్టుకుపోయిన కులతత్వాన్ని తెలియజేస్తుంది. సీరియస్ సమస్యను వ్యంగ్యంగా చిత్రీకరించడం వల్ల ఈ కథ మంచి హాస్య కథగా రూపొందింది.

"లంకా పునరుద్ధరణ" అనే కథలో రావణకథ అనంతరం విభీషణునికి లంకలో





పట్టులేదని భావించి వానర ముఖ్యులకు లంక పెత్తనం అప్పగించగా వాళ్ళు ఆ లంకను కొల్లగొట్టి సర్వనాశనం చేస్తారు. చివరకు శ్రీరాముల వారు వచ్చి పరిస్థితిని చక్కబెడతారు. ఇది పైకి పురాణ విమర్శగా కనిపించినా వలసవాద దేశాలు అవలంబించే విస్తరణ వాదాన్ని ప్రతీకగా తీసుకుని ఈ కథ రాసి వుంటారని భావించవచ్చు. ఇంకోవైపు నుండి ఆంగ్లేయుల ఆక్రమణ- పాలనతోపాటు దేశ విభజన నాటి పరిస్థితులను అన్వయించుకోవచ్చు. లేదా సంస్థానాలలో శాంతి ప్రక్రియగా వచ్చి తిష్టవేసిన పరాయి పాలకుల ఆగడాలను చిత్రీకరించగలిగిందని కూడా భావింపవచ్చు.

స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్ అవకాశవాదుల, స్వార్ధపరుల కూటమిగా తయారయిందని భావించిన గాంధీజీ కాంగ్రెస్‌ను రద్దుపరచమని సలహా ఇవ్వగా, నెహ్రూ ప్రభుత్వం దాన్ని తిరస్కరిస్తుంది. క్రమంగా కాంగ్రెస్ పార్టీ అవినీతి, అసమర్ధ పాలనతో ఎలా భ్రష్టు పట్టిపోయిందో "ఆగస్టు పదిహేను" (త్రయోదశ స్వాతంత్ర్యోద్యమము- 1959) అనే కథలో ప్రతీకాత్మకంగా వివరించిన తీరు బాగుంది.ఎన్నికలలో సరియైన అభ్యర్ధిని చూడకుండా, తమ విధేయులైన అనుచరులనే ఎలా ఎంపిక చేస్తారో వివరించే గల్పిక "ఎన్నిక కథ".

ఏ పని లేని ధనవంతులు, రాజకీయ నాయకులు జీవకారుణ్య సంఘం పేరిట జంతు దయను ప్రచారం చేస్తూ హడావుడి కార్యక్రమాలతో ప్రెస్ నాకర్షించడం కోసం ఎన్నో ప్రయత్నాలు చేస్తూ వుంటారు. ప్రపంచ వ్యాప్తంగా రేబీస్ వ్యాధితో చనిపోయేవారి శాతం మనదేశంలోనే ఎక్కువగా వుందని, అందుకు కారణమైన వీధి కుక్కలను బంధించడానికి మున్సిపాలిటీ వారు సమకూడితే జీవకారుణ్యం పేరిట వారిని అడ్డుకొని పేపర్లోకెక్కే బ్లూక్రాస్ లాంటి సంస్థలు మేనకాగాంధీలాంటి రాజకీయ నిరాశ్రయులకు, అమలలాంటి సినీతారలకు ఒక హాబీ కావచ్చు కాని, సామాన్య ప్రజల మాటేమిటి? పోష్ కాలనీల్లో విలాసవంత జీవితాలు గడిపేవారికి వీధి కుక్కల సమస్య ఎలా అర్ధమవుతుంది. పశువులను పోషించలేక కబేళాలకు అమ్ముకునే స్థితి నుంచి వారు రక్షణ కల్పించలేరు. బక్రీద్‌లాంటి పండుగలు- జాతర్లలో జరిగే జంతు బలిని అడ్డుకోలేరు. మాంసాహారం కోసం వధించే జంతువులను రక్షించలేరు. ఇంతెందుకు వారికి జంతువుల కంటే హీనంగా బతికే కోట్లాది భారతీయుల గోడు కూడా పట్టదు. ఇలాంటి కుహనా సంస్కరణవాదుల అట్టహాసాన్ని, ఆర్భాటాన్ని "మనమే నయం" కథ చిత్రీకరించింది. ఈ ప్రహసనాన్నంతా రెండు ఎడ్లు తమలో తాము సంభాషించుకున్నట్లు చూపడం బాగుంది. పార్వతి కళ్యాణం, పారిజాతాపహరణం అనే పౌరాణిక గాథల సాంఘికీ కరణే "విభూతి లేక ఫేస్ పౌడర్" అనే కథ. ఇంకోవైపు వినిమయ సంస్కృతిలో భాగంగా వ్యాపించిన ఫేస్ పౌడర్ వ్యామోహాన్ని వ్యంగ్యంగా విమర్శించడాన్ని కూడా ఈ కథలో చూడవచ్చు.

మనుగడ కోసం పోరాటం అనే సూత్రాన్ని చక్కగా విడమరచి చెప్పిన కథ "రెండు గింజలు". ఈ కథ ఆశా, నిరాశావాదాల పరిణామాల్ని చక్కగా చిత్రీకరించగలిగింది. ఇతరుల దుఃఖాన్ని తమకు ఆనందంగా భావించుకునే స్వార్ధపరులు, దుర్మార్గులు తమ అనుచిత కార్యక్రమాలను కూడా గొప్ప పనులుగా తలపోసి తమకు బ్రహ్మరథం పట్టలేదని ఈసడించుకునేవారు. చివరకు ఎలా పతనమైపోతారో "అనుభవము లేని ఆందోళన"తో తెలిసిపోతుంది. తమ కూతురుకు మంచి సంబంధాన్ని నిశ్చయించగా ఆ అమ్మాయి ఒక వారాలబ్బాయిని ప్రేమించడాన్ని, పొగడ చెట్టు కెక్కించిన జాజి తీగ అక్కడ నుండి పడిపోయి రేగుచెట్లకు అల్లుకుపోవడంతో పోల్చి చెప్పడం "జాజి తీగ" కథలో కాన వస్తుంది. ప్రాచీననాణాల సేకరణదారుగా ఎదుర్కొన్న వింత అనుభవమే "అపోహ". ఇది కొసమెరుపుతో ఆసక్తికరంగా సాగుతుంది.

ఇందులోని కథలన్నీ 1937-47 మధ్య కాలంలో రాసినవే. 'ఆగస్టు పదిహేను' కథ మాత్రం 1959లో రాశారు. ఈ కథల్లో కుల, మత విద్వేషాల పట్ల, అవి తెచ్చే అసమానతలు- అణచివేతల పట్ల రచయిత నిరసన కనిపిస్తుంది. స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన స్వార్ధపర అవకాశవాద ధోరణులను, రాజకీయాలను ఒక ప్రజాస్వామ్యవాదిగా కాళోజీ అసహ్యించుకుంటారు. దేశంలో ఏకైక పార్టీగా గుత్తాధిపత్యం వహించిన కాంగ్రెస్ పతనాన్ని, కాంగ్రెస్ వాదుల అరాచక వర్తనాన్ని ఈ కథల్లో చిత్రీకరించారు. కథలన్నింటినీ ప్రతీకాత్మకంగా చిత్రీకరించడం లోనూ, హాస్య- వ్యంగ్యాలను మేళవించడంలోనూ రచయిత చూపిన ప్రతిభ అమోఘం. ఎప్పుడైనా సరే, సమకాలీన రాజకీయాలను ప్రతీకాత్మకంగా చిత్రీకరించడం వల్లనే అవి మంచి వ్యంగ్య రచనలుగా నిలబడగలుగుతాయి. బతుకు పోరాటాన్ని వివరించిన "రెండు గింజలు" కథ, సూర్యుని అసహ్యించుకొని తరిమికొట్టాలని ప్రయత్నించే 'దివాంధం' కథ, సరియైన ఆధారాన్ని వదలుకున్న 'జాజి తీగ' కథ- మరారి అనువాదాలు కాగా, కొసమరుపు కథ ఆంగ్లానువాదం. ఇవి అనువాదా లంటే నమ్మలేనివిధంగా వాటిని స్వతంత్ర కథలుగా తీర్చిదిద్దడంలో రచయిత చూపిన నేర్పు ప్రశంసనీయం. కథలు అరవై ఏళ్ల తర్వాత పునర్ముద్రణకు నోచుకున్నా, సమకాలీనత కథకుడిగా 'కాళోజీ' విజయాన్ని సూచించినా, ప్రజాస్వామ్యవాదిగా, ఆయనను నిరాశపరుస్తాయని చెప్పడంలో ఎలాంటి సందేహం లేదు. 'భూత దయ', 'తెలియక ప్రేమ- తెలిసి ద్వేషము'లాంటి కథలు దేశంలో పెచ్చరిల్లిపోతున్న కులమత విభేదాలకు, వాటి రాజకీయాలకు అద్దం పడతాయి. జీవకారుణ్యం పేరిట కొన్ని కాలక్షేప సంస్థల బూటకాన్ని 'మనమే నయం' కథ ఎండగడుతుంది. పతనమైపోతున్న రాజకీయ వ్యవస్థను కొన్ని కథలు వివరించగా, అవకాశవాదాన్ని- ఆశావాదాన్ని వివరించే కథలు మరికొన్ని. మొత్తానికి ఈ కథలు 1940-50 దశకాల నాటి రాజకీయ, సామాజిక పరిస్థితులను ప్రతిబింబింపజేస్తాయి. ఈ కథలు తెలంగాణ నేటివిటీతో కూడుకొని వున్నాయి.

*రచయిత సెల్: 97000 00948*

భండారి అంకయ్య

# నాకు తెల్సిన కాళోజి!



"ఆయనతో పరిచయమున్న ప్రతి చిన్నా పెద్దా- ఆయననంత సన్నిహితంగా తెలిసిన, తమదే అయిన ఒక పరిచయ ఆనందాన్ని, తృప్తినీ ఆయన్నుంచి పొందుతారు" అన్న వరవరరావు మాటలు అక్షర సత్యాలు! వరంగల్లు జిల్లాలో రెవిన్యూ అధికారిగా పని చేయక ముందునుంచే కాళోజి నాకు తెల్సు. నేను ఆయనకు అంతగా తెలియదు. కానీ బాగా దగ్గర కావడానికి మిత్రుడు నాగిళ్ళ రామశాస్త్రి కారణం. చాలాకాలంగా కాళోజి కవితలు చదవడం ఆయన గురించి మాట్లాడు కోవడం వల్ల ఆయన పట్ల అభిమానం పెంచుకున్నవాన్ని. నేను చాలా సందర్భాల్లో కాళోజి కవితల్ని ఉదహరించేవాన్ని. "కమ్మని చకిలాలొకచోట/ గట్టి దవడలింకొకచోట"- "గేగు కొరికినా కేకు నమిలినా/ ఆకలి మంటను ఆర్పుటకే గద", "కాలంబు రాగానే కాటేసి తీరాలి"- "ఎవరను కున్నారు? ఇట్లేనని ఎవరనుకున్నారు?" లాంటి కవితలు ఆ రోజుల్లో ఎంతో స్ఫూర్తినిచ్చేవి. అదృష్టవశాత్తు 1986 నుండి ఒక దశాబ్దం పైచిలుకు హన్మకొండలో వుండడము, వీలున్నప్పుడల్లా 'మిత్ర మండలి' సమావేశాల్లో, ఇతర కార్యక్రమాల్లో పాల్గోవడం వల్ల ఒకింత చనువు పెరిగింది. వాస్తవంగా "నా ఉద్యోగ జీవితంలో" అధికారాన్ని ప్రజాపరం చేయడం కాళోజి సోదరుల వల్ల, మిత్రమండలి ముచ్చట్ల వల్ల ఎంత అవసరమో తెలిసివచ్చింది! ఆ కాలంలోనే సామాజిక చైతన్యశీలుర మధ్య, సాహితీవేత్తల సాంగత్యంలో గడపడం వల్ల ఒక రెవిన్యూ అధికారిగా విధులు నిర్వర్తిస్తూనే, నా అభిరుచిని తీర్చుకోవడానికి దోహదపడిందని చెప్పాలి!!

అతి విలక్షణమైన ఆయన జీవన విధానాన్ని చాలాసార్లు కండ్లారా చూసినవాన్ని. తనకంటూ యేదీ అవసరంలేనట్టే వుండేవాడు. ఆకలి వేళ యెక్కడుంటే అక్కడే- ఏది వుంటే అదే తినే మనిషి కాబట్టే రాష్ట్రం నాలుగు చెరగులా ఆయనకు ఎందరో ఆత్మీయులు! సంపన్నులతో, సామాన్యులతో, సాహితీకారులతో, ఉద్యమకారులతో ఓ కుటుంబ సభ్యుడిగా కల్సిపోయే నైజం/ భేషజాలు వుండేవికావు. కావల్సింది సూటిగా అడగడమే! ఇది ఆయన నిష్కల్మష హృదయానికి ప్రతీక!! ఇవన్నీ కాళోజీతో దగ్గరి పరిచయమున్న ప్రతి ఒక్కరికీ తెలిసినవే! నేను కొత్తగా చెబుతున్నదేమీ లేదు. కానీ ఈతరం వాళ్ళక్కూడా కొన్ని తెలుపాలె గదా! అందుకోసం రాస్తున్న!!

1994 సంవత్సరంలో నేను ఖమ్మంలో పనిచేస్తున్నప్పుడు జీపు ప్రమాదంలో పెద్ద గండం తప్పింది. నిమ్స్‌లో చికిత్స తర్వాత ఓ పదిహేను రోజులు ఇంట్లో పడక మీదనే వున్న. ఓ రోజు ఉదయం 10 గంటల సమయంలో నన్ను చూడాలని మా యింటికి వచ్చినాడు కాళోజి! నేను మంచం మీంచి



**అవినీతి లేని మంచి రాజకీయా లు రావాలంటున్నవు.**
**మంచిదే! నేను అరవై ఏండ్ల నుంచీ మొత్తుకుంటున్న.**
**ఈ మొద్దుబారిన రాజకీయ నాయకులు వటరా?!**
**ఆc!... అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడంటానేను.**
**అందుకే నువ్వూ నాకు ఆరాధ్యుడివే!**

లేవబోతుంటే- "వద్దు... వద్దు... పండుకో. నిన్ను చూసి పోదామని గదా నేను వచ్చింది. నువ్వెందుకు లేస్తవు?... నొప్పులు తగ్గినయా?... ఇంక నీకు నూకలు బాకి వున్నయంటే- నువ్వెందరికో బాకీ వున్నట్టు! వాళ్ళ ఋణం తీర్చుకో. బాగా పని చెయ్." ఆ పలుకరింత లోని ఆప్యాయతకు ఎంతగా పులకించిపోయినానో! నేనేదో అనబోతే మాట్లాడనివ్వలేదు. "ఇంకేందీ? వచ్చిన పనైపోయింది. అదే నిన్ను చూడాలనుకున్న, చూసిన, బాగానే వున్నవు." ఈ మాటలు అంటున్న ప్పుడు శ్రీమతి చాయ తెచ్చింది. కప్పు తీసుకుని "సుశీలా! నేను చాయ తాగి పోవాలనుకుంటున్నావా? ఉహు... ఇంత తిన్నంకనే పోత! ఇప్పుడు క్రికెటు మ్యాచ్ వున్నదిగదా! చూసినంక పోత. యేదుంటే అదే పెట్టు." అని టీ.వి.కి అతుక్కుపోయినారు. ఆరోజు ఇండియా- పాకిస్తాన్ మ్యాచ్ ఏదో... ఎంత ఇన్వాల్వ్ అయ్యిండో ఇప్పటికీ నాకు ఆశ్చర్యమనిపిస్తది! ఆయనకు అక్షరాలే కాదు ఆటలన్నా ఎంతో ఇష్టమని అప్పుడే తెలిసింది నాకు. యేది చేసిన పూర్తి మనసు పెట్టడం- అందులో మమేకం కావడం ఆయనలోని ప్రత్యేకత! చాలాసేపటికి సుశీల వచ్చి చెయ్యి కడుక్కోమంటే- అప్పుడు ఆకలి గుర్తుకొచ్చినట్టు లేచిండు. ఆయనకు ఇష్టమైన జొన్నరొట్టె- కూర తృప్తిగ తిన్నడు. అంతేనా? "సుశీలా! రెండు రొట్టెలు ప్యాక్ చేసి యివ్వు. ఆకలైనప్పుడు తొవ్వల తింట!! ఇంటికి పోతనో ఇంకెక్కడికి పోతనో తెల్వదు గద!" అన్నాడు. ఆమె తలూపి నవ్వుతూ వంటింట్లోకి పోయింది. ఓ గంట తర్వాత బయల్దేరిండు. ఎపుడేది తోస్తే అదే చేసే మనిషి! మొండి ఘటం!! ఆయన్ని పెద్ద జేసిన అన్న రామేశ్వరరావుకీ కట్టడి చెయ్యడం సాధ్యంకాలేదు. యెక్కడికి బోతవని అడగడానికి మేమెంత?... చేతికర్ర, బుజాన సంచీ, ముడుతలుపడ్డ ఖద్దరు లాల్చీ, కాయగాసిన అంచు ధోతి, కండ్లద్దాలు సవరించుకుంటూ కాళోజి మా యింటి గేటు దాటిపోతుంటే- ఓ చైతన్య ప్రవాహం కదిలిపోతున్నట్లు అనిపించింది!

***

1996లో సహృదయ సాహితి, విశాఖ వారి గురజాడ పురస్కారం తీసుకున్నారు కాళోజి. ఆయన వెంట హన్మకొండ మిత్రులు కొందరు సమావేశంలో పాల్గొన్నారు. తిరుగు పయనం గురించి మాట్లాడుతుంటే- "నేను శ్రీకాకుళంలో రెండు రోజులు వుండి వస్తాను. మీరు వరంగల్లు పోండ్రి-" అని కాళోజి అంటే అక్కడేమున్నదని ఎవరో అన్నరట. "అదేందీ?! అక్కడ మనోళ్ళు లేరా!? డా. కరుణ రామకృష్ణ ఊకె రమ్మంట న్నరు గద! అయితనేలేదు. ఇప్పుడు మన అంకయ్య కూడ ఆడ్నే వున్నడు గద, ఇంత దూరం వచ్చి శ్రీకాకుళం పోక పోతే ఎట్ల?" కాళోజి మాటకు ఎవరు ఎదురు చెప్తరు! వాళ్ళంత వెళ్ళిపోయింద్రు. కృష్ణక్క ఇంట్లో ఆ రాత్రి వుండి మరునాడుదయం శ్రీకాకుళం చేరుకున్నాడు కాళోజీ. "తాతా-తాతా" అంటూ గారాలు పోయే కీ.శే. రామకృష్ణ ఇంట్లో మకాం. నేనూ వారి సపర్యలు అందుకున్న. ఒక పూట మా యింట్లో భోజనం చేసి మాతో గడిపింద్రు, మాటల్లో అందరికీ దూరంగా వుంటున్నామని సుశీల అంటే ఆయన కలుగజేసుకున్నడు. "ఇక్కడ బాగలేదా చెప్పు. శ్రీహరికి చెప్పమంటవా? మంచిగుంటే ఎక్కడైతేంది పనిచెయ్యడానికి?..." నాకు బాగానే వుందని ఇక్కడికి యిష్టంగానే వచ్చిన అనంగనే- "ఇంకేంది? రిటైర్ అయ్యేదాకా, ఇంకో ఏడాది ఇక్కడ్నే వుండు. పేదోళ్ళకు యిండ్లు కట్టించే అవకాశం అందరికీ రాదు. పుణ్యం, పురుషార్థం, రెండు..." ఆ మాటలు నాకు కొండంత ధైర్యాన్నిచ్చినయి. సాయంకాలం బమ్మిడి జగదీశ్వర్‌రావు కథల పుస్తకం ఆవిష్కరణో, పరిచయమో ఓ కార్యక్రమం కాళోజి కోసమే యేర్పాటు చేసినారు. సభలో మాట్లాడుతూ ఆయన నా ప్రస్తావన తెచ్చిండు. రెండు మంచి మాటలు చెప్పిండు. అందుకే శ్రీకాకుళం సాహితీవేత్తల చూపు నా మీద పడింది. ఓ సంవత్సర కాలం కరీంనగరంలోనే వున్నట్లనిపించింది. కాళోజికి దగ్గరివాడన్న భావన వల్ల ఒక అధికారిగానే గాకుండా ప్రజా పథ పాలుగా పౌర సమాజం నన్ను అక్కున చేర్చుకున్నది. ఆ రోజుల్లోనే చేరా మాస్టరు "కథానిలయం" నిర్మాణానికి సన్నాహాలు జరుగుతుండె. అందులో నన్నూ భాగస్వామిని చేయడం ఎప్పటికీ మరచిపోను.

***

2003 రోహిణి కార్తె రోజులవి! హన్మకొండకు లోక్‌సత్తా కార్యక్రమంలో పాల్గోవడానికి డా. జయప్రకాశ్ నారాయణ్ వచ్చిండు. ఆనాటి సాయంత్రం స్థానిక పెద్దలతో సమావేశం యేర్పాటుచేస్తే బాగుంటుందని చెప్పినాడు. "ఇక్కడ కాళోజి చాలామందికి ఆరాధ నీయుడు. ఆయన వస్తే బాగుంటుంది. కానీ కొంచెం అనారోగ్యం అని తెలిసింది. అందువల్ల మనమే ఆయనింటికి పోతే బాగుంటుంది" అన్నాను. "చాలామంచి ఆలోచన! నేనే వార్ని కలువాలని ఎప్పటినుంచో అనుకుంటున్న. పెద్దాయన దగ్గరకు మనమే పోదాం" అని జె.పి. ఇతర కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. మధ్యాహ్నం భోజనం తర్వాత ఆయన్తోబాటు నేనూ, మిత్రులు కోదండ రామారావు నక్కలగుట్టకు కాళోజి ఇంటికి బోయినం. చల్లదనం కోసం మంచం మీద వేసిన మచ్చర్‌దాను పైకిలేపి, చుట్టూ తడిపిన చద్దర్లు, దుప్పట్లు వేసింద్రు. పైన పంఖా తిరుగుతున్నది. మమ్మల్ని చూడంగనే "కూచోండ్రి!" అని ఓ నిమిషం జె.పి.ని చూస్తూ- "జయప్రకాశ్! మంచి పని చేస్తున్నవయ్య. ప్రజలే ప్రభువులంటున్నావు. అది నిజం కావాలిగానీ వీండ్లు కానిస్తరా?! అవినీతి లేని మంచి రాజకీయాలు రావాలంటున్నవు. మంచిదే! నేను అరవై ఏండ్ల నుంచీ మొత్తుకుంటున్న. ఈ మొద్దుబారిన రాజకీయ నాయకులు వటరా?! ఆc!... అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యు డంటానేను. అందుకే నువ్వూ నాకు ఆరాధ్యుడివే! కానీ ఉపన్యాసాలతో సమాజం మారుద్దా? "కాళోజి వాక్ప్రవాహాన్ని ఆపడం యెవరితరమూ గాదు. ఆయన మాటల్లోని సత్యాన్ని, తీక్షణతని జె.పి. అర్థం జేసు కున్నాడు.

"ఎవరో ఒకరం మొదలుపెట్టాలిగదా! నేను అదే చేస్తున్నాను. మీ లాంటివాళ్ళ ప్రోత్సాహం కావాలి" అన్నాడు. "మంచిది. మంచి పనికి, ప్రజలకు మేలు జరిగే పనికి ఇంకా చాలామందిని కలుపుకు పోండ్రి. మన ప్రయత్నం ఆగొద్దు. అయితే అందులో చిత్తశుద్ధి వుండాలే."

అనగానే సరేనంటూ కాళోజీకి దండం పెట్టి జె.పి.తోబాటు మేమూ బయటికి వచ్చినం.

"ఇంత నిష్కర్షగా, నిజాయితీగా మాట్లాడేవాళ్ళు- అందునా ఆశయాన్ని ఆచరణలో పెట్టేవాళ్ళు బహు అరుదు" అని జె.పి. మాతో అంటూ- "ఇంత నిరాడంబరంగా జీవిస్తున్న పెద్దాయన ఈ తరానికి ఓ తరగని ఆస్తి. ఆయన మన లాంటి వాళ్ళకు స్ఫూర్తినే కాదు, భవిష్యత్ మార్గదర్శనం చేయగల మహానుభావుడు. ఆయన్ని కలువడం నాకు ఈరోజు ఎప్పటికీ గుర్తుండిపోతుందని" కారెక్కినాడు.

***

కాళోజి కోవెలకు ఆత్మీయతను మూట గట్టుకుని వచ్చే సహృదయులు ఎందరో! స్థానికంగా ప్రొ. జయశంకర్ తో బాటు కాకతీయ విశ్వవిద్యాలయ ఆచార్యులు చాలామది సందర్భానుసారం వచ్చిపోయేవాళ్ళు. డా.రాయక లక్ష్మణ మూర్తి, ప్రొఫెసర్ లక్ష్మణమూర్తి, వర్ధమాన కవి రచయితలకైతే లెక్కేలేదు. రాములు, రామశాస్త్రి సమన్వయం చేసెటోళ్ళు. అంతే గాదు శ్రీకృష్ణ, రావూరి భరద్వాజ, కన్నభి రాన్, కల్పనలాంటి వాళ్ళు హైదరాబాదు నుండి, సదాశివ మాస్టారు ఆదిలాబాదు నుండి... ఉత్తరాంధ్ర నుంచి ఒక చలసాని, ఒక కృష్ణాబాయి, ఒక రామకృష్ణ ఎందరో... కరుడుగట్టిన తెలంగాణావాదికి ఇలాంటి వారితో సాంగత్యమా?యని ఆశ్చర్యపరచేది. ఆయనది మానవీయ- స్నేహబంధం! అందుకే ఇష్టానికి, స్నేహానికి, ప్రాంత, వయో లింగభేదం లేదని కాళోజి నిరూపించిన మానవతా వాది! అదీ కాళోజి వ్యక్తిత్వంలోని ఔన్నత్యం!! వారింటికి వచ్చే విశిష్ట వ్యక్తుల గురించి మా రామశాస్త్రికో, రాములుకో ముందే తెలిసేది. నాకు సమాచారం ఇవ్వగానే కాళోజి ఇంటికి పోయేటోడ్ని. అట్లా ఎందరో ప్రముఖుల్ని కల్సుకోవడం, కొంచెంసేపైనా మాట్లాడే అవకాశం రావడం నాకెంతో ఆత్మతృప్తినిచ్చేది.



ఒక జన్మదిన వేడుక నాకు ఆజన్మాంతం గుర్తుండిపోతుంది. అది 1999, 2000 ఏదో సరిగ్గా యాదిలేదు. కృష్ణాబాయి బిడ్డ వీణావాదం వీనుల విందు చేసింది. శ్రీమతి వేనుష హిందుస్తానీ సంగీత ఝరిలో ఓలలాడించి మైమరిపించింది. పెద్ద కాళోజికి అత్యంత ప్రీతి పాత్రమైన గజల్స్ గానం చేసి గుమ్మడి జనార్దన్ అలరించినాడు. ఆర్భాటాలు లేని అతి సాధారణ సమ్మేళనం! కానీ అది అపూర్వ సంగమం!! పైన ప్రస్తావించిన చాలామంది పెద్దలు శ్రోతలు!! అనూహ్యంగా, ఆ సభకు అధ్యక్షత వహించే భారం నామీద మోపినారు మిత్రులు. కాదనలేను గదా! ఆదేశాలు పాటించడమేగదా!! సభాధ్యక్షునిగా కాళోజి ఆశయ సాధన కోసం అభిమానులంతా కల్సి రావల్సిన అవసరాన్ని, సమాజం పట్ల మన బాధ్యతల్ని నిర్వర్తించవలసిన ఆవశ్యకతని- ఏదో తోచింది ఓ అయిదు నిమిషాలు మాట్లాడి- అయిదారుగురు పెద్దలతో మాట్లాడించి కార్యక్రమం ముగించు కున్నాం. అప్పుడే కావచ్చు సదాశివ మాస్టారు నన్నూ- నా మాటల్ని నిశితంగా గమనించి వుంటారు. ఆ తర్వాత కూడ ఒకటి రెండు సందర్భాల్లో సభల్లోనో, కాళోజి యింట్లోనో కల్సు కున్నాం. అందుకే ఆయన 'యాది'లో నాకూ చోటు దక్కింది. పెద్దల ప్రేమాభిమానములు నాకు దక్కడం గొప్ప అదృష్టంగా భావిస్తాను.

***

నాకు గుర్తుండె మరెన్నో సంఘటనలు! పద్మవిభూషణ ప్రకటనకు ముందే ఈ వార్తను చేరవేసే అవకాశం నాకే దక్కింది.

హన్మకొండ ఆత్మీయమిత్రుల తొలి అభినందన కార్యక్రమంలో "పురి విప్పిన మయూరి" జ్ఞాపిక అందివ్వడం- ఇద్దరు కాళోజీల మధ్య కూచుని రెండు మూడు సభల్లో పాల్గొనడం, ఆయన సహస్ర చంద్ర దర్శన ఉత్సవంలో భాగస్వామిని కావడం... ఎన్నటికీ మరిచిపోలేనివి.

*'కుసుమం వలె కోమలుడు*
*వజ్రం వలె కఠినుడు.'*

***రచయిత సెల్: 9032742937***

# తెలంగాణకు ఒక పర్యాయపదం

కాళోజీ విలక్షణమైన వ్యక్తి. ఆయన తెలంగాణ కోసం గళమెత్తాడు. తన తనువంతా తెలంగాణ కోసం తపించాడు. తెలంగాణలో వస్తున్న కరువులకు నివారణంగా బతుకమ్మ పాటలకు కాళోజీ గొంతు కలిపాడు. తెలంగాణకు ఒక పర్యాయపదంగా కాళోజీ మారాడు. పి.వి.నరసింహారావు అన్నట్లు 'కాళోజీ'కి నిఘంటువు అర్థాలు యాడ వెతికినా కనిపించవు. కానీ కాళోజీ అంటే ఎవరు ఏ దృష్టితో చూసినా ఆ దృష్టితో కన్పిస్తాడు. కాళోజీ మనిషి తత్వానికి సరిపడా ఇమిడే గొప్ప మానవతావాది. విరామం లేని తెలంగాణ వాది. ఆయన మనిషి తనాన్ని కోస్తాంధ్రా కూడా కౌగిలించుకుంది. విషయాన్ని మౌఖికంగానే, ఆశువుగానే ముఖం మీద కొట్టినట్లు చెప్పిన కాళోజీ వ్యక్తిత్వం ఎంతో గొప్పది. ఒక కవిగా, కథారచయితగా కంటే ఒక సామాజిక శాస్త్రవేత్తగా ఆయన వేసిన అడుగులు, ఆయన నడక ఎంతో ఉన్నతమైనవి.

*- జూలూరు గౌరీశంకర్ ('కాళోజీ యాదిలో...' నుంచి)*



# మళ్లీ మహాభారతం



కన్యకుమారింటడుగే
కశ్మీరమునకు పునాది
కదలిబాయు ఆవిరులే
గంగ జీవనమునకాది

చీర అంచు అంటుకుంటే
ఆపాదమస్తకం అలజడి
కొప్పుపట్టి లాగితే
అరికాళ్లు నిప్పులు త్రొక్కినట్లు
దుండగీడు కన్నుగీటితే
శీలవతి కన్నుల్లో
శివుని చిచ్చుకంటి మంటలు

సైరంధ్రి అవమానిత అయినప్పుడల్లా
కీచకవధ జరుగక తప్పదు
ద్రౌపది అభిమానానికి క్షతి జరిగినప్పుడల్లా
దుర్యోధనుల తొడలు విరుగక తప్పదు
దుశ్శాసనుల ఎదలు పగులక తప్పదు

ఎన్నిసార్లు కీచక వధ జరిగినా
దుశ్శాసనుల గుండెలు పగిలినా
దుర్యోధనుల తొడలు విరిగినా
కర్ణుల రథచక్రం భూమిలో క్రుంగినా
ఎన్నిసార్లు కృష్ణులు రాయబారాలు జరిపినా
మళ్లీ మహాభారతం

మళ్ళీ మళ్లీ కీచకులకు సుధేష్ణల అండ
దుశ్శాసనులకు దుర్యోధనుల ఆదేశం
దుర్యోధనులకు దురాశ దురభిమానం
కర్ణులకు పగ సాధించే కసి
మళ్లీ కృష్ణుల రాయబారాల అవసరం
మళ్లీ మహాభారతం

మళ్లీ మళ్లీ భీష్మద్రోణుల మూగనోము
ధృతరాష్ట్రుల గుడ్డి ప్రేమ వ్యామోహం
శకుని మామల పాచికల పేచీలు
మళ్లీ ద్రౌపదికి తలవంపులు
మళ్లీ మహాభారతం

మళ్లీ మళ్లీ
సైంధవులకు వరాలు
ఆచార్యుల పద్మవ్యూహాలు
యోధానుయోధుల పన్నాగాలు
మళ్ళీ అభిమన్యుల చిత్రవధలు
మళ్ళీ మహాభారతం

మళ్ళీ మళ్ళీ కాశ్మీరముపై దురాక్రమణ
ఐ.రా.స. సంధి పరామర్శ
కాల్పుల విరమణ ఒప్పందం
విరమణ ఒప్పందం కాల్పులు
భారత ధర్మజుల ఓర్పులు
మావ్ సేతుంగ్ పాచికల పేచీలు
ఆయూబ్ దుర్యోధన దురాశా దురభిమానం
భుట్టో దుశ్శాసన దురావేశం
మళ్ళీ దుర్యోధనుల తొడలు విరుగక తప్పదు
దుశ్శాసనుల ఎదలు పగులక తప్పదు
మళ్ళీ కురుక్షేత్ర యుద్ధం తప్పదు
మళ్ళీ మహాభారతం తప్పదు.

- కాళోజీ





డా॥ పట్నం శేషాద్రి

# ఋషి



దూరముగా, శ్రావ్యముగా భానుమతి గొంతుకలో జాలువారిన ఒక పాత పాట వీనుల విందుగా వినిపిస్తున్నది. అది "పిచ్చి, పిచ్చి, పిచ్చి రకరకాల పిచ్చి ఏ పిచ్చి లేదనుకుంటే అదే ఒక పిచ్చి." ఆ పాట వింటుంటే, కవి కలంలోంచి జాలువారిన ఏ అక్షరాలైనా వీనుల విందుగా, పసందుగా వినిపిస్తాయి. ఆ పాట విన్నంతసేపు ఈ పిచ్చి కవి పిచ్చిగాని, అలాంటి పిచ్చి ఎక్కించే పాట పిచ్చిపిచ్చిగా రాశారన్నారు. క్రమముగా ఆలోచిస్తే కవి జీవితసారములోంచి ఈ పాట బయటకు వచ్చినట్లుగా అనిపించింది.

పాట వింటూ ప్రక్కకు తిరిగి చూస్తే కాళోజీ నారాయణరావుగారి నా గొడవ కవితల సంకలనము కనువిందుగా మల్లెవంటి తెల్లని దుస్తుల్లో చేతికర్రతో, చే సంచితో, చేతిలో కలముతో ఏదో కవిత రాస్తున్న ఆ మహనీయునికి కూడా గొడవ ఉన్నదా అనే ఆశ్చర్యపోతూ పుస్తకము చేతిలోకి తీసుకున్నాను. కాళోజీ నారాయణరావుగారిది శరీరము అయితే ఆయన ఆత్మగా సంచరించిన నాగిళ్ళ రామశాస్త్రిగారు దయతో నాకు అందించిన పుస్తకము అది.

అవును, ఆలోచిస్తే అప్పుడే పుట్టిన బిడ్డ ఊపిరికై పడే తపన, ఆకలి వేస్తే పాలకై అమ్మ స్థన్యాన్వేషణ, ఎదుగుతు అడుగులు వేసే ప్రయత్నములో క్రిందపడడము మరియు లేవడము, జ్ఞాన సంపదకై పాఠశాలలో చేరడము, ఉన్నతముగా చదివి ఉత్తీర్ణులయ్యే తపన, చదివిన చదువును సార్థకము చేసుకొనే ప్రయత్నములో ఉద్యోగ అన్వేషణా కాంక్ష, ఎదిగే వయస్సులో సహచరునికై సహచారిణి నిరీక్షణ, పిల్లల కొరకై ఆరాటము, ఆస్తిపాస్తులు సంపాదించుట కొరకై కనే కలలు, ముదిమి వయస్సులో ఎవరో ఒకరి ఆసరాకై తపన ఇలా మనుషుల జీవితాలలో ప్రతి అంశము ఒక గొడవ మయమే.

పేదవాడి ఆకలి పోరాటం, ఉన్నవాడి దోపిడి ఆరాటం, తాడిత పీడితులు తప్పించుకొనే ప్రయత్నం, పట్టువీడని కామాంధుల, అణగదొక్కే ప్రయత్నం, కామాంధుల కళ్ల చెడు దృష్టి నుండి తమను తాము కాపాడుకొనే కన్నెపిల్ల కష్టం, ఇలా సమాజము ఎదుర్కొనే ఆటుపోటులు ఒక గొడవే. అందుకే నాకు అనిపించింది పిచ్చిపాట నిజమే కాబోలు అని. ఈ గొడవల గోల గురించి ఆలోచిస్తే గొడవ, గొడవ, గొడవ రకరకాల గొడవ ఏ గొడవ లేదనుకుంటే అదే ఒక గొడవేనని.



అదే అప్పుడు అన్నారు నాకు తెలిసిన వారు. అరె బడవా వ్యక్తిగత గొడవ వేరు, సమాజ గొడవ వేరు, సమాజ శ్రేయస్సుకై గొడవ పడే వారు వేరు. అదెలా అంటే అందుకే ఎదుటనున్న కాళోజీ గొడవల కవితల సంపుటి సంకలనం చదువు అన్నారు. అప్పుడు నా గొడవ కాస్త ఆపి కాళోజిగారి గొడవ కవితల సంపుటిని భయపడుతూ తెరిచాను.

అలా తెరిచి చూసినపుడు కంటపడ్డ పేజీలో రెండు కవితలు ముద్రితమై ఉన్నాయి. అందులో ఒకటి 'ఖర', రెండవది 'మాందాతల' నుండి అనే కవితలు. తెలుగులో అరవైరెండు సంవత్సరాలకుగాను ప్రతి సంవత్సరమును ఒక వస్తువో, జంతువో లేదా ఒక పదబంధముతో పిలుచుకోవడము ఆనవాయితీ. ఇలాంటి ఆనవాయితీయే చైనా దేశములోను ఉన్నది. కాలమానములో ఒకటైన సంవత్సరపు పేరు 'ఖర' పై కాళోజిగారు వ్రాసిన కమ్మని కవిత చదివే వరకు దీని వెనుక ఇంత విషాద గొడవ దాగి ఉన్నదా అని అర్థము అయింది. ఈ 'ఖర' అను కవిత వ్రాయడములో కాళోజీగారి కర విన్యాసము బయటపడింది. పదాలను వడివడిగానే గాక, హృదయములో ఉబికిన తడితో తడి తడిగా నడిపించిన వైనము అవనిపై సామాన్యునిది వ్యథలు, తుచ్చుల తమాషాలు, ఎముకలు విరిగేల కష్టపడినా సామాన్యుడు గురి అయ్యే అవహేళన, అనాదరణ గురించి బాధపడడమే కాళోజీ గొడవగా మనం భావించవచ్చు. అణగదొక్కబడిన ప్రజల మధ్యన ఇలాంటి అక్షర నిప్పు రవ్వలు రాలితే భగ్గున మండి కామాంధులను, భూస్వాములను సమూలముగా అంతము చేసే అవకాశము ఉంటుంది. ఖరము వలె కార్య దీక్ష సహన శక్తి కలిగినను పేదలకు దక్కని పేరు, ప్రతిష్టలు, బలిసినవారికే గౌరవములు అని బాధపడుతూ అసహాయునికి ఆసరాగా నిలుస్తాడు మన కాళోజీ. ఇది ఆయన గొడవ.

'మాందాతల నాటి నుండి' అనే కవిత చదివితే కవి అన్నవారికి చరిత్ర, సంప్రదాయము, సమాజము, జీవన వైచిత్రి ఇలా మానవ జీవన మనుగడకు చెందిన అన్ని విషయాల పట్ల సంపూర్ణ అవగాహన ఉంటే



కవిత్వములు జవసత్వాలు కలిగి పఠనీయముగా, పరిపుష్టముగా ఉండి సమాజానికి ఒక సందేశాన్ని అందిస్తాయి. సమాజములో ఒకరిని అణగ దొక్కి ఇంకొకరు పైకి రావడము, ఒకరిని నాశనం చేసి వారి ఆస్తిపాస్తులను వశం చేసుకోవడం సామ దాన భేద దండోపాయాలతో బలహీనుణ్ణి బలవంతుడు దోపిడీ చేయడము రివాజు అయిపోయింది. ఈ ధనస్వామ్య వ్యవస్థ నాటి నుండి నేటివరకు ఉన్ననూ ఈ మధ్యకాలంలో వికృత రూపాన్ని ధరించి ధనపు ధృతరాష్ట్ర కౌగిట్లో మానవత్వము నలిగి ప్రక్కలవుతున్నది. దొంగ నాటకాలు వేసి, విషపు నవ్వులు చిమ్మే వికృత మనస్తత్వాలు గల వారిని దునుమాడుతూ దోపిడీ చేయబడుతున్న బలహీనులు, బాధాతప్త హృదయులను రక్షించే ప్రయత్నములో తాము ఎదుర్కొన్న కష్టాల కవితలే ఆయన గొడవ. అందుకే ముసుగులోని గుసగుస గోసలో పడకంటూ వారిని అప్రమత్తం చేయడం వీరి గొడవ.

ఇంకో కవిత 'ఈ అలజడి కొన్నాళ్లు'ను చదివాను. వారి కవిత చివరన ప్రకటించినట్లు ఈ కవిత రాసిన సంధి యుగం నాడు నెలకొన్న పరిస్థితుల్లో చేయవల్సిన, చేస్తున్న పనులు ఏమిటి, ఆ పనుల వల్లన ఒరిగేది ఏమిటి? చివరికి ఫలితము ఎవరికి అని పెదవి విరుస్తారు. నయవంచక నాయకులు అరచేతిలో వైకుంఠము చూపే వైనముల గుర్చి ఆసాంతము తెలిసిన అనుభవశాలి! అదగకనే అణగదొక్కే వారి పక్షము వహించి ఎవరి ప్రపంచము వారిది అయిపోతే మరి సమాజ మనుగడ ఏమి గావాలె, ఒకరికొకరు హననము చేసుకోవడమేనా మానసిక శారీరక బలహీనులకు 'ఆసరా' ఎవరు ఇవ్వాలి అని పేదల బతుకు ఎప్పటికి ఎవరు ఎన్ని వేషాలు కట్టిన ఎప్పుడు బాగు పడేను అన్న ఆకాంక్షతో...

**"ఈ అలజడి కొన్నాళ్లు**
**కొత్త దేవర తిరునాళ్లు**
**మళ్లీ అదే పాత కత**
**కాళోజీ కేల ఈ వెత"**

అంటూ తన గొడవ చెప్తుతారు కాళోజీ.

**"సత్యం, శివం, సుందరం**
**స్నేహం ఒక్కటే, స్నేహం ఒక్కటే**
**వాత్సల్యం, ప్రేమ, భక్తి,**
**స్నేహం ఒక్కటే, స్నేహం ఒక్కటే**
**మానవత్వము మెరుగు**
**స్నేహం ఒక్కటే, స్నేహం ఒక్కటే**
**రామ చక్క దనాలన్ని**
**స్నేహానివే, స్నేహానివే అని"**

---

***అణగదొక్కబడిన ప్రజల మధ్యన ఇలాంటి అక్షర నిప్పు రవ్వలు రాలితె భగ్గున మండి కామాంధులను, భూస్వాములను సమూలముగా అంతము చేసే అవకాశము ఉంటుంది. ఖరము వలె కార్యదీక్ష సహన శక్తి కలిగినను పేదలకు దక్కని పేరు, ప్రతిష్ఠలు, బలిసినవారికే గౌరవములు అని బాధపడుతూ అసహాయునికి ఆసరాగా నిలుస్తాడు మన కాళోజీ. ఇది ఆయన గొడవ.***

---



స్నేహము గురించి బహు చక్కగా చెప్పడం ఈ కవి గొడవే.

ఆప్తులైన, ఆత్మబంధువులైన, నచ్చని, ప్రజలు మెచ్చని విషయములను నిర్మొహమాటముగా ఏకిపారేయడమే కాళోజీగారి గొడవ.

దాశరథి రంగాచార్యుల వంటి మహామహులు నాటి ముఖ్యమంత్రి వెంగళరావు గారు తన రాజకీయ గురువు అన్నందుకు నీ ఆత్మగౌరవము ఏమి కావాలని దాశరథిని నిరసించారు. కాళోజీగారి అనుచరుడు అనుంగ శిష్యుడు అయిన నాటి భారత ప్రధానమంత్రి కీ.శే. పి.వి.నరసింహారావును కూడా ఒకానొక సందర్భములో విమర్శించి తన కలం కత్తికి అందరు సమానమేనని చాటినారు.

నేటితరం నైజపు నాడిని, నాడే దివ్య దృష్టితో చూశారా అన్న చందముగా ఎదుటివారి కష్టఫలం ఎట్లగో ఒక తీరుగా, పుణ్యం, పాపము ఆనక పొంది బతకవలసిందే అని బాధపడుతూ వ్రాసారు కాళోజీ. అన్యాయాలను, అక్రమాలను ఎదురించడమే గాదు, సరస్వతి మాతను గురించి చక్కగా మెచ్చుకొన్నారు.

**"పండిత పామర భేదము**
**ఎరుగని సహృదయ వాణి**
**అర్థంతర లావణ్యము**
**చిందించెడి జాణ వాణి**
**కలిమి లేములను బదయక**
**చను గుడిపిన తల్లి వాణి**
**అనంత పద శోభిని,**
**రాసప్రోతస్విని, బ్రహ్మాణి"**

అంటూ చదువుల తల్లిని చక్కని పదాలతో వినసొంపైన వాణితో కవితలు అల్లారు కాళోజీ.

యాభై సంవత్సరాల క్రితమే కులగోత్రాలను, మతాల అడ్డుగోడలను కూల్చె కవితల కత్తులు విసిరారు కాళోజి. ఈ దిగువ కవితలో

**"ఎదిగిన మొగోడు, ఎదిగిన ఆడది**
**మది మది కలిసి, ముదమున బ్రతుకగా**
**వరుడికి వధువు, వధువుకు వరుడు**

**నచ్చి మచ్చికలు హెచ్చి బ్రతుకగా**
**శాస్త్రాల అనుమతి ఎందుకు**
**కులగోత్రాల ప్రసక్తి ఎందుకు"**

అంటూ సమాజము మెచ్చిన, మెచ్చకపోయినా నచ్చిన విషయాన్ని కుండ బద్దలు గొట్టినట్లు చెప్పడమే కాళోజి గొడవ.

అధికారములో ఉన్న రాజకీయపక్షాలైన, ప్రతిపక్ష రాజకీయ పక్షాలైన ఎవరైన తప్పు చేస్తె తన కవితల సుత్తులతో వారిని తుత్తునియలు చేయడమె కాళోజీగారి గొడవ. చూడండి పాలకవర్గంపైన పోరిపోరి నిందిస్తూ సంఘ విరోధ శక్తుల సహాయం అర్థించే కన్న చావడమే మేలు అని చాటారు. తాను ఎలాంటివాడైన అన్ని ఓర్చి తన బ్రతుకును పట్టి నిలిపిన తన సహచరి గురించి తను మరియు కుటుంబ భారాన్ని మోసిన, తనువు తానైన ఆత్మ అన్నగా భాసించిన కాళోజీ రామేశ్వరరావు గారికి అప్పజెప్పి తన గొడవ తాను చూసుకున్నారు. ఆయన మాటల్లోనే చెప్పినట్టు అంకిత కవితలో ఎన్ని ఏండ్లు వచ్చినను చిన్నవాడననుచు.

**"అతి గారము తోడ అన్ని సమగూర్చుచు**
**ఆటలకు, పాటలకు అవకాశమిచ్చిన**
**అన్నయ్యకి గొడవ అర్పితము చేతు...!**
**శభాష్ కృతజ్ఞత భావము ఉంది..."**

శ్రీశ్రీ గారన్నట్లు ఫ్రెంచి విప్లవం సందర్భంగా లూయి అరగన్ అనే కవి ఒక్కడే నిలబడి ఎలా ప్రజాపక్షం వహించారో, అలాగే కాళోజీగారు కూడా 1969 నుంచి తను పరమపదించే వరకు తెలంగాణా పక్షం వహించినారు. కాళోజీగారు పరుల బాధను తన బాధగా భావించి తను మెచ్చిన, నచ్చిన విషయాలను, నచ్చని విషయాలను అస్మదీయులను, తస్మదీయులను సమాజశ్రేయస్సు దృష్ట్యా కవిత కత్తులతో తెగనరికి, కవితా సుత్తులతో తుత్తునియలు చేసి భూస్థాపితము చేసిన భూమాత సుపుత్రుడు మన ఋషి కాళోజీ నారాయణరావుగారు.

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు గురించి పి.వి., జె.వి., కె.వి.

**"బి.వి. గురుమూర్తి జాడ**
**పట్టి బయట పడలేదా**
**ఇప్పటికైనా పదవుల**



*శ్రీశ్రీ గారన్నట్లు ఫ్రెంచి విప్లవం సందర్భంగా లూయి అరగన్ అనే కవి ఒక్కడే నిలబడి ఎలా ప్రజాపక్షం వహించారో, అలాగే కాళోజీగారు కూడా 1969 నుంచి తను పరమపదించే వరకు తెలంగాణా పక్షం వహించినారు.*

**విడిచి బయట పడలేర**
**.......**
**కుక్క చావు చావకండి**
**చక్కగా బయటకు రండి**
**తెలంగాణా ప్రత్యేకత**
**కోరుతు బయటకు రండి**
**జై హింద్... జై తెలంగాణా"**

అని దిశా నిర్దేశము చేస్తూ గళము ఎత్తడమే కాళోజీ గొడవ.

సామాన్య భారత ప్రజల ప్రతీకగా కొల్లాయి గట్టి, కండువా కప్పి, చేతి కర్ర పట్టి, కిర్రు చెప్పులు తొడిగి, వడివడిగా నడిచేటి మహాత్మగాంధీ గురించి ఐన్‌స్టీన్ అనే శాస్త్రవేత్త భూమండలముపై ఇలాంటి వ్యక్తి ఉండే వారా అని రాబోయే తరాలు ఆశ్చర్యపోయే స్ఫూర్తి ప్రదాత అని మహాత్మాగాంధీగారి గురించి చెప్పారు. ఆ కోవకు చెందిన వారిలో ఆంధ్రదేశములో ఒక ముఖ్యమంత్రిగా పనిచేసిన ముతక ఖద్దరు దుస్తులే మిగిలిన టంగుటూరి ప్రకాశం పంతులుగారు, ఖద్దరు పంచే లాల్చి, ఒక కండువ ఒంటిపై, మరొక జత బట్టలు చేతి సంచిలో పళ్లు తోమడానికి ఒక వేప పుల్ల మాత్రమే మిగిలిన నాటి ఉప ముఖ్యమంత్రి డాక్టర్ వావిలాల గోపాల కృష్ణయ్య, జీవితాన్ని సమాజానికి త్యాగము చేసిన పుచ్చలపల్లి సుందరయ్యలు కాగా, మరొకరు మన కాళోజీ నారాయణరావుగారే అని నాకు తెలిసిన మేరకు భావిస్తూ, మనిషి నైజము గురించి కాళోజీగారు చెప్పిన ఒక కవితతో ముగిస్తాను. అది ఏమంటే-

**"మనిషి ఎంత మంచి వాడు**
**చనిపోయిన వాని చెడును**
**వెనువెంటనే మరుస్తాడు**
**వాని మంచినే తలుస్తాడు**
**మనిషి ఎంత చెడ్డవాడు**
**బతికి ఉన్న మనిషిలోని**
**మంచిని ఎప్పుడు గుర్తించడు**
**చెడును వెతికి కెలుకుతాడు"**

అందుకే మనిషిగా జన్మించాలని, మంచిగా బ్రతకాలని, పరులకు ప్రత్యుపకారము చేయాలని, జీవితాన్ని సాఫల్యము చేసుకోవాలని శాస్త్రాలలో చెప్పిన విధముగా

"నిర్భయత్వే నిర్మోహత్వే

నిర్మోహత్వే నిశ్చల తత్వే" అన్న విధంగా నిశ్చలతత్వం సంతరించు కొన్న వారే ఈ అమూల్య ఋషివర్యులు మన కాళోజీ నారాయణరావు.

*(అదనపు సంయుక్త సంచాలకులు, నిజామాబాద్ జిల్లా)*



# అందరి వాడు



అందరి వాడైనవాడు
ఏ ఒక్కనికి అంకితమ్ము కాజాలడు
ఏ ఒక్కనికి అంకితమ్ము అయినవాడు
అందరికి అయినవాడు కానేరడు.

అందరికి అయిన వాణ్ణి
ప్రతి ఒక్కడు నా వాడని
వాడు నావాడు కాకుండవుతున్నాడని
పడుచుండును ఆరాటము.

అందరి వాడైన వాడు
ఏ ఒక్కనికి అంకితమ్ము కాజాలడు
అందరి వాడైన వాడు
ఏ ఒక్కనికి
అన్ని తీర్ల అనుకూలుడు కాజాలడు

అందరి వాడైన వాణ్ణి
ప్రతి ఒక్కడు
అన్ని తీర్ల తనకే అనుకూలుడు కాదని పడు ఆరాటము
అంత తుదకు విపరీతము

యీ నడవడి పరిణామము
ఆరాటము తీరనట్టి ప్రతి ఒక్కడు
అందరి వాడైన వాణ్ణి
తనవాదనలే కాదని
తరిమి కొట్టి తృప్తి జెందు

అందరి వాడైన వాడు
ఏకాకే ఎల్లప్పుడు
అయినా అందరివాడె
ఏ ఒక్కనికి అంకితమ్ము కానివాడె.

– కాళోజీ

కాత్యాయని విద్మహే



# కాళోజి కవిత్వ పరామర్శ

భారత ప్రభుత్వం ఇచ్చిన అత్యంత ప్రతిష్ఠాకరమైన పద్మవిభూషణ్ బిరుదుతో కంటే 'ప్రజాకవి' అన్న బిరుదుతోనే తనను చెప్పుకొనటానికి ఇష్టపడే సాదాసీదాకవి కాళోజీ. తెలంగాణకు, ప్రత్యేకించి వరంగల్లుకు పెట్టని ఆభరణం. కవి కావటానికి ముందు నుండి ఆయనొక సామాజిక ఉద్యమోపజీవి. ఆర్య సమాజ ఉద్యమం దగ్గరనుండి పౌర హక్కుల ఉద్యమం వరకు ఆయన అన్ని ప్రజా ఉద్యమాలలోనూ భాగస్వామి అయ్యాడు. మనిషి స్వేచ్ఛకోసం తపించాడు. జపించాడు. నిలబడ్డాడు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య రాజకీయాలలో లోపించిన విలువల గురించి ఆందోళన పడ్డాడు. మొత్తంగా సమాజంలో మనిషిని పట్టించు కోని ఒక నిర్లక్ష్య నిర్లిప్త నిర్లజ్జ స్వభావాన్ని, సందర్భాలను ఏవగించు కొన్నాడు. దుఃఖపడ్డాడు. కవిత్వం వ్రాశాడు.

కాళోజి అంటే అస్తిత్వచేతనామూర్తి. నేను, నా అనేవి ప్రత్యేక వ్యక్తి అనుభవం, ఆలోచనలు, అభిప్రాయాలు కేంద్రమైన అహం అస్తితను సూచిస్తాయి. 'నేను' అనేది ఒక సామాజిక సందర్భం నుండి, సంఘర్షణ నుండి, సంవాదం నుండి రూపొందే అస్తి త్వం. తను వుండటం – ఇవన్నీ అస్తిత్వ చేతనలో భాగాలు. కాళోజికి తన అనుభవం, దానినుండి ఏర్పడే ఆలోచనలు, అభిప్రాయాలే ప్రధానం. గతానుగతికమైన మానవానుభవాలను, సిద్ధాంతాలను స్వీకరించి నడవటం ఆయన నైజం కాదు.

"నాగతిని ఆ కట్ట
నన్నడుపులో పెట్ట
ఎన్ని శాస్త్రాల కట్టడాలో
ఎన్నెన్ని నీతుల గోతులు
ఎన్ని ఇజాల ఊబులు
ఎన్ని అంతశ్శాఖల దొంకతిరుగుళ్ళు
ఎన్ని కులాల అనుపాతాలు
ఎన్ని కులగోత్రాల మడికట్లు..."

(నాగొడవ, కాళోజి కవితల సంపూర్ణ సంకలనం, కాళోజీ ఫౌండేషన్, సెప్టెంబర్ 2001, పు : 195) అన్న కవిత ఆ నైజాన్ని వ్యక్తం చేసేదే. పూర్వానుభవాల, ఇతరేతర శక్తుల ప్రభావంతో కలుషితమైన దృష్టితోకాక స్వచ్ఛంగా, స్వచ్ఛందంగా, సద్యోజాతంగా సందర్భానికి స్పందించే వివేక




**కాళోజి వ్యక్తులకు ఎంత అభిమానించాడో, వ్యక్తిత్వాల పట్ల గౌర వాన్ని, ఆరాధనను ఎంతగా కనబరిచాడో వ్యక్తుల ప్రవర్తనలు దృక్పథాలు నచ్చకపోతే అంతగా విమర్శించాడు కూడా. వ్యక్తులను అభినందిస్తూనో, అభిశంసిస్తూనో ఆయన వ్రాసిన కవితలు యాభైకి పైగా వున్నాయి.**

వంతమైన 'నేను' మీద అపారమైన నమ్మకం కాళోజి కవిత్వ బీజం. ప్రపంచంలోని ఏ సమస్యలోకైనా తాను ప్రవేశించటం, అనుభవించి పలవరించటం స్వభావమైన కాళోజీకి ప్రతిదీ తనగొడవే అవుతుంది. కవులు ఒక్కొక్కరు అనేక కావ్యాలు వ్రాస్తారు. కానీ కాళోజి తాను ఏమి వ్రాసినా అది 'నా గొడవ' అంటాడు. ఆరకంగా 1940ల నుండి అంటే తనకు ఇరవైఆరేళ్ళ వయసప్పటి నుండి ప్రారంభించి 1970ల వరకు నలభైఏళ్ళ కాలం మీద వ్రాసిన మహాకావ్యం 'నాగొడవ' ఒక్కటే. నిజాం వ్యతిరేక పోరాట కాలం నుండి, ఆంధ్రమహాసభ ఉద్యమంనాటి నుండి, స్వతంత్ర ప్రభుత్వపాలన పరిణామాలను గుర్తించి విమర్శించటం వరకు తాను స్పందిస్తూ వ్రాసిన కవితల సంకలనం 'నాగొడవ'. చైనా యుద్ధ సమయంలో, బంగ్లాదేశ్ విభజన సందర్భంలో వ్రాసిన కవిత్వమైనా, తెలంగాణ ఉద్యమం గురించిన కవిత్వమైనా అంతా అందులో భాగమే. విస్తరణే కానీ ముగింపులేని మహాకావ్యం అది. మొత్తంగా ఈదేశ రాజకీయార్థిక చరిత్ర పరిణామాలకు రన్నింగ్ కామెంట్రీ నాగొడవ.

## I

మానవ ప్రపంచమంతా నేను, నీవు, వాళ్ళు అని మూడు పురుషలుగా కుదించబడి చెప్పబడుతున్నది. ఈ మూడు పురుషలుగా విభక్తమైన మనుషుల మధ్య సంబంధాలలో వైశిష్ట్యతను నిశితంగా గమనించిన కాళోజి ఆ వైవిధ్యాన్నంతా తన కవిత్వంలో ప్రదర్శిం చాడు. నేను గొప్ప అనే అహం ఆధిక్యత నీవు తక్కువ అని తీసి పారేసే అధమ సంస్కృతి జీవితంలో ఎలా వ్యాపించి వున్నాయో 'నా ఇజం' అనే ఖండికలో వ్యంగ్యంగా సూచించాడు.

'నాకందినదినాది
నాకందనిది మనది" (14) అని మానవస్వభావంలోని స్వార్థాన్ని, స్వప్రయోజనాన్ని అతిసహజంగా, ఆలవోకగా చూపాడు. అవకాశాన్నిబట్టి ఒకే నేను ఒక సమయంలో హిట్లరుగానూ మరొక సమయంలో గాంధీగానూ ప్రవర్తించగల మానవ మనస్తత్వాన్ని 'నరుడనేను నరుడనేను' కవితలో వ్యాఖ్యానించాడు.

**ఇచ్చయే నా ఈశ్వరుడని**
**ఖచ్చితముగా నమ్ముతాను**
**ఇచ్చవచ్చినట్లు నేను ఆచరించి తీరుతాను.**
**గడిచినదేదియు తలవను**
**నడిచేదానికి వగవను**
**ఒరగనున్న దిదియదియని**
**ఊహాగానము చేయను**
**సంతసముగ జీవింపగ**
**సతతము యత్నింతుగాని**
**ఎంతటి సౌఖ్యానికైన**

ఇతరుల పీడింపలేను- కాళోజి 'నేను' యొక్క అచ్చమైన తత్వమిది. ఎప్పటికి తోచినట్లు అప్పుడు ప్రవర్తించటం, తన ఇచ్ఛ ఇతరులకు పీడకాకుండా జాగ్రత్తపడటం 'అహం' యొక్క ఉత్తమత్వం. గతానికి భవిష్యత్తుకు వారధిగా వుండే వర్తమానమే 'నేను' అంటూ "నేను ప్రస్తుతాన్ని" అనే కవితలో నేను యొక్క నిత్యత్వాన్ని ప్రతిపాదించాడు. నేనులోని 'అహం' అతి అయి దురహంకారంగా మారితే ప్రమాదకరమన్న 'ఎరుక'ను నేను నా అవసరాలు కవితలో ప్రదర్శించాడు.

ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం, ఇచ్ఛానువర్తనం- నేనుకు పరిపూర్ణ జీవితానందాన్ని ప్రసాదిస్తాయని కాళోజి నమ్మకం. ప్రతి నేనూ తన జీవించే హక్కును ఆచరణలోకి తెచ్చుకొనే క్రమంలో 'నీవు'గా తన ఎదుట తత్కాలంలో వున్న వ్యక్తికి, 'వాడు'గా స్థలాంతరాలలో, కాలాంతరాలలో వుండే వ్యక్తికీ కూడా వుండే హక్కుల గురించిన స్పృహతోనే వుండాలన్న కాళోజి అవగాహన ఆయన కవిత్వమంతా పరుచుకొనివుంది. నీవు, నేను, వాడు ఈ మూడు పురుషల మధ్య భేదం పాటించరాదని, అద్వైతమే అసలు వాస్తవమని అద్వైతం కవితలో చెప్పనే చెప్పాడు.

కాళోజి వ్యక్తులకు ఎంత అభిమానించాడో, వ్యక్తిత్వాల పట్ల గౌర వాన్ని, ఆరాధనను ఎంతగా కనబరిచాడో వ్యక్తుల ప్రవర్తనలు దృక్పథాలు నచ్చకపోతే అంతగా విమర్శించాడు కూడా. వ్యక్తులను అభినందిస్తూనో, అభిశంసిస్తూనో ఆయన వ్రాసిన కవితలు యాభైకి పైగా వున్నాయి. వ్యక్తుల గురించి వ్రాసినట్లున్నా, వ్యక్తిని సంబోధిస్తున్నట్లు వ్రాసినా ఆయావ్యక్తుల విలక్షణతను చెప్పటంతో పాటు సమకాలీన రాజకీయార్థిక భాషాసాహిత్య సాంస్కృతిక అంశాల మీద వాళ్ళను కేంద్రంగా చేసి వెలుగులను ప్రసరింపచేయటం ఆ కవితల విశిష్టత. వ్యక్తుల గురించి వ్రాసిన కవితలలో గాంధీ గురించి వ్రాసినవి ఎక్కువ. ఆ తరువాత శ్రీశ్రీ గురించి వ్రాశాడు.

గాంధీ గురించిన మొదటి కవిత గాంధీ మరణించిన వెంటనే వ్రాసింది. అప్పటికే కాళోజి కాంగ్రెస్ గాంధేయమార్గం తప్పి నడుస్తున్న వైనం కనిపెట్టాడు. కొత్తగా అధికారం లోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం గాంధీ నీతిని, సత్యాహింసల వారసత్వాన్ని ముందుకు తీసుకొని పోతుం దన్న నమ్మకం ఆయనకు ఏమాత్రం లేదు. దానినే అత్యంత తిరస్కృత





వాచ్యధ్వనితో కవిత్వం చేశాడు కాళోజీ. గాంధీ మరణానంతరం వరంగల్లులో గాంధీ జయంతి సభలో (2-10-1948) ఆయన వినిపించిన 'వసుధవీడ' అన్న కవిత అదే.

**'మారునది మారుస్తా**
**పరివర్తన పరుస్తా**
**ననుచుండిన**
**వ్యర్థజీవి**
**వసుధవీడ**
**వదిలెపీడ" -**
**"స్వార్థం**
**జీవితసారం**
**ప్రాణికాధారం**
**లేని సంసారం**
**గొప్పదనిచాటేడి**
**అలౌకికుడంతమగుట**
**అదృష్టం" -**

'వసుధవీడ' కవితలో ఈ రెండు భాగాలు కీలకమైనవి. మార్పును కోరేవాళ్ళు మార్పుకోసం పనిచేసేవాళ్ళు లోకం దృష్టిలో వ్యర్థజీవులు. స్వార్థం లేని సంసారం గొప్పదనేవాడు లౌకికదృష్టిలేనివాడు. గాంధీ మనుషుల్లో సత్యాహింసలకై మార్పును కోరాడు - కనుక వ్యర్థజీవి. స్వార్థం వదులుకోమన్నాడు. కనుక లౌక్యం తెలియనివాళ్ళు. అలాంటి వాళ్ళకు లోకంలో తావులేదు. లోకానికి ఆదర్శం ఏ గాంధీ అని చెప్తున్నామో ఆ గాంధీ ఆదర్శాన్ని అందిపుచ్చుకోలేని స్వార్థశక్తులు విజృంభిస్తుంటే చూచి ఒళ్ళుమండిన కాళోజి గాంధీ మరణాన్ని పీడవదలటంగా, అదృష్టంగా వాచ్యం చేశాడు. మార్పుకు వ్యతిరేకులు స్వార్థపర శక్తులు అయిన వాళ్ళ దృష్టిలో గాంధీ మరణం ఒక పెద్ద అడ్డు తొలగటం. వాళ్ళకోణాన్ని వ్యంగ్యమానం చేసి ఈ కవితలో కాళోజి ఆనాడే గాంధీపట్ల అపచారానికి దిగిన దేశీయుల నిస్సిగ్గుతనాన్ని గురించి హెచ్చరించాడు.

గాంధీని సంబోధిస్తూ 1963లో, 1965లో కాళోజి వ్రాసిన రెండు కవితలు పేర్కొనదగినవి. గాంధీ స్వయంగా తన రాజకీయ వారసుడుగా పేర్కొన్న నెహ్రూ పాలనలో నీతి, నిజాయితీ, న్యాయం, సత్యం, అహింస మొదలైన గాంధేయ విలువలు అభావమై పోతుంటే విలవిలలాడిన కాళోజి 'నీవారసు రాజ్యంలో నీతికి తావేది బాపు? / నీ మాటలు విని ప్రాణము నిలుపుకొనేదెట్లు బాపు' అని ప్రశ్నిస్తాడు. గాంధీ బొమ్మకు పటం గట్టి వ్రేలాడదీసి, గాంధీ టోపీని కాంగ్రెసు రాజకీయాలకు గుర్తును చేసి, గాంధీ బోధించిన విలువలను సౌకర్యవంతంగా మరిచిపోయిన జాతి ఆత్మన్యూనతను ఆధిక్యంగా మార్చుకొని అధికారం చెలాయిస్తూ కాలం గడుపుతున్న తీరును "ఇంకేమి కావలె? ఇంకేమి చేయాలె / బ్రతికి నన్నాళ్లు నిను బాపు అని పిలిచితిమి / చచ్చిపోయిన నిన్ను జాతిపిత జేసితిమి" అన్న మాటలలో వ్యక్తం చేశాడు. 'పెక్కుభంగుల నిన్ను చెక్కి నిలవేసితిమి' అన్న మాటల ద్వారా గాంధీ జీవిత తత్వాన్ని జాతిమంత్రంగా మార్చుకొనే కార్యక్రమ మేదీ లేక విగ్రహ ప్రతిష్ఠాపనలకు పరిమితమైన జాతి ఆత్మవంచనా లక్షణాన్ని ఎత్తిచూపాడు. నీపేరుతో టోపి నిత్యమైపోయినది' అన్న ఒక్కమాటలో ఎదుటవారిని ముంచివేసే దుర్మార్గవైఖరే రాజకీయమై కొనసాగుతున్న వైనాన్ని సూచించాడు.

గాంధీ జయంతి ఉత్సవాలకు, వర్ధంతి సంస్మరణలకు పరిమితమైపోయిన ప్రభుత్వ విధానాలపట్ల నిరసనతో 'పుట్టిన గిట్టిన దినాలు' కవిత వ్రాశాడు. సూత్రప్రాయంగా ఈ కవితలో చెప్పినదానికి విస్తరణ రూపాలు జయంతి సందర్భంగానూ, వర్ధంతి సందర్భం గానూ వ్రాసిన మరొక రెండు కవితలు.

**నీ మాటను పాటించే**
**మాటే యీనాడు లేదు**

**........................**

**నీ అడుగుజాడ, నీచేతలు**
**నీ మాటలు, నీ వలెనే**
**మటుమాయం అయినయంటే**

నమ్ముతావో? లేదో?- అని గాంధీని ఉద్దేశించి గాంధీ సిద్ధాంతాలను గాంధీ మరణంతోనే వదిలేసిన అధికార రాజకీయాల మీద నిరంతర విమర్శ పెట్టాడు కాళోజి. ఆరకంగా గాంధీని కేంద్రంగా చేసి వ్రాసిన కవిత్వం అంతా వ్యవస్థపై విమర్శే అయింది. కాళోజి గాంధేయవాది. గాంధేయవాదులైన వావిలాల, టంగుటూరి, జాకిరు హుసేన్‌లపై గౌరవంతో కవితలు వ్రాశాడు.

1939లో ఇస్లహత్ పేరున నిజాం ప్రభుత్వం అమలులోకి తెచ్చిన రాజ్యాంగ సంస్కరణల వల్ల హైదరాబాద్ సంస్థానంలో వృత్తుల ప్రాతిపదికన ఎన్నికలు జరిగాయి. అసెంబ్లీకి బాధ్యత వహించని ఈ ప్రతినిధుల సభ ప్రజాస్వామ్య వ్యతిరేకమైందని స్టేట్ కాంగ్రెస్ బహిష్కరించింది. కాళోజి ఆ మార్గంలోనే దానిని విమర్శిస్తూ ఇస్లహత్ ఎందులకు? అని కవిత వ్రాశాడు. ఆ సభకు వివిధ వర్గాలకు ప్రతినిధులుగా ఎన్నికయిన బలదేవ్ పతంగే, పింగిలి వెంకట్రాంరెడ్డి, జస్టిస్ లక్ష్మారెడ్డి ఈ ముగ్గురిని సంబోధిస్తూ వాళ్లు నిజాం అసెంబ్లీకి వెళ్ళటాన్ని నిరసిస్తూ కవితలు వ్రాశాడు. వ్యక్తులపై విమర్శ, హెచ్చరిక రెండూ ఈ కవితల్లో కనిపిస్తాయి. అదే సమయంలో నిజాం ప్రభుత్వ రాజ్యాంగ సంస్కరణల బోలుతనాన్ని, మాయను ఈ కవితలు విప్పిచెప్పాయి.

మర్రిచెన్నారెడ్డి, జలగం వెంగళ్రావు, పి.వి. నరసింహారావు, ఇందిరా గాంధీ వంటి వారిమీద వ్రాసిన కవితలు వారు ముఖ్యమంత్రులుగా, ప్రధానమంత్రులుగా కాంగ్రెసు పార్టీ రాజకీయ విధానాలకు బాధ్యులుగా - దేశరాజకీయాలలో నిర్వహించిన పాత్రను, ప్రవర్తించిన తీరును విమర్శకుపెడుతూ వ్రాసినవి.

బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి, జమలాపురం కేశవరావు, చెరుకు కాంతయ్య, జగన్నాథం, సర్వోత్తమరావు, దుర్గన్న, దాశరథి, సినారె, మాడపాటి, వెంకట్రాంరెడ్డి, వేణుముద్దల, కోదాటి, గద్దర్ మొదలైన వాళ్ళమీద వ్రాసిన కవితలు తెలంగాణ సాంఘిక రాజకీయ సాంస్కృతిక చరిత్రను వివరిస్తాయి. వ్యాఖ్యానిస్తాయి.

## II

వ్యక్తుల దగ్గర ప్రారంభమైనా వ్యవస్థ వైపు నిశితమైన చూపును ప్రసరించే లక్షణమున్న కాళోజి వ్యవస్థనే కేంద్రంగా చేసుకొన్నప్పుడు కవిత్వం మరింత పదునెక్కటం సహజం. కులమత సాంఘిక రాజ్య వ్యవస్థలు ఎన్ని వున్నా కాళోజి కవిత్వం ప్రధానంగా రాజ్యం మీదకే ఎక్కుపెట్టబడింది. కాళోజి ఆకాంక్షించేది ప్రజాస్వామ్యరాజ్యం. 'ప్రజాస్వామ్య మంటే' ఏమిటో ఆయన కవిత రూపంలో వివరించాడు.

**"......................**
**......................**
**సౌజన్యాలకు రక్ష**
**సామరస్యాలకు రక్ష**
**సహకారాలకు రక్ష**
**సహజీవనానికి రక్ష**
**......................**
**మానవత్వానికి మనుగడ**
**దానవత్వానికి ఎదదడ**
**గుందాతనానికి దగడు**
**గూడుపుతానికి బెగడు**



**కుట్రదారులకు హడలు**
**......................**
**శాసనబద్ధ వ్యవస్థ**
**స్వైరవిహారునకవస్థ!**
**......................**
**ఆతతాయి సంహరణ**
**అనామకుని సంరక్షణ**
**న్యాయవర్తనులకు హామీ**
**......................**
**పనిదొంగల కాటకట్టు**
**పనిదొరకాయువుపట్టు**
**సంరక్షిత పౌరమతము**
**స్వాంతంత్రమునకు హితము**
**హక్కుల కాపాడు కోట**
**మక్కువ వికసించుతోట**
**నెయ్యము పెంచెడి మడి**
**నీతులు నేర్పెడి బడి**
**ఆర్ద్రత ఆరని తడి"**
**అమ్మకడుపు దాచిన ఒడి**

ప్రజాస్వామ్యం గురించి కాళోజి ఇచ్చిన ఈ వివరణలు ఆవిధమైన వ్యవస్థ పట్ల ఆయన ప్రేమాభిమానాలను, సంపూర్ణ విశ్వాసాన్ని వ్యక్తం చేస్తాయి. ప్రజాస్వామ్యమంటే ప్రభుత్వాన్ని ఎన్నుకొనటానికి ప్రజలకు అధికారమున్న వ్యవస్థ. ప్రజలకు అందుకు వున్న సాధనం ఓటు. ఓటును వెయ్యటమంటే వివేకాన్ని ఉపయోగించటం. వివేకులయిన వాళ్ళు పౌరులు. పౌరులకు బాధ్యత వహించవలసిన ప్రభుత్వం. ప్రజాస్వామ్యం పట్ల విశ్వాసం, గౌరవం వున్న పౌరుడు కనుకనే కాళోజి కవిత్వమంతా ఓటును, పౌరులను, ప్రభుత్వాన్ని సంబోధిస్తుంది. ప్రజాస్వామ్యం గురించి ఇంతగా తపనపడిన కవి మరొకడు కనిపించడు.

'ఓటిచ్చునప్పుడే ఉండాలె బుద్ధి' అని 1947నుండి చెప్తూనే వున్నాడు కాళోజి.

**"అభ్యర్థులై ఓటులడిగేటివారు**
**ఏమేమి జేసిరో ఎటువంటివారో?**
**పురుషులెవ్వారు కాపురుషులెవ్వారు**
**గుర్తించి ఓటులను గురిపింపవలయు**
**ప్రాణతుల్యము ప్రజాస్వామ్యమున ఓటు"-**

అంటాడాయన. (నాగొడవ, 25) ఈ గ్రహింపులేక పొరపాటుగనో గ్రహపాటుగనో అలవాటుగనో ఓట్లేసేవారు ప్రభుత్వాలు తమ సంక్షేమమే పట్టించుకోకపోవటంతో నెత్తిబాదుకొనే ప్రమాదంలో పడిన వైనాన్ని ఓటరు కాపన్నా కవితలో (89) ఎత్తిచూపాడు. ఓట్లను దండుకోనటానికి ఎన్ని కుతంత్రాలకైనా దిగి, ఎంత అధికార దుర్వినియోగమైనా చేయటానికి సిద్ధపడే పార్టీలను, అభ్యర్ధులను

**"రాజ్యాంగమున కనుగుణ్యాశీలముతో**





**రాణించి ఓటులను నాటనీయండి**
**స్వచ్ఛంద శక్తితో కురిసిన ఓట్ల**
**స్వారస్యమొకసారి ఒలకనీయండి"** అని అభ్యర్థించాడు. (90) ఓటు వినియోగం ఒక ఉన్నత ప్రజాస్వామిక విలువగా కాక, ప్రజాస్వామిక విలువల నిలుపుదలకు కాక డబ్బుకు తదితర ప్రలోభాలకు అమ్ముడు పోయే వస్తువై అన్యాయాల అక్రమాల చలామణికి చట్టబద్ధ అనుమతినిచ్చే స్థాయికి దిగినందుకు ఆవేదనపడుతూ 'ఓటెవరికి' అనే కవిత వ్రాశాడు.

"ప్రజాస్వామ్య అంత్యక్రియల
సామగ్రియ మనవోటు" (125) అనే పంక్తులు ఆయన ఆవేదన తీవ్రతను చూపుతాయి.

'ప్రజాస్వామ్య పద్ధతిలో సక్రమ పరిపాలనకు
ఓటరు జాగ్రత్త ఆత్మ" (140) అని ఎన్నిక సంరంభం కవితలో చెప్పాడు. నేతాగిరి లూటీలో వాటాకోరే ఓటరు వోటు దొంగకే పడుతుందని కాళోజీకి తెలుసు. అలాంటి వోటర్లను ఏవగించుకొన్నాడు. నేతాగిరి లూటీలో వాటాలేని ప్రజాస్వామ్య పరాభవం సహించని, పెత్తందారీ తనాన్ని ఎదిరించే పౌరులుగా తమశక్తి తెలిసి ఓటు వేసే - ఓటర్ల కోసం కలగన్నాడు. స్వాభిమానాన్ని కోల్పోయి ఓటును చౌక చేసేవారిని పౌరులుగా గుర్తించలేకపోయాడు. వాళ్ళు 'పోరలు' మాత్రమే నన్నది అతని దృష్టి. 'పోరనివా? పౌరునివా' అన్న ప్రశ్న వాళ్ళమీదికి సంధిస్తాడు. అట్లాగే ఓటర్లమతమేమిటో... తెలుసుకొనక ప్రవర్తించే, ప్రకటనలు చేసే శాసనసభ్యుల పనితీరు ప్రజాస్వామ్యబద్ధం కాదని నిష్కర్షగా చెప్పాడు (361) పౌరులు బాధ్యతగా ఓటువేయటం, ఓట్ల ద్వారా ఎన్నికైన ప్రతినిధులు ప్రజలకు బాధ్యులుగా వుండటం అనే అతిసాధారణమైన ప్రజాస్వామిక సూత్రాన్ని నమ్మి దానికొక జీవితవాస్తవం చేసుకోవాలని పౌరులను, ప్రజా ప్రతినిధులను ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూ వచ్చిన కవి పౌరుడు కాళోజి.

బ్రిటిషు వలసపాలన నుండి స్వాతంత్ర్యం పొందాక అధికారం చేపట్టిన కాంగ్రెస్ పార్టీ ఏర్పరచిన దేశీయ ప్రభుత్వపు గతితప్పిన నడకను కాళోజి తొలినాళ్ళలోనే గుర్తించి విమర్శకు పెట్టాడు. ఆ క్రమంలో వ్రాసిన వ్యంగ్య కవిత "రఘుపతిరాఘవ.." (72) స్వాతంత్ర్యం వచ్చిన పన్నెండేళ్ళకు 1959లో ఆయన వ్రాసిన కవిత ఇది. పాలక ప్రభుత్వపు నిస్సిగ్గుతనాన్ని చెప్పటానికి ఈ కవితలో కాళోజి ప్రయోగించిన శిల్పం గొప్పది. పాలకుల ముఖంగానే వాళ్ళ వ్యవహార సరళిని చెప్పించటం ఒక వ్యూహం అయితే ఏ గాంధీ వారసులుగా గద్దెకెక్కిందో ఆ ప్రభుత్వం ఆ గాంధీ మార్గాన్నే వదిలి చాలాదూరం వెళ్ళిందని చెప్పటానికి గాంధీకి ఇష్టమైన 'రఘుపతిరాఘవ రాజారాం' భజన పద్ధతిలో కవితను ప్రారంభించటం మరొక శిల్పం.

**'రఘుపతిరాఘవ రాజారాం**
**రాంత్రోవకు రానేరాం**
**పతితపావన సీతారాం**
**పతితుల మార్గాన్నే పోతాం"** - అని ప్రారంభమైన కవిత పతితుల మార్గంలో వాళ్ళెంత దూరంపోయారో చూపటంగా విస్తరించింది. కాంగ్రెసు ప్రభుత్వ అవినీతి అక్రమాలకు తెల్లటోపి శ్రీరామ రక్ష' అయిన స్థితిని (136) మరొక ఏడేళ్ళకు 1966లో ఎండగట్టాడు కాళోజి 'శ్రీరామరక్ష' కవితలో- ఈ క్రమంలోనే 1968 నాటికి



**"దోపిడి దౌర్జన్యానికి కారకులగు**
**దుష్టుల దొంగల ముఠాల**
**రక్షించెడి అధినేతల**
**అసహ్యించి, కసిబూని**
**రూపుమాపు ధీమాతో**
**బ్రతుకదలచినట్టి మనిషి బ్రతుకు**
**తిరుగుబాటు"** (172) అన్న అవగాహనకు వచ్చాడు. ఇక అక్కడి నుండి కవిత్వాన్ని సాయుధం చేశాడు కాళోజి.

అధికృతహింస, ప్రతిహింస అన్న భావనలను కవిత్వంలోకి ప్రవేశపెట్టి ప్రచారం కల్పించాడు. "తిరుగబడమంటే తప్పా" కవితతో (173) 1971లో అందుకు ప్రారంభం చేశాడు.

**"........................**
**ప్రతిహింస తప్పెట్లనో చెప్పు**
**హిరణ్య కశ్యపుని పొట్టచీల్చి**
**నరసింహుడు చేసిందే ప్రతిహింస**
**నువ్వు చేస్తున్నది**
**హిరణ్యకశ్యపుని అధికృతహింస**
**.........................."** అని ప్రభుత్వానికి మొహం మీద గుద్దిచెప్పాడు కాళోజి.

"మేటి బలగాల అధికృత హింసబాప
కోటి చేతులు ప్రతిహింసబూనవలయు" అని విప్లవవహ్ని (180, 181) కవితలో పిలుపునిచ్చాడు. "మానవుని జన్మహక్కు మర్యాదను కపాడగ"... ప్రతిహింస అవసరమే నన్నది కాళోజి భావన. ప్రతిహింసను చేపట్టిన నరులను నరసింహులుగా సంభావించాడు. సంబోధించాడు.

"అధికృతహింసాకాండే
పరిపాలన అయినపుడు
ప్రతిహింస తప్పదు..." (182) అని ప్రకటించాడు.

ఇదంతా ప్రజాస్వామ్యం పట్ల, ప్రజాస్వామిక విలువల పట్ల కాళోజికి వున్న కామన పరిణామమే. ఫలితమే.




## III

జీవితంలోని, మానవ ప్రవృత్తులలోని వైరుధ్యాలను గుర్తించటంలో కాళోజీది చురుకైన చూపు. కలిమిలేములు, మంచిచెడులు, భావభౌతికాలు, అమాయక చాతుర్యాలు ఇలాంటి ద్వంద్వాలు, ద్వంద్వాల మధ్య వైరుధ్యం కాళోజి కవితలలో చక్కగా ఒదిగిపోయి జీవితాన్ని వ్యాఖ్యానిస్తాయి.

'కలిమిలేమి చేత వెలయు గాదె లోకము

మంచిచెడ్డ జంట పేర్ల మాయలోకము" - అని ప్రారంభమయ్యే లోకం (3) అనే కవితలో

**"కలిమిగల్గువాని తప్పుగనక లోకము**
**వానికెపుడు బ్రహ్మరథము బట్టులోకము**
**పేదపైన లేని తప్పు బెట్టిలోకము**
**ఎచట నెత్తిగొట్టి నిల్వనీదులోకము"**

అన్న పంక్తులలో కలిమిలేముల మధ్య వైరుధ్యం, కలిమి లేములను బట్టి తప్పొప్పులను నిర్ధారణకు ఎలా దారితీస్తుందో సరళసుందరంగా చెప్పాడు కాళోజీ. ప్రపం చమే ఒక వైరుధ్యాల పుట్ట అని ప్రపంచం కవితలో చెప్పాడు. పారదోలితే పైబడటం, కోరితే కొమ్మెక్కటం, వద్దంటే మెడకు బడటం, కావాలంటే తప్పుకోవటం- ఇవన్నీ ప్రపంచ వర్తనంలో వైరుధ్యాలు. సమరం శాంతి, ప్రేమ ద్వేషం, నీతిఅవినీతులు, సక్రమ అక్రమాలు మొద లైన పరస్పర విరుద్ధశక్తుల సంఘర్షణలో ప్రపంచ మనుగడ సాగుతున్నది - ఈ వైరుధ్యాలకు పరాకాష్ఠ "మనుజుల చేతనె మనెడు ప్రపంచము

మానవునే మననీదు ప్రపంచము" అన్న ముగింపు.

ద్వైతజగత్తు, దెబెలదౌర్భాగ్యం - ఈ రెండు కవితల్లోను కాళోజి మనుషులలోని రెండువర్గాల గురించి వారి మధ్య వైరుధ్యాల గురించి ఎరుక పరుస్తాడు. "కుటిలమతులు దేబె మొగాలు / జగతిలో రెండే రెండు రకాలు" అని చెప్పి కాళోజి

"లోకమెపుడు చతురునిదే సొత్తు

లేదమాయకున కందుల పొత్తు" - వైరుధ్యాల తీవ్రతను వక్కాణిం చాడు (12) కుటిలమతుల ధిక్కరించు పటుత్వం లేని... దేబెల దౌర్భాగ్యం గురించి మాట్లాడే నోరు కాళోజి కవిత్వం. (81)

**"రాగవైరాగ్యాల సాగరము మనసు**
**ప్రేమవైషమ్యాల పీఠంబు మనసు**
**దాతృత్వలోభత్వ ధామంబు మనసు**
**కారుణ్య కాఠిన్య కందంబు మనసు**
**ధీరుత్వ భీరుత్వ లేశంబు మనసు**
**వైరుధ్య భావాల - వసతి యీ మనసు...."**



***కాళోజి కవిత్వబీజం దుఃఖం. దుఃఖం జీవలక్షణం. పుట్టగానే శిశువు ఏడిస్తేనే బ్రతుకువున్నట్లు. దుఃఖం మనిషి లక్షణం. సాటిమనిషి కష్టం పట్ల సానుభూతి, సహానుభూతి మనిషిని మనిషిగా నిలబెట్టేగుణాలు. మనిషి మనిషిగా మనగలగటం కాళోజి కామన.***



అని మనసులోని వైరుధ్యాల గురించి చెప్పిన (56) కాళోజి మంచి చెడు మనిషిలోని వైరుధ్యాలని 'మనిషి' కవితలో సూచిస్తాడు.

**అన్నపురాసులు ఒకచోట**
**ఆకలిమంటలు ఒకచోట**
**హంసతూలిక లొకచోట**
**అలసిన దేహాలొకచోట**
**సంపదలన్నీ యొకచోట**
**గంపెడు బలగం బొకచోట**
**వాసననూనియలొకచోట**
**మాసిన తలలింకొకచోట**

........................ ఈరకంగా అవకాశాలకు, అవసరాలకు మధ్య వైరుధ్యం గురించి అనేక ఉదాహరణలతో ఉపమలతో చెప్పి వర్గవైరుధ్యాల మూలం వైపుకు మన చూపును మళ్ళించి నిలబెడతాడు కాళోజి వ్యత్యాసాలు కవితలో (5)

'భావుకత' కవిత ఈ కోవలో చెప్పుకోదగింది. భావభౌతికతలు ద్వంద్వాలు. భావుకత లేకుంటే బ్రతుకు బండబారుతుంది అని చెప్తూనే ఐనా భావుకత సంజీవిని వంటిదే / ఆహారం మాత్రం కాదు / మూర్ఛిల్లిన యోధుణ్ణి లేపి యుద్ధం చేయిస్తుందది / పూట పూటకు పుట్టుకొచ్చే ఆకలిని తీర్చే అన్నం కాదది" - అంటాడు. ఆకలి భౌతికం. దాన్ని తీర్చే ఆహారం భౌతికం. అదే జీవితానికి పునాది అని సూచించి భావుకత శిఖరం, పరమావధి అనటం ద్వారా దానిని ఉపరితలాంశంగా సంభావిం చినట్లయిది. పునాది భౌతికం - ఉపరితలంలో భావం, భావుకత.

ద్వంద్వాల గురించి, వాటిలోని వైరుధ్యాన్ని గురించి కాళోజీ ఈవిధంగా వ్రాసిన వివిధ కవితలు ఆయన లోకజ్ఞతకు ఆనవాళ్ళు. పాఠకులకు శాస్త్రీయమైన అవగాహనను అందించేవి.

## IV

కాళోజి కవిత్వబీజం దుఃఖం. దుఃఖం జీవలక్షణం. పుట్టగానే శిశువు ఏడిస్తేనే బ్రతుకువున్నట్లు. దుఃఖం మనిషి లక్షణం. సాటిమనిషి కష్టం పట్ల సానుభూతి, సహానుభూతి మనిషిని మనిషిగా నిలబెట్టేగుణాలు. మనిషి మనిషిగా మనగలగటం కాళోజి కామన. అందుకే ఆయన దుః ఖాన్ని వరించాడు. దుఃఖాన్ని కవితావస్తువుగా చేసుకొన్నాడు. కవిత్వాన్ని మానవీయం చేశాడు. 'కన్నీటిలో ఎన్నెన్నో కలవు' అన్న కవితలో (28) కన్నీరులో రకరకాల మనుషులు, సమూహాల జీవనవ్యథలు కనబడ తాయని పెద్ద జాబితానే ఇచ్చాడు కాళోజీ. మసిబారిన మనసులు, కసితీరని వ్యక్తులు, విసుగెత్తిన జీవులు, పీడలు, అవమానాలు, బాధలు, భయాలు, ఇలా ఎన్నో కన్నీటికి మూలమైనవి వున్నాయి. 'కన్నీటిలో ఎన్నెన్నో కలవు' అన్న కవిత మొదటి పాదానికి వివరణగా తరువాతి భాగం ఈవిధమైన దుఃఖమూలాలను సూచించటంగా సాగుతుంది. 'కన్నీటిని గనకన్నులు కలవు' అన్న రెండవ పాదం కన్నులున్నదె కన్నీటిని చూడటానికే అని చెప్తున్నది. కన్నీటిని చూడటం అంటే కన్నీటికి కారణమైన వాటిని చూడగలగటం. కన్నీరు వ్యక్తికి సంబంధించిందే అయినా కన్నీటికి కారణమైన శక్తులు సామాజికమైనవి. వ్యక్తుల దుఃఖాన్ని తీర్చాలంటే వ్యవస్థ వైపు దృష్టి సారించాల్సిందేమరి.

'కన్నీటిలో ఎన్నెన్నో కలవు / కన్నీటిని గన కన్నులు కలవు' అని కన్నీరు కార్చే మనుషులవైపు మన కళ్ళను విప్పమని చెప్పిన కాళోజి





కన్నీటిని చూచి కదిలి కరగకపోతే బ్రతుకు విలువే తెలియదంటాడు 'నరుడనేను, నరుడనేను...' అనే కవితలో.

**"చెమ్మగిలని కనులు బ్రతుకు**
**కమ్మదనము చాటలేవు**
**చెమ్మగిలని కనులు బ్రతుకు**
**కమ్మదనము చూడలేవు"**– (30) బ్రతుకు మర్మం, మాధుర్యం అర్థం చేసుకొనటానికైనా, అర్థం చేయించటానికైనా ప్రాథమిక అర్హత కన్నులు చెమ్మగిల్లటం. బ్రతుకులోని కష్టసుఖాల పట్ల సంవేదనాశీలి అయి స్పందించగల మనిషికే కన్నీళ్ళు వస్తాయి. కనుకనే కాళోజి కన్నీటిని కౌగిలించుకొన్నాడు. సానెగురూజీ వ్రాసిన మరాఠీ కవితను 'అశ్రువులు' అనే శీర్షికతో కాళోజి అనువదించటం ఇందులో భాగమే.

**"అశ్రువులు నన్నెపుడు ఆదుకొని వుండాలె**
**అశ్రువు లేనట్టి అసువులేలా నాకు**
**కన్నీటి కొరకునే**
**నెన్నైన వదలెదను**
**కన్నీరు కలదేని**
**ఎన్నైన వున్నట్లే**
**కన్నీరు పులకించు**
**కన్నీరు నవ్వించు**
**కన్నీరు బ్రదికించు**
**కన్నీరు కదలించు..."** అనే ఈ కవిత కన్నీటి గురించిన కాళోజి తాత్త్వికతకు అద్దం పడుతుంది. కన్నీరు మనిషిని మనిషిగా నిలబెట్టే జీవలక్షణం. కదిలేది కదిలించేది కన్నీరు. క్రౌంచపక్షి కన్నీరు వాల్మీకిని కవిని చేస్తే మానవులు రకరకాల సమస్యలతో వేదనలతో కారుస్తున్న కన్నీరు కాళోజిని తనవేపే చూడమని, లోతు కనుక్కోమని సవాలు చేసి సమరానికి పిలిచి కవిని చేసింది. అందుకే కాళోజి కవిత్వం లోకపు దుఃఖం మీద చేసిన యుద్ధారావం. లోకపు దుఃఖాన్ని తన దుఃఖంగా మార్చుకొన్న 'నాగొడవ'.

## V





ప్రజాస్వామ్య హక్కుల చైతన్యంలో భాగంగానే కాళోజి ఆత్మగౌరవ చైతన్యాన్ని కూడా కనబరుస్తూ వచ్చాడు. నిజాం పాలనలో మాతృభాషకు, దేశీయ ఆహార్యానికి పరాయీకరింపబడిన తెలుగువాళ్ళ ప్రతినిధిగా భాషాసాంస్కృతిక దాస్యాన్ని నిరసిస్తూ కవిత్వం వ్రాసినప్పుడయినా, (1942) విశాలాంధ్రలో తెలంగాణ ప్రతినిధిగా ప్రాంతీయ వివక్షతకు వ్యతిరేకంగా గొంతెత్తి ప్రత్యేక తెలంగాణ (1969) కోసం నినదిస్తూ కవిత్వం వ్రాసినప్పుడయినా ఆయన కనబరిచింది ఆత్మగౌరవ చైతన్యమే.

**"నీవేషభాషలను నిర్లక్ష్యముగ జూచు**
**భావదాస్యం బెపుడు బాసిపోవునురా**
**నీభాషయందును నీవేషమందును**
**స్వాభిమానముడిగిన చవటవీవేరా? (5)**
**........................................"** అని 1942లో కాళోజి స్వాభిమాన ప్రకటన చేసింది ఆంధ్రుడిగా.

రెండున్నర జిల్లాలదె
దండిబాస అని అంటవ
తక్కినోళ్ళ నోళ్ళయాస
త్రొక్కిపెట్టవలెనంటవ (357) అని నిలదీసింది తెలంగాణవాదిగా. ఈ రెండింటి మధ్య వైరుధ్యాన్ని భిన్నకాలాలలో, భిన్న సందర్భాలలో భిన్న సంబంధాలలో మనిషికి వుండే భిన్న అస్తిత్వాలకు సంబంధించినదిగా గుర్తించవచ్చు. స్వతంత్ర భారత ప్రభుత్వంలో విశాలాంధ్రలో కాళోజి అచ్చమైన తెలంగాణ అస్తిత్వచైతన్యమూర్తి. తెలంగాణ ప్రాంత రాజకీయార్థిక సాంస్కృతిక ప్రయోజనాలకు భంగకరమైన ఆలోచనలను, ప్రవర్తనలను, పార్టీల, ప్రభుత్వ విధానాలను తీవ్రస్వరంతో వ్యతిరేకించిన ఉద్యమకేతనం కాళోజి. 1969 తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ సందర్భంగా ఆయన వ్రాసిన కవిత్వం అందుకు నిదర్శనం. కోస్తా తెలంగాణ ప్రజల అన్నదమ్ముల సంబంధంలో అన్నల అహంకారం – తమ్ముళ్ళను దగా చేయటానికే ఉపకరించిందని అంటాడు కాళోజి. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు తెలంగాణ ప్రజల ఆకాంక్ష అయితే తెలంగాణ ఏర్పాటు ఆత్మహత్యా సదృశమని, శాంతికి, సమైక్యతకు భంగమని – ఆనాడు వచ్చిన వాదనలన్నిటిని తన కవిత్వంలో తిప్పి కొట్టాడు కాళోజి. "రాజ్యాల విభజనకు, రాష్ట్రాల ఏర్పాటుకు రాజ్యాంగం ఒప్పుకున్నది, పార్లమెంటు



మెప్పు న్నది..." (340) అని పదేపదే చెప్తూ కాళోజి తెలంగాణ రాష్ట్ర ఆకాంక్ష రాజ్యాంగబద్ధమైన దేనని నొక్కిచెప్పాడు.

**కోటిన్నర మేటి ప్రజల**

**గొంతొక్కటి గోడొక్కటి**

**తెలంగాణ వెలిసి నిలిచి**

**ఫలించాలె భారతాన....** " (354, 355, 363) అన్న ఒక్క ఆశయం కోసం అనేక కవితలు వ్రాశాడు. ఆశయసిద్ధికి అడ్డుపడుతున్న వ్యక్తులను, రాష్ట్ర కేంద్ర ప్రజాప్రతి నిధులను, మంత్రులను, ముఖ్యమంత్రి ప్రధానమంత్రులను - మొత్తంగా కాంగ్రెస్ పార్టీ విధానాలను, కార్యకలాపాలను, కప్పదాట్లను ఎండగడుతూ విస్తృతంగా కవిత్వం వ్రాశాడు.

**"బ్రతుకు తెరువులన్నిమూసి**

**ప్రజల బానిసగ జూస్తె**

**పరిణామము తిరుగుబాటు"** (407) అని తెలంగాణ ఉద్యమం ఆర్థిక కోణాన్ని ఆవిష్కరించాడు.

సమైక్యాంధ్ర నినాదాలు - దోపిళ్ళకు రహదార్లు మూసిపోతే ఎట్లాగన్న గజదొంగల బెదద మాత్రమేనని కూడా గుర్తించి చెప్పాడు (397) కోస్తాంధ్ర దోపిడి నుండి విముక్తికై నిర్మించబడిన తెలంగాణ రాష్ట్ర ఉద్యమం దోపిడికి ఎప్పుడూ వ్యతిరేకంగానే వుండాలని కాళోజి ఆశించాడు.

**"దోపిడి చేసే ప్రాంతేతరులను**

**దూరందాకా తన్ని తరుముతం**

**ప్రాంతంవాడే దోపిడిచేస్తే**

**ప్రాణంతోనే పాతరవేస్తాం" (366)** అని తీవ్రస్వరంతో హెచ్చరిక జారీ చేసాడు. ప్రజాస్వామిక తెలంగాణ ఆకాంక్ష స్వభావం ఇది.

అయితే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును సమర్థిస్తూ కాళోజి చేసిన వాదనలు, విమర్శలు ఏవీ కొంచెం కూడా ఈ నలభై ఏళ్ళ కాలపు పార్లమెంటరీ ప్రజాస్వామ్య సంస్కారాన్ని మార్చలేకపోవటం పెద్ద చారిత్రక విషాదం. సమకాలీన తెలంగాణ రాష్ట్రోద్యమం మళ్ళీ మళ్ళీ ఆనాటి కాళోజి వాదనలనే చెవిటివాని ముందు శంఖం వూదినట్లు వినిపించాల్సి వచ్చిందంటే అది పార్లమెంటరీ రాజకీయాలలో కరుదు కట్టిన అప్రజాస్వామిక ధోరణి కారణంగానే. ఆనాడు తెలంగాణ వివాదంలో బలమైన స్వరంగా నిలబడిన కాళోజి కవిత్వం ఈనాడు తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి శక్తిమంతమైన నినాదమై అందివచ్చింది. ప్రపంచ చరిత్రలో అధికారపు కోటగోడలు నేలకూలుతున్న దృశ్యాలను చూస్తూ (16) గోడలు కూలగొట్టటమే పనిగా జీవితమంతా బ్రతకదలచిన పోరు / సుతరాం తప్పదు (36) అనుకొంటూ పోరుబాట నడిచిన కాళోజి 'అక్షరం'గా కూడా గోడలు కూలగొట్టటానికి అందివచ్చిన ఆయుధమే అయినాడు.



***నాయకుడు కావలసిన వ్యక్తి అదృష్టవశాత్తు కవియైనాడు" అంటాడు దేవులపల్లి రామానుజరావు కాళోజి గురించి. (426) అధికారం ఏరూపంలో వున్నా సహించలేక పోవటం, అధికారంలో తనను తాను ఐక్యం చేసుకోకపోవటం కాళోజి జీవలక్షణం. అందువల్ల నాయకుడు కాలేదు. కాదలచుకోలేదు. ప్రజాస్వామ్య రాజకీయాలు ఆదర్శంగా జీవితమంతా రాజకీయకార్యకర్తవలె, హక్కుల కార్యకర్తవలె బ్రతికాడు. అక్రమంలో కవిత్వాన్ని ఒక ఆయుధంగా మలుచుకొన్నాడు.***



## VI

"నాయకుడు కావలసిన వ్యక్తి అదృష్టవశాత్తు కవియైనాడు" అంటాడు దేవులపల్లి రామానుజరావు కాళోజి గురించి. (426) అధికారం ఏరూపంలో వున్నా సహించలేక పోవటం, అధికారంలో తనను తాను ఐక్యం చేసుకోకపోవటం కాళోజి జీవలక్షణం. అందువల్ల నాయకుడు కాలేదు. కాదలచుకోలేదు. ప్రజాస్వామ్య రాజకీయాలు ఆదర్శంగా జీవితమంతా రాజకీయకార్యకర్తవలె, హక్కుల కార్యకర్తవలె బ్రతికాడు. ఆక్రమంలో కవిత్వాన్ని ఒక ఆయుధంగా మలుచుకొన్నాడు. అది తెలుగుజాతి అదృష్టం. నలభైఏళ్ళ ఆంధ్రప్రదేశ్ సామాజిక రాజకీయ ఉద్యమాల చరిత్రను వ్యక్తుల పేర్లతో సహా, సందర్భాలతో సహా విమర్శనాత్మకంగా నమోదు చేసిన కవి కాళోజి. కాంగ్రెస్ రాజకీయాల మీద ఇంత తీవ్రమైన విమర్శపెట్టటం ఒక కాళోజికి, ఒక రావిశాస్త్రికి మాత్రమే సాధ్యమైంది.

ఈ పదును కారణంగానే కాళోజికి వేమనతో పోలిక. పలుకుబళ్ళ భాషను కవిత్వభాషగా మలచటంలో మౌఖికత జీవలక్షణమైన గేయఛందస్సును తరచు ఉపయో గించుకొనటంలో, తర్కానికి ప్రాధాన్యత నీయటంలో గురజాడతో పోలిక. (XVII, XXII) కవిత్వానికి ప్రాణమైన భావుకత కాళోజిలో స్వల్పం. కవిత్వాన్ని కళారూపంగా ఆయన సాధన చేయలేదు. (XXVIII, XXIX) నిజమే కావచ్చు. కానీ గొప్పకవిని అనిపించు కోవాలన్నది కాళోజి లక్ష్యమే కాదు అని మనం గమనించాలి. తాను చెప్పే కవిత్వంలో 'తనగొడవ' వుండాలన్నదే కాళోజి దృష్టి. "కవిత్వం నా గొడవ - దాంట్లో కవిత్వం వుంటే మంచిదే" అని కాళోజి కవిత్వంలో కవిత్వాన్ని ద్వితీయాంశం, అనుబంధాంశం చేశాడు. అలాగని అందులో కవిత్వం లేదని అర్థంకాదు. కవిత్వాడంబరం లేదంతే (421).

ఎదమెదడుల కలయికతో పదంపదం కదంత్రొక్క

ఆవేశము, ఆలోచన అద్వైతస్థాయి వెలయ

కైతేర్పడు,.......... (80) అని కాళోజి కవిత్వానికిచ్చిన నిర్వచనం ఆయన కవిత్వానికి అనువర్తింప చేసుకొనవలసిన విలువ.

కవిత్వానికి ముఖ్యలక్షణమైన వ్యంగ్యం కాళోజి కవిత్వ గుణం. అసమ్మతి - నిరసన - ధిక్కారం ఇవే నా గొడవ లక్షణాలయినప్పుడు - వ్యంగ్యం అనివార్యంగా అంతర్వాహిని అవుతుంది. భుక్తిమార్గకీర్తన (71) మనభూతం (116) గొర్రెదాటు (147) దాసుల ఘోషణ (319) మొదలైన కవితలు ఇందుకు నిదర్శనాలు. కవితలో ఏ రెండు మూడు పంక్తుల్లోనో గాఢత, వ్యంగ్యం మెరుపువలె మెరిసిన సందర్భాలు అనేకం వున్నా కాళోజి ఆద్యంతాలలో విస్తరింప చేసిన వ్యంగ్యం ఈ కవితలలో ప్రత్యేకత.

'భుక్తిమార్గకీర్తన' శీర్షికయే వ్యంగ్యాత్మకం. భక్తిమార్గం ప్రచారంలో 'కీర్తన' ఒక మౌఖిక సాహిత్యసంగీత సమ్మిళిత ప్రక్రియ. భక్తి మార్గ ప్రయాణం కాదిప్పుడు లోకంలో వున్నది. భుక్తిమార్గం. కడుపునింపుకొనే



కార్యక్రమం. సర్వం భోజ్యం లక్ష్యంగా వికృతరూపం దాల్చిన అధికార తత్వం. దీనికి సాధనం 'ప్రజాసేవ' కావటం విషాదం. 'ప్రజాసేవ', రాజకీయ రంగప్రవేశం, ఓట్లసమీకరణ తంత్రాలు, కుతంత్రాలు ఇవన్నీ భుక్తిమార్గంలో మజిలీలు. వాటిని కీర్తించటం కొరకే కవిత. అందువల్ల ఇది భుక్తిమార్గకీర్తన అయింది. నిజంగా కవి దానిని కీర్తించటమే ఉద్దేశించాడా అంటే కాదు. నిరసించటాన్ని ఉద్దేశించాడు. దానిని వాచ్యంగా కాక వ్యంగ్యంగా చెప్పాడు.

**'ప్రజాసేవన్నపేర బ్రతకండీ, తిన్నంగ మీరు**

**ప్రజల సొత్తును మీదెయనుకోండి**

**సులభమైన భుక్తిమార్గము**

**సులువుగా పైకొచ్చు మార్గం"** అని మొదలయ్యే ఈ కవిత 'ప్రజాసేవకులుగా చలామణి అవుతున్నవాళ్ళను ప్రత్యక్షంగా సంబోధిస్తుంది. ప్రజాసేవ అంటే 'అక్షరాలు నేర్వకుండనె / లక్షలను గడియించుమార్గం".... పైరవీలకు సుగమమార్గము / పదవులను ఇప్పించుమార్గము".... "చిల్లిగవ్వచేతలేకనె / చల్లగా బ్రతికేటి మార్గము"..."పరువు మర్యాదలతో గూడిన / బ్రతుకు తెరువు వున్న మార్గము"... అని వరుసగా చెప్పుకొంటూ పోతాడు. ప్రజాసేవ పేరుమీద జరిగే స్వంతలాభపు పనులు చేయండి అని ప్రజాసేవకులను ఉద్దేశించి చెప్పటం వాళ్ళు చేస్తున్న పనుల మీద అసహ్యాన్ని కలిగించటానికి. వాళ్ళను వెక్కిరించటానికే. ప్రజా సేవకులను మధ్యమ పురుషలో సంబోధిస్తూ ముఖం పట్టుకొని కడిగిపారేసిన కవిత ఇది.

ఈవిధమైన ప్రజాసేవకుల మనుగడకు అవకాశమిస్తున్న ప్రజల అల్పబుద్ధులను కూడా వదిలి పెట్టలేదు కాళోజీ. 'దాసుల ఘోషణ' కవితలో ప్రజల బానిస మనస్తత్వాన్ని ఉత్తమ పురుషలో బట్టబయలు చేస్తాడు.

**"దొంగల దొరలని ఊరేగిస్తం**

**ఓట్లేస్తం ఓట్లను వేయిస్తం**

**గద్దెక్కించి జైజై అంటాం**

**పబ్బతి పడతం బాంచెను అంటం"....**

అని ప్రారంభమవుతుంది ఈ కవిత. 'దాస్యం బ్రతుక్కి వనరను కుంటం" - అన్న మాటలలో దాస్యం జీవన మార్గంగా కీర్తించుకొనే అధమస్థితికి చేరిన జనంపట్ల ఆగ్రహమే వుంది. బానిసలుగ బ్రతుకుతున్న ప్రజల ముఖంగానే అసహ్యకరమైన ఆత్మవంచనారూప మైన బానిస విధానాలను అవసరంగానో, అక్కరకో అవలంబిస్తూపోతున్న తీరును చెప్పించటం ద్వారా బానిసబ్రతుకు లక్షణం, దౌర్భాగ్యం తెలిసి దాని నుండి విముక్తులు కావలసింది బానిసలేనని ధ్వనింపచేశాడు కాళోజీ. ఆరకంగా ఈ రెండు కవితలకు ప్రాణశక్తి అత్యంత తిరస్కృత వాచ్యధ్వని అవుతున్నది.

గొర్రెదాటు పూర్తిగా అన్యాపదేశ కవిత. గొర్రె గురించి చెప్తున్న ట్లుసాగే ఈ కవిత మరొక అంతరువులో పౌరుడి గురించి - పౌరుడుగా వివేక విహీనుడై తిరుగుతన్న పౌరుడి గురించి చెప్తుంది.

**'దగాగడ్డి కరుస్తాంది గొర్రె'**

**వగలగాలి పీలుస్తాంది గొర్రె**

**పగల నీళ్ళు తాగుతాంది గొర్రె**

**మందలబడి మురుస్తాంది గొర్రె.**

**అని పౌరజన వ్యక్తిత్వ రాహిత్యాన్ని సూచించాడు.**

**బళ్ళయాకరణం నెమరేస్తాంది గొర్రె**

**'ల' 'ర'ల భేదం గురితిస్తాంది గొర్రె**

**గొల్లన్నను గొర్రన్నను కుంటాంది గొర్రె..."**

అని పాలితులైన పౌరులు పాలకుల అదుపుచేసే స్వభావాన్ని, అధికార స్వభావాన్ని విస్మరించి నడవటాన్ని వ్యంగ్యమానం చేశాడు. గొల్లన్న మాయలో, ఆధారితజీవిగా మారిన గొర్రె ప్రపంచం ఎంత ఇరుకయిపోతుందో, గొర్రె అస్తిత్వం సమస్తం ఎలా అభావమవు తుందో ఈ కవితలో అంచెలంచెలుగా చెప్పుకొంటూపోయాడు కాళోజీ.

గొల్లన్న యాతనంతా తనకోసమే అనుకుంటాంది గొర్రె

గొల్లన్న కొలిచే మల్లన్న తానే అనుకుంటాంది గొర్రె

మోసంలో పడి మోచ్చం చూస్తాంది గొర్రె

మందలపడి మురుస్తాంది గొర్రె

తెగబలుస్తాంది గొర్రె" - బలిసే గొర్రె బలికాక తప్పదు, బలి కోసమే గొర్రెను బలిపించటం - ఆ వాస్తవం విస్మరించిన పౌరుడి గతి ఏమిటి?

**"గొల్లన్నే గొర్ల పాణాలు నిలుపుతాండనుకుంటాంది గొర్రె**

**గొల్లన్నపై పంచపానాలు నిలుపుకుంటాంది గొర్రె**

**గొల్లన్న పాదాలపడి పాణాలు వదలాలనుకుంటాంది గొర్రె"** అని చెప్పిన దానిని బట్టి పౌరుడిదీ అదేగతి అనుకోవచ్చు. "తలవంపుల్లో అడుగు జాడకంటుంది గొర్రె" అన్నప్పుడు తలవంచుకు నడిచే గొర్రెల చైతన్య రహితమంద ప్రవృత్తి అయిన గొర్రె దాటుతత్వం ధ్వనిస్తూనే వుంది.

ఈ రకంగా నీవు, నేను, వాడు అన్న మూడు పురుషలను సామాజిక రాజకీయార్థిక అసంగతాలను వ్యక్తీకరించటానికి సమర్థవంతంగా వాడుకొన్న కవితాశిల్పం కాళోజీది. నీనా భావనలేని మన భావనలోకి సమభావనలోకి ప్రవహించి (49) విశ్వమానవ సౌందర్యాన్ని దీప్తిమంతం చేయటం దాని ప్రయోజనం.

*(ప్రజాకవి కాళోజి సాహిత్య సమాలోచన- 2012)*



వేణు సంకోజు



# కాళోజీ అంటేనే కవితా కడలి... ప్రవహించే ధిక్కార శైలి!!

ధిక్కార స్వరానికీ, సత్య సమ్మతమైన ఉద్యమాల ఉనికికీ, అసలు-సిసలు చిరునామా కాళోజీ. కాలానికి నిలువెత్తు సాక్ష్యంగా నిలుస్తూ, తరం తర్వాత తరంతో ఎడతెగని సంభాషణ గావిస్తూనే వస్తాడతడు. నిజానికితడొక ప్రత్యక్షప్రమాణ వాదీ, అనునిత్య పోరుగామీ అవుతాడు. మానవాతిహాసానికి గల విశిష్టతను, గరిమనూ అవగతం గావిస్తూ తనదైన హేతుబద్ధంగా ఉద్యమశైలితో వచ్చి, యోచిస్తేనే సహిస్తాడు.

కాళోజీ కదలికలు, వ్యాఖ్యానాలన్నవి అసంబద్ధ- స్వీయ కపోల నిర్ణయాలు కావు. వ్యర్థ- చర్విత చర్వణాలంతకన్నా కావు. నూటికి నూరుపాళ్ళూ అవి నిష్ఠుర సత్యాలూ, నిస్సందేహంగా శాస్త్ర సమ్మతమైన తీర్మానాలే అయి తీరుతాయి. కాల పరీక్షకు నిలబడుతూ, విలోమ విలువలను పూర్వపక్షం చేస్తూ వస్తాయి. దేశీయ తాత్వికులే కాదు, అంతర్జాతీయ చింతనాపరులు అనేకులాతని ప్రతిపాదనల్లోనూ, ఎంచుకున్న మార్గాల్లోనూ నిరంతరం తచ్చాడుతూ వుంటారు. అతడిలో పరకాయప్రవేశం చేసినట్లుగానే తోస్తూ వుంటారు. మాట్లాడినా, కవిత చెప్పినా, సమీక్ష చేసినా, ఉపన్యసించినా, సర్వత్ర నూత్నత్వమే; నిర్మోహమాటత్వానికీ, నిక్కచ్చితనానికీ, కర్పూరమై కరిగిపోయేంతటి తన కారుణ్య హృదయావిష్కరణకు ఆస్పదమే. ఎంత ప్రయత్నించినప్పటికి కూడా ఆంగారం వంటి అతని సత్యాగ్రాహినికీ, తీవ్రాతితీవ్ర వేదనకూ- సమంగా నిలువ గలవారు మరెవ్వరూ వుండజాలరు- ఆతడే తప్ప.

## స్వేచ్ఛయే ఆతని ఆత్మీయ శ్వాస

ఉచ్ఛ్వాస నిశ్వాసలన్నవి అతనికి స్వేచ్ఛ ప్లస్ స్వేచ్ఛ తప్ప మరేమీ కావు. ఇతరమైన ప్రత్యామ్నాయాలన్నీ పనికిరాని మాయోపాయాలవుతాయి. తలకిందుల కామాలలో యిరుక్కుపోయిన స్వాతంత్ర్యాలూ, హక్కులన్నవి హుళక్కి అయిన విలువలు, అర్థరహిత ప్రయోజనాలేనని తేల్చేస్తాడు కాళోజీ. పామరులకొక దిక్కు, నిరంతర శ్రమజీవులకొక దిశ చూపని ప్రదేశాలు, ప్రభుత్వాలు- అభినవ నరక కూపాలు, రాక్షసుల మాయాద్వీపాలవుతాయతనికి. జనాభాలో అత్యల్ప శాతం ప్రజానీకమైనా సరే, ఆ కళ్ళతో, అనారోగ్యాలతో కునారిల్లిపోవడం కన్న దోజక్ (నరకం) మరేదీ వుండదు. మరణాన్ని మించిన కూపంలోకి జనావళిని తోయడం కన్న నికృష్ట పాలన ఎక్కడైనా, ఏదీ కూడా వుండదు, ఉండకూడదని కాళోజీ అల్టిమేటం. వ్యత్యాసాలకు మాత్రమే ఆస్పదమైన నేలల్ని- మృత్యుకీలల్ని మించిన తావులుగా భావిస్తా డందుకే.

## కవితా వస్తువులు- తాత్వికతలపారం

అనేకానేక సందర్భాలలో, తనదైన వాడీ- వేడీ శైలీ విలువలతోనూ, తీవ్రత చాటుతూనూ చేసిన రచనలు అత్యధికం కఠోర సత్యాలు. అవి చదువరుల మెదళ్ళ మొదళ్ళను తాక గల సూక్ష్మమూ- సూటియైన విషయాలు, వ్యంగ్యాత్మక- తాత్విక చిత్రీకరణలవుతాయి. అంతకన్న మిక్కిలిగా ఉటంకించతగ్గ విశేష రచనలై వ్యాపిస్తాయి. ప్రతిభావ్యుత్పత్తులతో ప్రకాశిస్తాయి. ఐతే కాళోజీ కవితలు- సింహభాగం ఉద్యమ కవితలు, నిరసనలు కాగా, మరికొన్ని రాజకీయార్థిక- సామాజిక- తాత్వికాంశాలను గూర్చి ప్రస్తావించిన గీతాలు, గేయాలు, భావజాలపరమైన ఉల్లేఖనలు, సాధికారికమైన స్వేచ్ఛా ప్రకటనలవుతాయి. ఇంతటి శక్తి సంపన్నమూ, సమధికోత్సాహపూరిత రచనలు, సాంద్రతర వ్యక్తీకరణలు- వాటి మూల్యాంకనలకు గూర్చి అనేకానేక వేదికల మీద, సంస్థల ద్వారా, శతజయంతి ఉత్సవాల్లో భాగంగా, చర్చలు, గోష్ఠులు, సెమినార్లు నిర్వహింపబడి, రచనలు గావించటమన్నది విధిగా జరిగి, వ్యాసాలు, ప్లస్ చిన్నవీ పెద్దవీ గ్రంథాలను వెలువరించే కృషి జరగవలసియున్నది. ఇవన్నీ ఎంత ఎక్కువగా జరిగితే అంత గొప్పగా కొత్త తరాలకు లబ్ధి చేకూరగలదు. రానున్న కాలాలకు కాళోజీ రచనల ఆస్తిపాస్తులు దక్కగలవు. అదొకవిధమైన విశ్వవ్యాప్త కృషికి ఆస్కారంగానూ నిలువగలదు.

శ్రమజీవుల పక్షపాతి కాళోజీ...

ఇరవయ్యవ శతాబ్దపు ప్రథమ పాదంలో, విరివిగా ప్రగతి కాముకలైన కవులు, రచయితలు ప్రపంచ వ్యాప్తంగానూ, మనదేశం

లోనూ శ్రామిక లోకాన్నీ, శ్రామిక జన కళ్యాణాన్నీ కీర్తిస్తూ, వారికి సంబంధించిన మహోత్కృష్ట రచనలు- మహాద్భుతంగా చేసియున్నారు. వారివారి తీరు- వ్యక్తీకరణలో వారి వారి స్థాయి విలువలతో అలరారుతుంది. అయితే, ఈ విషయంలో కాళోజీ శైలి, రచనావిధానం విభిన్నమైనది. రైతులోక బాంధవుడని ప్రత్యేకంగా కాళోజీని గురించి చెప్పవలసిన పనిలేదు. ఇందుకు ప్రబల సాక్ష్యం "కర్షకా" అనే కవితే. ఉటంకించవలసి వస్తే యావత్కవితను ఉటంకించి తీరవలసిందే. నర్తకుని నాట్యాలు, గాయకుని గానాలు, వాదితుల వాద్యాలు, శిల్పుల శిల్పాలాదిగా అనేకానేకాలు- "కర్షకా నీ కర్రు కదలినన్నాళ్ళే" అంటాడు సరే. ఆ తరువాత-

"ధాంబికుని ధ్యానాలు ఛాందసుని జాప్యాలు
తాత్వికుని తత్వాలు మాంత్రికుని మంత్రాలు
గురువుల గోష్ఠ్యాలు గుడుగుడు గుంచాలు
దేవుళ్ళ తిరునాళ్ళు దివ్య నదితీర్థాలు
కర్షకా! నీ కర్రు కదలినన్నాళ్ళే..."

అని అనగలిగినప్పుడే ఆ పంక్తుల్లో కాళోజీ ముద్ర అన్నది చోటు చేసుకుని వుంటుంది. ఎవరు ఎవరికి ఆధారభూతమౌతారో బహు బాగా ద్యోతకమౌతుంది.

## ఒక కంట కన్నీరు... మరో కంట అంగారం...

ఒక కంట కన్నీరు, మరో కంట అంగారం. కాళోజీ అంటేనే ఆద్యంతం అలుపెరుగని పోరాటం. అంతకన్న మిక్కిలి దయ, కరుణ, జాలి. ప్రాణాలకు తెగించి, ప్రజల పక్షాన నిలిచిన వారిని ఎంతగా అభిమానించి తలకెత్తుకుంటాడో, అంతకు రెట్టింపుగానన్నట్లు పేదల తరఫున వకాల్తా పుచ్చుకుని వాదిస్తాడు. కష్టజీవిదే రాజ్యాధికారం అవుతుందని తీర్మానిస్తాడు- కాళోజీ.

కాళోజీ ఏ కవిత రాసినా, ఎంతటి నైచ్యాన్ని ఎండగడుతూ వచ్చినా, అది అనితర సాధ్యంగానూ, ఆగి ఆలోచించవలసిందిగానూ ఉంటుంది. కాలగతి ఎట్లా గడిచినా, సామాన్యుల ఏడుపులో ఏ మార్పూ వుండదన్నది సుస్పష్టమౌతుంది.

"ఆ యేడు పోతేమి/ ఈ యేడు వస్తేమి
మన ఏడుపేదియో/ మన వెంటనే యుండు"నని తేల్చేస్తాడు.

ఆచరణ సాధ్యంకాని కొన్ని విషయాలను కూడ వ్యక్తంచేసే కాళోజీ



కవితోక్తులు కఠోర నిష్ఠురాలౌతాయి. "ఈ అలజడి కొన్నాళ్ళు లో-" నిలబెట్టిన విగ్రహాలు/ మార్చలేదు మన గ్రహాలు" అని గుర్తుచేస్తాడు. కావాల్సినవి విగ్రహాలు కాదు- సాధకులకు నిగ్రహాలంటూ ఎరుక జేస్తూ, సున్నితంగా మందలిస్తాడు.

## అనుభూతికి తావులేని అమరత్వం కోరడు...

సందర్భం ఎటువంటిదైనా, తన కవితాస్త్రాన్ని సంధించటంలో కాళోజీదొక అపూర్వమైన రీతి. సంప్రదాయాలు, ఉగాదుల వంటి పర్వదినాల మీద అగౌరవంతో కాదుగాని, ఆలోచించి చూడవలసిందే. స్పందించవలసిందేనన్న అభ్యర్థనతో కూడిన మందలింపుతో ముందుకొస్తాడతడు. కాలాన్ని కొలిచేందుకంటూ మానవాళి ఎంపిక చేసుకున్న వత్సరాలకు గల పేర్లలో గాడిద (ఖర) కూడ వొకటి కావటాన్ని శంకిస్తాడు. సదరు 'ఖర'కు, చాకలి మారుటేగాని, చాకిరైతే తప్పదనా..." అని వాకబు చేస్తాడు. అంతటితోనే ఆగకుండా- "మాదు పొట్టతోడ తిను గాడిద చాకిరి చేయగ/ తోకవూపి మూతినాకు తుచ్ఛులకే వైభవాలు" అంటూ పచ్చి నిజం చాటుతాడు; మనల ఖచ్చితంగా నిలిచేట్టు చేస్తాడు.

జీవిత మాసాంతం కాళోజీ-

"అనుభూతియె ఎరుగనట్టి/ అమరత్వము నేగోరను" అంటూ రావడమే కాదు, "తనివి లేని చవట బ్రతుకు/ ఘనమని భావించలేనో" అంటూ స్పష్టం చేశాడు. ఇంకాస్త విశదం కాను- "మన్ను కాని కాను నేను/ మనసువున్న మానవుడను...

నవ్వగలను ఏడ్వగలను/నరుడనేను నరుడ నేను"అంటూ సగర్వంగా చాటాడు.

మనిషిలోని రాక్షస పోకడలను, నియంతృత్వ ధోరణులను గూర్చి బహు వ్యంగ్యంగా ప్రస్తావించాడు కాళోజీ. అవేవో యితరులకు ఆపాదించేట్టుగా కాకుండా తనకే ఆపాదించుకుని చెప్పడమే యిక్కడ తీక్షణంగా ఆలోచించవలసిన విషయం. "నేను" అనే కవిత ఎంతగా తన మీద తాను వ్యంగ్యాత్మకంగా ఆపాదించుకున్న హిట్లరత్వం చూడండి-

"మంది తప్పులు ఏరి మనసు ఖాతా నింపి/వడ్డీ వడ్డీ కట్టి వల్లించుతాను నా తప్పులను దాచ నానా రకాలైన/ ధర్మ సూత్రాలతో దడి కట్టుతాను" అనటం తోనే ఆగిపోక- "వీలున్న ప్రతిచోట విఱ్ఱవీగుచు అపర/ హిట్లరౌతాను నే హిట్లరౌతాను" అంటున్నప్పుడు లోకపు వికారాలు బహు బాగా రూపు కడతాయి మన కళ్ళ ముందు, తదేకంగా జలదరిస్తున్నట్లుంది ఒళ్ళు.

మనిషిలోని నైచ్యాన్ని "మారు రూపాలు" అనే కవితలో-

"నీటిలోని కంపు నూనెలోని మడ్డి/ కూరలోని గడ్డి పాలలోని నీళ్ళు
మనిషిలోని కుళ్ళు మారు రూపాలు" అంటుంటే మన కుహనా ప్రపంచం మీద మనకు కలిగే జుగుప్స వర్ణనాతీతం కదా!

ఈ విషయాన్ని గురించి రాశాడు. ఆ విషయాన్ని పట్టించుకోలేదని- కాళోజీ రచనల విషయంలో చెప్పలేమేమో! లోకంలో కూడని ప్రతి వస్తువుతో, వ్యవస్థతో, తీరుతో, పన్నాగంతో 'గొడవ' పడ్డాడతడు. ప్రతి ఋతువునూ పట్టుకుని చూశాడు. ఎమర్జెన్సీని ఎదుర్కొన్నాడు. అనేకమందిని గురించి- మహాద్భుతమైన అంచనా యిచ్చాడు, మందిని (ముఖ్యంగా సామాన్యులను తక్కువ చేసినవారిని, తెలంగాణకు ద్రోహం తలపెట్టి/ ముంచగా చూసిన వారిని తూర్పారబడుతూ వచ్చాడు. దేని



**మనిషిలోని రాక్షస పోకడలను, నియంతృత్వ ధోరణులను గూర్చి బహు వ్యంగ్యంగా ప్రస్తావించాడు కాళోజీ. అవేవో యితరులకు ఆపాదించేట్టుగా కాకుండా తనకే ఆపాదించుకుని చెప్పడమే యిక్కడ తీక్షణంగా ఆలోచించవలసిన విషయం.**

విషయంలోనూ, 'ఎంతటి వారమో'నని విర్రవీగిన వారి అంతు కనుక్కోబోయినంత పని చేశాడు. 'మనిషి'ని తప్ప మరెవరినో తలకెత్తుకునే పని పెట్టుకోలేదు. కనుకనే అతడు కాళోజీ అయినాడు. పుట్టుక- చావులు మాత్రమే అతనివి కాగా, బతుకంతా లోకానిదయింది. "జరిగిందంతా చూస్తూ/ ఎరగనట్లు పడి ఉందుగ/ సాక్షీభూతుణ్ణిగాను" అని ఖరాకండిగ తేల్చి చెప్పినాడు గనుకనే సాక్షాత్తు మానవుడై నడయాడినాడు.

## వేరై కూడ... వీర తెలంగాణ!

కాళోజీ రాసిన తెలంగాణ ఉద్యమ కవితలు లభ్యమై అచ్చయినవే 87 ఉన్నాయి. ఇంత విరివిగా తెలంగాణను గురించి రాసిన కవితలు, ఆ కవి విషయంలో, యిన్నేసి (యింత పెద్ద సంఖ్యలో) వుండకపోవచ్చునేమో! 'ఎవరనుకున్నారు? ఇట్లేనని ఎవరనుకున్నారు' మొదలుకొని 'తెనుగునాడు మనది ఐననాడు" దాకా, కవితల కాన్వాసు చాలా పెద్దది. ఈ కోవకు చెందిన కవితల్లో "కూళ చేతిలో తాళపు చెవు"ల గురించి వుంటుంది.

" 'తుచ్ఛబుద్ధి' అయినోనికి/ మెచ్చి అధికారమిస్తే

దుర్వినియోగం చేయక/ నిర్వాకం చేస్తాడా?" అనడుగుతాడు.

'తెలంగాణ వేరైతే' అన్న కవితలో- "తెలంగాణ వేరైతే దేశానికి ఆపత్తా?/ తెలంగాణ వేరైతే/ తెలుగు బాస మరుస్తరా?" అనగటమే కాదు, "తెలంగాణ వేరైతే/ కిలోగ్రాము మారుతుందా" వంటి సహజ సాధారణమైన విషయాలు మొదలు- ప్రస్తుత పరిస్థితులకు బహు బాగా వర్తించేలా "తెలంగాణ వేరైతే/ చెలిమి తుట్టి పడుతుందారు/ వాన పడక వుంటుందా?/ చెలిమి లెండిపోతాయా?" అని నిలదీయటముంటుంది. ధర్మసాగరం వంటి జలాశయాలనంతగా సాగిన విధముంటుంది. "అయ్యయ్యో ఆంధ్రావని" అన్న కవితలో- విచిత్రపురి దాకా సాగిన చిత్ర- విచిత్రమైన దోపిడీ వర్ణితమవుతుంది.

'కనని కండ్లు వినని చెవులు/ గల ముల్కి మంత్రులేల" నంటూ సోకాల్డ్ అమాత్యవర్యుల అమ్ముడుబోయే తత్వాన్ని ఆనాడే ఎండగట్టాడు కాళోజీ. ఆపైన, ఆగ్రహంతో ఆకాశమంతెత్తుకు లేస్తూ- "ప్రాంతం వాడే దోపిడి చేస్తే" అన్న కవితకు 1969లోనే ప్రాణ ప్రతిష్ట చేశాడు.

"దోపిడి చేసే ప్రాంతేతరులను/ దూరందాకా తన్ని తరుముతం

ప్రాంతం వాడే దోపిడి చేస్తే/ ప్రాణంతోనే పాతర వేస్తం" అంటూ, బహిరంగ హెచ్చరికతో.

ఇక, "వీర తెలంగాణ నాది" అనే కవిత ఎటువంటి మొహమాటాలూ, భేషజాలకు తావివ్వక, ఖచ్చితంగా తెగతెంపులకు తోవ జూపినట్టిది. చూడండి-

"వీర తెలంగాణ నాది- వేరు తెలంగాణ నాది

వేరై కూడ తెలంగాణ- వీర తెలంగాణ ముమ్మాటికి..." అంటూ సాగిన ఈ గేయంలో దోస్తుగ వుండేవారితో మేమును- దోస్తీ చేస్తే ప్రాణం ఇస్తం.

'ఎంతకు అంత' అన్న నీతితో- చింతమాని బ్రతుకును సాగిస్తాం" అంటూ, యిచ్చిపుచ్చుకునే విధమైన ఒక ఎజెండాను సిద్ధంచేసి పెట్టాడు. రాజీలేని ప్రణాళికకు తావిచ్చి తీరాడు.

ఇంకో కవితలో (అప్పటికి తెలంగాణలో 9 జిల్లాలు)

"తొమ్మిది జిల్లాల ప్రజలు/ చేసిన పాపంబేమిటి?

తొమ్మిది జిల్లాల ప్రజల/ కోర్కెలో తప్పేమున్నది?

రాజ్యాలను విభజిస్తే/ రాజ్యాంగానికి లోపమా?

తొమ్మిది జిల్లాల ప్రజలు/ చేసిన పాపంబేమిటి?" అని ఆరా తీయబూనాడు.

ఆయా ప్రాంతాల వారికి తమపైన యాసలుంటాయి. జీవిక కోసం సాగే యానంలో అనేకానేక నానుడులు- ప్రాంతీయ వ్యక్తీకరణలు పుడుతుంటాయి, బహుళ ప్రచారం పొందుతుంటాయి. అవి కాలక్రమాన వారి- వారి భాషల్లో జీవయుతమైన పదాలై, పలుకుబడులై చేరిపోతుంటాయి. ఎప్పుడైనా, ఎక్కడైనా అది జరిగి తీరే సత్యమే. కాని, వాటిని కూడా ఎద్దేవా చేస్తూ, లేని ఆధిపత్యాన్ని ప్రదర్శించబోయే వారిని లెక్కపెట్టక, వొక్కటొక్కటిగా ఏకరువు పెడుతూ, తూర్పారపడుతూ వచ్చాడు కాళోజీ- ఈవిధంగా.

"సీరియలంటే తెలుగు/ సిల్సిల అంటే ఉరుదు

సాల్టు, షుగర్, టిఫిన్ తెనుగు/ షక్కర, నాష్టంటె కొంప మునుగు

'టీ' అంటే తేట తెనుగు/ 'చా' అంటే 'తౌరక్యము'

పోయినడంటే చావు/ తోలడమంటే పశువు

త్రోవంటె తప్పు తప్పు/దోవంటేనె దారి" అని మహ బాగా నిలదీశాడు.

తాము మాట్లాడేదేదో- ఏ భాషలోనో అనే స్పృహ అయినా లేకుండా, తాము మాట్లాడేదే చెల్లుబడి అయి తీరాలన్న అహంకారాన్ని అధిక్షేపించాడు కాళోజీ. యధేచ్ఛగా ఆంగ్ల భాష పదాల్ని, ఉర్దూ పదాల్ని కూడా, బహు విస్తృతంగా ఉపయోగిస్తూ, వారి రచనల్లో వాటికి మంచి చోటిస్తూ, అవి అన్య భాషా పదాలన్న యింగితం కూడా లేకుండా అహంకరించే తీరును, మకిలి మనస్తత్వాన్ని నేలకేసి కొట్టి తీరాడు. తాము ఉపయోగిస్తున్న పదాలు తెలుగువి కావని, అట్లా ఉపయోగించుకుంటూ రావడమన్నది కూడా ఆదాన ప్రదానాల్లో భాగం కావటం కూడ హర్షించవలసిన విషయమన్న ఔదార్యం కోల్పోయి, అవాకులు- చవాకులు ప్రేలినవారి నోళ్ళకు గట్టిగా సీళ్ళు వేసి నిలిచాడు. వాళ్ళ వలెనే చెప్పాలంటే, వారి 'గర్వం సర్వం ఖర్వం" చేసి నిలిచాడు.

ఎంతటి నిర్బంధాలైనా ఉద్యమాన్ని ఆపలేవన్నది కాళోజీ తీర్పు. అందుకనే యితే శీర్షికగా రాసిన ఒక కవితలో-

"ఛత్రి ఎత్తి పట్టి సంత/ వాన వరద ఆగదెపుడు

ఉప్పెన మాదిరి ఉద్యమ/ ముప్పెత్తున ఎగిసి పార





కట్టు కలువలె కాదు/ ఆనకట్టలును ఆగవు" అని ఖరాఖండిగా తేల్చేశాడు. అంతటితోనే ఆగకుండా, మంగళాశాసనంగా నన్నట్లు-

"ప్రత్యేక తెలంగాణ/ ప్రకటితమయ్యేదాక

తెలంగాణ ప్రజలు తమ/ ఉద్యమాన్ని నడుపుతారు" (ఎంతటి విశ్వాసమో చూడండి) 'కోటిన్నర మేటి ప్రజల (అప్పటికి తెలంగాణ జనాభా అది) గొంతొక్కటి గొడువొక్కటి" అంటూ అద్భుతంగా శుభా శంసకు చోటిచ్చాడు- "తెలంగాణ వెలసి నిలిచి/ ఫలించాలె భారతాన

భారతమాతాకీ జై/ తెలంగణ జిందాబాద్" అని నినదిస్తూ- ఇది కవి లక్షణమంటే; ఒక ప్రజాకవి యొక్క ప్రగాఢాకాంక్షకు ప్రత్యక్ష సాక్ష్యమంటే, అయితే, ఈ సందర్భంలో అక్కడి పెద్దాయన (?) వొకాయన, (అయినా కాకున్నా అట్లా అనిపించుకున్నాయన) తెలంగాణ ఉద్యమంలో "ప్రత్యేక తెలంగాణ" అంటేనే "దక్షిణ పాకిస్థానం" అనబూనటాన్ని అధిక్షేపిస్తూ, అహంకారపు మాయపొరను అమాంతం విప్పి చూపుతూ- "కలంగారడీ కాదా! కన్నీటి పాటగాడా!

కదుపుల్లో చిచ్చుపెట్టి కౌగిలించుకుంటావా?" అని నిలదీస్తూ,

"ప్రత్యేక తెలంగాణము- దక్షిణ పాకిస్థానము

అనుటలోని ఔచిత్య భంగమ్మును ఎరుగనీవు..."

(అట్లా) "అంటే ఆశ్చర్యమేమి లేదు కాని ఆపదుంది-"

"తెలుగు తల్లి పిల్లలమను మాట లోనె ముసలముంది

తెలుగు మాటలాడేటి వెలుగో పులుగోలంత జేరి

కలిసిమెలిసి బలిసి నిక్కి 'తెలుగేతరుల'ను తరుమ

తమ్మ్యాకాదామన్న తలపున్నది, ధ్వని వున్నది" అంటూ దుర్మార్గ పూరితమైన మార్మిక ఎజెండా ఎట్లా వుండగలదో ఏకరువు పెడుతూ, కిరాతకాలు- రాతలు కావు, కారాదన్న హెచ్చరిక జారీచేశాడు- 'కలంగారడీ కాదా' అని 1969లోనే నిలదీశాడు.

కాళోజీ మాటల్నే పునశ్చరణ చేసుకుంటూ, యింకా యికోరు తులు- కుట్రలు- కూటకాలను గురించి యేకరువు పెట్టాలె!

"దోపిడి చేసే ప్రాంతేతరులను/ దూరము దాకా తన్ని తరుముతం

ప్రాంతం వాడే దోపిడి చేస్తే/ ప్రాణంతోటే పాతర పెట్టం" అంటూ



తెగేసి తేల్చి చెప్పిన- కాళోజీ మాటల్నే పునః పునః ఉటంకించాలె!

## ఇరవయ్యవ శతాబ్దపు తిరుగుబాటు పురుషుడు...

20వ శతాబ్దపు తిరుగుబాటు పురుషుల్లో ఒకడుగా కాదు, ప్రముఖుడుగా పేర్కొన దగినవాడు కాళోజీ. విశేషణాల్లేని సామాన్యుడినే అక్కున చేర్చుకుంటూ, కడదాకా వారల కళ్యాణం కోరినవాడు. ఎవరి పక్షం వహించాల్నో సరిగా తేల్చుకున్నాడు గనుకనే బడి పలుకులు కాదని పలుకుబడులను కాపాడుకుంటూ వచ్చాడు. కవి కన్న ఉద్యమకారుడు, ఉద్యమకారుడైన కవిగా నిలుస్తూ వచ్చాడు, స్పష్టతతో, సమధర్మ- సమ న్యాయ పక్షపాతంతో రాసిన సృజనకారుడై గెలుస్తూ వచ్చాడు. ప్రజలను హింసించే ప్రభువులను ఈసడించుకుంటూ వచ్చి, శోషణను విరుద్ధంగా పరాక్రమిస్తూ వచ్చాడు. చెమ్మగిలిన కన్నులతో కమ్మలెన్నో చదువుతూ, కమ్మదనాన్ని కోల్పోయినవారి నిమ్మళమైన జీవితాలనాకాంక్షిస్తూ వచ్చినాడు. దేవులాటను తీర్చలేని దేవుళ్ళెంద రుంటేనేం?- 'అన్ని దుః ఖాలకు మూల బీజం' కాని దేవుడు కావాలన్నాడు.

కవితలు, గేయాలు, గీతాలు, కథలు, గల్పికలు, అనువాదాలు, వ్యాసాలు ఎన్నెన్నో ప్రక్రియలకు అవకాశమిచ్చుకున్న కాళోజీ, అన్నింటిలోనూ 'నేను' అనకుండా వుండాలని కోరుకోవటంతో బహుళ- బహుళంగా విస్తరించాడు. కనుకనే తనది "నిత్య నూత్న వికసిత జ్ఞానం"గా మలచుకొన్నాడు. 'కైత చేత మేల్కొల్పుకున్న/ కాళోజీ కామము చాలింక" అనే సాహసోపేతమైన నిర్ణయం తీసుకొన్నాడు. "సాగిపోవుటె బ్రతుకు/ ఆగిపోవుటె చావు" అంటూ కొత్త నిర్వచనమిచ్చి నిలిచాడు. తన "పరాయి తనం పోగొట్టే ఆర్ద్రత చెలిమి చెలిమెలో చిందునన్నాళ్ళు" తాను బ్రతికే వుంటానన్న మహాన్- ఆత్మవిశ్వాసాన్ని, సడలని సంకల్పాన్ని ప్రకటించు కున్నాడు.

"కైతం కథనం విశ్వశ్రేయం" కాగా, "ఔతల పని రాకాసి మాదిరిదే" కావటం మీద కస్సున లేచే వాడే కాళోజి. అతని దృష్టిలో దేవుడు, దేవతలు, రాక్షసులు ఎవరూ లేరు- ఉన్నది కేవలం మానవుడు- వాడే అంతాను."

ఆది, అంతం- బతుకు కొసలు రెండింటిలోనూ, మనిషిగా మనిషికి మంచిని చేయడం కోసమే తనువని ఎంచుతూ వచ్చి, అట్టి స్పృహకు, నిజాయితీకే పట్టం కట్టిన కాళోజీ అమరుడు. ఎద అంతటా, మది నిండా తెలంగాణమే తెగని బంధమని భావిస్తూ వచ్చి, యిక్కడి ప్రజలకు దక్కవలసినవన్ని దక్కితీరాలని; కనీస న్యాయం కరువు కారాదని కాంక్షిం చిన పరమ దయాళువు, హిరణ్య కశిపుని మీదికే దైవాన్ని రప్పించిన అపర ప్రహ్లాదుడు కాళోజీ.

"అన్యాయాన్నెదిరిస్తే 'నా గొడవ'కు- సంతృప్తి

అన్యాయం అంతరిస్తె 'నా గొడవ'కు ముక్తి-ప్రాప్తి

అన్యాయాన్నెదిరించినోడు నాకు ఆరాధ్యుడు" అని ప్రకటిస్తూ వచ్చిన చేవ, సాహసం, తెగింపు గల మహా గంభీర సామాన్యుడు కాళోజీ. అతని-

"నేనింకా 'నా' నుండి 'మా' దాకానే ఎదగలేదు

'మనం' అన్నప్పుడు కదా ముందడుగు" అన్న మాటల్నే ఉటంకిస్తూ, "జయహో కాళోజి!" అని సంస్మరిస్తూ...

*రచయిత సెల్: 99484 19881*






# "తెలియక ప్రేమ తెలిసి ద్వేషము"



"ఎంత బాగుందోయి పాట. కొంతసేపాగి, విని, మరి పోదామా?"

"నాకు విందామనే వుందికాని సమయానికక్కడ చేరకపోతే దయాదాక్షిణ్యం లేక దండన విధిస్తాడు ఆ యమధర్మరాజు తెలుసా?"

"ఆ భయం మనకు లేనిదెపుడు, వైతరణి దాటితే యమపురి ఎంత దూరం. కొంచెం తొందరగా నడిస్తే వేళ కందలేమా ఏమి?"

"సరే నీ యిష్టం కాని, పాశాల్లో జీవాలున్నావే, వెంట తీసుకొని ఎలా వెళ్ళడం గంధర్వుల గానం వినేటందుకు?"

'వానిని వైతరణీ తీరాన వదలేద్దాం. తిరుగుతాయి పాపం కొంచెం స్వేచ్ఛగా, ఎటైనా పారిపోతాయన్న భయమూ లేదు. మళ్ళీ ఎన్నాళ్ళకో స్వేచ్ఛ, తలచుకుంటాయి కూడానూ."

"నేను చెపుతాను లేవోయి కొంతసేపు కాగానే, నీవు నడుద్దూ ఈ పాశాన్ని నాదానితో పాటిక్కడ వదలి."

"సరే, నడువు అట్లాగయితే"

2

"ఇదేమిటి? ఇప్పటికి నేనొక్కడనే అనుకుంటున్నాను ఈ ప్రదేశంలో- కాని, మీరెవరో వున్నారే నాతోపాటు? మనమెక్కడ వున్నది మీకేమైనా తెలుసా?"

"నేను అదే ఆలోచిస్తున్నాను. ఈ ప్రదేశం నాకు కొత్తే. ఎక్కడున్నది ఏమి బోధపడడం లేదు కూడాను."

"సరే కాని, ఎక్కడివాడవు నాయనా నీవు?"

"అయ్యా, నేను భారతీయుడను."

"ఏమీ, భారతీయుడవా, నా తండ్రీ! మా దేశీయుడవేనా నీవు?"

"మహాభాగ్యం, మీరు భూలోక స్వర్గమగు భారతదేశం వారేనానండి?"

"అవును కాని, ఏ ప్రాంతం నాయనా నీది?"




"అయ్యా, నేను నిజాం రాష్ట్రంలోని తెలంగానా మనిషిని."

"ఏమిటి! ఏమంటివి! నిజాం రాష్ట్రంలోని తెలంగానా వాడవే? స్వదేశీయుడవే కాకుండా స్వప్రాంతీయుడవు కూడానా నాయనా? మరి, నీవు మాట్లాడే భాష ఏది. తండ్రీ, ఆ ప్రాంతంలో?"

"ఇంకేభాష మాట్లాడమంటారు మమ్మల్ని? మేము మాట్లాడేది అచ్చం తెలుగండి మహాప్రభో."

"ఏమి! ఏమి! తెలుగే. అట్లయితే నీవు నిజాం రాష్ట్రాంధ్ర సోదరుడవేనా తండ్రీ? అందుకే, నిన్ను చూడడంతోనే ఒక విధమైన సోదర ప్రేమ కలిగింది, నాయినా, అయితే ఇక్కడికెలా రావడమైంది, బాబూ?"

"ఏమోనండి, అదే బోధపడడం లేదు నాకూను. ఉదయం మా ఊళ్ళో జరిగిన కొట్లాటలో నా తలపైన దుడ్డుకఱ్ఱ పడ్డాక నాకు స్పృహ తప్పింది. తర్వాత ఏమి జరిగిందో తెలియదు. ఇప్పుడు చూస్తే ఇక్కడున్నాను"

"ఎంత చిత్రం, మీ ఊళ్ళో కూడా ఉదయం గోల జరిగిందా. మా ఊళ్ళో జరిగిందే నా తలపైన గొడ్డలి పడడం వరకు జ్ఞాపకం వుంది. తర్వాత ఏమి జరిగినదీ నాకు తెలియదు. ఇప్పుడు చూస్తే ఎక్కడున్నది బోధపడడం లేదు."

"సరే బాగానే వుంది. అయితే మీ ఊళ్ళో జరిగిన సంగతేమిటో చెప్పండి. నేను మా సంగతి చెపుతాను తర్వాత. చాలా అన్యాయంగా వుందండి కథ. ప్రపంచంలో దయ అనేది లేకపోవడం సత్యమని బోధపడుతుంది మీకే తర్వాత. మీరు కూడా నాతో మరియు నాతోటివారితో సహానుభూతి చూపక మానరు నా కథ విన్నాక."

"నా కథా అలాగే వుంది అబ్బాయి, ప్రపంచంలో ధర్మమనేది నాశనమయిపోతున్నది దినదినం. ఆచార వ్యవహారాలు మంటగలుస్తున్నాయి లోకంలో. మా ఊళ్ళో జరిగిన కథ చెప్పితే ఆశ్చర్యపడడమే కాకుండా నమ్మనైన నమ్మవేమో అని అనుమానిస్తున్నాను. అందుకే, నీవే నీ కథ మొదలు చెప్పితే బాగుంటుందని నా అభిప్రాయం."

"నిజమేనండి, ప్రపంచంలో మనుష్యత్వమే లేకుండా అయింది. ఏమి చెప్పేది మా ఊళ్ళో అవస్థ. ఏదో చెపుతాను వినండి. మా ఊళ్ళో ఒక దేవాలయం వుంది. అది మా ప్రాంతంలో చాలా పురాతనమైనది. ప్రసిద్ధికెక్కినది కూడాను. ప్రతి సంవత్సరము పెద్ద తీర్థం సాగుతుంది. ఈ ఏడు జాతర అప్పుడు దేవాలయం ప్రవేశ విషయంలో వచ్చింది తగాదా అస్పృశ్యులకు, సవర్ణ హిందువులకు, సవర్ణులలో కొందరు హరిజనుల పక్షం వహించి దేవాలయ ప్రవేశానికి సాయపడతాం అన్నారు. దాంట్లో ఒకరిద్దరు బ్రాహ్మణులు కూడా వుండడం తటస్థించింది. జాతరకంటె ఒకవారం ముందే హరిజనులందరు నిరసన వ్రతంతో దేవాలయ ప్రవేశ విషయమై సత్యాగ్రహం మొదలుపెట్టారు. బ్రాహ్మణులు, యితర హిందువులూ లాఠీలతో గుడిచుట్టూ కాపలా కాస్తున్నారు. ఈరోజు ఉదయం హరిజనులు కూడా సత్యాగ్రహానికి స్వస్తి చెప్పి జబర్దస్తీగా దేవాలయ ప్రవేశం చేద్దామని లాఠీలతో తయారైనారు. జరిగింది సవర్ణ అవర్ణ హిందువులకు లాఠీలతో సంగ్రామం."

"ఏమీ! నీవూ ఆ దేవాలయ ప్రవేశ సందర్భములోనే నెత్తి పగిలి స్పృహ దప్పిన మహావీరుడవా నాయనా? ధన్యుడవు. స్వర్గంలో ఇంద్ర వైభవము పొందగలవు. ధర్మ సంగ్రామంలో పాల్గొన్నవాడవు. పుణ్యాత్ముడవు. నీ తల పగులకొట్టిన ఆ పాపాత్ముడెవడు? వానికి నరకం తప్పునా? నేనూ ఆ ధర్మయుద్ధంలో పాల్గొన్న వీరుడనే తండ్రీ. ఇంతకూ, మనమిరువురము ఒక్క ఊరివారమే నాయనా, అయిన నిన్ను కొట్టిన ఆ దుర్మార్గుడెవడో జ్ఞాపకమున్నదా?"

"కష్టమన్నది తెలియక రోజు మూడుపూటలూ అన్యాయంగా మమ్మల్ని దోచుకొని తిని బాగా బలిసిన ఒక లావాటి బాపనయ్య, ప్రక్క నుండి, నా తలపై దుడ్డుకఱ్ఱ వేసాడు. అతనికీ తగిన శాస్తి అయిందనే నా అభిప్రాయం. మా వెంకడు అప్పుడే గొడ్డలితో అతని బుఱ్ఱపై కొట్టినట్లు చూడడం నాకు జ్ఞాపకం."

"ఓరి ముండా కొడుకా! మాదిగ వెధవవు ఇక్కడా దాపురించావు? పొద్దున్నే కసితీర లాఠీతో కొట్టి దేవాలయ ప్రవేశం కంటె మొదలు యమపురి ప్రవేశం చేయిస్తామని అనుకుంటే ఆ గొడ్డలి దెబ్బ నా తలపై పడడం చూసి తప్పించుకుపోయావు. కాని ఇప్పుడెటు పోతావురా? గొంతుక పిసికి పారేస్తాను చూడు."

"ఆ బాపనయ్యవు నీవేనా? బొర్రపై ఒక లాఠీ కొట్టానంటే నిన్న సంతర్పణలో తిన్న భక్ష్యాలన్నీ బయటపడాలే జాగ్రత్త నా మెడ పిసకడమంటే పిండాల కూడు పిసకడమ్మనుకున్నావా"

"అబ్బా! ఎంత తన్ను తన్నితివిరా?"

"అయ్యో చస్తి! చేతకాక కొడుతావటయ్యా! ఉండు నీ పని పట్టిస్తా"

"అబ్బా ఎంత గుద్దు గుద్దితివిరా పేగులు వెళ్ళేటట్టు తొక్కుతా నుండు."

"ఏడ్సావు బాపనయ్య కింద పడ్డా నాదే గెలుపంటావు. చూడు నీవు చేస్తానన్న పని నేనే చేస్తా."

"అయ్యో చస్తీ! చస్తీ! ఎవ్వరన్నా రక్షించండి బ్రాహ్మణ్ణి, చచ్చిపోతున్నాను పుణ్యానికి."

3

"అరే చాలురా పాట వినడం. నదీ తీరాన ఏవో కేకలు వినవస్తున్నాయి. ప్రాణాలను పాశాల్లోంచి వదలివచ్చాం. అలవాటు చొప్పున ఇక్కడా కొట్లాడుకుంటున్నాయో ఏమో"

"అవునురా ఈ కేకలక్కడివే. ఆ బ్రాహ్మణ మాదిగ పంచాయితేరా ఇక్కడ కూడా."

"నడువు మరి"

"మంచిది"





"........."

"........"

"వీరి కావరం మండా. ఇక్కడేదో పోనీ పాపమని కొంత స్వేచ్ఛ యిస్తే మళ్ళీ తన్నుకుంటున్నారేమిరా?"

"చచ్చి ఇంకా సరిగా పది గంటలు కాకపోయే. ద్వేషం అప్పుడే పోతుందా?"

"వీరి ద్వేషం చట్టుబండలు గాను. ఇదేం కావరంరా చచ్చినా ఈ మత పిచ్చి ఈ వర్ణ భేధ శతృత్వం పోలేదేం? యమపురిలో తీర్పు చెప్పిన తరువాత తెలుస్తుందిలే సంగతి."

"ఇంకా ఆలోచిస్తున్నావేమి నేను పాశంలో వేసుకొని నడవటానికి సిద్ధంగా వుంటే?"

"సరే నడువు నేనూ ఇదే బంధిస్తున్నాను ఈ బాపనయ్యను."

"తొందరగా నడవాలి టైము ఎంతో లేదు మనకు."

"నీవు కదిలేగా, మాటలతోనే సరిపోయె?"

"సరే నడువవోయి."

4

"ఏమి ఇతడు ఆ అమాయకులైన హరిజనులు దేవాలయ ప్రవేశం చేస్తామంటే అడ్డు పడడమే కాకుండా ఒక హరిజనుని కర్రతో బాది చంపినాడా?"

"అవును మహాప్రభో"

"ఏమోయి, మావాడు నీ విషయమై చెప్పేది నిజమేనా?"

"అయ్యా నిజమే కాని ధర్మ సంరక్షణ"

"నోరుమూయి, ధర్మాధర్మములు ధర్మరాజునైన నాకా నీవు చెప్పేది? ఒరే ఇతనిని పదిరోజులూ అగ్నిగుండంలో పడవేసి తరువాత కొచ్చిన్‌లోని ఒక పరయా (మాదిగ) కుటుంబంలో పడెయ్యి సుఖపడుతాడు. ధర్మం తెలుస్తుంది కూడాను."

'చిత్తం మహాప్రభో."

"అయ్యో అగ్నిగుండమా?మాదిగ జన్మమా? అన్యాయం! ఘోరం..."

"...."

"వీడెవడురా?"

"దేవాలయ ప్రవేశానికి లాఠీతో పోయి ఇప్పటి బాపనయ్యతో చంపబడ్డ హరిజనుడు"

"అట్లాగా... ఒరే నీవు మహాత్ముడు చెప్పిన అహింసా విధానం మాని లాఠీ సహాయమెందుకపేక్షించావు దేవాలయ ప్రవేశానికి?"

"ఎన్ని రోజులు ఊరికే ప్రయత్నించినా ఆ బాపనయ్యలకు దయ రాలేదు విసిగి వేసారి జబర్‌దస్తీకి దిగాం మహరాజా."

"అది తప్పే... ఒరే వీడిని రెండు రోజులుఆ మంచులో పడవెయ్యి కోపం అంతా పోయి శాంతమలవడుతుంది. మూడోరోజు తిరువాన్ కూరులో హరిజన కుటుంబంలోకి పంపించు."

"తెనుగు దేశంలో కాక మలయాళ దేశంలో ఎందుకు తండ్రీ జన్మం?"

"మళ్ళీ దేవాలయ ప్రవేశపు చిక్కులేకుండా. లేకపోతే ఏ బ్రాహ్మణుడి చేతనో తల పగుల కొట్టించుకొని చేరుకుంటావు నావద్దకు."

"మహాభాగ్యం."

*(కాళోజీ కథలు నుంచి)*

[illegible]



సామాజిక వ్యవస్థలో మార్పులు రావాలన్న తీవ్ర మైన తపనతో వేణు మాధవ్ రాసిన పుస్తక మిది. ఇన్‌హెరిటాన్స్ టాక్స్, డబ్బు, మహిళ, ఆహారం, ఆరోగ్యం, పర్యావరణం వంటి అంశాల్ని చర్చకు పెట్టారు. తనదైన స్వతంత్ర ఆలోచనా పద్ధతిని అనుసరించారు. ఆస్తి సంబంధాల్లో మార్పులు రావాలని, పన్ను విధానాల్లో సమూల మైన మార్పులు రావాలని ఆశిస్తూ ఈ పుస్తకాన్ని రచించారు.

కరెన్సీ నోట్లపై ఈ దేశపు మూలవాసుల నిజమైన జాతిపిత అంబేద్కర్ చిత్రపటాన్ని ముద్రించాలన్నది అతని డిమాండ్. మగపిల్లలయినా, ఆడపిల్లలయినా తల్లి ఇంటి పేరుతో గుర్తింపు పొందాలన్నది అతని ఆకాంక్ష.

అవినీతిని నిరోధించడానికి, సంపదల మీద అత్యాశను అడ్డుకోవడానికి ఇన్‌హెరిటాన్స్ టాక్స్‌ను విధించాలని వేణుమాధవ్ వాదిస్తారు.

ఆలోచనకు పురిగొల్పే అంశాలెన్నిటినో చర్చకు పెట్టిన ఈ పుస్తకాన్ని సామాజిక, రాజకీయ ఉద్యమాల్లో పాల్గొనేవారు, యువతీ యువకులు తప్పనిసరిగా చదవాలి.

**జీవితంలో భూమి, డబ్బు, మహిళ,**

**ఇన్‌హెరిటాన్స్ టాక్స్**

**వేణుమాధవ్. సి.హెచ్.ఎస్.**

పేజీలు: 132,

వెల: మహిళలకు రూ. 80/-

పురుషులకు రూ. 100/-

అంబటి సురేంద్ర రాజు



# తెలంగాణ గోరుకొయ్యలు

*"ఏడు రంగుల ఇంద్ర ధనుస్సు*
*మూడు కోట్ల మంది తొలి ఉషస్సు"*

అంటూ ప్రసిద్ధ గాయని విమల కాళోజీ మీద వ్రాసిన పాట కాళోజీని ప్రత్యూష వేళ నింగిన పొడిచే గోరు కొయ్యను, కొక్కొరొకో అని మేలుకొలిపే తొలికోడిని మన కళ్ళముందు నిలుపుతుంది. కాలజ్ఞాని కావడం మూలంగానే కాళోజీ తెలంగాణ రాష్ట్రం విశాలాంధ్రలో కలవకూడదని ఎలుగెత్తి చాటింపు వేశారు. బలవంతంగా కలిసిన తరువాత విడిపోవాలని 'యిడుపు కాయితాలు' సిద్ధం చేశారు. తెలంగాణ అంతకు మునుపు మాదిరే స్వతంత్ర రాష్ట్రంగా మనుగడ సాగించాలని మొట్టమొదట లోకానికి చెప్పిన ఖ్యాతి ఒక్క కాళోజీకే దక్కుతుంది. 1952లో ఉధృతంగా రేగిన 'గైర్ ముల్కీ గోబ్యాక్' ఉద్యమం కాళోజీని జాగృతం చేసింది.

'విశాలాంధ్ర'లో ప్రజా రాజ్యం ఏర్పడాలని పుచ్చలపల్లి సుందరయ్య పథకం రచిస్తే, దాశరథి శ్రీశ్రీలతో కలిసి వరంగల్ ఆకారం నర్సింగం తోటలో శ్రీశ్రీతో చేయి చేయి కలిపి విశాలాంధ్ర తీర్మానం చేసి, శ్రీశ్రీ పరిభాషలో రాళ్లు విసురుతున్న 'అఖిలాంధ్ర కవి'గా పేరొంది, అంతలోనే జ్ఞానోదయమై విశాలాంధ్ర బద్ధ విరోధిగా ఒంటిగా నిలిచిన ఖ్యాతి కూడా ఒక్క కాళోజీకే దక్కింది. 1952వ సంవత్సరం కాళోజీ ప్రాపంచిక దృక్పథాన్ని ఆవిధంగా మౌలికంగా మార్చివేసింది. ఆంధ్రోద్యమం వలన నాటుకొన్న అఖిలాంధ్ర భావనను పరిమార్చింది. కోదాటి నారాయణరావు వంటి ఎందరో తన సమకాలికులు, సన్నిహిత మిత్రులు, సహచరులు, ఆంధ్రోద్యమం మత్తులో నుంచి బయటపడ కుండానే కన్ను మూస్తే, కాళోజీ మాత్రం యాభై ఏండ్ల నాడే తెలంగాణ అస్తిత్వ సమస్యను మనసు మీదికి తీసుకొన్నారు. తాత్విక, సామాజిక, రాజకీయ స్పష్టతో వున్నందునే కాళోజీ తెలంగాణ మనిషి ఉనికిని కాపాడే అన్ని అంశాలను, ముఖ్యంగా భాషను, సంస్కృతిని, జీవన విధానాన్ని తన కవిత్వం నిండా చాటుతూ వచ్చారు. స్వతంత్ర దేశంలో తెలంగాణ అంతర్గత వలస మూలంగా పారతంత్ర్యంలో మగ్గిపోవడం ఆయనను కలచివేసింది. అతి సున్నిత మనస్కుడు అయిన కాళోజి తెలంగాణకు అన్ని రంగాలలో అను నిత్యం జరుగుతున్న అన్యాయాలను చూసి చలించి పోయారు. వేరు తెలంగాణ



సాధనకు కట్టుబడి తన వంతు కర్తవ్యాన్ని సదా నిర్వహిస్తూ వచ్చారు. 1969 నాటి ప్రత్యేక తెలంగాణ విద్యార్థి ఉద్యమంలో అత్యంత క్రియాశీల పాత్ర పోషించారు. తెలంగాణ రాష్ట్రాన్ని మనందరికన్నా ముందే కలగన్న కాళోజీని మన మధ్య పెట్టుకుని కూడా మనం ఆయన నడిచిన తోవలో నడవక తెలంగాణకు మరింత కీడు చేసే రాజకీయ కార్యకలాపాలలో ఇంతకాలం మునిగిపోయాం. తుదకు ఆయనే గెలిచారు. ఆయన చూపిన బాటలోకి ఆలస్యంగానైనా మళ్ళాం. తెలంగాణ సాధనకు కార్యరంగం కట్టుదిట్టంగా సృష్టించుకున్నాం. మన కోసం కాళోజీ కన్న కలను నిజం చేసుకునేందుకు కృత నిశ్చయంతో మునుముందుకు సాగుతున్నాం. ఇగ తెలంగాణ సాధనోద్యమం ఆగదు. మన గమ్యాన్ని చేరుకొనే దిశగా మన అడుగులు పడుతున్నాయి, కనుక ఈ రోజు కాకపోతే రేపైన మనం తెలంగాణ సాధించి తీరుతాం. కాళోజీ ఇచ్చిన భరోసాతోనే ఈ కార్య భారాన్ని మనం మోయగలుగుతున్నాం.

కాళోజీ పౌరహక్కుల కోసం ఎమర్జెన్సీకి ముందునుంచి సాగిస్తున్న పోరాటంలో కూడా తెలంగాణదే అగ్రస్థానం. ఆనాటి ఇందిరా గాంధీ, జలగం వెంగళరావుల అత్యాచారాల నుంచి మొదలుపెడితే ఈనాటి చంద్రబాబునాయుడు సాగిస్తున్న అణచివేత దాకా కాళోజీ చూపు ఆనని సందర్భం లేదు. కాళోజీ కార్యక్షేత్రానికి కేంద్ర బిందువు వరంగల్ కావడాన తెలంగాణ ఆసాంతం ఆయన నుంచి వెలుతురు ప్రసరించింది. వ్యక్తిగా సర్వ స్వతంత్రునిగా వ్యవహరించిన కాళోజీ ప్రజాస్వామ్యానికి పునాదిరాయి అయిన స్వేచ్ఛకు ఎనలేని ప్రాధాన్యం ఇచ్చారు. మనిషి నిత్య జీవితంలో స్వేచ్ఛగా చరించడానికి అవసరమైన పరిస్థితులు ఏర్పడేందుకు ఆయన అహరహం కృషి చేశారు. స్వేచ్ఛకు ప్రాతిపదిక సౌభ్రాతృత్వంలో ఆయనకు కనిపించింది. సమానత్వం సమీప భవిష్యత్తులో సమకూరేది కాదు కనుక ముందు సోదర భావం బలపడితే అప్పుడు స్వేచ్ఛకు ఆస్కారం ఏర్పడు తుందని ఆయన ఆశించారు. అయితే సౌభ్రాతృత్వాన్ని దర్శించడంలో ఆయన కొన్ని పరిమితులకు లోనయ్యారు. వర్ణ వ్యవస్థ పునాదిగా పూరించ వీలుకాని సామాజిక అగాథాలకు ఆలవాలంగా వున్న మన సమాజంలో హక్కులు కొంతమందికే ఎందుకు వుంటున్నాయో ఆయన అంతగా పట్టించుకోలేదు. చట్టం ముందు అందరూ సమానులైనప్పుడే పౌర సమాజానికి ప్రాతిపదిక ఏర్పడుతుంది. మనదేశంలో దాదాపు ఎనభై శాతం మంది ఈనాటికీ పౌరసత్వం నోచుకోలేదు. పౌరుల హోదా వారికి లేకపోవడానికి, తద్వారా హక్కులు వారికి కొరవడటానికి, పౌరహక్కులు అలావుంచి మానవ హక్కులు సైతం వారికి మృగ్యం కావడానికి గల సామాజిక కారణాల మీద ఆయన దృష్టి పెట్టినట్టు కనిపించదు. హక్కులను కేవలం రాజ్యాంగ పరిధిలో చూసి ప్రభుత్వం జవాబుదారీగా వ్యవహరిస్తే, చట్టం సవ్యంగా తన పని నిర్వర్తిస్తే హక్కులు సిద్ధిస్తాయనే స్థూల దృష్టి ఈ విషయంలో ఆయన ఆచరణకు అనివార్యంగా కొన్ని పరిమితులను విధించింది. వర్ణ వ్యవస్థను సృష్టించిన మను ధర్మం గీచిన రేఖకు లోబడే మన రాజ్యాంగం ఈనాటికీ పనిచేస్తున్నదనే వాస్తవిక సామాజిక దృష్టి రాష్ట్రంలో దాదాపు గత ముప్పై ఏండ్లుగా పనిచేస్తున్న పౌరహక్కుల ఉద్యమానికి లోపించినట్లే కాళోజీకి కూడా లోపించింది. ఈ ఒక్క విషయం లో 'ఆధునికత' తాలూకు భావజాలంలో కాళోజీ తనకు తెలియ కుండానే చిక్కుకొని ఆచరణలో నిర్దిష్టతను కోల్పోయారు. అయినా కాళోజీ వయసు లో సగం కూడా లేనివారు, పౌరహక్కులకు సంబంధించి కాళోజీ కన్నా లోతైన జ్ఞానం, అనుభవం వున్నవారే ఒకవైపు 'ఆధునికత' అనే పెను జాడ్యానికి (వలసవాదం పోతూపోతూ మిగిల్చిపోయిన అవశేషం ఇది) లోనై హక్కుల ఉద్యమాన్ని 'ప్రధాన స్రవంతి'కి పరిమితం చేసి, యథాతథ వాదాన్ని నిరందిగా పెంచి పోషిస్తుంటే, మనం మారాలని అనుక్షణం రంధి పడుతూ బతికిన కాళోజీని అనవలసిన అవసరం ఏముంది!

> ***రాజకీయ, సాహిత్యరంగాలలోనే కాదు నిత్య జీవితంలో కూడా యజమాని- బానిస సంబంధాలను తన ఆచరణతో రద్దు చేసిన ఘనాపాటి కాళోజీ. ఆయన అటు నాయకుని పాత్ర, ఇటు అనుచరుని పాత్ర పోషించడానికి నిరాకరించారు. గురుశిష్య సంబంధాన్ని కూడా ఆయన తోసిపుచ్చారు.***

ఈ మధ్య కాళోజీ పోయిన తరువాత ఆయన మీద ఒక మేధావి రాసిన వ్యాసంలో కాళోజీకి జాన్ స్టూవర్ట్ మిల్ అనే ఉదారవాద రాజకీయ తత్వవేత్తకు పోలిక తెచ్చారు. ఈ మిల్ మహాశయుడు ఆనాటి బ్రిటిష్ వలసాధిపతులకు దళారీగా వ్యవహరించాడనేది జగద్విదితం. అయినా మన మేధావి రచయిత ఎందుకో ఆ మాట మరిచాడు. మరచి కాళోజీ స్ఫూర్తికి అపచారం తలపెట్టాడు. బ్రిటిష్ ప్రభువుల తరపున ఆనాటి ఇక్కడి గవర్నర్ జనరల్స్ చేపట్టే కార్యక్రమాలకు మద్దతు కూడగట్టేందుకు తన పలుకుబడిన ఉపయోగించిన ఘనుడి భావాలతో కాళోజీ భావధారను పోల్చడం మామూలు తప్పు కాదు. కాళోజీ వంటి సుసంపన్నమైన భావ/ రాగ జలధిని, తప్పుడు అంచనాలతో కలుషితం చేసే ఇటువంటి శుష్క పండితుల నుంచి రక్షించుకోవాల్సిన బాధ్యత మన మీద వుంది.

రాజకీయ, సాహిత్యరంగాలలోనే కాదు నిత్య జీవితంలో కూడా యజమాని- బానిస సంబంధాలను తన ఆచరణతో రద్దు చేసిన ఘనాపాటి కాళోజీ. ఆయన అటు నాయకుని పాత్ర, ఇటు అనుచరుని పాత్ర పోషించడానికి నిరాకరించారు. గురుశిష్య సంబంధాన్ని కూడా ఆయన తోసిపుచ్చారు. ఇద్దరు మనుషుల మధ్య సమానత్వం ప్రాతిపది కగా విలసిల్లే స్నేహబంధానికి మాత్రమే ఆయన ఆమోద ముద్ర వేశారు. చరిత్రలో ఇప్పటి దాకా మనుషులు ఈ రెండు అమానవీయ పాత్రలనే పోషిస్తూ వచ్చారు. కానీ కాళోజీ న్యూనతకు గురిచేసే ఈ సంబంధాన్ని, పాత్ర పోషణను అధిగమించేందుకు శతవిధాల యత్నించారు. అసలు సిసలైన ప్రజాస్వామిక సిద్ధాంతాన్ని ఆచరణలో నిగ్గు దేల్చారు. కవిత్వంలోనే కాదు నిజ జీవితంలో కూడా కాళోజీది దేశీ సంప్రదాయం. అది పాల్కురికి సోమన, బమ్మెర పోతన, సురవరం ప్రతాపరెడ్డి మార్గం. కాళోజీ నడిచిన ఈ బాటలో మనం నడిచినప్పుడే కాళోజీ జీవితానికి, స్ఫూర్తికి సార్థకత సిద్ధిస్తుంది. మనం కోరుకొంటున్న తెలంగాణ సిద్ధించా లన్నా ఇదే బాట పట్టాలి. మరో మార్గం లేదు. రేపటి తెలంగాణకు తోవ చూపిన క్రాంత దర్శి కాళోజీ అజరుడు, అమరుడు.

***(కాళోజీ యాదిలో... నుంచి)***

ఓల్గా

# న్యాయాగ్రహం, ప్రేమల నిలువెత్తు రూపం



కవిగా కాళోజీ నాకు ఎన్నో సంవత్సరాల నుంచీ తెలిసినా వ్యక్తిగా ఆయన పరిచయం 1987లో జరిగింది. ఆయనతో పరిచయమయ్యాక కవిగా కూడా మరింత బాగా అర్థమయ్యాడు. కవిగానూ, వ్యక్తిగానూ కూడా కాళోజి ప్రత్యేకమైన వ్యక్తి. ప్రేమ, అధికారం, నిర్మోహమాటం, సున్నితత్వం, ఆత్మీయత, అబ్జెక్టివ్‌నెస్ ఇలా ఆయన విరుద్ధ భావాలను చక్కగా బాలెన్స్ చేసే ప్రత్యేక వ్యక్తిత్వం ఆయనది.

1987వ సంవత్సరంలో ఒక రోజు రాత్రి మా ఇంటికి హఠాత్తుగా చెప్పా పెట్టకుండా ఆయన వచ్చే సరికి చాలా ఆశ్చర్యపోయాను. అంత పెద్దాయన మా ఇంటికి ఎందుకు వచ్చినట్టు. పైగా మమ్మల్నీ మా ఇంటినీ వెలి వేయమనే పిలుపొకటి బైట గాలిలో తిరుగుతున్నపుడు సరిగ్గా కాళోజీ అందుకే వచ్చాడు. నేను నీ పక్కన ఉన్నానని స్వయంగా చెప్పి పోయేందుకు వచ్చాడు. రాత్రి పొద్దుబోయే వరకూ ఏవేవో కబుర్లు, తన అనుభవాలూ చెప్పి వెళ్ళాడు. ఎంత మంచి గెశ్చర్. మనుషుల పట్ల ఆయన కెంత శ్రద్ధ. అన్యాయం పట్ల ఎంత నిరసన. అది ఎంత సాదాసీదాగా ప్రేమగా ప్రకటించాడు. అనవసరమైన ఆర్భాటం లేదు. గర్జనలు లేవు. ప్రకటనలు లేవు. కానీ అవసరమైనపుడు ఆయన చేయూత ఉంటుందనే విశ్వాసం మనకు కలుగుతుంది. అది కాళోజీ పద్ధతి. ఆయన కవిత్వం కూడా అంతే నిరాడంబరంగా, సూటిగా, పదునుగా తాకవలసినచోట తాకే గురితో అచ్చు ఆయనలాగే ఉంటుంది.

1992 నుంచీ అస్మితకూ కాళోజీకి ఒక ప్రత్యేక అనుబంధం మొదలయింది. 1992లో అస్మిత 'మహిళలపై హింస మానవ హక్కుల ఉల్లంఘనే' అనే నినాదంతో ఒక పెద్ద సెమినార్ రెండు రోజుల పాటు నిర్వహించింది. ఆ సభకు కాళోజీని వక్తగా గానీ, అతిథిగాగానీ మేము ప్రత్యేకంగా పిలవలేదు. పోనీ ఆయన ఆ రెండు రోజులూ సభలకు వచ్చి రెండు వేల మంది గ్రామీణ స్త్రీలతో వాళ్ళ పక్కనే చాపల మీద కూర్చుని ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నాడు. అంత కవీ, ప్రజల మనిషి ఎలా కాగలిగాడో ఆ మూడు రోజులూ మేం ప్రత్యక్షంగా చూశాం. ఆ తర్వాత అస్మితలో జరిగిన అనేక కార్యక్రమాలలో కాళోజీ భాగమయ్యాడు. 1992 అక్టోబర్‌లో రచయిత్రులపై జరిగిన దాడిని ఖండిస్తూ అస్మిత నిర్వహించిన సభకు కాళోజీ అధ్యక్షత వహించారు. 94లో 'సరిహద్దులు లేని సంధ్యలు' పుస్తకాన్ని ఆవిష్కరించారు. 99లో కవయిత్రులను అస్మిత వేదిక మీద నుంచి సత్కరించాలనుకున్నపుడు ఆ సత్కారం వారికి చేయగల అర్హత ఎవరికుందని ఆలోచించినపుడు కాళోజీ తప్ప మరెవరూ లేరని అనుకున్నాం. ఆరోజు సభలో ఆయన చేత సత్కారం పొందిన కవయిత్రులు ఎంతో సంతోషించారు. అది అస్మిత కార్యక్రమాలలో మరపురానిదయింది. ఎన్నో సందర్భాలలో ఎన్నో విషయాల గురించి ఆయన సలహాలు అస్మిత కెంతో ఉపకరించాయి.

ఆయన మాటలూ కవితలూ ఒకోసారి ఎంత సరదాగా ఉంటాయో అంత షాకింగ్‌గానూ ఉంటాయి. ఆయన కోపం ఎంత తీవ్రమైందో అంత న్యాయమైంది. సామాజిక అన్యాయాల పట్ల న్యాయమైన కోపానికి మానవుల పట్ల అవ్యాజమైన ప్రేమకూ నిలువెత్తు రూపం కాళోజీ.

***(కాళోజీ యాదిలో... నుంచి)***





శైలజా జింబో

# మరపురాని మనిషి కాళోజీ



ప్రజాకవి, పెద్ద దిక్కు కాళోజీ నారాయణరావుగారు ఇక లేరని తెలియగానే నిస్సత్తువ ఆవరించింది. దిక్కు తోచని దిగులు మనసంతా నిండింది. మేము వెస్ట్‌మారేడ్‌పల్లిలో వుండేటప్పుడు మా ఇంటికి వచ్చేవారు. 1992లో అనుకుంటాను- మా పాప సెకెండ్ క్లాస్, బాబు యుకెజి చదివే వాళ్ళు. ఆగస్టు 15 నాడు పిల్లలు ఇంట్లో వున్న రోజున కాళోజీ ఇంటికి వచ్చారు. "బిడ్డా, ఆకలైతుందే యేమున్నది తినుటానికి" అనగానే నేను వంటగదిలోకి వెళ్ళాను. ఈలోగా మావాడు సన్నీ ఆయన ఒళ్ళో చేరి, కాళోజీ పొడవాటి తెల్లని మెరిసే గడ్డంతోనూ, కళ్ళద్దాలకు వేలాడే తాడు తోనూ ఆటలాడటం మొదలెట్టాడు. కాళోజీకి అసౌకర్యంగా వుంటుందనుకొని నేను మా బాబుని మందలిస్తుంటే "ఆడుకోనీ, వాడు కాకుంటే నువ్వు నేను చేస్తమా అల్లరి" అని కోప్పడిన ప్రేమమూర్తి కాళోజీ. "తాతయ్యగారేంది, తాతా అని పిలువు, తాత అంటే వున్న ప్రేమ గారుల వుంటదా" అన్నా నిరాడంబరులు కాళోజీ.

కాళోజీగారు పిల్లలతో ఇలా ఆడుకుంటున్న సమయంలోనే మా ఎదురు క్వార్టర్‌లో వున్న... జిల్లా జడ్జి దాశరథిగారు మా ఇంటికి వచ్చారు. మావారు కాళోజీగార్కి పరిచయం చెయ్యగానే ఆయన అమాంతం కాళోజీ కాళ్ళకి సాష్టాంగ ప్రణామం చేసారు. దాశరథి గారు తెలంగాణా వారేమీ కాదు. కాళోజీ వ్యక్తిత్వం, ఔన్నత్యం ప్రాంతీయతా ఎల్లలు దాటిందనడానికి ఇదో నిదర్శనం.

కవులు, రచయితలు చివరకు సాధారణ వ్యక్తులైనా తమ సమకాలీనుల మీద నిర్భయంగా నిస్సంకోచంగా తమ అభిప్రాయాల్ని వెల్లడి చేయడం అంత సులభం కాదు. అది కాళోజీకే చెల్లింది. సాహసానికీ నిర్మొహమాటత్వానికీ నిలువెత్తు దర్పణం కాళోజీ. వ్యక్తిగత స్నేహం ఎంతటిదైనా తమ అభిప్రాయాల విషయంలో నిక్కచ్చిగా వుండేవారు. పిల్లల్లో పిల్లవాడిగా పెద్దల్లో పెద్దవాడిగా కలసిపోయే నిర్మలత్వం కాళోజీగారికే సాధ్యమయింది.

మావారు జింబో రాసిన "హాజిర్ హై" కవితా సంకలనానికి ముందుమాట రాసింది కాళోజీగారే. ఆ సందర్భంగా కాళోజీని పలుమార్లు కలవడం, ఫోనులో సంభాషించడం జరిగింది. "ముందుమాట రాయడం అయిపోగానే ఫోను చేసి రాయడం అయిపోయింది పంపించమంటావా" అని అడిగిన నిరాడంబరులు కాళోజీ. నేను వచ్చి తీసుకుంటానని జింబో వెళ్ళి తెచ్చుకున్నారు.

చివరిసారిగ కాళోజీని చూసింది గల సంవత్సరం కాళోజీ 88వ జన్మదిన వేడుకలలోనే. ప్రముఖుల ప్రసంగాలు అయినాక వేదికపైకి వెళ్ళి జన్మదిన శుభాకాంక్షలు తెలిపినాక ఆయన, పిల్లల, మా కుశల మడుగుతూ మునుపటి లాగా నా అంతట నేను ఎ క్కడికీ పోలేకపోతున్నా. మీరు వచ్చి తీసికెళ్తేనే రాగలనిప్పుడు అన్నారు. నగర జీవితపు ఒత్తిళ్ళలో పడి ఎప్పటికప్పుడు అనుకుంటూనే ఆయన్ని ఇంటికి తెచ్చుకోలేకపోయాం. జన్మదిన వేడుకలో ఆయనతో కలిసి తీయించుకున్న ఫొటోలే మిగిలాయిప్పుడు.

ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
అవనిపై జరిగేటి అవకతవకల జూచి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
పరుల కష్టములను జూచి పగిలిపోవును గుండె
అన్న కాళోజీ స్వర్గం నుంచి కూడా తన ప్రజల గురించే వ్యధ చెందుతారనీ-
సాగిపోవుటె బ్రతుకు
ఆగిపోవుటె చావు
సాగిపోదలచిన
ఆగిరాదిచటెపుడు
అంటూ మనందరిలోనూ స్ఫూర్తిని తగిలిస్తారని భావిస్తూ ఆయనకిదే నా నివాళి.

***(కాళోజీ యాదిలో... నుంచి)***





# వీర తెలంగాణ నాది

వీర తెలంగాణ నాది వేరు తెలంగాణ నాది
వేరై కూడ తెలంగాణ వీర తెలంగాణ ముమ్మాటికి
తెలంగాణ వేరై నిలచి భారతాన వెలయు ముమ్మాటికి

వీర తెలంగాణము వైనంతో భారత పౌరుని ధీధైర్యంతో
ప్రజావాణి నా గొడవ మిన్న 'ప్రజా' ప్రకటన జేస్తున్నది.

వీర తెలంగాణ నాది వేరు తెలంగాణ నాది.

వేరై కూడ తెలంగాణ వీర తెలంగాణ ముమ్మాటికి
తెలంగాణ వేరై నిలిచి భారతాన వెలయు ముమ్మాటికి.

దోపిడి జేసే ప్రాంతేతరులను
దూరము దాక తన్ని తీరుతం
ప్రాంతం వాడే దోపిడి జేస్తే
ప్రాణం తోనే పాతర వేస్తం

దోస్తుగ వుండే వారితో మేమును
దోస్తీ చేస్తే ప్రాణం ఇస్తం.
'ఎంతకు అంత' అన్న నీతితో
చింత మాని బ్రతుకును సాగిస్తాం

తెలంగాణ 'బాషిందా' బ్రతుకు
తెలిపిన తరతరాల సత్యమిది
కన్నడులు మహారాష్ట్రులు తుర్కీ
అన్నయ్యల తరతరాలేరినది...
గుజరాతీ, మార్వడి పారిసీ
గుజ్జన గూళ్ళు అనుభవించినది
కాబూలీ ఈరాని భాయిలకు
కనువిప్పుగ మెలిగిన విధమిది.
తెలంగాణమిది తెలంగాణమిది
తీరానికి దూరాన ఉన్నది
ముంచే యత్నము చేస్తే తీరము
మునుగును తానే తీరము తప్పక

జైహింద్ జై తెలంగాణ
తెలంగాణ జిందాబాద్
భారత మాతకీ జై
తెలంగాణ జిందాబాద్



Kaloji Narayana Rao, the doyen of literary, social, and political activism for nearly two generations and a Padma Vibhushan awardee, is known for his contribution to civil life, participation in public life, and oral leanings in literary creation. People of the region have many fond memories of him as a rebel, a rishi, an activist, an orator, a commentator, a chronicler, and a conversationalist. The best tribute that could be paid to Kaloji, as he is popularly known, is that he continued the legacy of protest and defiance, ingrained in the soil of Warangal. Literary historians and scholars will have a fruitful time if they continue to examine the many dimensional personality of Kaloji especially his contribution to oral tradition. In fact, his body of speeches, writings and activism needs to be fully explored in this realm of orature.

Besides, there is an urgent need to reconstruct and record the Kaloji persona in terms of his contribution to poetry, political activism, and not the least his oratory and conversation skills, literary forms in their own right, which should all be seen as one entity, a single gesture. Further research on the life and literature of this sage from Warangal would throw more light on his genius.

During his lifetime Kaloji remained a live metaphor for Warangal—turbulent yet modest, polite but dissenting, relaxed but rebellious, simple but argumentative, defiant yet sacrificing, Gandhian lifestyle with a socialist approach. Underneath all these traits there is a child-like, pristine innocence and humane attitude that permeate through all of Kaloji's life and literature. He best represents his times and the society. He is comfortable with his own self with all the dualities, with his 'warring' town at war with itself and the system, and the postmodern nation that offered a melting pot of seemingly irreconcilable opposites yet a meeting point of many existences.

Kaloji's forefathers migrated from Maharashtra and made Madikonda, a village on the outskirts of Warangal as their home. Later Warangal adopted Kaloji brothers as its illustrious sons. It is a lesson to many that Kaloji, one of the early protagonists of separate Telangana movement way back in the 1960s originally belonged to a migrants' family. Kaloji's life and commitment is a practical demonstration of far-reaching consequences to both Telangana and Andhra protagonists. One can take a leaf out of Kaloji and proudly proclaim that it needs not only adopting oneself to his place of birth and upbringing but needs to be loyal to the place and the people. Kaloji and Warangal have taught by example that there is no middle path. Either one is loyal or not.

Kaloji's home in Nakkalagutta area of Hanamkonda remained the first destination of any significant personality or activist from across the state who visited Warangal. Dr. Samala Sadasiva of Adilabad, a noted scholar and littérateur once made a pertinent remark that Kaloji brothers and Warangal are inseparable insofar as hospitality is concerned. He recounts in his pioneering work, *Yadi*, how the brothers brought *chakinalu* a special recipe on the Sankranti eve, when he was staying in his favourite Broadway Lodge in Hanamkonda on a writing mission. Such instances as recounted by people, in course of time, might form part of folklore around these great personalities.

Kaloji's contribution to the world of letters chiefly rests on his ability to combine the oral and written traditions. Critics have compared him with the people's poet Vemana of the 17the century. He superimposed oral rhythms, social concern, and human rights on his poetry so much so that many have found it difficult to categorize his corpus of writing. A similar problem was faced by the literary establishment in Bengal when confronted with the creative-activist writings of Mahasveta Devi. It took a long time for them to reconcile to the fact that there was not much of a difference between her fictional works and activist-findings. It may take us longer to consider the works of Kaloji in terms of oral contribution and arrive at an estimate. Who else but an unpretentious and conscientious writer would agonize as he did in one of his most celebrated poems:

*Why so many agonies in my heart*
*At these uneven happenings on earth?*
*Heart melts looking at the toil of people....*

*Why so many agonies in my heart?*
*I cannot set things right, nor can I show the path*

*I am not empowered to punish the guilty*
*Nor can I come to the rescue of the distraught.*

The original poem in Telugu though written by Kaloji in 1942, it provides a framework for his life, literature, and activism all through.

**K. DAMODAR RAO**
Associate Professor of English
Kakatiya University Warangal 506009 AP

# పాలపిట్ట పుస్తకాలు

## కథలు

1. రంకె -స్వామి . . . . . . . . . . . . . . . . రూ. 10/-
2. కలియుగ కృష్ణార్జునులు -పులిగడ్డ విశ్వనాథరావురూ. 80/-
3. నిర్నిమిత్తం -బి.పి.కరుణాకర్ . . . . . . . . రూ. 60/-
4. పేగుకాలిన వాసన -ఎ.ఎన్.జగన్నాథశర్మ . రూ. 125/-
5. మనిషి -యస్.డి.వి.అజీజ్ . . . . . . . . . . రూ. 60/-
6. కుడి ఎడమైతే -భీమరాజు వెంకటరమణ . . రూ. 50/-
7. మోహతిమిరం -డా॥ ధేనువకొండ శ్రీరామమూర్తిరూ. 50/-
8. మా -బా రహమతుల్లా . . . . . . . . . . . రూ. 50/-
9. పాలపిట్ట ప్రత్యేక కథల సంచిక . . . . . . రూ. 80/-
10. తేరానామ్ ఏక్ సహారా?! - నరేష్ నున్నా . . రూ. 50/-
11. పరాయోళ్ళు -జి. ఉమామహేశ్వర్ . . . . . రూ. 70/-
12. చీకటి పున్నమి -వడలి రాధాకృష్ణ . . . . . రూ. 125/-
13. నిర్ణయం -రాచపూటి రమేష్ . . . . . . . . రూ. 60/-
14. గంధం చెట్టు -గన్నవరపు నరసింహమూర్తి . రూ. 60/-
15. మనసు పలికె -భీమరాజు వెంకటరమణ . . రూ. 50/-
16. అనంతాకాశం -గోవిందరాజు రామకృష్ణారావు . . . రూ. 60/-
17. రెక్కల హరివిల్లు - సలీం . . . . . . . . . . రూ. 90/-
18. గోపినికరుణాకర్ కథలు . . . . . . . . . రూ. 150/-
19. అడ్డా -శైలజామిత్ర . . . . . . . . . . . . రూ. 80/-
20. కథాపార్వతీపురం . . . . . . . . . . . . రూ. 250/-
21. కథాకాశం -ఎల్.ఆర్.స్వామి . . . . . . . . రూ. 60/-
22. ఉడుతాభక్తి -గన్నవరపు నరసింహమూర్తి . . రూ. 60/-
23. ఆపద్ధర్మం -అర్నాద్ . . . . . . . . . . . రూ. 90/-
24. జి.నరసింహమూర్తి కథలు . . . . . . . . రూ. 100/-
25. ఉషస్సు -కూర చిదంబరం . . . . . . . . . రూ. 70/-
26. నేనున్నాగా -రంగనాథ రామచంద్రరావు . . రూ. 60/-
27. యానాం కథలు - దాట్ల దేవదానం రాజు రూ. 100/-
28. తియ్యనివేప -వేముల ప్రభాకర్ . . . . . రూ. 100/-
29. ఒప్పందం-అత్తలూరి విజయలక్ష్మి. . . . రూ. 125/-
12. నీవేనా -ఒద్దిరాజు సోదరులు . . . . . . . రూ. 50/-

## నవలలు

1. రెండుకలల దేశమ్ -స్వామి . . . . . . . . . రూ. 80/-
2. మునెమ్మ -డా॥ కేశవరెడ్డి . . . . . . . . . రూ. 50/-
3. నీటి నీడ -ఎస్.ఎమ్.ప్రాణ్‌రావ్ . . . . . . . రూ. 40/-
4. పురివిప్పిన నెమలి -ఎస్.ఎమ్.ప్రాణ్‌రావ్ . . రూ. 40/-
5. మలగనిబత్తి -ఎస్.ఎమ్.ప్రాణ్‌రావ్ . . . . . రూ. 50/-
6. గులాం రసూల్ ఖాన్ -యస్.డి.వి.అజీజ్ . రూ. 75/-
7. పాండవపురం(అనువాదం)-సేతు,ఎల్.ఆర్.స్వామిరూ. 70/-
8. జిగిరి -పెద్దింటి అశోక్ కుమార్ . . . . . . . రూ. 70/-
9. మరణకాంక్ష -సలీం . . . . . . . . . . . . రూ. 150/-
10. డాక్టర్ సుందరరావు -డా. ఎం.వి.రమణరావురూ. 100/-
11. నేల దిగిన వాన -డా. వేంపల్లి గంగాధర్. . రూ. 70/-

## బాలసాహిత్యం

1. మహాభారతం- ఎ.ఎన్.జగన్నాథశర్మ . . . రూ. 100/-

## జీవిత చరిత్ర

1. ఒబామా - గుడిపాటి . . . . . . . . . . . . రూ. 50/-
2. మైకేల్‌జాక్సన్ -కస్తూరి మురళీకృష్ణ . . . . . రూ. 60/-

## చరిత్ర

1. తీవ్రవాదం -కస్తూరి మురళీకృష్ణ . . . . . రూ. 100/-
2. అలనాటి నెల్లూరు -ఈతకోట సుబ్బారావు . రూ. 250/-

## సాహిత్య విమర్శ

1. కథావలోకనం -కె.పి.అశోక్‌కుమార్ . . . . . రూ. 50/-
2. సంవిధానం -గుడిపాటి . . . . . . . . . . . రూ. 50/-
3. శివారెడ్డి కవిత్వం విమర్శలు విశ్లేషణలు . . రూ. 150/-
4. హైకూ సారస్వతం -రూప్‌కుమార్ . . . . . . రూ. 70/-
5. వెలుతురు కొలను - జి. బాలశ్రీనివాసమూర్తి రూ. 60/-
6. బహుత్‌ఖూబ్ యాకూబ్ -సౌభాగ్య . . . . . రూ. 60/-
7. అంటరానివసంతం-ఒకపరిశీలన-డా॥ఎ.సామాన్యరూ. 60/-
8. షేక్స్‌పియర్ సాహితీపరామర్శ-బుచ్చిబాబు రూ. 120/-
9. నూరు అరుదైన పుస్తకాలు -డా.ద్వానా శాస్త్రి రూ. 150/-
10. ఇష్టవాక్యం -దర్భశయనం శ్రీనివాసాచార్య . రూ. 90/-
11. నేలమ్మా నేలమ్మా-గేయరూప కవిత్వం-గోపగానిరూ. 90/-

## ఆధ్యాత్మికం

1. పురాణవేదమ్- రాణి శివశంకరశర్మ . . . . రూ. 60/-

## ఇతర రచనలు

1. మధుపం -పూదూరి రాజిరెడ్డి... . . . . . . . రూ. 45/-
2. ప్రేమ మరికొన్ని సంగతులు-పెన్నాశివరామకృష్ణరూ. 50/-
3. ముద్దుల ముచ్చట్లు -పెన్నా శివరామకృష్ణ. . రూ. 60/-
4. శతాబ్దాల సూఫీకవిత్వం -ముకుంద రామారావురూ. 60/-
5. తెలుగులో మారుపేరు రచయితలు-అశోక్ కుమార్రూ. 70/-
6. అర్థశాస్త్ర సిద్ధాంతాలు ఓ మిథ్య

-ఎస్.విద్యాసాగర్ రెడ్డి . . . . . . . . . . . . . . . రూ.50/-
7. ఒకమాట -సి.సి.రెడ్డి. . . . . . . . . . . . . రూ.150/-
8. జీవితంలో డబ్బు మహిళ ఇన్‌హెరిటాన్స్ టాక్స్‌రూ.100/-
9. ఆలోచనా సులోచనాలు -కూర చిదంబరం . రూ.60/-
10. సౌందర్యసృజన -ఎల్.ఆర్.వెంకటరమణ . రూ.80/-
11. అతి పెద్ద నయవంచన
-సిర్గాపూర్ విద్యాసాగర్ రెడ్డి . . . . . . . . . . ...రూ.100/-

## ఆడియో బుక్

1. ఐలాండ్‌విల్లా(కథలు)
-డా॥ ధేనువకొండ శ్రీరామమూర్తి . . . . . . .రూ.50/-

## ఆంగ్లం

1. EDUCATION my perception
- Jayanth Munigala, I.A.S. (Retd.) Rs.120/-

## కవిత్వం

1. దీపఖడ్గం -పెన్నా శివరామకృష్ణ . . . . . . . రూ.30/-
2. ఆమె ఎవరైతే మాత్రం -కె.శివారెడ్డి . . . . . రూ.50/-
3. ఊరి చివర -అఫ్సర్ . . . . . . . . . . . . . . రూ.60/-
4. అలసెంద్రవంక -గోరటి వెంకన్న . . . . . . రూ.90/-
5. నారుమడి -యెన్నం ఉపేందర్ . . . . . . . రూ.40/-
6. గగనమంత తలతో -కె.శివారెడ్డి . . . . . . రూ.70/-
7. అనంతరం -కోడూరి విజయకుమార్ . . . . రూ.30/-
8. సజల నయనాలకోసం -ఎలనాగ . . . . . . రూ.50/-
9. మోర్సింగ్ మీద మాల్కౌంస్ రాగం -ఎలనాగ రూ.30/-
10.డా.ఎన్.గోపి భావచిత్రదీపాలు . . . . . . . . రూ.10/-
11.కావ్యనందనం-తిరుమల దేశికాచార్యులు . రూ.200/-
12.హంసగీతి -ఎస్.ఎమ్.ప్రాణ్‌రావ్ . . . . . . రూ.20/-
13.పొద్దున్నే వచ్చిన వాన -గోపిని కరుణాకర్ . . రూ.50/-
14.ప్రేమ ప్రతిపాదన -ఆకెళ్ళ రవిప్రకాష్ . . . రూ.200/-
15.ఆకాశం -బి.వి.వి.ప్రసాద్ . . . . . . . . . . రూ.70/-
16.కవిగానే కనుమూస్తా -కె. జనార్దన మహర్షి . రూ.90/-
17.కవి నీరాజనం -కె.వేంకటరామకృష్ణ . . . . రూ.50/-
18.వానలో కొబ్బరిచెట్టు -హెచ్చార్కె . . . . . . రూ.50/-
19.రామకృష్ణద్విశతి -సాకె రామకృష్ణ కవి . . . రూ.70/-
20.నిచ్చెనమెట్ల లోకం -జూపల్లి ప్రేంచంద్ . . . రూ.70/-
21.ఒకదేశం రెండు పదప్రయోగాలు -వంశీకృష్ణ రూ.60/-
22.చింతయామి -డా॥ ధేనువకొండ శ్రీరామమూర్తిరూ.50/-
23.కవికాలమ్ - సుధామ . . . . . . . . . . . రూ.90/-
24.ఫ్లోరోసిస్... ఫ్లోరోసిస్... -డా. రూప్‌కుమార్ రూ.30/-
25.అగ్ర తలుపులు -కొండపల్లి నీహారిణి . . . . రూ.60/-
26.చీలిన మనిషి -ఈతకోట సుబ్బారావు . . . . రూ.60/-
27.అంతర్లయ -ఎలనాగ . . . . . . . . . . . రూ.70/-
28.అంతస్తాపము -ఎలనాగ . . . . . . . . . . రూ.50/-
29.ఓనమాలు -నాగరాజు రామస్వామి . . . . . రూ.50/-
30.అనుధ్వని -నాగరాజు రామస్వామి . . . . . రూ.60/-
31.తడి ఆరని నేల -అరసవిల్లి కృష్ణ . . . . . . రూ.60/-
32.అమిత్వం -బి.ఎస్.ఎం.కుమార్ . . . . . . . రూ.70/-
33.నీటిచుక్క - ఈతకోట సుబ్బారావు . . . . . రూ.50/-
34.కొర్రాయి -డా. దామెర రాములు . . . . . . రూ.70/-
35.లిపి తడిసిన తరుణం - రఘు . . . . . . . రూ.60/-
36.నిర్నిద్రగానం - కొండపల్లి నీహారిణి . . . . . రూ.60/-
37.పూలమ్మిన ఊరు -పెరుగు రామకృష్ణ . . . రూ.100/-
38.అంతర్యానం -సాయి కిరణ్‌కుమార్ . . . . . రూ.50/-
39. యుద్ధకాండ - బండి సత్యనారాయణ . . . రూ.70/-
40. మహాశూన్యం - డా. దీర్ఘాశి విజయభాస్కర్ రూ.100/-
41. రాత్రిసూర్యుడు - కెరె జగదీష్ . . . . . . . రూ.70/-
42. శిరిడిసాయి గీతాసచ్చరిత్ర-కోమటి రమణయ్యరూ.60/-
43. రమణయ్య చాటువులు -కోమటి రమణయ్య. రూ.25/-
44. మృత్యుమోహనం -శ్రీలత. . . . . . . . . . రూ.50/-
45. జీవితం-కవిత్వం -మాడభూషి సంపత్‌కుమార్‌రూ.60/-

## అనువాదాలు

1. మనసులోని మాట -డా॥ అనంత్ కాబ్రా . రూ.150/-
2. దేశదేశాల హైకు -పెన్నా శివరామకృష్ణ . . . రూ.30/-
3. Some Silent Melodies-
Dr. Dhenuvakonda Sriramamurthy . .రూ. 60/-
4. ఆలోచనాలోచనం -డా॥ అనంత్‌కాబ్రా . . రూ. 150/-
5. గోరింట పూలు -చాగంటి తులసి . . . . . .రూ. 60/-
6. Pride of Place (An anthology of Telugu Poetry 1981-2000)
Translated by K. Damodar Rao . . . . . . . . . . . . రూ.300/-
7. నెలబాల (ఠాగూర్ కవిత్వం) -రత్నమాల . . రూ.50/-
8. కపాస్ కి అటారి(హిందీ) - ఎం.రంగయ్య రూ.100/-
9. జయంత్ మహాపాత్ర కవితలు . . . . . . . . రూ.60/-
10. నౌకాభంగం (అనువాదం) -ఒద్దిరాజు సోదరులురూ.100/-

ఈ పుస్తకాలు కావలసిన వారు సంప్రదించవలసిన చిరునామా :

**పాలపిట్ట బుక్స్**, ఫ్లాట్ నెం: 3, ఎం.ఐ.జి-2, బ్లాక్-6, ఏ.పి.హెచ్.బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-500 044
Ph: 040-27678430 • palapittabooks@gmail.com



అతిథివోలె వుండి వుండి
అవని విడిచి వెళ్ళుతాను
పల్లె పట్టణంబులనక
పల్లేరై తిరిగినాను

122



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M301 |
| పుస్తకం పేరు | పాలపిట్ట |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | saranya |
| పేజీలు విడదీసినది | SARANYA |
| స్కాన్ చేసినది | Mary |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |